శ్రీ రస్తు.

శ్రీనివాసాయనమః.

# సకలార్థ సాగరము

ఇది,

ఓ. వై. శ్రీ. దొరసామయ్యశాస్త్రిచే

రచియింపఁబడినది.

చెన్నపురి:

వేలూరు - కుప్పుస్వామిమొదలారివారి

అమెరికన్ డైమండు ముద్రాక్షరశాలయందు

ముద్రించి ప్రకటింపఁబడినది.

 1929. [వెల 2-0-0.

# పీ ఠి క.

ఇదివఱకును ఆంధ్రభాషలో ననేక గ్రంథములు రచియింపఁ బడెను. వానియం దేగ్రంథమునందును లౌకిక వైదిక మతసంబంధ విషయ విచారాది ముఖ్యాంశములు చేర్పఁబడి యుండ లేదు. అట్టి కొఱఁతను వారింపఁబూని నేను చిరకాలపరిశ్రమ చేసి "సకలార్థసాగరము" అనుపేర నొక గ్రంథమును 1901-వ సంవత్సరమునఁ బ్రకటించినాఁడ. ఆ గ్రంథమును గాంచిన పండితులును పత్త్రికాధిపతులును, సమ్మోదితులైనదే గాక, ఆంధ్రభాషాభిమానులు నా గ్రంథంబులను విలిచి నా శ్రమను సార్థకంబుఁ జేసిరి. కావుననే ఈ సకలార్థసాగరమును అనేకమాఱులు ముద్రించుటకును, "చరిత్రచింతామణి" యను గ్రంథమును రచియించుటకును వీలయ్యెను. రెండవకూర్పునందు పండితులయొక్కయు పత్త్రికాధిపతులయొక్కయు భాషాభిమానులయొక్కయు అభిమతప్రకారము మఱిఁ గొన్నిమతములును, పారమార్థికతరంగమును జేర్పఁబడియెను. సారగ్రాహకులు సద్విషయములను గ్రహించి సానందు లగుదురు. "గుణినామపి నిజరూపప్రతిపత్తిః పరత ఏవ సంభవతి, స్వమహిమదర్శన మక్ష్ణో ర్ముకురతలే జాయతే యస్మాత్" గుణవంతులకుఁ గూడ స్వస్వరూపజ్ఞానము పరుల వలననే కల్గుచున్నది. సమస్తమును వీక్షించెడి కనులమహిమను అద్దము చేతనే తెలిసికొనవలయును. కనుక సర్వజ్ఞులందఱు నీ గ్రంథము నవలోకించి సమాలోచనచేయఁ బ్రార్థింపఁబడు చున్నారు.

విద్యావతి ఆఫీసు,
మద్రాసు;
1905-వ సం.
శ్రీకృష్ణజయంతి.

ఇట్లు విద్వజ్జనవిధేయుఁడును, భాషాసేవకుఁడు నగు,
ఓ, వై, శ్రీ, దొరసామయ్య.

(ప్రథమముద్రణ)

# కృతివిమర్శనములు.

**Sakalarthasagaram**, BY C. DCRASAMIAH, *Madras*.

This is a very useful volume, written in easy, flowing Telugu. It takes the Place of a small, handy encyclopædia and contains varied and valuable information on all matters Indian and even foreign to this country. The author is evidently one well versed in Indian lore and literature and in every way fitted to edit a volume of the kind under review. To the non-English-knowing public and even to many of our educated men this publication is valuable as a book of ready reference, especially in matters religious. (The *Arya*, Madras July 1901.

మ-రా-రా-శ్రీ, ఓమందూరు వైద్యము, శ్రీ-దొరసామయ్యగారిచే నిజవిరచితము సకలార్థసాగర మను గ్రంథము నాకొసంగఁబడినది. నే నా గ్రంథమందలి విషయముం గని కరము సంతసిల్లితిని. ఈ విషయము లన్నియు హిందువుల కందఱకును అవశ్యము తెలిసియుండవలసినవి. ఇట్టిగ్రంథ మింతకు పూర్వము లేనందున ఇన్ని విషయములు ఎవరికో మహాపురుషులకుఁ దప్ప పండితులకేనియు సామాన్యులకు దెలియరాక యుండినవి ఈ గ్రంథమున వేదవేదాంగవిషయములును, సాంఖ్య, చార్వాక, మీమాంసక, వైశేషిక, మాలక్ దాసు, థామక్, కబీరు, యూథ, వీరశైవ, పాశుపత, వల్లభ, బౌద్ధ, జైన, క్రీస్తు, పారసీక, గ్రీకు ప్రభృతి నానామతముల స్వరూపంబును, స్కాండినేవియ, మెక్సికో, సయాం, జావా లోనగు నానాదేశముల మతములును, ద్వైతాద్వైత విశిష్టాద్వైతాది మతంబులును, శ్రీశంకర శ్రీరామానుజ శ్రీదేశికాచార్యుల చరిత్రంబులును, స్వప్న, సాముద్రికవిషయములును, చమత్కారగణితములును, దేశాచారములును, జంతుస్వభావములును, ఆరోగ్య సాధనములును, ఇట్టివి పెక్కువిషయములు 365 "కొండ యద్దమందు గొంచెమై యుండదా" అనునట్లు యిమిడి యున్నవి. ఈ గ్రంథము పండితాఽపండితభేద మక్కఱ లేకుండ సకలజనులకును అత్యంతము విద్యాభివృద్ధిని జ్ఞానాభివృద్ధిని వినోదప్రాయముగానే కలిగింపఁ గలిగి యున్నది. సులభభాషలో వ్రాయఁబడి యున్నది.

వే - వేంకటరాయశాస్త్రి.

12-10-01. సంస్కృత ప్రధానోపాధ్యాయులు, క్రిష్టియన్ కాలేజి, మద్రాసు.

మ-రా-రా-శ్రీ, సి-దొరసామయ్యగారికి;

మీరు దయాపురస్సరముగాఁ బంపినట్టి "సకలార్థసాగరము" అను గ్రంథము సాంతముగ జదివి సంతసించితిని. అది నిక్కముగ సకలార్థసాగర మనఁదగును.

27 - వ పుట మొదలు 175-వ పుటదనుక మతములు వివరింపఁబడి యున్నవి. శంకరు లనేకమతములను ఖండించి యున్నారు ఆమతములకు వీనికి సంబంధము లేదు. అయినను గ్రంథకర్తగారు మతాభిప్రాయముల సేకరించి ప్రకటించుటవలన లోకమునకు మేలు చేసినవా రనుటకు సందియము లేదు ఇంతియగాక; వేదములు, గాలి, జలము, భోజనము, నిద్ర, గృహము, వ్యాధినిదానము మొదలైనవి ముఖ్యములు వీని విషయమును బ్రతిమనుజుఁడును దెలిసికొనఁదగినదిగా నున్నది.

తిర్యగ్జంతుస్వభావములు కొన్ని వివరింపఁబడినవి. ఆ స్వభావములఁ దెలిసికొనినచో మనమునకు మిగుల సంతసము గలుగు చున్నది గ్రుడ్లగూబ కనుగ్రుడ్లను కదలింపదఁట, తలనుమాత్ర మన్నివైపులకుఁ ద్రిప్పునఁట; దీనిని మే మెఱుంగము. కప్ప నోరుఁదెఱచి యున్నంతసేపు శ్వాసమును విడువఁజాల దఁట, ఇట్టి విషయము లనేకము లున్నవి.

శుభాశుభశకునములు, స్వప్నఫలములు మొదలైనవి విశేషముగా వ్రాయఁబడి యున్నవి ఇవి మనకు నిత్యము కావలసియున్నవి గాన నీగ్రంథము నిజముగ సాగరమే యగును, మఱి తగును. నిరంతరము పద్యకావ్యములఁ జదువు మాకీ గద్యగ్రంథ మూరటగా నున్నది. ఇది సర్వప్రాయముగ నున్నకతన వివిధరుచులం గలిగి యున్నది. ఎంత యని వ్రాయఁగలము. మఱి యీఁదగలము. సాగరముగదా. మీ మిత్త్రుఁడు,

నెల్లూరు, 2—11—01.

పూండ్ల - రామకృష్ణయ్య;
అముద్రితగ్రంథచింతామ ణ్యధిపతి.

మ-రా-రా-శ్రీ, ఓమందూరు, వైద్యం శ్రీ-దొరసామయ్యగారి సముఖమునకు; సుధీనిధీ, యుష్మత్కృతం బగు సకలార్థసాగరాఖ్య సార్థకసమాఖ్య గ్రంథరాజంబు కరంబు మత్కరం బలంకరించె. ఇయ్యది పండితపామరజనాహ్లాదకరం బగు నిర్దుష్టశైలి నలరు చున్నయది. ఇయ్యమూల్యగ్రంథప్రతి యొండు గలిగినమాత్రమునఁ బ్రతిగృహస్థునకు సమస్తగ్రంథ సరస్వతీభండార మింట నున్నట్లు దలంపందగి యున్నది. సమస్త మతోద్ధారకులచరిత్రములతోఁగూడఁ దన్మతసిద్ధాంతములను నిష్పక్షపాతముగఁ బ్రకటించినందులకు నే మెంతయు సంతసించు చున్నారము. భగవత్కృపచేతఁ దమ కిట్టి యసాధారణగ్రంథకల్పనానల్పసామర్థ్యం బొదవుట జూడఁగా దేవరవారు కారణపురుషు లని యెంచఁదగి యున్నారు. మీ గ్రంథమహిమఁ గొనియాడ వేనోళ్ళు కలవానికైనఁ దరంబుగా దనుచో నద్దానిం గొండాడుటకు మాకు దరంబు గదురు చున్నయది. మీగ్రంథమునకు మీగ్రంథమే సాటి యని యనన్వయరీతిగ నెన్నుచున్నారము.

జలుమూరు, గంజాంజిల్లా. 22—10—01.

భవన్మిత్రుఁడు,
భుక్త - తమ్మయ్యశాస్త్రి.

విజ్ఞప్తిః. సుహృచ్ఛిరోమణులారా! యుష్మత్ప్రహిత సకలార్థసాగరంబు సాంతంబుగ నవలోకించితిమి. అయ్యది సర్వదర్శనసంగ్రహాది కతిచిద్గ్రంథంబుల గొన్ని విషయముల సంబంధించి యుండినను శాస్త్రాదిదృత్సులకు కల్పతరుజనకం బయిన క్షీరవారాశింబోలి యనేకవిషయంబులఁ దెలియఁజేయు నిట్టిగ్రంథం బిదివరలో నేరివలనను రచియింపంబడమి నే తదవలోకనజనితసంతోషంబున నొక్కవిధంబుగా మాయాశయంబులఁ బ్రకాశపఱిచి యున్నారము.

శ్లో. దొరసామినామ కృతినా సరసాగ్రసరేణ సాదరం రచితః,
సకలార్థసాగరోయం సమ్మత ముపయాతి సకలసుకవీనామ్. 1

,, మృద్భత్షణాద్భుతముకుందముఖారవిందే దృష్ట్వాయథాముదమవాపజగద్యశోదా
శాస్త్రార్థసారమఖిలంసుకరంవిలోక్య సంతోష మేతిసమితి స్సుహృదామిహాద్య.

యుగ్మకము.
మోహగ్రాహకయుక్తం మునినాముక్తం మతేరసువ్యక్తం
వక్తుం లవణపయోధిం శక్తిం కిలయంతి నాత్ర తత్త్వవిదః.
సకలార్థసాగరస్య ప్రతిమానక్షీరనీరధిం వక్ష్యే
శ్రీదం సుగమం శుద్ధం ముగ్ధం మధురామృతప్రదాతారమ్. 3

సీ. మహిలోన గల సర్వమతనిరూపణ లేక చను సర్వదర్శనసంగ్రహంబు
తనమతంబె పరంబు తగ దన్యమత మంచు దనరు వివేకచింతామణియును
మాధవాదికభాష్యమార్గంబు గాఁ దని పొలుచు బుగ్వేదాది భూమికయును
భారతాచారంబు దూరంబు గావించి క్రాలు సత్యార్థప్రకాశికయును
గాంచుభారం బపారంబుగా దలంచి, సకలశాస్త్రార్థతత్త్వవిచార మొంది
ముద్దుపలుకుల జనులకు ముద మొనర్చ సాదరంబుగ సకలార్థసాగరంబు. 4

క. దొరసామి సుకృతికృతికిఁ, దొరసామి! వచించు పెల్ల దురుసా మగు ఘే
దురసార శాస్త్ర మిది యిం, దురసామోదంబుఁ జెందుదురు సారజ్ఞుల్. 5

శ్లో. నాథేన శ్రీసుమన స్సరస్వతీ వసతి పాఠశాలాయాః,
శ్రీలోకనాథకవినా గుడిబండపురస్థితేన రచిత మిదమ్.

గుడిబండ, 17—6—1901.

లోకనాథకవి,
సుమనస్సరస్వతీవసతిపాఠశా లాధ్యక్షః.

శ్లో. శ్రీమ ద్దొరసామి బుధై ర్విరచిత సకలార్థసాగరో ఽన్వర్థః
సమ్య గ్వ్యలోకి సమయా తుష్టే శ్చేష్టే హ్యాథ స్తనీరు క్తేః. 1

,, విషజ నిభూమిరథః కృత రత్నో ఽహిపశయన ముషిత సర్వస్వః
యని న భవే ద్భువతు సుఘో దధి రిహ సకలార్థసాగరేణ సమః. 2

,, నిగమాగమాది ముకురా యిత మితశాస్త్రార్థరత్న మిహ దృష్ట్వా
ననువంతి యే మనీషా వంత స్సంతోషదంతురా స్సంతః. 3

సీ. జ్ఞానసాధనతరంగము రంగమను జూడ సకలవేదార్థ విచారనటికి
క్రమసమాహితతరంగము తురంగము సర్వమతసుసిద్ధాంతాధ్వగతికి గనఁగ
రమ్యప్రమాణతరంగం బభంగసారంగంబు శాస్త్రసారసమునకును
రంగదదృష్టతరంగంబు తుంగసారంగంబు సందేహారంభలకును
వినఁగనఁ బ్రమోదవిజ్ఞానవిద్యలను త,రంగములు లౌక్యధర్మాంతరంగము లహా
సారతత్త్వార్థసకలార్థసాగర మను, నీమహాగ్రంథము నుతింప నేరితరము. 4

ఉ. శ్రీసకలార్థసాగరమ శేషమనీషిహితైషిభాషితో
ద్భాసము గేయసద్విషయబంధురతాజనితాఖిలాధికో
ల్లాసము శాస్త్రదుర్గమచలత్త్వబహుత్వకృతార్తిమానసా
శ్వాస మయారె పొల్చు దొరసామికృతీ ట్కృతి యిజ్జగంబునన్. 5

క. ఈ దొరసామికృతిట్కృతి, కిదొర సామ్యము వచించు నే నెఱుఁగ నిలన్
లేదా! రసాన్వితములు కృతు, లేదొర సాధు వని బల్కు లే రెవ్వారున్. 6

శ్లో. కేశవకృతిషు శ్రీసకలార్థాశ్రయసాగరప్రశస్తిరియం
జేజీయా దహరహ ఇహ మహతాం మహవృద్ధయే ముహు ర్జనయే. 7

ఎ - కేశవయ్య,

17—6—1901. హెడ్మాస్టర్, A. V. స్కూల్, గుడిబండ.

క. శ్రీదొరలు కుతుక గల ఘణి, శ్రీదొరయును గృపఁ గనంగ స్థిరలాలిత్య
శ్రీదొర గానని రచనన్, శ్రీదొరసామయ్య వ్రాసె క్షితి నొక్కకృతిన్. 1

క. సకలచ్ఛందశ్శాస్త్ర, ప్రకటపురాణేతిహాస భవ్యమతగ్రం
థకలిత సర్వశుభాంశ,ప్రకరము సకలార్థసాగర మన నది తగున్. 2

సీ. వేదవేదాంగోపవేదపురాణేతిహాసకావ్యాది శుభాంశములను
దనరారు జ్ఞానసాధనసమాహితసుప్రమాణముల్ మూఁడును మతి యదృష్ట
సత్ప్రమోదాఖ్యవిజ్ఞానవిద్యలు మూఁడు గడునొప్ప షట్తరంగముల నలరు
సకలార్థసాగరాంచద్గద్యహృద్యకావ్యంబు నోమందూరు వైద్యము దొర
సామి కవివ్రాసె నిది యాంధ్రభూమినున్న, జనములింటింటికొకప్రతిఁ గొనఁగఁదగిన
గ్రంథ మని త్రికరణశుద్ధిగా లిఖించి, మచ్చ వేంకటకవి యిట్లు ముచ్చటించె. 3

ఇట్లు,

మచ్చ - వేంకటకవి,
శ్రీవైదర్భీపరిణయశుద్ధాంధ్రనిరోష్ఠ్య
నిర్వచనకుశచరిత్రా ద్యనేకాంధ్రగ్రంథకర్త.

పర్లాకిమిడి,
3—6—1901.

*Telugu Pandit Rajah's College, Parlakemidi.*

సకలార్థసాగరము:—ఇది శ్రీ ఓమందూరు, వైద్యం-దొరసామయ్యగారిచే రచియింపఁబడి 370 పుటలు గలిగి, చక్కఁగ నట్టలు గట్టఁబడిన తెలుఁగుగ్రంథము. ఇందు జ్ఞానసాధనతరంగము, సమాహితతరంగము, ప్రమాణతరంగము, అదృష్టతరంగము, ప్రమోదతరంగము, విజ్ఞానతరంగము అను ప్రకరణములు గలిగి; వానిలో వేదములు, ఇతిహాసములు, పురాణములు మొదలగు పూర్వగ్రంథములను గుఱించియు, లోకములో నుండిన నానామతములను గుఱించియు, ఆయామతస్థాపకులను గుఱించియు. అలంకారములు, శాస్త్రములు, ఆరోగ్యధర్మములు మొదలగు ననేకోపయుక్తవిషయములను గుఱించియు తెలియవలసిన సంగతులు సులభశైలిని వ్రాయఁబడినవి. మనకే విషయమునందయినను సందేహము గలిగినయెడల యింగ్లీషుభాషలోవలె, అన్ని సంగతులను గుఱించియుఁ గొంతవఱకుఁ జర్చించుగ్రంథములు తెలుఁగున లేక పోవుట వలన మనకుఁ గావలసిన సంగతులు సులభముగ దొరకుచుండుట లేదు. ఇట్టి లోపము నీగ్రంథము కొంతవఱకుఁ జక్కఁగ నివారించుచున్నదని చెప్పఁగలము. ఈపుస్తకములో ముఖ్యముగ లోకములోని మతములనుగుఱించిన సంగతులు వ్రాయఁబడినవి. ఇప్పుడు కానఁబడు దాదాపుగ నన్నిమతములను గుఱించియు దీనిలోఁ జర్చ చేయఁబడినది. అందఱికిని, ముఖ్యముగ నన్యభాషాపరిచితి లేనివారికిని, ఈపుస్తకము మిగుల ప్రయోజనకారి యని చెప్పఁగలము.

పుస్తకమునందలి కాగితములును అక్షరములును బాగుగనే యున్నవి. శైలి యందఱికిని దెలియునట్లుగ సులభముగ నున్నది. సాధ్యమయినంతవఱకన్నిసంగతులను గుఱించియు నీగ్రంథకర్త ప్రసంగింపవలయునని యుద్దేశించినను, కొన్నిపుటలలోనే పుస్తకమును బూర్తిచేయవలసివచ్చుటచేత, అట్లు చేయుటకు వీలు లేకుండెను. జ్యోతిషశాస్త్రము, నానాదేశచరిత్రములు, ప్రకృతిశాస్త్రములోని ముఖ్యాంశములు మొదలగువానిని గుఱించియు జెప్పవలసియే యున్నది. ఇవి గాక, సాధారణముగ నింగ్లీషుభాషలో నుండు నిట్టిగ్రంథములలో నుపయుక్తము లగు ననేకము లయిన యితరవిషయములను గుఱించి చెప్పఁబడుటఁ జూచుచున్నాము. గ్రంథకర్త యట్టివాని నన్నిఁటిని గుఱించియును, ఆంధ్రకవులను గుఱించియు గొంతవ్రాసి, ఈపుస్తకమునకు రెండవభాగముఁ బ్రకటించినచో బాగుగా నుండును అన్నివిషయములును, ఒకపుస్తకములోనే యిముడుట సాధ్యము గాదు. కావున, కావలసినయెడల నింకనొకటి రెండు పుస్తకము లిట్టివి వ్రాయుట ఆవశ్యకమని నమ్మెదము.

బెజవాడ.
1—10—1901.

తెలుగుజనానాపత్త్రిక.

చెన్నపురియందు ప్రచురింపఁబడుచున్న సత్త్వసాధని యను ఆంధ్రమాసపత్త్రిక నవిచ్ఛిన్నముగ ప్రచురింపుచున్న ఓపుందూరు వైద్యం, శ్రీ దొరసామయ్యగారిచే రచింపఁబడిన సకలార్థసాగరము తద్గ్రంథకర్తలచే నొక ప్రతి మా కార్యస్థానమున కంపఁబడుటచే ఆదరపూర్వకముగా నందుకొని గ్రంథమంతయు సాంతముగ జదివి చూచితిమి. గ్రంథనామము సాగర మనుటచే గ్రంథమంతయు తరంగములతో నిండి యుండఁగల దని యెల్లరును నూహించగలరు. అట్టి తరంగము లీగ్రంథమునందు మిక్కుట మగుటచే ఒక్కొకతరంగము తప్పించుకొని ముందుకు బోవుటలో ఇందు కాలస్య మగుటచే సాగరవృత్తాంతము సాంతముగ ముచ్చటించుట కించుక ఆలస్యమునకు గ్రంథకర్తలు మన్నింపఁగోరెద.

ఈ గ్రంథమునందలి మొదటితరంగము జ్ఞానసాధనతరంగము; ఇందు వేదములు, ఉపనిషత్తులు, పురాణములు, ఇతిహాసములు, భారతరామాయణాంతరార్థవివరణములు, పిండాండలక్షణములు మున్నగునవి దెలుపఁబడినవి. రెండవది సమాహితతరంగము; ఇందు శైవము, వీరశైవము, ఆర్య, దివ్యజ్ఞాన, శాక్తేయ, బౌద్ధ, జైన, పారసీక, గ్రీకు, రోమక, క్రైస్తవ, యాదవ, భాగవత, అద్వైత, విశిష్టాద్వైత, ద్వైతమతములను గూర్చియు, ఆయా మతసిద్ధాంతములను గూర్చియు దెలుపఁబడినవి. మూఁడవది ప్రమాణ తరంగము; ఇందు అలంకారశాస్త్రమును గూర్చియు, అదృష్టతరంగమునందు స్వప్న శకున సాముద్రికాంశములను గూర్చియు; ప్రమోదతరంగమునందు మానవధర్మములు, యోగ్యాయోగ్యకన్యాలక్షణములు. చమత్కారగణితములు, దేశాచారములు మొదలగు విషయములను గూర్చియు; కడపటిదగు విజ్ఞానవిద్యాతరంగమునందు ఆరోగ్యలక్షణము, గాలి, జలము, భోజనము, నిద్ర, వస్తుగుణవివరణము, వ్యాధినిదానము, నాడీలక్షణము, ఔషధలక్షణము మున్నగువానిని గూర్చియు 37, పుటలు గల పెద్దగ్రంథముగా రచించి ఆంధ్రభాషకు వన్నె దెచ్చిరి. ఎవ్వరైన ఒక్కొక్కసంగతిలో కృషి చేసి సంగతులను వెల్లడించుట సులభము గాని వీరివలె అన్నిసంగతులను గుదిగూర్చి ముచ్చటించుట కనువు గలుగజేయుట సాధారణమైన పనిగా నెంచజాలము. సాధారణముగ ఈ గ్రంథములోని సంగతులు గట్టి పరిశ్రమ చేసిన యేవిషయమునందు ఉపన్యాస మిచ్చినను చక్కఁగా గ్రహించి తర్కించవచ్చును.

ఇట్టి యుద్గ్రంథము మిక్కిలి తక్కువగా రు. 1–12–0 లకు విక్రయించుచున్నటులఁ దెలియుచున్నది. తెలుఁగు దెలిసిన ప్రతివారును గ్రంథము తప్పక గైకొనఁ గోరుచున్నాము.

"దేశోపకారి"

2—11—01. ఏలూరు, గోదావరిజిల్లా.

సకలార్థసాగరము:—ఇది ఓ మందూరు, వైద్యం శ్రీ దోరసామయ్యగారిచే రచియింపఁబడినది. వీరే సత్త్వసాధనిపత్త్రికకు మేనేజరుగ నుండి ఆ పత్త్రిక నవిచ్ఛిన్నముగ జరుపుచున్నవారు. వీరు చక్కనిశైలిని వ్రాయఁగలరనుట కీగ్రంథమే ప్రబల నిదర్శనము.

ఇందు మానవునికి వలయు సమస్తధర్మములు మిక్కిలి శ్రమపడి వ్రాయఁబడినవి. వేదములు శాస్త్రములు పురాణములు వివిధదేశీయులమతములు శ్రీశంకరాచార్య చరిత్రము, శ్రీరామానుజాచార్య చరిత్రము, శ్రీమధ్వాచార్య చరిత్రము, మున్నగు మతవిషయములతో 27) వ్రాయఁబడెను. తరువాత స్వప్న మృత్యు శకునములు, సాముద్రికాది లక్షణములు, పతివ్రతాధర్మములు, పురుషధర్మములు, కన్యాలక్షణములు, పాకశాస్త్రము, ఛందశ్శాస్త్రము, శరీరారోగ్యము, భోజనవిషయము, నిద్ర, వస్తుగుణవివరణము, వ్యాధి నిదానము, నాడీలక్షణము, ఔషధలక్షణము మున్నగు చిరకాలపరిశ్రమచే సంపాదింపఁగలిగిన సంగతులన్నియు విపులముగా నీగ్రంథమందు వ్రాయఁబడినవి.

ఇందలియంశము లన్నియు బుద్ధిమంతు లెవ్వరైనను సంపాదింప బ్రయత్నించిన 5, 6 సంవత్సరములకు తక్కువకాలము పట్టదని మా నిశ్చితాభిప్రాయము. ముఖ్యముగా మతములనుగూర్చి యీమహనీయుఁడు వ్రాసినసంగతులు జూడఁగా నివి యెట్లు సంపాదింపఁ గలిగెనను విస్మయము మా కిప్పటికిని పోకున్నది.

ఇట్టిగ్రంథ మింగ్లీషుభాషయందు వ్రాయఁబడి యుండిన గ్రంథకర్తకు *Royalty* పారితోషక మిచ్చి యేముద్రాశాలాధికారు లైన గయికొని యుందురు.

కాఁబట్టి చదువు నేర్చిన ప్రతిమానవుఁడు నీగ్రంథమును కొని చదివిన పిమ్మట ప్రపంచములో నేబుద్ధిమంతుఁ డేమిమాట లాడినను గ్రహింపఁ గలిగిన శక్తి గలవాఁడగు ననుటకు సంశయింపఁ బని లేదు. ద్విజుఁ డుపనయనముచే పవిత్రీభూతుం డగున ట్లీగ్రంథము జదువుటచే నరు లెల్లరు పవిత్రులు గాఁగలరు.

ఈ గ్రంథము ననుపుదేరిన తెల్లనికాగితములమీఁద డెమ్మి పరకసయిజున 37) పేజీలలో ముద్రింపఁబడినది. వెల ప్రతి 1-8 రు. 1-12-0 లు మాత్రమే.

"మంజువాణి"

1-8-01

ఏలూరు, గోదావరిజిల్లా.

శ్రీ ర స్తు.

# సకలార్థ సాగరము

## వి ష య సూ చి క.

### జ్ఞానసాధనతరంగము.



### సమాహిత తరంగము.

## ప్రమాణతరంగము.



## అదృష్టతరంగము.

## ప్రమోదతరంగము.



## విజ్ఞానవిద్యాతరంగము.



## పారమార్థికతరంగము.

శ్రీ ర స్తు.

# సకలార్థ సాగరము

## జ్ఞా న సా ధ న త రం గ ము.



శ్లో. శ్రియః కాన్తాయ కల్యాణ నిధయే నిధయే ఒర్థినామ్
శ్రీవేఙ్కటనివాసాయ శ్రీనివాసాయ మఙ్గళమ్.
జ్ఞానానందమయం దేవం నిర్మలస్ఫటికాకృతిమ్
ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవ ముపాస్మహే.

### వే ద ము లు.

వేదము "విద్" అను ధాతువునుండి పుట్టినది. ఈ వేదమును శ్రుతిః, ఆమ్నాయః, అనియుం జెప్పుట కలదు. "వేదయితీతి వేదః" తెలియఁజేయునది గాన వేదమని చెప్పఁబడెను. ఈ వేదశబ్ద నిష్పత్తి యెట్లనఁగా, "విదంతీ యతో ధర్మాధర్మా వితి వేదః" అనఁగా దీనిసహాయమువలన ధర్మాధర్మములు తెలియఁబడును. "శ్రూయత ఇతి శ్రుతిః" అనఁగా వినఁబడుటవలన (పరమేశ్వరునియందుండియే వినఁబడినందున) శ్రుతి యనఁబడెను. మఱియు శ్రోత్రేంద్రియముచే శబ్దరూపముగాఁ దెలియఁబడుటను బట్టి "శ్రుతిః" యనియుం జెప్పఁబడెను. ఆమ్నాయః - అనఁగా వల్లించుట యని యర్థము.

ఇంతియగాక వేదమును ఆదియందు భగవంతుఁడు బ్రహ్మదేవున కుపదేశించెను. బ్రహ్మదేవుఁడు ఋషుల కుపదేశించెను ఋషులు తమశిష్యుల కుపదేశించిరి. ఇట్లుండు కాలమున సోముఖాసురుఁడు వేదములను దొంగిలించుకొని పోఁగా మరలను భగవంతుఁడు మత్స్యావతారము నధిష్ఠించి యా వేదములను అసురునియొద్దనుండి పరిగ్రహించి తెచ్చి బ్రహ్మదేవున కొసఁగెను. ఈ కారణమునుబట్టియే వేదములు లిఖితముగా లేక ఉపదేశముగా నున్నది. ఇందుచేత దీనికి "శ్రుతిః" యని పేరు కలిగెను.

"ఆమ్నాయతే పరంపర యేత్యామ్నాయః" అనఁగా పరంపరగా (గురుశిష్య పరంపరగా) అభ్యసించుటంబట్టి ఆమ్నాయ మనఁబడెను.

ఈ వేదము కాలక్రమముగా ననేకులచే రచియింపఁబడినట్లు కొందఱు చెప్పుచున్నారు. ఇందులకు దృష్టాంతముగా, విశ్వామిత్రుఁడు ఋగ్వేదమునందలి మూఁడవ ఖండములోని గీతములకును, భారద్వాజులు ఋగ్వేదము ఆఱవఖండములోని కొన్ని గీతములకును, వసిష్ఠులు ఋగ్వేదము ఏడవఖండములోని గీతములకును, వామదేవుఁడు ఋగ్వేదము నాల్గవఖండములోని గీతములకును, ఇట్లే అగస్త్య, కశ్యప, ఆంగీరస, జమదగ్ని, పరాశర, గౌతమ, నారద, కణ్వ, మేధాతిథి, శునశ్శేఫాదులు వేదముల లోని కొన్నిగీతములకును కర్తలుగ నుండుటంబట్టి ఋషులే వేదములకు కర్తలని తోఁచుచున్నది. ఎట్లయినను, ఈ వేదములయం దణఁగియుండు విషయము లత్యంతము శ్లాఘనీయ మైనవియు, ప్రపంచవిషయజ్ఞానమును ఆముష్మికవిషయజ్ఞానమును బోధించునట్టివియునై యున్నవి. వేదము శ్రీమన్నారాయణుని శ్వాసరూపమనియును, వేదపురుషుఁడు గరుత్మంతరూపమును ధరించి విష్ణువునకు వాహనమై యున్నాఁడని యును ప్రమాణములు గలవు.

ఈ వేదము కర్మకాండ మనియు, ఉపాసనాకాండ మనియు, జ్ఞానకాండమని యు మూఁడుభాగములుగ నున్నవి.

కర్మకాండము:—ఇహపరసుఖములకుఁ దగిన కర్మానుష్ఠానములను జేయు పద్ధతులును; అశ్వమేధము, వాజపేయము మొదలగు యజ్ఞములు చేయువిధములును; అవి చేయుటవలనఁ గలుగు ఫలములును బోధించును.

ఉపాసనాకాండము:— పరమేశ్వరునియందు భక్తి చేయువిధమును, అట్లు భక్తి చేయువారికిఁ గల్గు ఫలమును బోధించును.

జ్ఞానకాండము:—తత్త్వజ్ఞానమువలన బ్రహ్మజ్ఞానమును బొందుమార్గమును, అందువలనఁ గలుగు ప్రయోజనమును బోధించును.

మఱియు వేదము బ్రాహ్మణము లనియు, మంత్రము లనియు, ఆరణ్యకము లనియు మూఁడువిధములుగ నుండును.

బ్రాహ్మణము లనఁగా:—బ్రహ్మజ్ఞాను లనుష్ఠించవలసిన విధులు.

మంత్రము లనఁగా: —భగవంతుఁడు మొదలగువారిని స్తుతించు స్తోత్రములు.

ఋషులు విన్నవి మంత్రములనియును, ఋషులు తెలిసికొనినవి బ్రాహ్మణము లనియును కొందఱు చెప్పెదరు.

ఆరణ్యకము లనఁగా:—ఋషులు అరణ్యములయందు భగవంతుని స్తుతించిన భాగములు. ఈ ఆరణ్యకములు బ్రాహ్మణములకు టీకవంటిది యని కొందఱి యాశయము.

ఋగ్వేదములోని బ్రాహ్మణములు హోతలయొక్కయు, యజుర్వేదములోని బ్రాహ్మణములు అధ్వర్యులయొక్కయు, సామవేదములోని బ్రాహ్మణములు ఉద్గాతృలయొక్కయు విధులను బోధించును. ఐతరేయబ్రాహ్మణము, కౌషీతకీబ్రాహ్మణము, తైత్తిరీయబ్రాహ్మణము, శతపథబ్రాహ్మణము, తాండ్యబ్రాహ్మణము, గోపథబ్రాహ్మణము అను నీబ్రాహ్మణములు ఆర్యులయొక్క ఆదివచనకావ్యము లని కొందఱెంచెదరు. పైనజెప్పిన బ్రాహ్మణములును, ఆరణ్యకములును ఉపనిషత్తులలోఁ జేరినవి.

బ్రాహ్మణములు, మంత్రములు, ఆరణ్యకములు, ఉపనిషత్తులు మొదలగునవి యంతయు విభజనము లేక యొకటిగా నుండినందున అధ్యయనము చేయువారికి సులభముగా నుండునటుల బాదరాయణ (వ్యాస) మహర్షి రుక్, యజుర్, సామ, అథర్వణము లని నాలుగుగా విభజించెను.

## ఋగ్వేదము.

'ఋక్' అనఁగా పరమాత్మను స్తుతించుమంత్రము. ఇది అత్యంతము పురాతనమైన దనియు సుమారు 3000 సంవత్సరములకు పూర్వమే దీనియొక్క వాక్యము పదము మొదలగునవి లెక్కింపఁబడిన వనియు కొందఱిమతము.

ఈ ఋగ్వేదము పదిమండలములుగా విభజింపఁబడి యున్నది. ఇందు 10622 పద్యములును, 153826 కావ్యములును, 432000 పదములును అణఁగి యున్నవి. ఇందు మొదటి ఏడుమండలములయందు పరబ్రహ్మమును అగ్నియను పేరుతోడను 10వ మండలమున ఇంద్రుఁ డను పేరుతోడను స్తుతింపఁబడి యున్నది. తక్కిన గీతములు బ్రహ్మమును విశ్వేదేవత లను పేరుతోడను స్తుతింపఁబడియున్నది. 8, 9 మండలముల యందు ప్రాధాన్యమైన గీతములు పరబ్రహ్మమునుగూర్చి స్తోత్రముచేయఁబడియున్నవి. 8 వ మండలమునందు 92 గీతములును, 9 వ మండలమునందు 114 గీతములును గలవు. వీనియందు కొన్ని సోమలతను గుఱించియును ప్రార్థింపఁబడి యున్నవి. ఈ పదిమండలములలో 100 కి మీఁద అనువాకములు గలవు.

వీనియందు గీతములను రచియించిన ఋషుల పేళ్ళును, అవి యే దేవతల యొక్క పేళ్ళతో రచియింపఁబడెనో ఆ దేవతలపేరులును, ఏవిషయమునకై రచియింపఁబడినదో ఆవిషయముయొక్కవివరణమును విశదముగాఁ జెప్పఁబడియున్నది. 1 మండలము 15 వ అధ్యాయమునందు కుత్సుని ధృతుని గూర్చిన గీతములును, కొందఱు తపోధను లొకయెడారియందు పోవునప్పుడు జలముకొఱకై యొకఁ డొక బావిలో దిగఁగా వే ఱొకఁడు ఆబావిని బండిచక్రముతో మూసినంత లోపల నున్న

వాఁడు పరితాపముతో ప్రార్థించిన గీతములును, 23 వ అధ్యాయమునందు అగస్త్యులు, ఇంద్రుఁడు మొదలగువారికి జరిగిన సల్లాపములును, 24 వ అధ్యాయమునందు అగస్త్యులు స్తుతించిన గీతములును, మఱియు నతఁడు విషమునకు భయపడి ప్రార్థించిన గీతమును గలవు. ఇట్లే 7 వ మండలము 3 వ అధ్యాయము 8 వ ప్రకరణమునందు వసిష్ఠులు విషవేదన తొలఁగుటకుఁ బ్రార్థించియున్నారు. 3 వ మండలము 5 వ అధ్యాయమునందు విశ్వామిత్రుఁడు రచియించిన ప్రార్థనలయందలి కడపటిగీతములందు 6 మంత్రములలో నొకదానియందు పరమాత్మను ఓంకారగాయత్రిగా స్తుతింపఁబడి యున్నది. 6 వ మండలము 3 గీతములయందు పరమేశ్వరుని సూర్యునిపేరుతో స్తుతించినవియును, వర్షమునిమిత్తము వసిష్ఠులవారు ప్రార్థించినవియును గలవు. 7 వ మండలము 3 వ అధ్యాయము కడపట ఆర్యులు ఆదియందు గృహములు మొదలగునవి నిర్మించునపుడు స్తుతించుమంత్రములు కలవు. నాలుగవ అధ్యాయమున రుద్రునిగూర్చియు స్తుతింపఁబడియున్నవి. మఱియు నీమండలము కడపటిభాగమునందు ఆదికాలపురాజులచరిత్రలు ప్రస్తావింపఁబడి యున్నవి. 8 వ మండలము 27 వ అధ్యాయమునందు రాజపట్టాభిషేకము చేయు విధరణములును, 3 మొదలు 38 వఱకు గల అధ్యాయములయందు ఇంద్రుఁడు మొదలగు దేవతలను వర్ణించువిధములును, 34 వ అధ్యాయమునందు భయభక్తులలవడుటకు సాధనమగు కర్మలును, 4 వ అధ్యాయమునందు పురోహితులయొక్కయు ఆచార్యులయొక్కయు లక్షణములును వారికి చేయవలసిన మర్యాదలును వివరింపఁబడియున్నవి. 10 వ మండలము 6 వ అధ్యాయమునందు శత్రుజయవిషయమైన 2 గీతములును, 7 వ అధ్యాయమునందు చంద్రసూర్యులసల్లాపములును, యముఁడు యమునను చెడుప యత్నించినపుడు నీతివాక్యములను జెప్పి యడ్డగించిన గీతములును, 10 వ అధ్యాయము కడపటిభాగమున అంబరీషునికుమార్తెను గుఱించియును, సూర్యునిగుఱించియును, 11 వ అధ్యాయమునందు మొదట లోకసృష్టివిషయమునుగుఱించియును జెప్పంబడిన గీతములును గలవు.

ఈ ఋగ్వేదమునందలి ఐతరేయబ్రాహ్మణమును, ఐతరేయారణ్యకమును, ఐతరేయోపనిషత్తును, కౌషీతక్యుపనిషత్తును మిగుల ప్రశస్తమైనవిగా నెంచఁబడుచున్నవి.

## యజుర్వేదము.

"యజ్" అను ధాతువునుండి పుట్టినది. యజుర్వేద మనఁగా, యాగము, బలి, దానము మొదలగువానినిగుఱించి చెప్పఁబడినవేదము. ఇందు యాగము, బలి

దానము మొదలగునవి చేయునప్పుడు పురోహితులు, వారి సహాయోపాధ్యాయులు చెప్పునట్టి పద్యములు గలవు ఈ వేదము ననుష్ఠించువారికి అధ్వర్యు లని పేరు.

ఈ యజుర్వేదమున ప్రధానభాగములయందు మంత్రములును, సంహిత యందలి 40 అధ్యాయములయందు స్తోత్రములును గలవు. ఇది 286 అనువాకములును, ఇంచుమించుగా 1937 ప్రకరణములును గలిగి యున్నది.

మొదటి రెండధ్యాయములయందు మొదట అమావాస్య పౌర్ణమి దినములయందు చేయవలసిన యాగములను; కడపట పితృకర్మలను జేయు విధములను; 3 వ అధ్యాయమునందు నిత్యకర్మాదులను; 4 మొదలు 8 అధ్యాయములవఱకు అగ్నిష్టోమాదులను, సోమపానమును; 9, 10 అధ్యాయములయందు వాజపేయము, రాజసూయము మొదలగు యజ్ఞములను; 19, 20, 22, 23, 24, 25 అధ్యాయములయందు అశ్వమేధయాగమును; 30, 31 అధ్యాయములయందు పురుషమేధము, సౌత్రామణి, నారాయణబలి మొదలగునవియును చెప్పఁబడియున్నవి. ఇట్లే తక్కిన యధ్యాయములయందెల్లను యాగవిషయములు ప్రబలముగా వర్ణింపఁబడియున్నవి.

మఱియు స్తోత్రభాగములయందు పరమేశ్వరుని ప్రజాపతి, పరమేష్ఠి, నారాయణుఁడు, బృహస్పతి, ఇంద్రుఁడు, వరుణుఁడు, అశ్విని మొదలగు పేళ్ళచేఁ గొనియాడఁబడియున్నవి ఈస్తోత్రములకువసిష్ఠ, వామదేవ,విశ్వామిత్రాదులుకర్తలుగనున్నారు.

ఈ యజుర్వేదమున చెప్పఁబడినట్లుగ పశుపక్ష్యాదులను జంపుట యనునది మంచిదికాదని సామాన్యముగాఁ దోఁచుటయెగాక, యెంతమాత్రమును ప్రాణులను హింస చేయఁగూడదని విధులున్నవి. మఱియు శతపథబ్రాహ్మణమునందు బలుల నీయఁగూడదని నిషేధింపఁబడి యున్నది.

ఇది వాజసనేయులకాలమున కృష్ణయజుర్వేద మనియును, శుక్లయజుర్వేద మనియును రెండువిధము లైనది. శుక్లయజుర్వేదము వాజసనేయసంహితయనియును, తైత్తిరీయసంహిత యనియును జెప్పఁబడుచున్నది. శుక్లయజుర్వేదమునకు ఉదాత్త అనుదాత్త లను రెండు స్వరములును, కృష్ణయజుర్వేదమునకు ఉదాత్త అనుదాత్త స్వరితము ప్రచయము అని నాల్గుస్వరములును గలవు.

శుక్లయజుర్వేదములోని ఈశావాస్యము, ఉపనిషత్తులకెల్ల ప్రధాన మైనదిగా పరిగణింపఁబడు చున్నది.

## సామవేదము.

సామవేద మనఁగా, గానరూపమైన గీతములు గలది. ఇది సహస్రసంహితాభేద ముకలదియై యున్నది. కొందఱు 1549 పద్యము లున్నయవి యనియును, ఇందు

7౩ పద్యములు ఋగ్వేదములోనివి యనియును జెప్పుచున్నారు. ఈ సామవేదమును నృత్తశాఖను వ్యాసులవలన జైమినిఋషియును, వారివలన తమకుమారులైన సుమంతు మొదలగువారును అధ్యయనము చేసిరి.

ఇందు పరమేశ్వరుని అగ్ని, ఇంద్రుఁడు మొదలగుపేళ్ళతో నుద్ఘోషింపఁబడి యున్నది. మఱియు పాపనివారణమగు గీతములును, వీనిని అధ్యయనము చేయువారికి గలుగు ఫలమును చెప్పఁబడి యున్నది. ఈ వేదమును అధ్యయనము చేయువారిలో ఉదీచ్యసామగు లనియును, ప్రాచ్యసామగు లనియును ఇరువెఱఁగులవారు గలరు. ఈ వేదమును అధ్యయనము చేయువారికి ఉద్గాతృ లని పేరు దీనిని సుకర్మాదులు ఏనూరుగురధ్యయనము చేసియున్నారు.

ఈ సామవేదములోని ఛాందోగ్యోపనిషత్తు, కేనోపనిషత్తు, అను నీ రెండును మిగుల ప్రశస్తము లైనవి. అందును ఛాందోగ్యము మిగుల ప్రసిద్ధ మైనది. ఈసామవేదము భక్తిప్రాధాన్య మైనది.

## అథర్వణవేదము.

అథర్వణవేదమునందు శాంతిక పౌష్టిక చరకాది మంత్ర తంత్ర ప్రయోగ విధులు గలవు. ఈ వేదమును వ్యాసమహర్షి శిష్యు డైన సుమంతుఋషి తనకుమారుఁ డైన కబంధువున కుపదేశించెను కబంధువు దీనిని రెండుగ భాగించి దేవదర్శాది శిష్యుల కుపదేశించెను.

ఇది 28 కాండములును, 1015 వాక్యములును, ఇంచుమించుగా 2000 పైఁబడిన అనువాకములును, 7600 పైఁబడిన సూక్తములును గలిగి 40 ప్రపాఠకములుగా విభజింపఁబడి యున్నవి. ఇందు ముఖ్యముగా శత్రునాశనము మొదలగు విషయములు చెప్పఁబడి యున్నది. మఱియు నక్షత్రములయొక్కయు, మాసములయొక్కయు ప్రస్తావన గలదు. దీని రెండవభాగమునందు ప్రపంచోత్పత్తినిగుఱించియును ప్రపంచమున కాదికారణము బ్రహ్మ మనియును, మఱియు సంవత్సర మాస దిన విషయములును చెప్పఁబడి యున్నవి.

ఈ అథర్వణ వేదాంతర్భూతం బగు ముండకోపనిషత్తును, కేనోపనిషత్తును ప్రశస్తములై యున్నవి.

ఈ చెప్పఁబడిన వేదములు నాలుగింటియందలి ముఖ్యాంశములను వివరించుటకు ఉపనిషత్తులు (వేదాంతములు)ను, మఱియు నీవేదవేదాంతములకు అంగము లైన షట్ఛాస్త్రములును, వేదముల కనుబంధము లగు ఉపవేదములును గలవు.

## ఉపనిషత్తులు.

ఉపనిషత్ అను శబ్దము మూఁడుపదములతోఁ గూడియున్నవి. ఎట్లన, ఉప-ని-సత్. ఉప-సమీపమున, ని-చక్కఁగా, సత్ - పొందఁబడినది. అనఁగా గురు సమీపముననుండి అధ్యాత్మవిద్య పొందఁబడిన దని భావము. ఉపనిషత్—"అస్యాం శ్రేయః ఉపనిషీదతి" అని విగ్రహము. అనఁగా మేలు కల దనియు, లేక హితమును తెలియఁజేయునది యనియు భావము. మఱియు ఉపనిషత్తునకు వేదాంత మనియును, వేదశిర స్సనియును, రహస్య మనియు నిట్లనేకనామములు కలవు. వేదములయొక్క పర్యవసానమును దెల్పునది గాన వేదాంత మనియును, మానవునకు శిరస్సువలె వేదమునకు ఉపనిషత్తు శిరస్స్థానమై యున్నందున వేదశిర స్సనియును పేరు గలిగెను. ఇంతే గాక, పరమాత్మజ్ఞానమును గలుగఁజేయునదిరియై, ఆచార్యునియొద్ద నభ్యసింపఁదగినది యైనందున రహస్య మనియును అంతరంగమనియును, ప్రార్థన యనియును ఇట్లు అనేకార్థములు గలిగి యున్నవి. కావుననే ఉపనిషత్తునకు "సమీపసాధనము" అని పేరు కల్గెను. ఋగ్యజుస్సామాధర్వణము లనెడు నాలుగువేదములలోనుండి 1180 ఉపనిషత్తులు కలిగెను.

ఎట్లనఁగా:—ఋగ్వేదమునందు 21 శాఖలును, యజుర్వేదమునందు 109 శాఖలును, సామవేదమునందు 1000 శాఖలును, అధర్వణవేదమునందు 50 శాఖలును గలవు. ఈ శాఖలసంఖ్య యైన 1180 యును ఉపనిషత్తు లనఁబడును. వీని యందు 840 కర్మమును బోధించును గాన కర్మకాండ మనియును, 232 ధ్యేయ బ్రహ్మమును బోధించుటంబట్టి ఉపాసనాకాండ మనియును, 108 ఉపనిషత్తులు జ్ఞేయ బ్రహ్మమును బోధించును గాన జ్ఞానకాండ మనియును చేరొందెను. మఱికొందఱు 235 అనియు, 170 యనియు, 108 యనియు నిట్లు పలువురు పలువిధములుగాఁ జెప్పుచున్నారు. ఇప్పుడు జ్ఞేయబ్రహ్మమును బోధించు * 108 ఉపనిషత్తులు ప్రసిద్ధముగ నున్నవి. వీనియందు దశ (10) ఉపనిషత్తులు మిగుల ప్రశస్తము లైనవియును, ద్వైత అద్వైత విశిష్టాద్వైతమతస్థులు అంగీకరించినవియునై యున్నవి.

దశోపనిషత్తులు:— ఈశావాస్యోపనిషత్, కేనోపనిషత్, కఠోపనిషత్, ప్రశ్నోపనిషత్, ముండకోపనిషత్, మాండూక్యోపనిషత్, తైత్తిరీయోపనిషత్, ఐతరేయోపనిషత్, ఛాందోగ్యోపనిషత్, బృహదారణ్యకోపనిషత్ అనునవి.

---

* ఈ సారతమ మైన 108 ఉపనిషత్తులను పూర్వము శ్రీరామచంద్రుండు తన నిజభక్తుండు నగు ఆంజనేయునకు మోక్షసిద్ధికొఱకు నుపదేశించుటవలన జగత్ప్రసిద్ధమై వెలయుచున్నది.

కొన్ని యుపనిషత్తులను కొందఱంగీకరించరు. అనఁగా విశిష్టాద్వైతులకుఁ దగిన యుపనిషత్తులు కొన్నియు, శైవులకు దగినవి కొన్నియు, అద్వైతులకు దగినవి కొన్నియునుగా నున్నవి.

కావున అనేకోపనిషత్తులు వారివారిమతేమున కనుకూలముగ రచియించి యుపనిషత్తులలోఁ జేర్చి రని కొందఱి యాశయము. దీనికి దృష్టాంతముగా అక్బరు పాదుషా ప్రీత్యర్థముగ అల్లా ఉపనిషత్తు నొకటిని రచియించియున్నారు. వజ్రసూచ్యుపనిషత్తు మొదలగునవి కొన్ని బౌద్ధమతస్థులచేతను జైనమతస్థులచేతను రచియింపఁబడిన వని చెప్పుచున్నారు.

## వేదాంగములు.

శ్లో. శిక్షా వ్యాకరణం ఛందో నిరుక్తం జ్యోతిషం తథా
కల్పశ్చేతి షడంగాని వేదస్యాహు ర్మనీషిణః.

అనఁగా శిక్ష, వ్యాకరణము, ఛందము, నిరుక్తము, జ్యోతిషము, కల్పము-అని వేదాంగములు ఆఱు.

శిక్ష:—దీనికి పాణిని కర్త. ఇందు వేదశబ్దములయొక్క అక్షరములస్థాన జ్ఞానమును, ఉదాత్తానుదాత్తస్వరిత స్వరములజ్ఞానమును జెప్పంబడును. ఉదాత్తమనఁగా ఉచ్చము, అనుదాత్త మనఁగా నీచము, స్వరితమనఁగా సమానమని తెలియఁదగినది. వ్యాసశిక్ష, భరద్వాజశిక్ష, నారదశిక్ష ఇవియుఁ గలవు.

వ్యాకరణము:—దీనికి పాణిని కర్త. కాత్యాయనులును పతంజలులును వ్యాఖ్యానములను రచియించియున్నారు. ఇందు వేదశబ్దములయొక్క ప్రకృతిప్రత్యయజ్ఞానము విశదీకరింపఁబడి యున్నది. పాణినీయప్రోక్తవ్యతిరిక్తవ్యాకరణములు వేదాంగముగాఁ బరిగణింపఁబడవు. అవి పురాణముల కుపయోగించును.

ఛందము:—దీనికి పింగలముని కర్త. ఇందువలన వేదమునందుఁ జెప్పఁబడిన గాయత్రి మొదలగు ఛందములయొక్క జ్ఞానము బోధ మగును.

నిరుక్తము:—దీనికి యాస్కమహర్షి కర్త. ఇందు వేదమంత్రములయొక్క ప్రయోజనమును స్పష్టపఱుచునిమిత్తము అప్రసిద్ధపదములయొక్క అర్థములు బోధింపఁబడి యున్నవి. మఱియు వేదశబ్దవివరణనిఘంటువును ఇందు గలదు. శాకపూర్ణినిరుక్తమును గలదు. ఇది పదకాండ, అర్థకాండ అని రెండువిధములుగా నున్నది.

జ్యోతిషము:—దీనికి ఆదిత్యాదులు కర్తలు. ఇందు వైదికకర్మల నారంభించుటకు వలయు కాలజ్ఞానమును, తత్ఫలమును, భవిష్యత్సూచనలును వివరింపఁబడి యున్నవి. వీనిని వివరించు సూర్యసిద్ధాంతము మొదలగుగ్రంథము లనేకము లున్నవి.

కల్పము:—దీనికి ఆశ్వలాయన, కాత్యాయన, ఆపస్తంబ, బోధాయన, వైఖానస, ద్రాహ్యాయన, భారద్వాజ, సత్యాషాఢ, హిరణ్యాకేశి మొదలగువారు సూత్రకర్తలు. కల్పసూత్రములు వేదములయం దుద్ఘోషింపఁబడిన యజ్ఞకర్మములనను ష్ఠించురీతిని బోధించును

## ఉపవేదములు.

ఋగ్యజుస్సామాథర్వము లనెడు నాలుగు వేదములనుండి క్రమముగా నాలుగు ఉపవేదములు కలిగియున్నవి. 1 ఆయుర్వేదము, 2 ధనుర్వేదము, 3 గాంధర్వవేదము, 4 అర్థవేదము అనునివి.

ఆయుర్వేదము:—దీనిని రచియించినవారు బ్రహ్మ, అశ్వినీదేవతలు, ధన్వంతరి మొదలగువారు. ఈ వేదము రోగమును నివారణము చేయుటను బోధించును. చరక, వాగ్భట్ట, సుశ్రుతాది గ్రంథములును దీనియంతర్భూతములే. ఈ వేదమును జ్ఞానమార్గము నంటియుండును. ఎట్లన, ఔషధదానమువలన పుణ్యము గల్గును. మఱియు ఔషధములవలన రోగశమనము కాకపోయినప్పుడు వైరాగ్యమును గలుగఁజేసి తద్ద్వారా ముక్తిమార్గమును విచారింపఁజేయును; గాన నిదియు జ్ఞానదాయకమై యున్నది.

ధనుర్వేదము:—విశ్వామిత్రు లీ వేదమునకు కర్త. ఇందు ముక్త, అముక్త, ముక్తాముక్త, యంత్రముక్త మని చతుర్విధ శస్త్రవిద్యలు కలవు. అనఁగా, చక్రాదులు ముక్తము. ఖడ్గాదులు అముక్తము. నారాచాదులు ముక్తాముక్తము. శతఘ్ని మొదలగునవి యంత్రముక్తము. ఈ వేదమునందు అస్త్రశస్త్రప్రయోగమంత్రములును, శత్రునాశమును, శిష్టజనరక్షణమును, జారచోరాదులఖండనమును చెప్పఁబడియున్నవి గాన, ప్రజాక్షేమము కల్గును. తద్ద్వారా మోక్షము సిద్ధించును. దీనిని బ్రహ్మదేవునివలన విశ్వామిత్రుఁ డుపదేశము నొందెను.

గాంధర్వవేదము:—ఇది భరతముని ప్రణీతము. ఇందు స్వర, తాళ, మూర్ఛాదులును, నృత్య, వాద్యాదుల విషయములును స్పష్టముగాఁ దెలియఁజేయఁబడి యున్నవి. గీతమువలన యీశ్వరస్తోత్ర మానందదాయకముగ నుండును గాన నిదియును పరలోకసాధనమై యున్నది.

అర్థవేదము:—దీని కనేక మహాత్ములు కర్తలు. శిల్పశాస్త్రము, పాకశాస్త్రము, నీతిశాస్త్రము, అశ్వశాస్త్రము మొదలగునవి అథర్వణవేదాంతర్భూతములు. ఇవి ధనసంపాదనకు హేతుభూతములు. ఇందువలన ధనసంగ్రహము గలిగి

యాధనము సత్కర్మాచరణము, అనఁగా దేవాలయము, యజ్ఞము మొదలగువా యుపయుక్తమై ఆముష్మికఫలమును గలుగఁజేయును. ఈ వేదమునకు స్థాపత్యమనియు పేరు గలదు.

## పురాణములు.

పురాణము:—అనఁగా వేదమునకంటె పూర్వమునం దుండినది "పురాణం సర్వశాస్త్రాణాం ప్రథమం బ్రహ్మణా స్మృతమ్, అనంతరంతు వక్త్రేభ్యో వేదాస్తస్య వినిర్గతాః" అను మత్స్యపురాణవాక్యమునుబట్టి పురాణములను బ్రహ్మదేవుఁడు వక్కాణించి యనంతరము వేదమును జెప్పినాఁడు. ఈ పురాణము కృతయుగమందు నూఱులక్షలగ్రంథము గలదిగను, త్రేతాయుగమునందు నూటపదునొకండులక్షల గ్రంథము గలదిగను, ద్వాపరయుగంబున యేఁబదియైదున్నరలక్షగ్రంథము గలదిగను రచియింపఁబడెను. కలియుగమున పురాణమును పదునెనిమిదిగ విభజించి నాలుగు లక్షలగ్రంథము గలదిగ వేదవ్యాసమహర్షి రచియించెను.

## పురాణవిభజనము.

శ్లో॥ బ్రాహ్మం పాద్మం వైష్ణవంచ శైవం లైంగంచ గారుడమ్।
నారదీయం భాగవతం ఆగ్నేయం స్కాందసంజ్ఞికమ్।
భవిష్యం బ్రహ్మవైవర్తం మార్కండేయంచ వామనమ్।
వారాహం మాత్స్య కౌర్మాణి బ్రహ్మాండాఖ్య మితి త్రిషట్.

1. బ్రాహ్మపురాణము:—దీనిని బ్రహ్మదేవుఁడు మరీచికి బోధించెను. ఇది పదివేల (శ్లోకము) గ్రంథము గలది.

2. పాద్మపురాణము:—ఇదియు బ్రహ్మచేఁ జెప్పఁబడినది. ఇది యేఁబదియైదువేలగ్రంథము గలది.

3. విష్ణుపురాణము:—దీనిని పరాశరులవారు రచియించిరి. ఇది యెనిమిది వేలగ్రంథము గలది.

4. శివపురాణము:—దీనిని వాయుదేవుఁడు రచియించెను. దీనిని వాయుపురాణ మనియుం జెప్పుట కలదు. ఇందు యిరువదినాలుగువేల శ్లోకములు గలవు.

5. భాగవతపురాణము:—దీనిని శుకమహర్షి పరీక్షిన్మహారాజున కుపదేశించెను. ఇది పదునెనిమిదివేలశ్లోకములు గలది.

6. నారదీయపురాణము:—దీనిని నారదమహర్షి రచియించెను. ఇందు యిరువదైదువేలగ్రంథము గలదు.

7. మార్కండేయపురాణము:—ఇది మార్కండేయమహాముని ప్రణీతము. ఇందు పక్షులు జైమినికి ధర్మములను జెప్పినవి ప్రశస్తము. దీనియందు ముప్పదిరెండు వేలగ్రంథ ముండును.

8. భవిష్యోత్తరపురాణము:—దీనిని శతానీకుఁడు సుమంతునకు బోధించెను. ఇందు ముప్పదియొక వేలగ్రంథము గలదు.

9. ఆగ్నేయపురాణము:—ఇందు భృగుమహర్షిచే యాగాదివిధులు చెప్పఁబడి యున్నవి. ఇది యేనిమిదివేలగ్రంథమై యున్నది.

10. బ్రహ్మవైవర్తపురాణము:—దీనిని వసిష్ఠమహర్షి అంబరీషున కుపదేశించెను. ఇందు పంద్రెండువేల గ్రంథ మున్నది.

11. లింగపురాణము:—దీనిని నందికేశ్వరుఁడు విరచించెను. ఇందు పదునొకండువేలగ్రంథము గలదు.

12. వరాహపురాణము:—దీనిని వరాహమూర్తి భూదేవి కుపదేశించెను. ఇందు యిరువదినాలుగువేలశ్లోకము లున్నవి.

13. స్కాందపురాణము:—ఇది కుమారస్వామిచేఁ జెప్పఁబడినది. ఇందు నూఱువేలగ్రంథము గలదు.

14. వామనపురాణము:—ఇది బ్రహ్మదేవునిచే రచియింపఁబడినది. ఇందు పదునాలుగువేలగ్రంథ మున్నది.

15. మత్స్యపురాణము:—దీనిని మత్స్యమూర్తియగు విష్ణువు మనువున కుపదేశించెను. ఇందు పదునాలుగువేల గ్రంథ మున్నయది.

16. కూర్మపురాణము:— దీనిని కూర్మరూపభగవంతుఁడు రచియించెను. ఇందు ఆఱువేలగ్రంథ మున్నది.

17. గారుడపురాణము:—ఇది విష్ణువు గరుత్మంతున కుపదేశించెను. ఇందు పదునాఱువేలశ్లోకములు గలవు.

18. బ్రహ్మాండపురాణము:—దీనిని బ్రహ్మదేవుఁడు రచియించెను. ఇందు పంద్రెండువేల యిన్నూఱుశ్లోకములు గలవు.

పైన జెప్పిన పురాణములు 18 లో విష్ణు, భాగవత, నారదీయ, గారుడ, పాద్మ, వారాహము లనునవి యాఱును సాత్త్వికపురాణములు. ఇవి విష్ణుప్రతిపాద్యములు.

బ్రహ్మ, బ్రహ్మాండ, బ్రహ్మవైవర్త, మార్కండేయ, భవిష్య, వామనములను నీయాఱును రాజసపురాణములు. ఇవి బ్రహ్మప్రతిపాద్యములు.

శైవ, లైంగ, స్కాంద, ఆగ్నేయ, మాత్స్య, కౌర్మము లనునివియాఱును తామసపురాణములు. ఇవి శివప్రతిపాద్యములు.

మఱియు తామసపురాణములను సాత్త్వికపురాణము లనియును, సాత్త్విక పురాణములను తామసపురాణము లనియును మతద్వేషముచేఁ జెప్పుచుందురు. మఱి కొందఱు మాధ్వులు దేవీభాగవతమునే భాగవతపురాణముగా గ్రహింపఁదగిన దందురు. (ఈ విషయమును చరిత్రచింతామణియందు విశదీకరించెదను.)

## ఉపపురాణములు.

ఈ పురాణములుగాక ఉపపురాణములు 18 గలవు. ఉశనపురాణము, కపిల పురాణము, కాళీపురాణము, సనత్కుమారపురాణము, శంభుపురాణము, సౌరపురాణము, దౌర్వాసపురాణము, నందీయపురాణము, నారసింహపురాణము, నారదీయపురాణము, పారాశరపురాణము, ఆంగీరససంహిత, భృగుసంహిత, మారీచపురాణము, మానవపురాణము, వాసిష్ఠపురాణము, లింగపురాణము, వారుణపురాణము అనునివి.

## పురాణ లక్షణములు.

పైన చెప్పఁబడిన పురాణములయొక్క లక్షణములు రెండువిధములైయుండును.

శ్లో॥ సర్గోఽస్యాథ విసర్గశ్చ వృత్తి రక్షాంతరాణిచ।
వంశోవంశానుచరితం సంస్థాహేతు రపాశ్రయః।
దశభి ర్లక్షణైర్యుక్తం పురాణం తద్విదో విదుః.

అనఁగా: సర్గము (సృష్టి), ప్రతిసర్గము (ప్రళయము), వృత్తి (వ్యాపారము), రక్షా (పరిపాలనము), మన్వంతరము (మన్వాదులకాలము), వంశము (వంశాదివిషయములు), వంశానుచరితము (రవిశశివంశస్థులచరిత్రములు), సంస్థా (స్థితి), హేతువు (కారణము), అపాశ్రయము (ఆశ్రయవిషయము), అను నీపదియును పురాణములకు లక్షణములు,

మఱియొకవిధము:—

శ్లో. సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశ మన్వంతరాణి చ
వంశానుచరితం చేతి లక్షణానాంతు పంచకమ్.

అనఁగా; సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరము, వంశానుచరితము అనునివి.

సర్గ మనఁగా:—సర్వప్రపంచసృష్టిని విస్తరించుట.

ప్రతిసర్గ మనఁగా:—సకలప్రపంచమును లయ మగు లక్షణమును దెలుపుట. (ప్రలయము అని అర్థము).

వంశ మనఁగా:—పృథు, ప్రియవ్రతాదులవంశోత్పత్తిని విశదీకరించుట.

మన్వంతర మనఁగా:— చతుర్దశమనువులలో ఏకల్పమునందు ఏమనువుకాలమున ఏ యే కార్యములు జరిగినవో యా వృత్తాంతము దెలుపుట.

వంశానుచరిత మనఁగా:—సూర్య చంద్ర వంశస్థు లగు శ్రీరామ, ధర్మరాజాదులయొక్క వృత్తాంతమును దెలుపుట.

అను నీ అయిదును పురాణమునకు లక్షణములు. కొందఱు దశలక్షణములతోఁ గూడినది మహాపురాణ మనియును, పంచలక్షణములతోఁ గూడినది అల్పపురాణ మనియును జెప్పుదురు.

మఱియు; పురాణములును ఉపపురాణములును వ్యాసభట్టారకప్రణీతములు. ఇతరులచేఁ జెప్పఁబడిన వని యుద్ఘోషింపఁబడి యున్నను, వ్యాసులవారివలన తదితరులు గ్రహించి చెప్పి రని గ్రహింపవలయును. పురాణములు శిష్యులగుణాగుణములకుం దగిన ట్లుపదేశింపఁబడినవి. అందు భేదవాదంబులు కన్పట్టినను సామరస్యజ్ఞానముచేత సరిపఱుచుకొనవలయును.

మఱికొందఱు శ్రుతిమొదలుగ ఇతిహాసములవఱకు నన్నిఁటికిని పదార్థవాదమనియును, గుణార్థవాద మనియును, లేక బాహ్యార్థ మనియును, అంతరార్థ మనియును రెండర్థములు గలవని చెప్పుచున్నారు. ఇందులకు దృష్టాంతముగ ఇతిహాసములయొక్క యంతరార్థము వ్రాయఁబడుచున్నది.

ఇతిహాసములు.

శ్లో. ధర్మార్థ కామ మోక్షాణా ముపదేశ సమన్వితమ్
పూర్వవృత్త కథాయుక్త మితిహాసం ప్రచక్షతే.

అనఁగా, (మనుష్యుఁడు పొందవలసినట్టి) ధర్మార్థ కామమోక్షము లనెడి పురుషార్థచతుష్టయముతోడను, పూర్వవృత్తాంతకథలతోడను, ఉపదేశముతోడను గూడినది ఇతిహాస మనఁబడును.

రామాయణము, భారతము, హరివంశము అనునివి యితిహాసములు.

భారతము:—ఇది పదునెనిమిది పర్వములు గల కావ్యముగను, సకలధర్మములుఁగి పంచమవేదం బనఁబడునట్లుగను, వేదమును విభజించిన వేదవ్యాసులవారు రచియించిరి.

రామాయణము:—ఇది బ్రహ్మదేవునివలన నారదులును, వారివలన వాల్మీకులును ఉపదేశ మొందిరి. వాల్మీకులు సప్తకాండములుగ విభజించి రచియించిరి.

## భారతాంతరార్థ వివరణము.

అర్జునుఁ డను జీవాత్మ, సత్యమైన ధర్మరాజునకు ప్రాణమైన భీమునికి ఇట్లే తక్కినవారితో వీడకయుండి, మాయ అను ద్రౌపదికారణముగా కామక్రోధాదు లను దుర్యోధనాదులు ప్రబలి బాధించుచుండ, జీవాత్మ యైన యర్జునుఁడు పరమాత్మను బొందఁ గోరినవాఁడై యుండినంత, పరమాత్మ యైన కృష్ణమూర్తి జీవాత్మను (అర్జునుని) రక్షించునిమిత్తమై, యనేకవిధములగు తత్త్వములను బోధించి (భగవద్గీతల నుపదేశించి) తనసాన్నిధ్యమునం జేర్చికొనియెను.

## రామాయణాంతరార్థ వివరణము.

శతయోజనపరిమితసముద్రమే అహంకార మమకార రూపమగు ఘోరసముద్రము. లంకాపట్టణమే శరీరము. ఆత్మవ్యతిరిక్తమైన సమస్తమును స్త్రీప్రాయము. అశోకవననాశనమే అవిద్యావననాశము. ఆంజనేయుఁడే శుద్ధసత్త్వప్రధాన బుద్ధి. రావణ కుంభకర్ణ విభీషణులే తామస రాజస సత్త్వగుణములు. సీతకు భద్రముద్ర నొసఁగుటయే జీవునకు తారకమంత్ర మొసఁగుట. లంకాదహనమే అన్యశేషప్వ దహనము. జానకిశోకమును రాముని కెఱింగించుటయే జీవుని శోకకష్టములు ఆత్మ కెఱింగించుట. లంకకు శ్రీరాముఁడు వచ్చుటయే శరీరమం దుండెడి జీవునకు ఆత్మ సందర్శనము. రావణ కుంభకర్ణాదుల సంహారమే తామస రాజస గుణనాశనము. రావణాసుర మంత్రిపరిజనములే తామస రాజస గుణవృత్తులు. శ్రీరామునిచే విభీషణుఁడు లంకయందు ప్రతిష్ఠింపఁబడుటయే శరీరమందు సత్త్వగుణమును ప్రతిష్ఠిం

చుట. రావణవధానంతరము సీతనాందోళికయం దుంచి తెచ్చుటయే జీవుని ప్రణవరథారూఢునిగాఁ జేసికొనిపోవుట. జానకి యగ్నిచే పరిశుద్ధ మగుటయే జీవుఁడు విరజాస్నానముచే సూక్ష్మశరీరవాసనలను బాపుకొనుట. అగ్ని తనచేతులచే సీతను శ్రీరామునిసన్నిధియందు విడుచుటయే దేవతాకరగ్రహణయోగ్య మగు పంచోపనిషన్మయదివ్యశరీరముచే వైకుంఠమునకుఁ బోవుట. జానకి శ్రీరామునితోఁ పుష్పకారోహణము చేయుటయే జీవుఁడు భగవంతునితో శేషపర్యంక మధివసించుట. శ్రీరామపట్టాభిషేకము సీతతోఁగూడ నగుటయే జీవునకు పరబ్రహ్మత్వప్రాప్తి పట్టాభిషేకము. సుగ్రీవాంగదాదులే మనస్సు చిత్తము మొదలగునవి. వానరసమూహములే మన స్సంకల్ప వికల్పములు. సుగ్రీవ మధువన నాశనమే మన స్సంతోష ఉత్సాహ స్ఫూర్తి నాశనము. శ్రీరాములు సేనలతో సముద్రమును దాఁటుటయే అహంకార మమకారరూప మగు సముద్రమును తరించుట. ఇట్లని కొందఱిమతము. ఇదిగాక, "అష్టాచక్రా నవద్వారా దేవనాం పూరయోధ్యాత్" ఇత్యాది శ్రుతిరీతిగా మఱొక అంతరార్థమును జెప్పుదురు. ఈలాటి అంతరార్థములు చాలాగలవు.

## పిండాండ లక్షణము.

శ్రీపర్వతము, శిరస్థానము. కేదారములు, లలాటము. వారాణసి, భ్రూమధ్యము. కురుక్షేత్రము, కుచస్థానము ప్రయాగ, హృత్సరోరుహము. చిదంబరము, హృన్మధ్యము. కమలాలయము, ఆధారము.

మూర్ధ్ని, సత్యలోకము. లలాటము, తపోలోకము. భ్రూమధ్యము, జనలోకము. గళము, మహర్లోకము. హృదయము, సువర్లోకము. కుక్షి, భువర్లోకము. నాభి, భూలోకము.

మజ్జ, జంబూద్వీపము. అస్థి, ప్లక్షద్వీపము. త్వక్కు, శాల్మలద్వీపము. రక్తము, శాకద్వీపము. మేదస్సు, పుష్కరద్వీపము. మాంసము, కుశద్వీపము. రోమములు, క్రౌంచద్వీపము.

మూత్రము, లవణసముద్రము. స్వేదము, ఇక్షుసముద్రము. శుక్లము, సురాసముద్రము, శోణితము, సర్పిసముద్రము. శ్లేష్మము, దధిసముద్రము. లాలా, క్షీరసముద్రము. బాష్పము, శుద్ధోదకసముద్రము.

భ్రూమధ్యము, శుక్రుఁడు. తాలుమూలము, బృహస్పతి. నేత్రస్థానము, కుజుఁడు. ముఖము, రాహువు. మనస్సు, చంద్రుఁడు. కంఠము, ఆదిత్యుఁడు. హృదయము, బుధుఁడు. నాభి, శనైశ్చరుఁడు. గుదము, కేతువు.

శిరము, కృత్తిక. ముఖము, రోహిణి. నక్త్రము, మృగశిర. నేత్రము, ఆర్ద్ర కంఠము. పునర్వసు - పుష్యమియు భుజములు, ఆశ్లేష - మఖ - పుబ్బలు. కరములు ఉత్తర - హస్తలు హృదయము, చిత్తా-స్వాతి. నాభి, విశాఖ - అనూరాధ - జ్యేష్ఠ. పూర్వాషాఢలు గుహ్యము. ఉత్తరాషాఢ - శ్రవణములు. జానువులు, ధనిష్ఠ - శతభిషము - పూర్వాభాద్రలు జంఘులు, ఉత్తరాభాద్ర - రేవతియు పాదములు, అశ్విని. భరణీ నక్షత్రములు.

ఆత్మ, జ్ఞానాగ్ని. నేత్రములు కోపాగ్ని. హృదయము, శీతాగ్ని. నాభి, క్షుధాగ్ని. పాదము, కాలాగ్ని.

ఈ ప్రకారము దర్శనోపనిషత్తు, మొదలగువాని ఆధారమునలన ప్రపంచమంధ! యన్నిటిని శరీరంబునకుం బోల్తురు. ఈరీతిగా కొన్నిగ్రంథంబులకు బాహ్యార్థ మనియును, అంతరార్థమనియును రెండువిధము లగు అర్థములును కలవు.

ఎట్లనఁగా:—

శ్లో. గంగా యమునయో ర్మధ్యే బాలరండా తపస్వినీ
బలాత్కారేణ గృహ్ణీయాత్ తద్విష్ణోః పరమంపదమ్.

ఈ శ్లోకముయొక్క బాహ్యార్థము సులభముగా బోధమగును గాన అంతరార్థమునుమాత్రము వ్రాసెదను.

శ్లో. ఇడా భగవతీ గంగా పింగళా యమునానదీ
ఇడా పింగళయో ర్మధ్యే బాలరండాచ కుండలీ.

గంగా యమున లనెడు ఇడా పింగళా నాడుల మధ్యమైన సుషుమ్నామార్గమునందు, తపస్వినియై బాలరండ యైన కుండలిని బలాత్కారముగ గ్రహించినయెడల పరమపదము లభించు నని తాత్పర్యము.

ఇత్యాది శ్లోకములు చాలా యున్నవి. వీనిని హఠయోగ ప్రదీపిక యందు గనందగును.

---

శ్రీ ర స్తు.

# సకలార్థ సాగరము



## స మా హి త త ర ం గ ము.

### సాంఖ్య మ త ము.

ఈ మతాచార్యుఁడు క్రీస్తుపుట్టుటకు ముందు 7 లేక 8 వ శతాబ్దమున స్వాయంభువమనువుపుత్త్రియైన దేవహూతిగర్భమున పుష్కరక్షేత్రమందు విష్ణ్వంశ సంభూతుఁడై కపిలుఁ డను పేరుతో అవతరించెను తర్వాత గంగాసాగరసంగమ క్షేత్రమునందు బహుకాలము తపస్సు చేసి యీ మతమును స్థాపించినట్లు తెలియు చున్నది.

ఈ కపిలమహర్షి అవతారము భాగవతము తృతీయస్కంధమునం జూడనగును. కపిలుఁడు శ్యామలవర్ణము గలిగి సామాన్యమైన ఔన్నత్యము గలిగి సదాహరిద్రవస్త్ర ములను ధరించుచుండినదే గాక మనోహర మైన తేజో రూప లావణ్యాదులతోఁ గూడినవాఁడునై యుండెను. ఈ మతమునొక్క ముఖ్యగ్రంథము సాంఖ్యసూత్రము లనఁబడును.

సాంఖ్యమత సిద్ధాంతము:—సాంఖ్యము అనఁగా తత్త్వములను సంఖ్య చేసి చెప్పునట్టిది. సాంఖ్య శాస్త్రమందలి అనుబంధ చతుష్టయము:—"దుఃఖత్రయాభి ఘాతా జిజ్ఞాసా తదపఘాతకే హేతాదృష్టేసాపార్థాచేన్నైకాంతాత్యంతతో భావాత్" అనఁగా సత్త్వరజస్తమంబు లను మూఁడుగుణంబులు సామ్యావస్థ యనెడి మూల ప్రకృతికి దుఃఖములు. ఇవి స్వాభావిక మగుటచేత ప్రతిపురుషునిం బాధించుచున్నవి గాన దుఃఖతిరస్కారమును కోరువారలే అధికారులు. ప్రయోజనము దుఃఖనివృత్తి. విషయములు ప్రకృతిపురుషులు. సంబంధము ప్రతిపాద్య ప్రతిపాదక భావము. అని అనుబంధ చతుష్టయము.

"మూలప్రకృతి రవికృతి ర్మహదాద్యాః ప్రకృతి వికృతయః సప్త, షోడశ కస్తు వికారో నప్రకృతి ర్నవికృతిః పురుషః" పదార్థములు నాలుగువిధములు. ఒకటి ప్రకృతిరూపము. ఒకటి వికృతిరూపము. ఒకటి ప్రకృతివికృతిరూపము (ఉభ

యరూపము). ఒకటి ప్రకృతి వికృతి రూపము కానిది (అనుభయరూపము). ఇట్లు నాలుగువిధంబులు. ప్రకృతిరూప మే మనఁగా, "మూలప్రకృతి రవికృతిః, మూలఃచాసౌ ప్రకృతిశ్చేతి మూలప్రకృతిః".

ప్రకృతి యనఁగా:—మిక్కిలిగా కార్యసంఘాతమును పుట్టించునది. దీని వ్యుత్పత్తి, "ప్రకర్ష వికరోతీతి ప్రకృతిః" దీనికే ప్రధాన మనియు, సామ్యావస్థయని యు వ్యవహారము కలదు. ఇదియే ప్రపంచమునకు కారణము గాని వేఱే కారణ లేదు. గాన మూలప్రకృతి యని అన్వర్థ నామము చెప్పఁబడినది.

వికృతి పదార్థము లేవనఁగా:—"షోడశస్తు వికారః" పంచమహాభూతము ఏకాదశేంద్రియములు, అను పదునాఱు పదార్థములేకాని వేఱేవియును లేవు. గో టాదులు పృథివియొక్క వికారములు కదా యనఁగా, వానియందు స్థూలత్వ లును, ఇంద్రియగ్రాహ్యత్వము అవిశేషముగాను నుండుటవలన అవి పృథివికం నేఱుకా దని యభిప్రాయము.

ప్రకృతిగాను వికృతిగానుండెడి తత్త్వములేవనఁగా:—"మహదాద్యాః ప్రకృతివికృతయః సప్త" అనఁగా, మహత్తత్త్వము, పంచతన్మాత్రలు, ఈ ఏడుతత్త్వ ములలో నొకటి కొకటి ప్రకృతి, ఒకటి కొకటి వికృతి. మహత్తత్త్వము అహంకా మునకు ప్రకృతి. మూల ప్రకృతికి వికృతి. ఈ రీతిగానే అహంకారతత్త్వము పం తన్మాత్రలకు ప్రకృతి. మహత్త్వమునకు వికృతి. పంచతన్మాత్ర లనఁగా సూక్ష్మ భూతములు. అవికూడ మహాభూతములకు ప్రకృతులు. అవి అహంకార తత్త్వమున వికృతు లగుచున్నవి.

ప్రకృతియునుకాక వికృతియునుకాక యుండునట్టి తత్త్వ మేదియనఁగా:— "నప్రకృతిః నవికృతిః పురుషః" అనఁగా పురుషుఁడు కారణసర్గమందును కార్య సర్గమందును చేరనివాఁ డనియర్థము. "తస్మాచ్చవిపర్యాసా త్సిద్ధంసాక్షిత్వమస్యపురు షస్యకైవల్యంమాధ్యస్థ్యం ద్రష్టృత్వమకర్తృభావశ్చ." అనఁగా, పురుషుఁడు మధ్య స్థుఁ డనియు కేవలస్వరూపుఁ డనియు సాక్షియనియు ద్రష్టయనియు కర్తృత్వ లేనివాఁ డనియు తెలియవలసియుండినచో సాంఖ్యవిచారము చేయవలసినది. సాంఖ్య మతము సామాన్య విశేష లక్షణములచే ప్రమాణములను నిరూపించును.

"ద్రష్టమనుమాన మాప్తవచనంచ సర్వప్రమాణసిద్ధత్వాత్ త్రివిధం ప్రమాణ మిష్టం ప్రమేయసిద్ధిః ప్రమాణాద్ధిః ప్రమీయతే అనేనేతిప్రమాణమ్". లక్షణమునకు ప్రమనుగుఱించి కారణ మయినదని తాత్పర్యము. ఇక్కడ ప్రమ యనఁగా సందేహము లేనట్టియు విపరీతము కానట్టియు చిత్తవృత్తి లేదనుటలో అదే ప్రమ యనఁబడును

ఇట్టి చిత్తవృత్తులను కలిగించెడి ప్రమాణము లెన్నియనఁగా:—"త్రివిధం ప్రమాణ మిష్టమ్" మూఁడువిధము లయినవి. "దృష్ట మనుమాన మాప్తవచనంచ" ఇటుల చెప్పుట లోకసిద్ధము లయిన ప్రమాణము లని యర్థము.

"సర్వప్రమాణసిద్ధత్వాత్" ప్రత్యక్షానుమాన శబ్దములయందే, "సర్వం హ్యస్తి పదేమగ్నమ్" అన్నట్లు అంతర్భావముకాని వేఱుకాదు. "ఏవం తత్త్వాభ్యాసానాస్మిన మేనాహమిత్యపరిశేషం అవిపర్యయా ద్విశుద్ధం కేవల ముత్పద్యతే జ్ఞానమ్" అనఁగా సాంఖ్యవిచారముచేత అనర్థరూప మయిన నేను నాది యనెడి అహంకార మమకార ములను వదలి నేను దృశ్యముకాను, నాకు దృశ్యసంబంధము లేదు, అని నిశ్చయ జ్ఞానము కలుగుచున్నది.

సాంఖ్యమత ప్రమాణ లక్షణములు:—ఈ మతమున లేనిదానిని సృజించుట, ఉన్నదానిని నశింపఁ జేయుట లేదు. లేనిది ఏవిధముగాను సృజింపఁబడఁజాలదు. ఏల యనఁగా, ఉన్నవస్తువును భ్రాంతిగా నశింపఁజేసినట్లుగాని, లేక లేనిదానిని సృజించిన ట్లుగాని యెవరును జూచి యుండలేదు. ఈ మతమున 3 ప్రమాణములు. ప్రత్యక్ష ప్రమాణము, అనుమానప్రమాణము, శబ్దప్రమాణము అని. ప్రకృతి (జడము), పురు షుఁడు (ఆత్మ), అను రెండువస్తువులే సృజింపఁబడినవి. ప్రకృతి వృద్ధినొందుట కును క్షీణించుటకును శక్తి గలిగి యున్నది. ఆత్మ కట్టిశక్తి లేదు. వేర్వేరుగ జనించిన ఆత్మలనేకములు గలవు. ఈ ప్రకృతి, సాంఖ్యసిద్ధాంతప్రకారము పరమాణువులసముదా యము గాక సర్వవ్యాపకత్వము గలది. సత్త్వరజస్తమము లనెడి మూఁడుగుణములను గలిగియున్నది. సత్త్వ మనఁగా సంతోషము. రజస్సనఁగా దుఃఖము. తమ స్సనఁగా ఉపేక్ష. ప్రపంచమంతయు యీమూఁడుగుణములను కలిగియున్నది. ఎట్లనఁగా, ఒకఁడు తనకొకపదార్థము దొరికినచో సంతోషించును. అది పోయినచో దుఃఖమును పొందును. దానియందిష్టములేనివాఁడు ఉపేక్షచేయును. ప్రకృతి పురుషునికలిసినపుడు (అట్లుకలియుట ఆకస్మికముగా సంభవించును). మహత్తుజనించును. అది ఆత్మయొక్క యిష్టానుసారముగ కాదు. ఏలయన, ఆత్మకు ఇచ్ఛలేదు. అవిరెండును సమీపించినందు ననే కలుగుచున్నది. చలింపని యినుము, సూదియంటుతాళిని సమీపించినపుడు చలిం చినట్లుగా, ప్రకృతి ఆత్మను సమీపించినపుడు జ్ఞానముపుట్టును. అనఁగా, జ్ఞాన మను నది యొకపదార్థము. అది ఆత్మ ప్రకృతితో కలిసినపుడు దానిని పొందును. ప్రపం చమునందు ఉద్దేశము కనఁబడుచున్నది. కనుక జ్ఞానముతో దాని నుద్దేశించినవాఁడు న్నాఁడనుటకు వలనుపడదు. ఒకయింటిసామగ్రులన్నియు క్రమముగా నేర్పఱచబడి నపుడు ఆ సామగ్రులు తమంతటతాము కలిసి గృహము కాఁజాలవు. కనుక శిల్పిచేసి

నట్లొప్పుకొనుట వాస్తనమేను. గంధకము సూరేకారము మొదలగు పదార్థము కలిసి, కొన్ని యాకారము లగునటుల అనయనపదార్థములు తమంతట తాము కలిసి ఒక యాకారముకాఁగలదు. ప్రకృతి, బాధకుమూలముగాన ఆత్మ దానినివిడిచి అంత్య సుఖము లేక మోక్షముకొఱకు ప్రయత్నించును. తనతప్పులను తన భర్త చూచినయెడల ఆస్త్రీ మరల భర్తసమీపమున కెటులపోనుద్దేశింపదో, అట్లే తనతప్పిదముల నాత్మ కనుఁగొనఁగానే ప్రకృతి దానినివిడిచి పోవును. ప్రకృతిచే జనించినపదార్థము మహత్తని యిదివరకే చెప్పంబడెను. ఆ మహత్తునుండి అహంకారము, అహంకారమునుండి తన్మాత్రలును యింద్రియములును, ఇంద్రియములనుండి సూక్ష్మభూతములును, వాని నుండి స్థూలభూతములును జనించెను. ప్రతిజన్మమందు నశించు చున్న యీ స్థూలశరీరముగాక సూక్ష్మభూతములచే చేయఁబడిన లింగశరీరము ఒకటి కలదు. ప్రకృతి సంపూర్ణముగా త్యజించునఱకు (మోక్షములభించునఱకు) లింగశరీరము ఆత్మ ననుసరించి యుండును. బాధ సంపూర్ణముగా నశించెనేని మానవునకు సంపూర్ణాంతము కలుగును. ఆత్మ, ప్రకృతిని సంపూర్ణముగా త్యజించినపుడు శాశ్వత మైన సుఖము అనుభవించుచుండును. అనఁగా, సాంఖ్యమతకర్మలను చేయువానికి ముక్తిదొరకును.

సాంఖ్యమత కార్యకారణ లక్షణము:—ఈ మతమునందు ఆత్మ కర్త యని అంగీకరింపక అనేక మని అంగీకరించుట అత్యంతవిరుద్ధమై యున్నది. సత్త్వరజస్తమోగుణములకు ప్రధానావస్థ యని పేరు. ఈ ప్రధానము ప్రకృతియై యున్నది. వికృతికాదు. వికృతి యనఁగా కార్యము, ప్రకృతి యనఁగా ఉపాదానకారణము. ఈ ప్రధానము మహత్తత్త్వముయొక్క ఉపాదానకారణమై యుండుటవలన ప్రకృతియై యున్నది. అనాదిగా నుండుటవలన ఇది వికృతికాదు. మహత్తత్త్వ అహంకార పంచతన్మాత్ర లను నీయేడు ప్రకృతులును వికృతులై యున్నవి. ఉత్తరోత్తరమగు నుండుదానిని ప్రకృతిగాను, పూర్వాపూర్వమునం దుండునది వికృతిగాను తెలియవలయును.

తన్మాత్రలు పంచతన్మాత్రలకు ప్రకృతులై యున్నవి. ఈ విధముగా 7 ప్రకృతులు వికృతులై యున్నవి. పంచభూతములు దశేంద్రియములు మనస్సు ఇవి 16 వికృతులు ప్రకృతులుకావు, పురుషుఁడు ప్రకృతి వికృతి రెండునుకాదు. ఎందుకనగా ఒక్కొకపదార్థమునకు కారణమైనచో అది ప్రకృతి యగుచున్నది. కార్యమైనచో అది వికృతి యగుచున్నది. పురుషుఁడు దేనికిని కారణము కానందున ప్రకృతికాదు. కార్యము కానందున వికృతియుకాదు. కాఁబట్టి పురుషుఁడు అసంగుఁ డనఁబడుచున్నాడు. ఈరీతిగా సాంఖ్యమతమునందు 25 తత్త్వములు (అనగా పదార్థములు) గలవు.

ఈ మతమున దిగువ నుదహరించిన నియమములకు వ్యతిరేకమైన పదార్థము లన్నియును అసత్యములు.

1. ఇంద్రియనాశము. 2. ఇంద్రియములయందు దేనిచేనైన నొకదానివలన మనస్సు ఆక్రమింపఁబడియుండుట. 3. దర్శనీయమైనపదార్థము అతి సూక్ష్మముగాఁ గనఁబడుట. 4. అట్టిపదార్థము మహత్తుగా నుండుట. 5. అది బహుదూరముగా నుండుట. 6. అది అత్యంతసమీపమున నుండుట.

ఈ మతమునందు ఈశ్వరుఁడు అంగీకరింపఁబడలేదు స్వతంత్రమైన ప్రకృతియే జగత్తునకుఁ గారణము. పురుషుని భోగమోక్షములనిమిత్తము ప్రకృతియే ప్రవర్తించుచున్నది. పురుషుఁడు ప్రవర్తించుట లేదు. ప్రకృతియొక్క విషయరూప పరిణామముచేత పురుషునకు భోగము కలుగుచున్నది బుద్ధిద్వారా వివేకరూప ప్రకృతియొక్క పరిణామమువలన మోక్షము కలుగుచున్నది. పురుషుఁడు అసంగుఁడగుటంబట్టి వానియందు భోగమోక్షములు సంభవించుటలేదు. అయినను జ్ఞాన సుఖదుఃఖ రాగ ద్వేషాదులు బుద్ధియొక్క పరిణామము లగుచున్నది. ఈ బుద్ధికి ఆత్మవివేకమున్నది. కావున ఆత్మయందు బంధమోక్షములు ఆరోపింపఁబడి యున్నవేగాని పరమార్థమునందు కాదు. అవివేకమునలన సిద్ధించు భోగమునలన ఆత్మ కర్త యని చెప్పఁబడుచున్నది. పరమార్థమునందు ఆత్మ భోక్తకాదు. బుద్ధియే భోక్త. బుద్ధి ఆత్మకు భిన్నము. ఈజ్ఞానము వివేక మనఁబడును. దీని అభావము అవివేక మనఁబడును. ఇట్లీ మతమునందు ఆత్మ అసంగమై యున్నది. సుఖదుఃఖాదులు బుద్ధియొక్కపరిణామములు. కావున బుద్ధియొక్కధర్మము లగుచున్నవి. ఆత్మ అనేక మని చెప్పఁబడును.

సాంఖ్యమతమును ప్రతిపాదించు సాంఖ్యసూత్రములకు శబరస్వామి భాష్యము చేసెను. ఈశ్వరకృష్ణుఁడు కారికలు చేసెను. గౌడపాదాదాచార్యులు ఈ కారికలకు భాష్యము చేసిరి.

కర్దమ దేవహూతులకు బుట్టిన కపిలునిమతము సేశ్వరసాంఖ్య మనియును, మఱియొక కపిలునిచేఁ గలిగిన మతమును నిరీశ్వరసాంఖ్య మనియును జెప్పుదురు.

మఱికొందఱు చెప్పునది యేమనఁగా, కపిలమును లిరువురు కారనియును, దేవహూతికుమారుఁ డైన కపిలునిమతము నిరీశ్వరసాంఖ్య మనియును, పతంజలిచే స్థాపింపఁబడిన మత ముసేశ్వరసాంఖ్య మనియును జెప్పుచున్నారు. నిరీశ్వర సాంఖ్యమునందు ఈశ్వరుఁడు లేఁడనియును, సేశ్వరసాంఖ్యమునందు ఈశ్వరుఁడు కలఁడనియును సిద్ధాంతము.

## సేశ్వరసాంఖ్యమతము.

ఈ మతమునకు యోగమత మనియును పేరు గలదు. దీనికి కర్తయైన పతంజలి మహర్షి క్రీస్తుపుట్టుటకుముందు 200 సంవత్సరములక్రిందట యవతరించెను. ఇతఁడు శేషావతారము. సంస్కృతవ్యాకరణకర్తయైన పాణినిముని గంగానదియందు సూర్యున కర్ఘ్యమిచ్చునప్పుడు వారి అంజలియందు పడిన కారణమున పతంజలి యని పేరు గలిగెను. ఈ పతంజలిమహర్షి చిదంబరక్షేత్రమున మిక్కిలి తపస్సుచేసి యీశ్వర కటాక్షముం బడసెను. ఈతనిచే శరీరరోగతాపముల నివృత్తికొఱకు వైద్యగ్రంథమును, అశుద్ధపదోచ్చారణ వాఙ్మలనివృత్తికొఱకు వ్యాకరణభాష్యమును, విక్షేపతాపాంతఃకరణమలిన నివృత్తికొఱకు యోగసూత్రములను రచియింపఁబడెను. ఈ యోగశాస్త్రమునందు 4 పాదములు గలవు. ప్రథమపాదమున వైరాగ్యమును, ద్వితీయపాదమున యమ నియమా ద్యష్టాంగయోగసాధనములును, తృతీయపాదమునందు యోగియొక్క విభూతులును, చతుర్థపాదమున మోక్షమును చెప్పఁబడియున్నవి. (పాతంజలయోగశాస్త్రమును జూడుఁడు.

సేశ్వరసాంఖ్య సిద్ధాంతము:— నాస్తికసాంఖ్యులు చెప్పునట్లుగా సృజింపఁబడిన పదార్థములు రెండు గావనియును, ఈశ్వరుఁడు ఆత్మ ప్రకృతి అని మూఁడు పదార్థము లనియును, ఆస్తికసాంఖ్య సిద్ధాంతము. ఈశ్వరుఁడు ప్రకృతివలన చలింపువాఁడు కాఁడు. ప్రకృతిని కలియుటచే జనించిన ఆత్మయొక్క బాధను తప్పింప శక్తి గలిగియున్నాఁడు. దీనికొఱకు మానవుఁడు యమ నియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణా ధ్యాన సమాధులను అభ్యాసము చేయవలయును. యోగాభ్యాసము లాభమును గోరి చేసినవారికి గొప్పలాభమును, దేనిని గోరక చేసినవారికి శాశ్వత మోక్షము నిచ్చును.

## పాణినిమతము.

పాణిని మాహేశ్వరసూత్రముల ననుసరించి వ్యాకరణము చేసెను. ఇతఁడు శేషాంశ సంభూతుఁడు. ఈ వ్యాకరణశాస్త్రముయొక్క యుద్దేశ్యము వేదములను గాపాడుట యనియును, క్రమమైన పదముల నుపయోగించుటవలన సంపద కలుగుననియును, పదములకు క్రమ మైన యర్థము చేసి యుపయోగించుటవలన స్వర్గము లభించు ననియును, పరమాత్మస్వభావము వివిధపదములచే దెలియఁజేయఁబడు నొకవస్తువై యున్న దనియును, భేదములు మాయనుబట్టి పుట్టుచున్న వనియును, ముఖ్యముగా పదములయొక్క క్రమ మైన యర్థము తెలియుటయే అంత్యసుఖమునకు సాధన మనియును యీ మతసిద్ధాంతమై యున్నది.

## చార్వాకమతము.

ఈ మతమును స్థాపించిన చార్వాకుఁడు అవంతీదేశమున శంఖోద్ధారక్షేత్రమునందు యుధిష్ఠిరశకము 661 లో జన్మించి ఇదేశకము 727 లో గతించినాఁడు. మఱియు భారతము శాంతిపర్వమునందు చార్వాకుఁ డను రాక్షసుండు బ్రాహ్మణవేషధరుండై ధర్మరాజుతో మతవిషయ మైన పరిహాసవచనములను చెప్పియున్నాఁడు. అయినను వాఁడు రాక్షసుఁ డని తెలిసి వధింపఁబడియున్నాఁడు.

ఈ మతమును దేహాత్మవాది మత మనియును, బృహస్పతిమత మనియును జెప్పుటకలదు. ఈ మతస్థులకు బృహస్పతిసూత్రములు ప్రమాణములు. ప్రత్యక్షప్రమాణము తప్ప తక్కినదానిని యొప్పుకొనరు. మఱియు పృథివ్యప్తేజోవాయువు లను నాలుగు భూతములు మాత్రమే కల వనియును, ఆకాశమను భూతము లేదనియును, భూతముల సంబంధమువలన ప్రాణము కలుగుచున్నదనియును, ఇట్లగుట స్వాభావిక మనియును, ఆత్మ దేవుఁడు మోక్షము మొదలగునవి లేవనియును, వీనిని నమ్మట తెలివిహీనమనియును, ఇహలోకమున ననుభవించినదే ప్రయోజన మనియును, స్త్రీభోగము సంతోషము ఇవియే సుఖ మనియును, దరిద్రము వ్యాధి ఇవియే దుఃఖ మనియును, మరణమే ముక్తియనియును, చచ్చినమీఁద చతుర్భూతములచేఁ గలిగినదేహము చతుర్భూతములుగ మాఱిపోవుచున్నందున నేమియు లే దనియును చెప్పుదురు.

చార్వాకమత సిద్ధాంతము:—ఈ మతమును నాస్తికమతముగానే యున్నది. ఎట్లనఁగా—పరమేశ్వరునకు మోక్ష మిచ్చునట్టి యధికారము సంభవింపనేరదు. "యావజ్జీవం సుఖం జీవేత్ నాస్తి మృత్యో రగోచరః। భస్మీభూతస్య దేహస్య పునరాగమనం కుతః" అనఁగా, బ్రతికియుండువఱకు సుఖముగా జీవించవలయును; మరణమునకంటె వేఱుగతి మఱి యేదియు లేదు, భస్మీభూత మైన దేహము మఱల వచ్చుట లేదు. ఈ మతస్థులు కామశాస్త్రములను అనుసరించి అర్థకామములు రెండు మాత్రమే పురుషార్థ మని సదా తలంచుచు వానికొఱకే ప్రయత్నించుచున్నారు. పరలోకసుఖములను స్వప్నమందైనను తలంపరు. వానియందు లక్ష్యము నుంచరు. పృథివ్యప్తేజోవాయువు లను నాలుగుతత్త్వములే. బొగ్గును గంధకమును క్షారమును అగ్నియును కలిసి ఒకవస్తువును చలింపఁజేసినట్లు, పై నాలుగుతత్త్వములు చేరి దేహరూపమైన శరీరమును ఇంద్రియసముదాయమును చలింపఁజేయుచున్నది; కాఁబట్టి ఇంద్రియముల కూడికయే ఆత్మ యగుచున్నది. ఈ యింద్రియములు నాశమైనతోడనే మరణము సంభవించుచున్నది.

పురుషార్థ మేమనఁగా:—అంగనాంగసంగమముచేకలిగిన యిష్టావినోద స్త్రీ పానా బంధువులయొక్క సుఖమే. ఈ సౌఖ్యము దుఃఖములోఁ జేరిన దని చెప్పెదుష్టమున దుఃఖమును త్యజించి సుఖమును పొందవచ్చును. ఎట్లనఁగా, చేపలను తినుటకాసక్తి గలవాఁడు కంటకసహితములను దుర్గంధయుక్తమును అగునట్టివానినంతయు తీసివేసి తక్కినవానిని భుజించుచున్నాఁడు. ధాన్యార్థి యగువాఁడు పొట్టును పోఁగొట్టి బియ్యమును భక్షించుచున్నాఁడు. కాఁబట్టి దుఃఖభయముచేత సుఖమును త్యజించుట ధర్మముకాదు. మృగము లున్నవను భయముచే పైరుపెట్టుట మానుదురా! యాచకులున్నారని పంటవిడుతురా! బావులలో పడుదురను భయముచే బావులు త్రవ్వింపకుండురా! కాఁబట్టి దుఃఖములకు భయపడి ఇంద్రియసౌఖ్యములు విడనాడుట అవివేకము. దీనికి ప్రమాణము "త్యాజ్యం సుఖం విషయసంగమ జన్మపుంసాం దుఃఖోపసృష్టమితి మూర్ఖవిచారణైషా । వ్రీహీన్ జిహాసతి సితోత్తమతండులాఢ్యాం కోవా తుషకణోపహితాన్హితార్థీ" అని చెప్పఁబడియున్నది.

ఈ మతప్రకారము కంటకాదులవలన గలిగిన దుఃఖమే నరక మనియు, లోకమందు ప్రసిద్ధుఁడైన రాజే భగవంతుఁడనియు, దేహనాశమే మోక్షమనియుఁ దెలియవలసినది. దేహమే ఆత్మ యనుటకు, "అహంస్థూల కృశోస్మీతి సామానాధికరణ్యతః। దేహస్థౌల్యాది యోగాచ్చ సఏవాత్మా నచాపరః" "నేను బలిసినవాఁడను", "నేను చిక్కినవాఁడను" "నే పొట్టివాఁడను" అను నీమొదలగు వాక్యములే ప్రమాణము కాఁబట్టి అట్టి ఆత్మను సాధించుటకు అనుమానాపూర్వబోధకశబ్దములు ప్రమాణములు కావు. అయినను జగద్వైచిత్ర్య మెట్లు సంభవించు ననఁగా, "అగ్నిరుష్ణోజలంశీతం శీతస్పర్శస్తథానిలః। కేనేదంచిత్రితంతస్మాత్ స్వభావాత్తద్వ్యవస్థితిః" అనఁగా:—అగ్నికి వేఁడిమియు, జలమునకు శైత్యమును, అనుష్ణాశీతస్పర్శము పృథివీ వాయువులకు యెట్లు స్వభావములో, అలాగుననే జగద్వైచిత్ర్యమును స్వభావము. ఇందులకు బృహస్పతివాక్యము. "నస్వర్గో నాపవర్గోవా నైవాత్మాపారలౌకికః । నైవవర్ణాశ్రమాదీనాం క్రియాశ్చ ఫలదాయకాః" అని ఈప్రకారము చార్వాకమతసిద్ధాంతమయి యున్నది. ఈ మతమునందు అహింసయే మిక్కిలి శ్రేష్ఠ మని వివరింపఁబడి యున్నది.

## విరోచనమతము.

ఈ మతమునకు అసురస్వామియైన విరోచనుఁడు కర్త. ఈ మతస్థులు అన్నమయకోశమును ఆత్మయందురు. దేనియందు నేను అనెడి బుద్ధి కలుగుచున్నదో అది ఆత్మ. నేననెడి బుద్ధి స్థూలశరీరమునందు కలుగుచున్నది. "నేను మనుష్యుఁడను

నేను బ్రాహ్మణుఁడను'' అను నిట్టి ప్రతీతి యందఱికిని కలుగుచున్నది. మనుష్యత్వము బ్రాహ్మణత్వము స్థూలశరీరమునందే యున్నది. కాఁబట్టి స్థూలశరీరము నే ననెడు బుద్ధికి విషయమై యున్నది. దీనింబట్టి స్థూలశరీరమే ఆత్మ. స్త్రీ ధన పశు పుత్త్రాదులు స్థూలశరీరమునకు ఉపయోగ మైనప్పుడు వీనియందు ప్రీతి కలుగుచున్నది. ఉపయోగ పడనియెడల ప్రీతి కలుగుటలేదు. అన్యపదార్థములందు కలుగు ప్రీతి స్థూలశరీరము నిమిత్తమయ్యే యున్నది గాన స్థూలశరీరమే ఆత్మ యనఁబడును. ఇట్టి స్థూలశరీరమును వస్త్ర భూషణ అంజన అభ్యంజనాదులచేతను, భోజనాదులచేతను వుపచరించుటయే పరమపురుషార్థము. ఈ మతమును అన్నమయకోశాత్మకమత మనియుఁ జెప్పుదురు.

ఈ మతస్థులును చార్వాకమతము ననుసరించి పృథివ్యప్తేజోవాయువు లను చతుర్భూతముల సంఘాత మైన దేహమే ఆత్మ యని చెప్పెదరు. వీరును చార్వాకుల వలె ప్రత్యక్షప్రమాణముతప్ప తక్కినప్రమాణముల నొప్పుకొనరు. నేను అనుటకు దేహమే కారణముగా నుండుటంబట్టి యీ దేహమును అలంకరించి పోషించుటయే పరమధర్మ మనియు, మరణమే మోక్ష మనియుఁ జెప్పుదురు.

## లోకాయితమతము.

ఈ మతమును ఇంద్రియాత్మవాది మత మనియు, నిరీశ్వరవాది మత మనియుఁ జెప్పుదురు. ఈ స్థూలశరీరమునం దేదియుండుటవలన జీవించు వ్యవహార మేర్పడుచున్నదో, ఏది లేకుండినచో మరణవ్యవహార మేర్పడుచున్నదో అదే ఆత్మ. అది స్థూలశరీరమునకు భిన్నమైయున్నది. జీవించుటయు మరణించుటయు నివి యింద్రియములకు అధీనమైయున్నవి. శరీరమునందు ఇంద్రియములుండు పర్యంతము జీవించుట కలదు. ఇంద్రియములయం దేదైన నొకటి లేనియెడల మరణ మని చెప్పఁబడుచున్నది. నేను చూచెదను, మాట్లాడెదను, వినెదను, అనుటయందు 'నేను' అను బుద్ధి యింద్రియమునం దున్నది కావున ఇంద్రియమే ఆత్మ యనఁబడును.

## హిరణ్యగర్భమతము.

ఈ మతమును ప్రాణాత్మవాది మతమనియుం జెప్పుదురు. మరణసమయమునందు మూర్ఛగలిగినపుడు సమీపమునం దుండు పుత్త్రాదులు ప్రాణ మున్నయెడల జీవించినట్లును, ప్రాణములేనియెడల మరణమైనట్లును తెలిసికొనుచున్నారు. మఱియు శరీరమునందు నేత్రేంద్రియము లేనియెడల శరీరమునకు అంధత్వము సిద్ధించుచున్నది. ఇట్లే

శ్రోత్రేంద్రియము లేనప్పుడు చెవుడుగాను, వాగింద్రియము లేనప్పుడు మూఁగగా ఈవిధముగనే యింద్రియవ్యాపారములు లేకపోయినను శరీరముమాత్ర ముండు ప్రాణము లేనియెడల శరీరమునకు చలనాదులు లేకపోవుచున్నది. చూచుట మొదలగు ఇంద్రియములు, నేను చూచుచున్నాను. నేను వినుచున్నాననుటలేదు గా ఇంద్రియము ఆత్మ కానేరదు. శ్రోత్రేంద్రియముతోఁ గూడిన నేను వినుచున్నా నేత్రముతోఁ గూడిన నేను చూచుచున్నాననెడు ప్రతీతియుండుటఁబట్టి యింద్రియము కంటె ఆత్మ వేఱని తోఁచుచున్నది మఱియు సుషుప్తియందు ఏయింద్రియమును ప్రాణముమాత్ర ముండుటంబట్టి జీవించుచున్నాఁడు. అను నిట్టి వ్యవహారము యున్న ప్రాణము ఏయింద్రియమునకును అధీనము కాదు. స్థూలశరీరమునకును ప్రా మునకును గలుగు వియోగమే మరణము. కాఁబట్టి జీవుని జననమరణములు ప్రా ధీనమై యున్నవి. గాన ప్రాణమే ఆత్మ యని చెప్పఁబడును.

## వాచస్పతిమిశ్రమతము.

ఈ మతమునకుకర్త ప్రసిద్ధపండితుఁడైన వాచస్పతిమిశ్రులు. ఈ మతమున ఈశ్వరుఁడును జీవుఁడును అజ్ఞానముచే కల్పింపఁబడినట్లు చెప్పఁబడుచున్నది. నఁగా, జీవుఁడు అజ్ఞాని యనఁబడుచున్నాఁడు. ఈ అజ్ఞానము జీవుని ఆశ్రయిం కొని బ్రహ్మమును విషయము చేయుచున్నది. నేను అజ్ఞాని, నేను బ్రహ్మమును దె కొనలేదు. అనఁగా, జీవుఁడు అజ్ఞాని యనియును, అజ్ఞానమున కాశ్రయము జీ డనియును సిద్ధ మగుచున్నది. బ్రహ్మమును దెలిసికొనలేదు అనునప్పుడు అజ్ఞానము విషయము బ్రహ్మ మని సిద్ధించుచున్నది. ఇట్లు అజ్ఞానము జీవుని ఆశ్రయించి బ్ర మును విషయము చేయుచున్నది. అనఁగా, ఆచ్ఛాదించుచున్నది. ఈ అజ్ఞాన ఒక్కటేకాదు. అనేకము లని తెలియవలయును. ఎందుకన, అజ్ఞానము ఒక్క యనెడు పక్షమునందు ఒక్కని అజ్ఞానము నివృత్తి యైనప్పుడు తక్కినవారి అజ్ఞా మును, దానికార్యమైన సంసారమును ప్రతీతి కాఁగూడదు. ఇదివఱ కెవ్వఁడును జ్ఞా కాలేదనినచో యిఁకమీఁదనుయెవ్వఁడునుజ్ఞానికాఁడు. కావున శ్రవణాదిసాధనము ప్రయోజనము లేకపోవుచున్నవి అయినను అనంతజీవులను ఆశ్రయించిన అజ్ఞాన అనంతమై యున్నది. అనంత జీవులయొక్క అనంత అజ్ఞానముచే కల్పింపఁ ఈశ్వరు లనేకులు అట్లే బ్రహ్మాండమును అనంతములు. ఏజీవునకు జ్ఞానము కలు చున్నదో అప్పుడు అజ్ఞానము ఈశ్వరుఁడు బ్రహ్మాండము ఇవి నివృత్తి యగుచున్న ఎవనికి జ్ఞానము కలుగలేదో వానికి బంధమున్నది. జ్ఞానము కలిగినప్పుడు ముక్తి సిద్ధి

చున్నది. ఇట్లు వాచస్పతిమిశ్రులు ముముక్షువులకు సులభముగాఁ దెలియునిమిత్తము చెప్పినారని చెప్పెదరు. ఎట్లనఁగా, నేను అనెడు శబ్దము వాచ్యార్థప్రకారము అంతఃకరణ విశిష్టచేతనరూపజీవుఁడు. దీనివిశేష్య మైన సాక్షిచేతనము బ్రహ్మము. ఇది అజ్ఞానమునకు ఆశ్రయము. విశేష్యధర్మము విశిష్టమునందు వ్యవహరింపఁబడు చున్నది యని తెలియఁదగినది. (ఈ వాచస్పతిమిశ్రులు సురేశ్వరాచార్యుల అపరావతార మని కొందఱి యాశయము).

## మీమాంసకమతము.

ఈమతము జైమినిమహర్షిచే స్థాపింపఁబడినది. ఈ మతమును పూర్వమీమాంసా మత మనియును చెప్పఁబడును. ఈమతము చాలపురాతనము. ఈమతముయొక్క ధర్మప్రతిపాదకము ఎట్లన:— "ఓం అథాతో ధర్మజిజ్ఞాసా" అను సూత్రమందు అథశబ్దమువలన వేదముయొక్క సాంగాధ్యయనము చేసినతర్వాత యను నర్థము తెలియవచ్చుచున్నది. ధర్మజిజ్ఞాస యనఁగా ధర్మస్వరూపమును తెలియఁగోరుట. పురుషులకు ధర్మాధర్మస్వరూపము తెలియక ధర్మానుష్ఠానము చేయుటకును, నిషిద్ధధర్మములు విడుచుటకును, వీలు చొప్పడనందుచే ధర్మాధర్మములు రెండును విచారణీయము లని యీ సూత్రాభిప్రాయము. ఈ విచారమంతయును స్పష్టముగా ద్వాదశాధ్యాయములు గలిగిన 'పూర్వమీమాంసా' యను జైమినిమహర్షిచే రచియింపంబడిన గ్రంథమునందు వివరింపఁబడి యున్నది.

జైమినిమత సిద్ధాంతము. 1 ప్రపంచము సత్యము, మిథ్య గాదు. 2 దానికి ఆద్యంతములు లేవు. 3 వేదములు ఆద్యంతంబులు లేనివి, నీతిమత బోధకము లైనవి. 4 స్వర్గము నరకము అను రెండు స్థలములు గలవు. 5 ఆత్మ ఆద్యంతములు లేనిది. 6 తమ తమ కర్మానుసారముగ: ఆత్మలకు పునర్జన్మము గలదు. 7 యజ్ఞములను వేదవిహిత మైన కర్మలను చేయుటవలన ఆత్మలకు స్వర్గము లభించును. 8 యజ్ఞములు స్వర్గమునే గాక ప్రాపంచిక సుఖమును నిచ్చును. 9 వేదార్థములను గ్రహించుటకు ఆవశ్యక మైన జ్ఞానముకంటె నెక్కుడు జ్ఞానమును సంపాదింపఁగూడదు. మిగిలిన యంశములందు లేవ యిష్టానుసారముగ నడువ వచ్చును. 10 ద్విజులకే యజ్ఞాది కర్మములను జేయుట కధికారము గలదు.

## వైశేషికమతము.

ఈ మతము విక్రమశకము 1014 సంవత్సరములకు ముందు అంతరంజిక అనునగరమును పాలించు చున్న బలశ్రీ అనురాజు పోషణలో నుండిన కణభుక్ అనియు

కణాదయనియు పేర్లుగలవారిచే స్థాపింపఁబడినది. విశేషమని యొకపదార్థము నిశ్చ
చెప్పినందున నీమతమునకు వైశేషికమని పేరు కలిగెను. దీనిని కాణాదమతమనియు
జెప్పుట కలదు. ఈ ప్రపంచము శాశ్వతము లగు పరమాణువులచే చేయంబడినది.
వంతునివలన వేదములు గలుగలేదు. అయినను క్రమమును ప్రతిపాదించునవి వేదము
అని ఈ మతకర్త చెప్పుచున్నాఁడు.

ఈ లోకమునం దుండు అనుభవసిద్ధ మయినట్టి ప్రతికూలవేదనీయ ము
దుఃఖము అనర్థహేతువు కావున, అట్టి దుఃఖమును నిర్మూలము చేసికొనుటకు
మేశ్వరసాక్షాత్కారము తప్ప వేఱే యేయుపాయమును లేదు. ఎట్లన, "య
చర్మవదాకాశం వేష్టయంతిమానవాః । తదా శివ మవిజ్ఞాయ దుఃఖస్యాంతో భవి
తి". అనఁగా, ఎప్పుడు మనుష్యులు వ్యాపకస్వరూప మైన పరమాత్మను సోపా
స్వరూపముకలదానిగా భావించి చర్మమువలె చుట్టుటకు యిచ్ఛయింపుదురో, అప్పు
ఈశ్వరుని చక్కఁగాఁ దెలిసికొని దుఃఖనాశకు లగుదురు. ఇట్టి ఈశ్వరసాక్షాత్కా
శ్రవణమననాదులవలన కలుగును. "ఆగమే నానుమానేన యోగాభ్యాస బలేన
త్రిధా ప్రకల్పయన్ ప్రజ్ఞాం లభతే యోగ ముత్తమమ్" అనఁగా ఆగమముచేతను, అను
మానముచేతను, ధ్యానాభ్యాసబలముచేతను, బ్రహ్మజ్ఞానమును సంపాదింపవలె
నని భావము. ఈ మూఁటిలో మనన మనఁగా ఆత్మ దేహేంద్రియాదులకు వ్యతిరి
డనెడు భావనారూపము. అది అనుమానసాపేక్షము; అనుమానము వ్యాప్తి
సాపేక్షము. వ్యాప్తిజ్ఞానము పదార్థవివేకసాపేక్షము. ఈవిషయ మంతయు శాబ
భాష్యమందు చక్కఁగా వివరింపఁబడినది. గౌరోహం, అంధోహం, ఇట్టి మిథ్యా
నములు నశించుటచే రాగద్వేషాదిదోషములు నశించును; దోషనాశ మైన ధర్మా
ధర్మాధర్మరూప మయిన ప్రవృత్తి నశించును; ప్రవృత్తి నాశనానంతరము దేహప్రా
రూప మయిన జన్మనాశ మవును; జన్మనాశనానంతరము దుఃఖనాశము కలును
కాఁబట్టి పదార్థతత్త్వజ్ఞానముతప్ప వేఱే యే యుపాయమును మిథ్యాజ్ఞాన
పోఁగొట్ట నేరదు. కనుక అందఱికిని న్యాయవైశేషికాది శాస్త్రాధ్యయనము ఆ
కము. ఈ మతమునందు ప్రత్యక్షము, అనుమానము, అను నీ రెండే ప్రమాణము
సూత్రము:— "ప్రత్యక్షానుమానే ప్రమాణే" ఈ మతము ప్రత్యక్షమాత్ర ప్రమాణ
వాదు లయిన నాస్తికాదిమతముల నిరాకరించి స్వమతస్థాపనయందు జాగరూకత
యున్నది. మననమందు నీశాస్త్రము అత్యుపయోగముగ యున్నది.

## అక్షపాదమతము.

ఈ మతము త్రేతాయుగమునం దవతరించిన గౌతమునిచే స్థాపింపఁబడినది. దీనిని న్యాయసిద్ధాంతమనియు, పాదంబున నేత్రంబు గల గౌతమునిచే స్థాపింపఁబడి నందున అక్షపాద మత మనియుఁ జెప్పుదురు. ఈ మతమును వైశేషికమతము ననుస రించియుండును. దీని సిద్ధాంతంబు లెవ్వి యనఁగా:—ఆత్మ శరీరమునకంటెను, ఇత రేంద్రియములకంటెను భిన్నమైనది. వివిధశరీరములలోనియాత్మలు వేరువేరుగా నున్నవి. పరమాత్మయొక్కటె. అది సమస్తవస్తువులను సృజించెను. అది సమస్తజ్ఞానమునకు మూలము. ఆత్మ ఒకశరీరములోనుండి మఱియొకశరీరమునకు పోవుచుండును. తాను చేసిన సత్కర్మమునకును, దుష్కర్మమునకును తగినఫలము ననుభవించుచుండును. బాధయొక్క నివారణయే యునికియొక్క అంతము. జ్ఞానములో తన్ను ధ్యానించుట వలనను, అనఁగా తన్ను దెలిసికొనుటవలనను, పుణ్యకార్యములవలనను ఆత్మ సుఖ మును బొందును పాతకాదికార్యములవలన గొప్పస్థితి దొరకదు ఈ విషయం బంత యును గౌతమునిచే రచియింపంబడిన పంచాధ్యాయంబులు గల న్యాయభాష్యమున గనందగును. ఈ మతమునందు షోడశ (16) పదార్థము లనియు, చతుః (4) ప్రమా ణము లనియు తేటబడుచున్నది. "మానాధీనామేయ సిద్ధి రితి న్యాయేన ప్రమాణ లక్షణం తావద్వ్యాచష్టే, సాధనాశ్రయా వ్యతిరిక్తత్వేసతి ప్రమాప్రాప్తంప్రమాణం, మంత్రాయుర్వేదవచ్చ తత్ప్రామాణ్యమ్" అనఁగా, ప్రమేయపదార్థములు ప్రమాణ సిద్ధ్యధీనములు కావున ప్రమాణమునకు లక్షణమును మొదట చెప్పుచున్నాఁడు. సాధ నముకంటెను ఆశ్రయముకంటెను వేఱుకానిదై యథార్థజ్ఞానమును కలిగించునట్టిది యని లక్షణము. ఈ యర్థమునే న్యాయపారావారపారదర్శియగు ఉదయనాచార్య వర్యునిచే కుసుమాంజలి యను గ్రంథమునందు నిరూపింపఁబడినది. "మితిః సమ్యక్పరి చ్ఛిత్తి స్తద్వత్తాచ ప్రమాతృతా తదయోగవ్యవచ్ఛేదః ప్రామాణ్యం గౌతమేమతే" ఇందు ప్రత్యక్షానుమానోపమాన శాబ్దికములు నాలుగుప్రమాణములు. ప్రమేయములు 12 విధములు. అవి యేవియనఁగా:—ఆత్మ, శరీర, ఇంద్రియ, అర్థ, బుద్ధి, మనః, ప్రవృత్తి, దోష, ప్రేత్య, భావ, ఫలదుఃఖ, అపవర్గము. ఈ ప్రమేయంబులును ప్రమా ణములును చేరి షోడశపదార్థములు. అన్నిపదార్థములు కథకునియొక్క కథావిశేష ముచే సిద్ధించును. కథ యనఁగా, వాది ప్రతివాదులయొక్క పక్ష ప్రతిపక్షములను గుఱించి చర్చ జరిగించుట. అది మూఁడువిధములు. వాదకథ యనియు, జల్పకథ యనియు, వైతండికకథ యనియు చెప్పఁబడును. తత్త్వనిర్ణయమే ఫలముగాఁ గలిగిన కథ వాద మని చెప్పఁబడును. ఉభయపక్షములకు సాధన మయినట్టి కథ జల్పకథ

యనఁబడును. స్వపక్షస్థాపనము లేనికథ వైతండికకథ యని తెలియవలయును. "ప్రదీపః సర్వవిద్యానాం ఆశ్రయః సర్వకర్మణామ్। ఉపాయః సర్వధర్మాణాం విద్యోద్దేశే పరీక్షిత" అనఁగా న్యాయశాస్త్రము సర్వవిద్యలకు దీపమువంటిది. సర్వకర్మలకు ఆశ్రయ మైనది. సర్వధర్మములకు సాధన మైనది అని భావము. మిథ్యాజ్ఞాన మనఁగా అనాత్మ యయిన దేహాదులయందు ఆత్మబుద్ధి కలుగుట. రాగ మనఁగా ప్రతికూలములయినవానియందు నిరభిలాష. ఇట్టి రాగద్వేషములు మోక్షమార్గమునకు బంధములు కావున వానిని ముఖ్యముగా పోఁగొట్టవలయు నని తాత్పర్యము. ప్రవృత్తి రెండుతెఱంగులు గలది. హింసా ఽస్తేయ అసత్యరూప మయినట్టిది పాపప్రవృత్తి. అహింసా సత్యరూప మయినది పుణ్యకర్మప్రవృత్తి. ఈ ప్రవృత్తులే ఉచ్చనీచములయిన జన్మములకు కారణము లగుచున్నవి కాఁబట్టి పదార్థతత్వజ్ఞానము మోక్షమునకు ముఖ్యసాధన మని సిద్ధాంతము.

## భాట్టమతము.

ఈ మతమును స్థాపించినవారు వార్తికకారులు ఈతనికి భట్ట యనియు పేరు గలదు. ఇదియు పూర్వమీమాంసకమతముతోడ సంబంధించినది ఈ మతసిద్ధాంత మెట్లనఁగా:—ఆత్మవిద్యుల్లతికవలె క్షణికరూపముకాదు. అయినను స్థిరస్వరూపమైన ఆత్మ జడరూపముగను చేతనరూపముగను నున్నది, నిద్రనుండి మేల్కొనినవాఁడు నేను జడమై నిద్రపోతి నని చెప్పుచున్నాఁడు; గాన, ఆత్మ జడరూప మని సిద్ధించుచున్నది. మేల్కొనినవానికి స్మరణ కలుగుచున్నది గాని ప్రతీతి కానట్టి పదార్థముయొక్క స్మరణ కలుగదు. సుషుప్తియందు ఆత్మస్వరూపముతప్ప వే ఱేదియు జ్ఞానసాధనముగ నుండలేదు. కావున, స్మరణమునకు కారణము సుషుప్తియందలి జ్ఞానము. ఇదే ఆత్మస్వరూపము. ఈ ప్రకారముగ ఆత్మ ఆకాశప్రకాశమువలెను, మెఱుపుతీగవలెను, ప్రకాశరూపముగను, అప్రకాశరూపముగను నున్నది. జ్ఞానరూపముగ నుండుటచే ప్రకాశరూపముగను, జడముగ నుండుటచే అప్రకాశరూపముగను నున్నది. అనఁగా, సుషుప్తియందు చేతనముయొక్క ఆభాస సహిత అజ్ఞానానందమయకోశము ఆత్మ యని చెప్పఁబడుచున్నది. ఈ ఆభాసము ప్రకాశరూపముగను, అజ్ఞానము అప్రకాశరూపముగను నున్నది. ఇట్లు ఆనందమయకోశము ప్రకాశమానముగను, అప్రకాశమానముగను నుండుటవలన ఆనందమయకోశమే ఆత్మ యని చెప్పఁబడుచున్నది.

## ప్రాభాకరమతము.

వార్త్తికకారులశిష్యులలో నొక్కఁడైన ప్రాభాకరుఁడు యీ మతమునకు కర్త. ఈ మతము పూర్వమీమాంసకమతముతో సంబంధించిన నైయాయికమతము. ఈ మతసిద్ధాంతమునందు ఆత్మ శూన్యముకాదు. ఎందుకనఁగా.—ఆత్మను శూన్యరూపముగా జెప్పువారిని శూన్యరూపమును నీవు అనుభవించితివా, లేదా, యని యడిగినప్పుడు శూన్యరూపమును అనుభవించలేదని చెప్పినచో శూన్యము లేదని సిద్ధించును. అనుభవించినట్లు చెప్పినచో దేనివలన శూన్యము అనుభవింపఁబడెనో అదే ఆత్మ యనియును, అది శూన్యమునకు లక్షణ మనియును సిద్ధించును. శూన్యమునకు విలక్షణమైన ఆత్మయందు మనస్సుయొక్క సంయోగమువలన జ్ఞానము కలుగుచున్నది. జ్ఞానగుణమువలన ఆత్మ చేతన మని చెప్పఁబడుచున్నది. స్వభావమునందు ఆత్మ జడము. ఈ జడమైన ఆత్మయందు సుఖము, దుఃఖము, ఇచ్ఛ, ద్వేషము, ప్రయత్నము, ధర్మము, అధర్మము, ప్రియము మొదలగు గుణము లున్నవి.

ఇందు ఆనందమయకోశమే ఆత్మ యనఁబడును. విజ్ఞానమయకోశమునం దుండు బుద్ధి ఆత్మయొక్క జ్ఞానగుణము. ఎట్లనఁగా, ఆనందమయకోశమునం దుండు చేతనము గుప్తమై యున్నది, వివేకము లేనివాని కిది ప్రతీతి యగుట లేదు, సుషుప్తి యందు ఆత్మస జ్ఞానము లేదు గాన ఆత్మ జడ మనఁబడెను. మఱియు ఆత్మస్వరూపమైన నిత్యజ్ఞానము జీవునియందు లేదు. అనిత్యజ్ఞాన మున్నది ఈ సిద్ధాంతమునందును ఆనందమయకోశము ఆత్మగాను, బుద్ధి దానియొక్క గుణముగాను నున్నది

## నింబార్కమతము.

క్రీస్తు పుట్టిన 12 వ శతాబ్దమునందు నింబార్కునివలన నీ మతము స్థాపింపఁబడినది. ఈ మతాచార్యులైన భాస్కరాచార్యు లొకనాఁడు ఒకసన్న్యాసిని భోజనమునకుఁ బిలిచిరి. వారు సమ్మతించి వచ్చెద నని చెప్పి యాదినము సాయంకాలము దనుక రాకపోయిరి. భాస్కరాచార్యులును అంతవఱకు భోజనము చేయలేదు. ఇంతలో సూర్యుఁ డస్తమించెను. భాస్కరాచార్యులు ఆఁకలిచే పీడితులై యుండఁగా సన్న్యాసి వచ్చి చేరెను. సూర్యాస్తమయమున కనంతరము సన్న్యాసులు భోజనము చేయరు గాన, భాస్కరాచార్యులు సూర్యనారాయణుని గూర్చి మిగుల ప్రార్థించిరి. అంత సూర్యుఁడు నింబ (వేప) వృక్షముతో అటలో తనకిరణములతోఁ బ్రకాశించెను. ఆ సూర్యభగవానుని జూచి యిరువురును భుజించిరి. అదిమొదలు యీ మతాచార్య

లైన భాస్కరాచార్యులకు నింబార్కులని పేరు గలిగెను. సూర్యసిద్ధాంతము రచించిన భాస్కరాచార్యులు వీరే యనియును, సూర్యుఁడే యిట్లవతరించె ననియు కొందఱు చెప్పుచున్నారు. ఈ నింబార్కులు వేదములకు భాష్యము చేసి యుండి దానినంతయును ఔరంగజీబు నాశము చేసెను. వీరికి భాగవతము ముఖ్యమైన ప్రమాణగ్రంథమై యున్నది వీరు కృష్ణమూర్తిని రాధాదేవిని పూజింపుచుందురు. వీరు మధ్వులవలె గోపీచందనమును ఊర్ధ్వపుండ్రముగా ధరింతురు. గీతగోవిందమును రచియించిన జయదేవకవి యనువారీ మతము ననుసరించినవారు. ఇందును వైష్ణవమతమువలె జీవాత్మను నాయికగాను, పరమాత్మను నాయకుఁడుగాను వర్ణింపఁబడియున్నది.

ఈ మతస్థులు మిగుల శాంతమును భక్తియును కలవారు. ఈ మతస్థులలో నే కులు గోకులము మొదలగు స్థలములయందుండు గుహలలో శుద్ధసాధువులుగ కాలముగడపుచున్నారు.

సిద్ధాంతము:—జగదీశ్వరుఁ డొక్కఁడే యున్నాఁ డనియును, ఆదేవుని విగ్రహమును జూచి యిప్పుడెట్లు ఆనంద మొందుచున్నారమో, అట్లే పరలోకమునందును జూచి ఆనంద మొందవచ్చు ననియును, అట్లానందించుటకు కేవలము భక్తియే ముఖ్యమైన దనియును, శ్రీ రాధాకృష్ణులనే జీవాత్మ పరమాత్మలనుగా భావించి బ్రహ్మానందమొందవలయునేగాక తుచ్ఛభోగమునందు రాధాకృష్ణులు ప్రవర్తించినారని మూఢులు కొంద ఱెంచెడురీతిగా నెంచఁగూడ దనియును చెప్పుచున్నారు.

ఈ మతసిద్ధాంతమును సిద్ధాంతరత్నాంజనము, రత్నమాల, రత్నమంజరి, సేతుకము, గిరివ్రజము మొదలగు గ్రంథములు బోధించును.

## రాధావల్లభమతము.

ఈ మతమును హితహరివంశాచార్యమత మనియును జెప్పుట కలదు. విక్రమశకము 1559-వ సంవత్సరము షహారాఁపూర్ జిల్లాతోఁ జేరిన దేవవనము అను గ్రామమునందు వ్యాసులనుపేరుగల గౌడబ్రాహ్మణుఁడు పుత్త్రుఁడు లేనిదుఃఖముచే అనేకవ్రతములు చేయుచు నుండెను. ఇట్లుండఁగా ఢిల్లీచక్రవర్తియొద్ద వుద్యోగ మమరెను. అంత తాను తనభార్యతోడఁ గూడి ఆ గ్రామమార్గముగాఁ బోవుచుండఁగా, ఆ దారి యందే అతనిభార్య యైన తారాదేవి గర్భము ధరించి శ్రీ మధురాపురికి సమీపమునందుండు దేవవనము అను గ్రామమునందు మగశిశువును గనెను. ఆ బిడ్డకు హరివంశుఁడు

అని నామకరణమును జేసి మిగుల గారాబముతోఁ బెంచుచు నుండిరి విద్యాభ్యాసానంతరము హరివంశులవారికి వివాహయుక్తవయస్సు రాఁగా రుక్మిణి యను పేరు గల కన్యకను వివాహము చేసిరి. ఆరుక్మిణిగర్భమున యిద్దరు మగబిడ్డలును, ఒక ఆడు బిడ్డయును పుట్టిరి పెద్దకుమారులపేరు మోహనచంద్రులు. అతనికి సంతతిలేకపోయెను. చిన్నకుమారు లైన గోపీనాథులు అను వారు ప్రస్తుతమున దేవబనమునందు వసించుచున్నారు. తమకుమార్తెను వివాహమైన యనంతరము సన్న్యాసమును స్వీకరించి బృందావనమునకు వచ్చుచుండఁగా మార్గమున నొక వృద్ధబ్రాహ్మణుఁడు సంధించి తనయొక్క యిర్వురుకుమార్తెలను వివాహము చేసికొనవలయు ననియును, అట్లు చేసికొనుటకై స్వామియనుజ్ఞ కలిగియున్న దనియును చెప్పి, రాధావల్లభవిగ్రహము నొసంగి పూజచేయు మని చెప్పఁగా, హరివంశులు వల్లె కాని మ్మని యా యిద్దరుకన్యలను వివాహమాడిరి తర్వాత బృందావనమునందు దేవాలయము నిర్మించి యందు ఆ రాధావల్లభస్వామిని ప్రతిష్ఠచేసిరి. వీరు ప్రథమమున ద్వైతసిద్ధాంతమునందును, తర్వాత నింబార్కసిద్ధాంతమునందును ఆసక్తికలవారై యుండిరి. ఆమీఁద రాధావల్లభు లను నామమును ధరించి లోలత్వమునం దభిలాష గలిగి యుండిరి. కావుననే వీరు రాధాసుధానిధి మొదలుగాఁగల శృంగారకావ్యములను గీతములను రచించి ఆనందముగా చదువుచు పాడుచు నుండిరి. వీరిగీతములను "భక్తిమాల" యను గ్రంథమునఁ జూడనగును. ఈ గీతము లన్నియును శృంగారవర్ణనలతోఁ గూడియుండును. వీరి ప్రథమశిష్యు లైన వ్యాసజీ అనువారికి అనేకాద్భుతముల నగపఱచిరి. రాధావల్లభులవారి సమాధిని బృందావనమునందు నేటికిని జూచి యానందింపవచ్చును.

వీరి రెండవశిష్యులు ధ్రువదాసు అనువారు. వీరు జీవదశ, వేదగానము మొదలగు అనేకగ్రంథములు రచియించియున్నారు.

ఈ మతము వల్లభాచార్యవైష్ణవమతమును కొంచె మనుసరించినట్టిదిగాఁ గనఁబడుచున్నది ఈ మతస్థులును కృష్ణోపాసన చేయుదురు. వల్లభమతస్థులవలె కంఠమున తులసీమణిహారమును ధరింతురు. వీరికిని యేకాదశీదినమున తాంబూలమును ధరింపవలసిన దని కృష్ణమూర్తి యనుజ్ఞ కలదు. గాన నాప్రకారము తాంబూలమును వేసికొందురు. వీరికి శిష్యులు పెక్కుజను లున్నారు.

## హరిదాసుమతము.

ఉత్తరమథురకు సమీపమునందు గోల అను గ్రామమునందు సనంఢుఁ డను బ్రాహ్మణుఁ డొకఁడు గిరిధరుఁ డను పేరుగల కృష్ణమూర్తిని యా గ్రామమునందే

ప్రతిష్ఠచేసి పూజించుచుండెను. ఇతఁడు బృందావనమునకు సమీపమునందు రాజ
అను గ్రామస్థుఁడైన గంగాధరుఁ డను బ్రాహ్మణునికొమార్తెను వివాహ మైయుండెను.
విక్రమశకము 1441-వ సంవత్సరమందు సనందున కొక మగబిడ్డ పుట్టెను. ఆబిడ్డ
శ్రీ హరిదాసు అని నామకరణము చేసెను. ఆ శిశువు క్రమముగా వృద్ధినొంది చిన్న
నాటినుండియే విష్ణుభక్తియం దత్యంతాసక్తి కలవాఁడై యుండెను. అంత హరిదా
బృందావనమునకును యమునకును నడుమనుండు మానససరోవరమున వసించి చా
కాలము తపస్సు చేయుచుండెను. ఆమీఁద నందవనమునకు రాఁగా నచ్చట తనక్షే
మామగా రయిన విఠలభూపాలుఁడు ప్రథమశిష్యుఁ డాయెను. ఈ హరిదాసుయొక్క
మహత్త్వము నలుదిశల వ్యాపించుచుండెను. అప్పుడు ఢిల్లియందు వసించుచుండి
దయాళుదాసు అనువారు ఒక మహాత్ముఁ డిచ్చియుండిన బంగారుచేయు తా
పోఁగొట్టుకొన్నవ్యసనముచేత హరిదాసుయొద్దకు వచ్చి మొఱబెట్టఁగా, ఆ దయాళ
దాసుని జూచి యమునయం దుండి యొకపిడికెడు యిసుకను తీసిచూడు మనఁగా
హరిదాసువా రాజ్ఞయిచ్చిన మేరకు యిసుకను దీసిచూడఁగా అంతయు బంగారుగను
మఱియు తానుపోఁగొట్టుకొన్నట్టి తాయిలెనే యొక్కొక్క యిసుకయు గనఁబడఁగా
జూచి మిగుల ఆశ్చర్యమొంది యతఁడును శిష్యుఁ డాయెను.

ఇంతేగాక, హరిదాసుయొద్ద సాలగ్రామ మొకటి యుండుటంబట్టియే యిట్లు
బంగార మగు చున్న దని యెంచి దొంగలు కొందఱు ఆ సాలగ్రామమును దొంగిలించు
కొని పోయిరి గాని అది వారికి బంగా రీయకపోయినందుచే దానిని యొకపాదలో
పాఱవైచిరి. ఆ సంగతిని హరిదాసువారు జ్ఞానదృష్టిచే నెఱింగి యా సాలగ్రామము
నచ్చోటనే యుండునట్లుచేసి అచ్చటనుండియే ప్రతినిత్యమును భగవత్పూజాకైంకర్య
ములకును కోఁతులు మొదలగువానికి ఆహారమునకును వెచ్చమునకై ప్రతిదినము
ఒక బంగారుమొహరిని తనయొద్దికి వచ్చునట్లు చేసికొనిరి.

మఱియు శిష్యులు రెండువేలనిష్కములు సుగంధద్రవ్యములను భగవంతునికై
తీసిపెట్టియుండఁగా దానినంతయు హరిదాసువారు మట్టిలో పాఱబోసిరి. దానికి
శిష్యులు వ్యాకులత నొందిరి. ఆమీఁద శిష్యులతోఁగూడి భగవత్సన్నిధికిఁ బోయిచూ
డగా నచ్చట దేవాలయమంతయు సుగంధమయముగ నుండెను. ఇట్లు అనేక అద్భుతము
లను జేసి యనేకులను శిష్యులనుగాఁ జేసికొనిరి.

ఇతఁడు విక్రమశకము 1537 సంవత్సరమునందు పరమపదము నొందెను. అనం
తరము యితని ప్రథమశిష్యుఁడైన విఠలభూపాలుఁడు హరిదాసుయొక్క మహంతు
పట్టమునకు వచ్చెను అతనికి తర్వాత బిహారిదాసు, నగరిదాసు మొదలగువారు
మహంతు లైరి.

సిద్ధాంతము:—ఈ మతము కొంచెము భేదముతో చైతన్యమతము ననుసరించి నదిగాఁ గన్పట్టుచున్నది. అయినను యిందు తత్త్వవిచారము మెండుగాఁ గలఘు సర్వధర్మపరిత్యాగము చేసి శుద్ధసన్న్యాసము నొందవలయును. ఈ మతముయొక్క ముఖ్యగ్రంథములలో సాధారణసిద్ధాంతము, రసికపదము అను నివి ప్రసిద్ధములు. ఈ మతస్థులు బృందావనము మొదలగు ప్రాంత్యములయం దున్నారు.

## ఉదాసీనమతము.

ఈ మతము నానక్ అనువారిచే స్థాపింపఁబడినది. దీనికి సీఖ్ (శిష్య) మత మనియు పేరు గలదు. ఈ మతస్థాపకుఁడైన నానక్ పంజాబులో బీయానదీతీరమునం దుండు రామపురములో యిక్ష్వాకుసంతతివారైన కల్యాణచంద్ అను నతనికి త్రిపణ గర్భమున శాలీవాహనశకము 13 9 లో అవతరించెను. ఇతఁడు తన పూర్వమతమును వదలి కొంతకాలము తురకమతము నవలంబించెనుగాని, అక్బరుపాదుషావలెనే ఇతఁడు సున్నతి చేసికొనకుండెను. తుద కీతనికి మహమ్మదుమతమునందు నమ్మకము లేక పోయెను. అయినను యీతఁడు మక్కాకుపోయి అచ్చటనున్న విష్ణువిగ్రహమును మరల ప్రతిష్ఠచేసెను. ఇతఁడు రచియించిన గ్రంథము లనేకము లున్నవి. హిందూ మతసారాంశములను కొన్నిఁటినిమాత్రము గైకొని యొకక్రొత్తమతమును శిష్యుల కుప దేశించి వారిని మిగుల శాంతస్వభావులుగ నుండునట్లు చేసెను. ఇతఁడు శాలీవాహన శకము 146 లో పరలోకము నొందెను. ఇతనికి తర్వాతవచ్చిన పీఠాధిపతులలో నొకఁడైన గురుగోవింద్ అను నతఁడు సీఖ్‌మతస్థులను శూరులనుగాఁ జేసెను. కావున అదిమొదలు వీరు సదా ఆయుధపాణులైయున్నారు. ఈ మతమున అకాలీ అని మఱొకభేదము గలదు. వీరికి ఆహో అనియు పేరు గలదు.

ఈ మతస్థులు నానక్ రచియించిన గ్రంథములనే పూజించుచుందురు. నమ స్కారము చేయునపుడు బావాగురూజీ అని చెప్పుదురు. ఈ మతస్థులును జైనమత స్థులవలె హింసాదికార్యములు చేయరు.

## మాలక్‌దాసమతము.

ఈ మతమును మాలక్‌దాస్ అనువారు స్థాపించిరి. ఇది ఔరంగజీబుకాలము నందు కలిగినది. ఈ మతమును యించుమించుగ హరిదాసుమతము ననుసరించి యున్న యది. అయినను హరిదాసుమతస్థులు కృష్ణనామజపము చేయుదురు. ఈ మతస్థులు రామనామజపము చేయుచుందురు.

ఈ మతస్థులయొక్క ముఖ్యగ్రంథము "దశరత్నము" అనునది. ఈ మతస్థు గోకులము మొదలగు ప్రాంత్యములయం దున్నారు.

## ధామక్ మతము.

ఈ మతాచార్యులైన ప్రాణనాతిస్కు లనువారు సుమారు నూటయిరు యేండ్లకుముందు బుందేల్‌ఖండమును పాలించిన క్షత్త్రియరాజుయొక్కసహా మును గొని యీ మతమును స్థాపించిరి. ఇది యొకవిధమైన వైష్ణవమతముగ నున్న ఈ మతమువారు ఖురానులోను బైబిలులోను కూడా ఆర్య వేద వేదాంత పురాణే హాసాదులలోని విషయములే అడఁగియున్నవని చెప్పుచున్నారు. సకలమతముల సా మును గ్రహించి సకలమతములను బోఁగొట్టి యొకేమతమును చేయుటకై ప్రయత్నిం నట్లు కనఁబడుచున్నది.

సిద్ధాంతము:—ధామకు లనఁగా దేవునియొక్క పుత్త్రు లని భావము. వీ విగ్రహారాధన లేదు. వీరు గుళ్ళయందు మతాచార్యులచే రచియింపఁబడిన గ్రంథమ నుంచి పూజింతురు. ఆ గ్రంథము లేవి యనఁగా—రసము, ప్రకాశము, కలశ సనందము, కీర్తనము, ఖేలపదము, సాగరశృంగారము, వారిశృంగారము సిద్ధిభా మొదలగునవి.

ఈ గ్రంథములయందు హిందూవేదాంతములయొక్కయు, ఖోరానుయొక్క యు ముఖ్యాంశము లణఁగియుండును. ఈ మతస్థులను గొందరు నాస్తికు లనియు అద్వైతు లనియును, చార్వాకు లనియును, లోకాయితు లనియును, పరిశుద్ధవైష్ణవు యును, సమరసవేదు లనియును చెప్పెదరు. సాధారణముగా వీరిని ప్రాణనాతీ వైష్ణవు లని చెప్పుచున్నారు.

## ఆనందమతము.

ఈ మతమును స్థాపించినవారు రామానందులు. ఈ మహాపండితుఁడు క్రీ పుట్టిన 14-వ శతాబ్దమున కాశీదేశమునందు ప్రబల మైన విష్ణుభక్తుఁడై యుండె ఇతఁడు రామానుజాచార్యులవారియొక్క శిష్యుఁ డని లోకప్రసిద్ధము. కాబట్టి యీ మతము రామానుజమతసిద్ధాంతము ననుసరించియున్నది. ఈ మతస్థులు గోపీచం నముచేత తెల్లగల తిరుమణివలె నామమును ధరించి శ్రీరాముని లీలను మిగులఁ గొ యాడుచున్నారు. వీరియొక్క ముఖ్యగ్రంథమునకు 'భక్తిమాల' యని పేరు. ఈ మ స్థులు గంగాతీరమందును, ఆగ్రా మొదలగు దేశములయందును విశేషముగ నున్నా

ఈ రామానందులకు విఠలపంత్, కబీరు మొదలుగాఁగల పన్నిద్దరు శిష్యులు గలరు. రామానందులవారి మతమునందు జాతిభేదము, ఆచారము, కర్మము మొదలగు నవి కలవు. కబీరుమాత్రము వీనిని నిరసించెను. ఈ మతములోఁ జేరిన బైరాగులకు జాతిభేదములేదు

## మీరాబాయిమతము.

ఈ మతకర్త్రియైన మీరాబాయి మార్వాడదేశములోని మేరతునగరమున విక్రమశకము 1475 లో విజయమల్లు అను సర్దారునకు పుత్త్రియై జన్మించెను. ఈమెకు తండ్రి చక్కఁగా విద్య నేర్పెను. ఈమె ఉదయపురరాజును వరించెను. ఈమె సౌందర్యమున కచ్చెరువంది అక్బరుపాదుసా మోహించినసంగతి తెలిసి భర్తయాజ్ఞను గైకొని నదిలో దుమికెను. అపు డొక జ్యోతి కనఁబడి లెమ్ము లెమ్ము అనెడి శబ్దము వినఁబడఁగా నాయమ లేచి యచ్చోటనుండి బృందావనమునకుఁ బోయి కృష్ణభక్తి చేయును నుండెను. ఈమెచే రచియింపబడిన కీర్తనములను యిప్పటికిని పాడుచున్నారు. ఈమె కనేక శిష్యులు గలరు. ఈమె “సదా భగవంతునిభక్తియే పరమార్థసాధనము” అని బోధించు చుండెను. ఈ వాక్యమునే సిద్ధాంతముగా నీమె శిష్యులవలనను అంగీకరింపఁబడినది. ఈమెపద్ధతిని అనుసరించిన మతస్థులు కొంద టిప్పటికిని యున్నారు.

## కబీరుమతము.

ఇతఁడు క్రీస్తుపుట్టిన 14 వ శతాబ్దమున కాశీపట్టణమునం దొక బ్రాహ్మణ వితంతువునకు జననమొందెను. ఈ వితంతువు కులమునకు వెఱచి యాబిడ్డను యరణ్యమున విడిచి పోయెను.

అనంతరము నూరియను పేరుగల నేత నేయుతురకవాఁడును ఆతనిభార్యయుతమ బంధువుల శుభకార్యమునకై పోవుచుండఁగా మార్గమధ్యమునఁ బడియుండిన శిశువు నెత్తికొనిపోయి కబీ రని పేరిడి గారాబంబుగఁ బెంచుచుండిరి. ఈ కబీరు పిన్నతనము నుండి మతమునం దాసక్తి గలవాఁడై యుండెను. యుక్తవయసున వివాహమొనర్చిరి. కబీరు మతాభిలాషియై కాలమును గడపుచుండెను. ఇతఁడు రామానందులకడ కొన్ని పర్యాయములుపోయి వుపదేశింపవలయునని వేడెనుగాని, అతఁడు తురకకు వుపదేశము చేయడము లే దని చెప్పెను.

ఇట్లుండ నొకనాఁటిరాత్రి గంగానదియందొకఘట్టమునపరుండి నిదురబోయెను. రామానందుఁడు ఉషఃకాలమున స్నానమునకై గంగానదియం దాఘట్టమునకుఁ బోవు

చుండఁగా నాఘట్టము మెట్లపై నిరురించియున్న కబీరుతలపై నడుగిడి "రామరామ మనిషినిం ద్రొక్కితి" ననెను అంత కబీరు దిగ్గునలేచి "దాని నే కనుగొంటి" నని కేకవేసెను. అంత రామానందుఁడు కబీరుయొక్క భక్తికి మెచ్చి యతనికి తన మతము నుపదేశించెను. కబీరు తనగురువుయొక్క మతమునలె ఆచారకర్మములను పాటింపక తాను నొక క్రొత్తమతమును స్థాపించెను.

కబీరుమతసిద్ధాంతము:— 1. ప్రతిమనుష్యుఁడును ఇతరులను తన సమానముగా భావింపనలయును. 2 భగవన్నిర్మితమైన వానినెల్లను ప్రేమింపనలయును. 3 జగదీశ్వరుని భక్తివిశ్వాసములతో ధ్యానింప వలయును.

కబీరుసంప్రదాయస్థులు ఒకరినొకరు చూచుకొనునపుడు బందగీ, లేక బందగీ సాహేబ్, లేక సత్ సాహేబ్ అని చెప్పుదురు. వీరు రామభజన చేయునపుడు మైదానములో తెల్లనిధ్వజమును నాటుదురు. లేనిచో తెల్లనిగుడ్డను చుట్టు ముదురు కట్టుదురు. ఈ కబీరు తదితరమతబోధకులనలె తన మతోద్దేశ్యముల నుపన్యసించి యితరులను తనమతము నవలంబింపుఁడని చెప్పలేదు స్వమతధర్మములను కీర్తనలుగాఁ జేసి పాడుటయేగాక ఆచారకర్మముల నిషేధించుగీతములనుకూడా రచియించి పాడుచు దేశాటనము సల్పుచుండెను. విగ్రహారాధనములను చేయుట లేదు. తెల్లగలతిరుమణిని యొల్లని శ్రీచూర్ణముతో ధరింతురు. మతియు జాతి మతభేదములు లేవని చెప్పెను. మానవులందఱు సోదరు లనియెను. ఈ కారణముంబట్టి హిందువులును, మహమ్మదీయులును, కబీరును సమానముగాఁ జూచుచుండిరి.

ఇతఁడు మాగరుగ్రామమున పరమపదించెను. అప్పుడు కబీరు శరీరము నగ్నిసంస్కారము చేయుటకై కాశీరాజనేకవేల హిందువులతోను, కబీరును సమాధిచేసి గోరికట్టించుటకై బిజిలీఖానను మహమ్మదీయరాజనేకవేల తురకలతోను, ప్రేతభూమి కేతెంచి వాదులాడు చుండఁగా "కబీరు దేహముపైనుండు వస్త్రముదీసి చూడుఁడు" అని యొకధ్వని వినబడియెను. అప్పుడు హిందువులును మహమ్మదీయులును వాదముమాని వస్త్రమును దీయఁగా దానిక్రింద పుష్పరాశియుండెను. ఇరుతెగలవారు నాపుష్పములను చెటిసగము చేసికొని ఇరువురును నుత్తరక్రియలు గావించిరి. మాగరులో హిందువులు కబీరుమందిర మను మఠమును, మహమ్మదీయులు కబీరుమసీదును గట్టించిరి. ద్వివిధమతస్థులును గొనియాడుచున్నారు.

## వీరశైవ మతము.

ఈ మతమున కాదిపురుషుఁడు సదాశివుఁడు. సదాశివునిచేత సకలదేవతలును సకల చరాచరములును సృష్టింపఁబడెను. ఈ సృష్టియందు అధోసృష్టి యనియును,

బ్రహ్మసృష్టియనియును రెండువిధములు. ఎట్లనఁగా. సదాశివునకు సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశాన అని పంచముఖములుగలవు ఇందు మొదటినాలుగు ముఖములు నాలుగుదిక్కులయందును, ఈశానముఖము ఊర్ధ్వముగ నుండును. సద్యోజాతముఖమున వీరశైవబ్రాహ్మణులును, వామదేవముఖమున వీరశైవక్షత్రియులును, అఘోరముఖమున వీరశైవవైశ్యులును, తత్పురుషముఖమున వీరశైవశూద్రులును పుట్టిరి. ఊర్ధ్వముగ నుండు ఈశానముఖమున అతివర్ణులై, అత్యాశ్రములై, గణసంతతులై, సాయుజ్యపదస్థులై, నిత్యముక్తులైనట్టి పంచములైన లింగాంగులు పుట్టిరి. ఈ ప్రకారమైన సృష్టియే ఊర్ధ్వసృష్టి యనియును, అందును ఊర్ధ్వముఖమునఁ బుట్టిన లింగాంగులే ఉత్కృష్టు లనియును, సదాశివునిపరంపరగా జన్మించిన బ్రహ్మవలన గలిగిన బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రులనువారు అధోసృష్టితోఁ జేరినవా రనియును దెలియవలయును. లింగాంగులు శివునివలనఁ బుట్టినవా రగుటచేత వీరికి శివునికులమును, నందీశ్వరగోత్రమును, వీరాగమసూత్రమును, రుద్రశాఖయును, నిరంజనగణేశ్వర ప్రవరయునై యున్నది. వీరలోత్పత్తికాలము సృష్ట్యాదియం దని చెప్పఁబడి యున్నది

లింగాంగ (లింగాయత) మతసిద్ధాంతము:—తనయిష్టలింగము పతి యనియు తాను సతి యనియు నిట్లు సతిపతిన్యాయము ననుసరించియుండును. మహాలింగమే వీరి శరీరమందు ఇష్టలింగమై ప్రకాశించుచుండుటం బట్టి వీరు తమ యిష్టలింగమునే పూజింపవలయును. పైనఁ జెప్పినవానికిఁ బ్రమాణము:—

శ్లో. "పతిర్లింగం సతీ చాహం హృదియుక్త స్వయం విదు" అనియును,
లింగమధ్యే జగత్సర్వం త్రైలోక్యం సచరాచరమ్
లింగబాహ్యాం పరం నాస్తి తస్మై లింగాయవైనమః అనియును,

చెప్పంబడియున్నది. మఱియు శివుని పంచముఖములయందుండి 28 ఆగమములు పుట్టినప్పటికిని, అసురమోహకములైనవి పదిపోగా మిగిలిన 18 యును అంగీకారము లైనవి.

లింగాయతమతవిభాగములు:— వీరశైవము, సామాన్యవీరశైవము, నిరాభారివీరశైవము అని నాలుగువిధములు. ఈ భేదములు క్రియాభేదము లని తెలియవలయును. ఇట్టి వీరశైవమతమే అన్నిమతములకంటెను శ్రేష్ఠము. "శివభక్తి విహీనశ్చ బ్రాహ్మణా శ్శ్వపచాధమః" శివభక్తి లేని బ్రహ్మజ్ఞానియైనను నీచాధముఁడనఁబడును "శివభక్తి స్సదాపూజ్య శ్శ్వపచోబ్రాహ్మణోత్తమః" శివభక్తితోఁగూడిన నీచుఁడైనను బ్రాహ్మణోత్తముఁడును సదా పూజింపఁదగినవాఁడును నగును. ధర్మసంరక్షణార్థముగ శివునిపంచముఖములయందవతరించిన దేశికులే కలియుగమునందు రేణు

కారాధ్య, మరుళారాధ్య, పండితారాధ్య, ఏకోరామారాధ్య విశ్వారాధ్య అను నామములను ధరించి బ్రాహ్మణాది చండాలజాతిపర్యంతము గల సకలజాతివారి ముక్తిమార్గము నుపదేశింతురు ఇట్లని సుప్రభేదాగమమునందుఁ జెప్పఁబడియున్న

ఈ లింగాయతమతస్థులుమాత్రము శ్రేష్ఠు లనుటకు బ్రమాణ మెట్లనఁగా:— శైవోత్కర్ష గ్రంథమునందు, శ్లో. ప్రాకృతా ప్రాకృతశ్చేతి ద్వివిధామానుషాస్స్మృతాః ప్రాకృతా భవిన స్సర్వే వైకృతాలింగధారిణః' అనఁగా, ప్రాకృతు లనియు భవిజా లనియు చెప్పఁబడువారు లింగధారణము లేనివారు; వైకృతు లనియు భక్తు లనియు జెప్పఁబడువారు లింగధారణము గలవారు. ఇట్టి జాతిద్వయమునందు భక్తులైన లింగా యతులు, లింగమును ధరింపనివారినందరిని భవిజాతిలోఁ జేరినవారని నిగ్రహింతురు ఏజాతివాఁడైనను లింగధారణము గలవాఁ డాయెనేని వానితోఁగూడి వర్తింతురు మఱియు వాఁడు శ్రేష్ఠుఁడు, వానికి శివసాయుజ్యముకలుగును, దీనికి ప్రమాణము:— శ్లో. 'లింగధష్టేనయద్దేహం తద్దేహంలింగదేహకమ్' అనియును, 'శివసంస్కారసంస్థ జాతిభేదం నకారయేత్' అనియును, 'శ్వపచశ్శివభక్తశ్చ ఉత్తమోత్తమజన్మభాక్' అనియును చెప్పఁబడియున్నది.

బ్రహ్మదేవునిచే సృష్టింపఁబడిన దేవ దానవ మును లాదిగాఁ గలవారు అధో సృష్టియందు జేరినవారు. ఇట్టివారే అలింగకులనియును, భవిజన్ము లనియును, పాశ లనియును, పశువు లనియును, నిత్యసంసారు లనియును, జననమరణసహితు లనియు చెప్పఁబడుదురు. కావున వీరికి కర్మ,మల, పాశ,భవ, బంధ, దురిత, సంసార, సంతా ములుకలవు కావుననే అందఱును పశువులనఁబడుదురు శివుఁడు పతియైయున్నాఁడు ఎట్లనఁగా:— శ్లో.'బ్రహ్మాదిస్థానరాంతశ్చ పశవఃపరికీర్తితాః। తేషాంపతిత్వాద్భూతేశః పశుపతిస్మృతః' ఇట్లు చెప్పంబడియుండుటంబట్టి బ్రహ్మదేవుఁడును పశువుగా న్నాఁడు. ఆ బ్రహ్మదేవునిచే సృష్టింపఁబడినవారును పశువులే యని తెలియఁబడు న్నది. కావున లింగాంగులే శ్రేష్ఠులు. శ్లో. 'లింగాంగీచ మమప్రాణో లింగాంగీమమ రక్షకః। లింగాంగీ మమకర్తాచ లింగాంగీచ మమప్రభుః' అనఁగా, లింగవంతుఁడే నాయొక్క ప్రాణము, మఱియు రక్షకుఁడును, కర్తయు, ప్రభువునై యున్నాఁడని శివుఁడు చెప్పెను గాన ఈమతమే శ్రేష్ఠమైన దని సిద్ధాంతము.

శ్రీశైలము మొదలగు ప్రాంత్యములయందుండు శైవబ్రాహ్మణులను ఆరాధ్యు లని పేరు. వారు యజ్ఞోపవీతమును ధరించి యుందురు. కంఠమున లింగమును ధరింతురు. శివునివినా అన్యదైవభజనము లేదు. తాము ధరించిన యిష్టలింగమునకు తాము భుజించు అన్నమును సమర్పించి భుజింతురు. భోజనానంతరము శివారాధన

ప్రసాదమును త్యజింపరాదని కంఠమునుసహా కడిగి పుచ్చుకొందురు గురుపాదోదక స్వీకరణమునందు మిగుల నాసక్తిగలవారు కొందఱు గురుపాదోదక మని, తమపాదోదకమును లింగమునకు నభిషేకము చేయుదురు. వృషభారోహణమును చేయుదురు.

ప్రస్తుత వీరశైవమతవ్యాప్తికారణము:—బ్రాహ్మణవంశమునందు కల్యాణనగరంబున బసవేశ్వరుఁ డవతరించెను. అతఁడు ఇష్టలింగదీక్షమాత్రమే చాలు నని యెంచి యుపనయనము చేసికొనలేదు. బిజ్జలరాజునకు ఈ బసవేశ్వరుఁడు ప్రధాని యైనమీఁద సకలకులస్థులను ఇష్టలింగమును ధరించుకొనునట్లుగా అనేకోపాయములచేత తనకోర్కెను నెఱవేర్చెను. ఆ తర్వాత జైనులకును లింగవంతులకును మతకలహములు కలిగెను. ఆ సమయమున బసవేశ్వరుఁడు కూడలసంగమ మను గ్రామమునం దుండు సంగమేశ్వరునితో ఐక్యమాయెనట ఉళివి అనుచోట బావిలో పడినట్లు కొందఱు చెప్పుచున్నారు, చరిత్రచింతామణియందు స్పష్టముగాఁ గనందగును).

## పాశుపతమతము.

పాశుపతమతమును స్థాపించినవాఁడు నకులేశుఁడు. ఇతఁడు రుద్రాంశమున కలియుగము వైశంపాయనశకమునం దవతరించెను. ఈ పాశుపతమతము వైష్ణవాది మతములను నిరాకరించుచు స్వమతమును స్థాపించుచున్నయది. ఎట్లనఁగా, వైష్ణవమతమందు జీవులు అస్వతంత్రు లగుటచే దాసత్వాది ధర్మములు కలవారలయి యుందురు. కాఁబట్టియే పరతంత్రదుఃఖమును అనుభవించుచు నెప్పటికిని స్వాతంత్ర్యములేక యుందురు. పరాధీను లయినజీవులు ముక్తిని జెందరు. పరాధీను లగుటవలన పరమైశ్వర్యము లేనివారు. కావున పాశుపతమతస్థులే ముక్తాత్ములు. ఎట్లనఁగా అన్నిదుఃఖములకును బీజము లేనివారు, కావున పరమేశ్వరునివలెనే యని అనుమానమును ప్రమాణముగా చెప్పుదురు ఇట్టి మాహేశ్వరులు కొందఱు పరమపురుషార్థసాధన మయిన పంచార్థప్రపంచమును చెప్పునట్టి పాశుపతసూత్రములను ఆశ్రయించు చున్నారు. మఱియు గణకారిక యను గ్రంథమందు "పంచకా స్త్వష్టవిజ్ఞేయా గణ శ్చైక స్త్రికాత్మకః। వేత్తానవగణస్యాస్య సంస్కర్తా గురురుచ్యతే॥ లాభామలా ఉపాయాశ్చ దేశావస్థా విశుద్ధయః। దీక్షాకారి బలాన్యష్టౌ పంచకా స్త్రీణివృత్తయః" ఇచ్చట లాభ మనఁగా జేయఁదగిన ఉపాయఫలమే లాభము. ఈలాభము జ్ఞాన మని, తపస్సు అని, దేవనిత్యత్వ మని, స్థితి యని, శుద్ధియని పంచవిధములు. ఇంక మల మనగా 'ఆత్మాశ్రితో దుష్టభావః సమలః, సమిథ్యాజ్ఞానభేదాత్ పంచవిధః' అనఁగా తన్ను ఆశ్రయించిన దుష్టస్వభావము మలమని చెప్పఁబడును అట్టి మలము అయిదువిధములు. ప్రమాణము—'మిథ్యాజ్ఞాన మధర్మశ్చ

సక్తిహేతుశ్చ్యుతి స్తథా। పశుత్వమూలంపంచైతే తంత్రేహేయావివిక్తత' సాధక
పరిశుద్ధిని కలుగఁజేయునట్టి యుపాయములు దాసచర్యాది భేదములవలన అయిదువిధ
లు; ప్రమాణము—'దాసచర్యా తపోధ్యానం సదా రుద్రస్మృతి స్తథా ప్రతిపత్తి
లాభానాం ఉపాయాః పంచనిశ్చితా' దేనిచేత అర్థానుసంధానపూర్వకముగా జ్ఞానవి
వృద్ధి కలుగుచున్నదో అదే దేశము అని చెప్పఁబడుచున్నయది ప్రమాణము—'గురుర్జ
గుహాదేశః శ్మశానంరుద్రఏవచ' లాభప్రాప్తియగు నలుపు నొకదానియందు స్థిరముగా
నుండుటయే అవస్థ యని వ్యవహరింపఁబడును విశుద్ధి యనఁగా, పయిన చెప్పిన మిథ్యా
జ్ఞానము మొదలయినవానియొక్క సంపూర్ణనాశమే విశుద్ధి యనఁబడును. అట్టి వి
ద్ధియు అయిదువిధములు. పశువు లనఁగా జీవులు. అట్టి జీవులకు పతి యయినవాఁడు
ఈశ్వరుఁడు. అట్టి యీశ్వరపారతంత్ర్యము బద్ధజీవుల కుండినను ముక్తజీవులు స్వత
త్రులుగానే యుందురు. బద్ధజీవు లనఁగా, మాయాపాశముచే కట్టఁబడి యుండువారు
ముక్తు లనఁగా, మాయాబంధమును వదలినవారు. జీవులు మాయనుండి వదలుటకొ
కయి పతి యయిన యీశ్వరుని ఆరాధించి ముక్తు లగుచున్నారు. సమస్తకారణములక
కారణ మైనట్టియు, అపరిమితశక్తులను కలిగినట్టియు భగవంతుఁ డొకఁడు గలఁడు.
భగవంతుఁ డొక్కఁడే మహేశ్వరుఁడు, విష్ణువు మొదలుగాఁగల నామములచే వి
జింపఁబడి యున్నాఁడు. ఆత్మ భగవంతునితో సమముగ శాశ్వతపదార్థ మైనను ఆత
నకు గల శక్తులు దానికి లేవు. భగవత్కృపవలన నతనిసన్నిధానము ఆత్మకు దొ
కును. మతకర్మములను చేయుటవలనఁగాని, లేక మతసిద్ధాంతములప్రకారము భగ
వంతుని తెలియుటవలనఁగాని భగవత్కృప గలుగును. మతకర్మములు—విభూతిధా
ణము, రుద్రనామోచ్చారణము, ఈశ్వరగుణకథనము ఇవి మొదలగునవి.

పాశుపతమత ముఖ్యసిద్ధాంతము:—త్రిపదార్థమును నిత్య మని తలంచి దీక్ష
వహించి ఆచార్యునిమూలముగా ఉపదేశమునొంది శివపూజచేత జలముతో జల మైక్య
మైనట్లు గూడియుండుటయే ముక్తి.

## శైవమతము.

ఈమతము క్రీస్తుశకము పదునొకండవశతాబ్దమునందు శ్రీకంఠశివాచారి యను
వారివలన స్థాపింపఁబడినది. ఈ మతము పాశుపతమతమును నిరాకరించుచు స్వమత
మును స్థాపించుచున్నది. పాశుపతమతసిద్ధాంతమునందు పరమేశ్వరుఁడు ప్రాణి
కర్మల నపేక్షింపకయే జీవులకు స్వర్గనరకాదిభోగములు నొసఁగుచున్నాఁడు. ఇట్టి

చెప్పినప్పుడు ఈశ్వరునియందు పక్షపాత నైర్ఘృణ్యాది దోషంబు లంగీకరింపవలసి వచ్చును. నిర్దోషి యయిన పరమేశ్వరునకు దోషము నారోపించుట యుక్తము కాదు. కాఁబట్టి పాశుపతమతమునకంటె శైవమతము శ్రేష్ఠము. పరమేశ్వరుఁడు ప్రాణికోట్ల యొక్క సుకృత దుష్కృతకర్మముల ననుసరించి జీవులను సుఖదుఃఖంబు లనుభవింపఁ జేయుచున్నాఁడు. శైవమతమందలి పదార్థంబులు:— "పతిపశుపాశభేదా త్త్రియః పదార్థఇతి" తంత్రతత్త్వజ్ఞగ్రంథమున, 'త్రిపదార్థం చతుష్పాదం మహాతంత్ర జగద్గురుః। సూత్రేణేన సంక్షిప్య ప్రాహ విస్తరతఃపునః' అనఁగా, పతి అనువాఁడు ఈశ్వరుఁ డనియు, పశువులు జీవు లనియు, ఈ జీవులకు అవిద్యాకామకర్మాదులు పాశము లనియు మూఁడువిధములు. పతి యయిన ఈశ్వరుఁ డనుమానప్రమాణముచేత సిద్ధించును. అనుమానప్రకారము. 'వివతం సకర్తృకం కార్యత్వాత్ ఘటవత్' కర్త యయినవాఁడు లేనియెడల వివాదవిషయ మైన దేహాదిప్రపంచము కలుగనేర దను ప్రమాణముచేత ఈశ్వరసాధనమును వూహింపవలసినది. 'అజ్ఞోజంతురనీశోయం ఆత్మనః సుఖదుఃఖయోః। ఈశ్వరప్రేరితో గచ్ఛేత్ స్వర్గంవాశ్వభ్రమేనవా.' అజ్ఞుఁడగు జీవుఁడు స్వతంత్రుఁడుకాక సుఖదుఃఖములను స్వర్గనరకములను జెందుచున్నాఁడు. కర్మము ననుసరించి ఈశ్వరుఁడు జీవులకు సుఖదుఃఖాదిభోగముల నిచ్చువాఁ డయినను తన స్వాతంత్ర్యశక్తికి హాని కలుగదు. కోశాధ్యక్షుని నపేక్షించు రాజునకు స్వాతంత్ర్యము లే దని చెప్పవచ్చునా? అటుల చెప్పుట న్యాయేతరముకాని వేఱుకాదు. 'సర్వజ్ఞః సర్వకర్తృత్వాత్ సాధనాంగఫలైస్సహ। యో యజ్ఞానాతి కురుతే సత దేవేతి సుస్థితమ్' అనఁగా, ఈశ్వరుఁడు సర్వజ్ఞుఁడును సర్వకర్తయును సర్వస్వతంత్రుఁడునుగా నుండు నని యభిప్రాయము. ఈప్రకారముగా జగత్కర్త యయిన యీశ్వరుఁడు శరీరము కలవాఁడా, శరీరము లేనివాఁడా యని ప్రశ్న కల్గిన యెడల, రెండుపక్షములకును సమత్తరము కలదు. శరీరము లేని యాత్మ శరీరమును కదలునటుల చేయును. కాఁబట్టి యీశ్వరుఁడు శరీరము లేనివాఁ డయినను జగత్కర్తగా నుండవచ్చును. అథవా శరీరము కలవాఁ డని చెప్పినను, మనవంటి ప్రాకృత శరీరము కలవాఁడు కాఁడు. దివ్య మగు తేజోరూప మయిన మలకర్మాది పాశములు లేని శరీరము కలవాఁడు. ఇట్లు చెప్పినమాత్రమున నే మనవంటివాఁడే యీశ్వరుఁ డని కాని, మనము ఈశ్వరునితో సమానుల మని కాని యెంచుట తగదు కావున దివ్యశరీరమునకును ప్రాకృతశరీరమునకును చాలాతారతమ్యము గలదు.

శైవమతసిద్ధాంతము:—భగవంతుఁడు, ఆత్మ, పదార్థము, ఈ మూఁడును వే అని ఈమతసిద్ధాంతము. భగవంతుఁడు యజమానుఁ డనియు, ఆత్మ పశువనియు,

పదార్థము దానిని కట్టునట్టిత్రాడు అనియు చెప్పఁబడుచున్నది. అనఁగా, ఆత్మ పశు
మృగము. భగవంతుఁడు దానియజమానుఁడు. పదార్థము దానిని కట్టుత్రాడు శివుఁ
నిరాకారుఁడైన దేవుఁడు. అతఁడు సర్వదర్శి. ఆయనకు స్థూలశరీరము లేదు. నిర్మ
మయిన శక్తియే ఆయన శరీరము. నిరాకారుని ధ్యానించుటకును పూజించుటకు
కాదు. కనుక తన దాసుల నిమిత్తము గొన్ని కొన్ని యాకారముల ధరించును. సృజి
చుట, కాపాడుట, నశింపఁజేయుట, మఱుఁగుజేయుట అనునివి ఆయనపనులు.
జంతువులచేఁజేయఁబడుపనులను విచారించుచుండును. ఆత్మ అణుస్వరూపము కా
అది సర్వవ్యాపి. కర్మములనుబట్టి తిరిగి పుట్టుచుండును. పదార్థమునుండి వీడి
నిలో కలియుటయును, లేక ఆయన సన్నిధానమును పొందుటయును మాన
వుద్దేశ్యము. ఆత్మతోఁ గల సంబంధము కొద్దికాల ముండున దైనను పదార్థము శా
తము. దానిగుణము నాల్గువిధములు. 1. మలము, అనఁగా ఆత్మకుఁ గల హేతుజ్ఞా
మునుజ్ఞా,కర్మలంజేయుశక్తినిజ్ఞా కప్పివేయునది. 2. రోధము, దీనిని పదార్థముయొక్క
శక్తియని వర్ణింపుదురు గాని నిజముగా నిది తనయోగ్యతకుఁ దగినట్టుగా పదా
మున కధిపతిగా నుండి ఆత్మను మఱుగుపఱచగల శివునిశక్తియై యున్నది. 3. కర్మ
అనఁగా పని. లేక పనియొక్క ఫలితము. 4. మాయ, ఇది సృష్టియందు ప్రకా
శును. ఈమాయ ప్రపంచము నశించినతోడనే భగవచ్ఛక్తిలోఁ గలియును. కర్మ
విచారణలేకయే పరమాత్ముఁడు మోక్షమునిచ్చును. ఈ మతమును స్థాపించిన శ్రీకం
లకే నీలకంఠు లని పేరు గలదుగాన, నీలకంఠమత మనియు పేరు గలదు. నీలకం
చార్యప్రోక్త బ్రహ్మసూత్రభాష్యమును కలదు. ఈ మతమునకు విశిష్టాద్వైత మని
పేరు కలదు.

## శివాద్వైతమతము.

పరమశివుఁడు నిత్యశుద్ధముక్తుఁడై అద్వితీయుఁడై జ్ఞానమే స్వరూపముగా
గలవాఁడై, సముద్రతరంగములు మెఱుములు కనఁబడి మఱిగిపోవునట్లు ఆత్మలయం
దెల్ల నివసించియు, తన్నుమఱచి ఉపాధులయందు సుఖదుఃఖములు లేక, తా నస్వా
గాక, సర్వము తానై యుండును. శాంభవదీక్షను పొంది, అనుభవనిష్ఠచేత లయమగు
టయే మోక్షము.

## సమ్మేళితశైవమతము.

త్రిపదార్థములును సత్య మైనది. పాశము అనాదిగా పశువును బంధించు
పతి—అనాదిముక్తుఁడు, పాశము—అనాది, పశు—శరీరధారకజ్ఞోగి. శివధ్యా
జ్ఞాన పూజలచేత బంధములను తొలఁగఁద్రోసికొని శివునితో నైక్య మగుటయే ము

## మహాప్రతిమతము.

శివుఁ డొకఁడు గలఁడు ఆత్మలు అనాదిగా మలత్రయములతోఁ గూడి వసించును ఆణవాది త్రిమలములను అనాదిగా నున్నవి పతి పశు పాశములును నిత్యము. పతి తనజ్ఞానశక్తిచేత ఆత్మలను బద్ధావస్థ నొందింపఁజేయును. పశువు త్రిమలములయందును బంధింపఁజేసి జన్మమును కలుగఁజేయును. పాశము పశువునకు బంధమై జ్ఞానశక్తిచేత పక్వము నొందింపఁజేయును. ముక్తి అనఁగా, ఆత్మ పరిపక్వము నొంది, దీక్షావిధిచేత మలమునుండి వీడి, ఆగమప్రమాణములచే శివుని పూజించి, తుదకు కర్తృత్వసంహారమును విడిచి, నిత్యవ్యాపకచైతన్య మైన ఆత్మయైనది శివునియొక్క జ్ఞానశక్తి గలదై శివలోకమునందు జ్ఞానమాత్రముతో నుండుట.

## శివసమవాదిమతము.

పతి, పశు, పాశము ఈమూఁడును నిత్యము. పతి యనునది నామ రూప క్రియారహితమై, నిత్యమై, అనాదియై, చిత్తై, సత్తై, నిర్మలమై, శుద్ధమై యుండునది. పశు వనునది అనాదిమలసంబంధమై అనేకరూపమై నిత్యమై యుండునది. పాశ మనునది అనాదినిత్యమై, అనంతవ్యాపకశక్తి గలదై యుండునది.

## ఐక్యవాదిమతము.

శివసమవాదిమతమునలెనే త్రిపదార్థములును నిత్యము. ఆత్మ అనాదిశుద్ధ మనియును, ఆణవము కేవలావస్థయందు లే దనియును, మాయయును, కర్మమును గల దనియును చెప్పుదురు. విశేషదీక్షను బొంది, శివార్చనచేత అధ్వాశుద్ధిచేసి, నిర్వాణదీక్షచేత కర్మనిగ్రహము చేసియే ముక్తి నొందవలయును.

## సంక్రాంతివాదిమతము.

పదార్థములు మూఁడింటియందు, పతి—అమలమై, పరిశుద్ధమై, నిత్యమై, అఖండమై యుండును. పశువు—అనాదిశుద్ధనిత్యమై యుండును. పాశము—జడమై యుండును. వీనిలో తటస్థలక్షణ మె ట్లనఁగా:---పతి—దేనిని దహింపక దీపమువలె నుండును. పశువు—కాంతము ఇనుమును వేధించునట్లు మాయాబలముచే శరీరము గలదిగా నుండును. పాశము—శరీర కరణ భువన భోగములుగా వ్యాపించి యుండును.

## ప్రవాహేశ్వరవాదిమతము.

ఈశ్వరుఁడు, ఆత్మ, మాయ, కర్మ, ఇవి అనాది ఈశ్వరునిచే రక్షింపఁబడు ముక్తాత్మలకు అనాదిమలము లేదు. మాయ బంధమొంది తత్త్వశేషముచేత తను క[ర] భువన భోగములుగా వ్యాపించియుండును పశువు మాయాకర్మలచేత జన్మము నొందును. దీక్షావిధిచేత మాయాకర్మలు రెండును నశించి శుద్ధుఁడగును. ఇదే ముక్తి.

## అవికారవాదిమతము.

స్వరూపలక్షణము:—అవికారనిత్యేశ్వరుఁ డొక్కఁడు గలఁడు. ఆత్మలు అజ్ఞాన మయిన ఆణవముల తమస్సులోఁబడి అనేకప్రాణులై యుందురు. పతి, పశు పాశము లను నీమూఁడును అనాది.

తటస్థలక్షణము:—పతి—శీతోష్ణజలములవలె ఐక్యమును చేయును. పశు—అధికారిజ్ఞానముచేత సర్వమును దెలుపును. పాశము—మలుఁగుననుండి శివరూపమును ధరించును.

వేషము:—నరకపాలభిక్షాటనము. కర్తృత్వమే సంహారము; కనుక దీక్ష తొలఁగించి, శివునియందే జ్ఞప్తిని యుంచుట మోక్షము.

## ఊర్ధ్వశైవమతము.

శివుఁ డొకఁడు గలఁడు. వాఁడు తత్త్వాతీతుఁడు, వానినిఁ బొందు టెట్లన గా:—విభూతి, రుద్రాక్షము, జట, యజ్ఞోపవీతము వీనిని ధరించి శివలింగపూజ చేయుచు, భక్తితో పంచాక్షరమును జపించుచు, సన్న్యాసిగా నైనను సంసారిగా నైన నుండినయెడల శివుని పొందవచ్చును. ఇదే ముక్తి.

## అనాదిశైవమతము.

త్రిపదార్థములు అనాది, అది నిత్యవ్యక్తమై ప్రకాశించును. శివుని గుణవికల్పము లేనివాఁ డని తెలిసి, విభూతి రుద్రాక్ష పంచాక్షర గురులింగవేషధారియై శివుని పూజచేసినచో పాశములు వదలును. అపుడు పతితో నైక్య మగుట సంభవించును. అనఁగా ఆత్మ శివునినే నమస్కరించుచుండును. ఇదే ముక్తి.

## ఆదిశైవమతము.

శివుఁడు పశువునిమిత్తము, సర్వమునకును తానే అధిపతియై పంచకృత్యములను ప్రకాశింపఁజేయుచు నిష్కళముగాను సకలముగాను నుండును. ఈ పతితో

సుఖించుచుండవలయు ననువారు మోక్షసాధనములకుం దగిన వేషములును, నడవడికలును గలిగి, సర్వమును శివభోగమే యని యనుభవించి, శివస్వరూపమునందు విశ్వాసముంచి, పతితోఁ గూడి యుండునట్లే భావించి యుండవలయును. ఇదే ముక్తి.

## మహాశైవమతము.

మూర్తామూర్తము లైన వారికంటె శ్రేష్ఠ మైనవాఁడు శివుఁ డొక్కఁడే అ శివుని చెందువారు సంసారమును త్యజించి జటాది శివవేషమునుదాల్చి సగుణముగ శివుని ధ్యానించి గురులింగమే సత్త యని యుండవలయును. ఇదే ముక్తి.

## గుణశైవమతము.

శివునియొక్క అష్టమంగళగుణములను జీవుఁడు తనయొక్క అష్టగుణములచేత లభింపఁజేసికొనవలయును. ఇదే మోక్షము.

## క్రియాశైవమతము.

ఆచార్యునివలన సదా శివమూర్తిని దెలిసికొని, సమయదీక్షలనుబొంది, అధ్వా శోధనచేసి, ఆవాహనాదిభేదములను దెలిసి పంచశుద్ధి చేసికొని, విధిప్రకారము నిత్యముక్తి సంబంధపడుటకు కర్మములను సాధించుచు శివార్చన చేయుచు నుండవలయును ఇదే మోక్షము.

## చతుష్పాదశైవమతము.

చర్య, క్రియ, యోగము, జ్ఞానము అను నీనాలుగింటిని యొక్కటొక్కటిగా సాధించి, నిష్ఠతోఁ గూడియుండి శివస్వరూపమునం దైక్య మొందవలయును. ఇదే ముక్తి.

## శుద్ధశైవమతము.

త్రిపదార్థములు నిశ్చయ మని దెలిసి, దీనియందే సచ్చిదానందబ్రహ్మనిశ్చయము గల దనియును, ఇతరమతము లన్నియు పాశజాల మనియు గ్రహించి.మౌనముతోడను, నిష్ఠతోడను గూడియుండి శివస్వరూపముతో నైక్య మొందవలయును. ఇదే ముక్తి.

## యోగిమతము.

ఈ మతమును గోవిందభగవత్పాదాచార్యులు, రసేశ్వరులు మొదలగువారు స్థాపించిరి ఇదియు నొకవిధ మైన శైవమతము. ఈ మతమున యోగులు పరమేశ్వర

సమానరూపు లయి జీవన్ముక్తులయి యుందురు. అట్టి యోగులయొక్క అభిప్రాయ మనగా:—శరీరము స్థిరము కానియెడల జీవన్ముక్తి సిద్ధింపదు; కావున, శరీరస్థైర్య నకు తగినయుపాయమును మొదట సంపాదింపవలయును. ఆ యుపాయ మేమనగా పారద మను పదముచే వ్యవహరింపఁబడు రసమే శరీరస్థితికి కారణము. 'పారం దదాతీతి పారదః' అను వ్యుత్పత్తిచేత సంసారరూప మయిన అనేక విదేహపరిణామ ముండి తప్పించి యెప్పటికిని యేకరీతిగా నుంచునట్టి స్థితిని చేయుచున్నది. "సంసారస్య పరంపారం దత్తే సౌపారదస్మృతః। పారమోగదితో౽యస్మాత్ పరార్థం సాధకోత్తమైః॥ సుప్తో౽యం మత్సమో దేవి మమప్రత్యంగసంభవః। మమ దేహ రసో౽యస్మాత్ రసస్తేనాయ ముచ్యతే.' ఓపార్వతీ! సంసారమునుండి తరింపఁజేయునదియును, శరీరమువలన కలిగినదియు నైన పాదరసము శుద్ధి చేయఁబడిన దయి రసవాదపారంగు లగు వారిచేత సకలయోగసిద్ధులకు సాధనముగా స్వీకరింపఁబడు చున్నది ఇట్లు రసార్ణవ మను గ్రంథమందు శివుఁడు పార్వతీదేవికి యుపదేశించియున్నాఁడు. ఆయా మతములయందును దేహము నశించిన తర్వాతనే ముక్తి యని చెప్పఁబడియున్నది. కాని షడ్దర్శనములయందు చెప్పఁబడు ముక్తికంటె ప్రత్యక్షసిద్ధ మైన యోగిసమ్మత మగు ముక్తికొఱకై పాటుపడవలసినది యని యోగశాస్త్రము చెప్పుచున్నది. 'షడ్దర్శనేపి ముక్తిస్తు దర్శితా పిండపాతనే। కరామలక వత్సాపి ప్రత్యక్షా నోపలభ్యతే॥ తస్మాత్తం రక్షయే త్పిండం రసశ్చైవ రసాయనమ్.' అరిచేతియందలి యుసిరికకాయవలె సులభమై ప్రత్యక్షసిద్ధమై యుండునట్టి జీవన్ముక్తిని జెందవలసినది ముఖ్యము గనుక తత్సాధన మైన శరీరమును రస రసాయనములచే రక్షింపవలయును. ఈ యర్థము గోవిందభగవత్పాదులవారు చెప్పియున్నారు. 'ఇతి ధనశరీరభోగాన్ మత్వానిత్యాన్ సదైవ తనీయమ్। ముక్తౌ సాచ జ్ఞానాత్ తచ్చాభ్యా సాత్సచ స్థిరే దేహే.' అనగా ధన శరీరభోగములు నిత్యము లని తెలిసి ముక్తికై యత్నము చేయవలయును. ఆ ముక్తి జ్ఞానమువలన కలుగును. అట్టి జ్ఞానము అభ్యాసమువలన కలుగును. ఆ యోగాభ్యాసము శరీరము నిత్య మయినయెడల కలుగును అని తాత్పర్యము. ఈ విషయమందు కొందఱు, శరీరములన్నియు అనిత్యములుగా నున్నవి కాని నిత్యదేహము లెక్కడి వని యాక్షేపింతురు అట్లు ప్రశ్నచేయువారలకు తగిన సమాధానము యోగులు చెప్పుచున్నారు. ఎట్లనఁగా, పాట్కౌశిక మయిన స్థూలశరీరము నిత్యము కాకపోయినప్పటికిని రసాదికపదములచే వ్యవహరింపఁబడునట్టి శివగౌరీసృష్టిచే కలిగిన రసధాతువులకు నిత్యత్వము కలుగుచున్నది. అట్టి ధాతుసేవనముచేత యోగులు సూక్ష్మశరీరులై గగనమార్గవాసులై అణిమాదిసిద్ధులు గలవారలై యున్నారు.

కాఁబట్టి నిత్యశరీరము యోగులకు ప్రసిద్ధము. "యేచా త్యక్తశరీరా హరగౌరీ సృష్టిజాంతరం ప్రాప్తాః, వంద్యాస్తే రససిద్ధాః మంత్రగణ కింకరో యేషామ్." కావున జీవన్ముక్తిని కోరునట్టి యోగి మొదట దివ్యదేహమును సంపాదింపవలయును. రసాభ్రకములను రెండుధాతువులలో రసము శివ వీర్యము, అభ్రకము పార్వతి వీర్య మని చెప్పఁబడినది. 'అభ్రకస్తవబీజంతు మమబీజంతు పారదః, అనయో ర్మేలనందేవి మృత్యుదారిద్ర్యనాశనమ్.' దేవతలు దైత్యులు మునులు మొదలయినవారు దివ్యశరీరములను ధరించి యున్నారని రసేశ్వర సిద్ధాంతమను గ్రంథంబునందు చెప్పఁబడినది. 'దేవాః కేచిన్మహేశాద్యాః దైత్యాః కావ్యపురస్సరాః। మునయోవాల ఖిల్యాద్యాః నృపాః సోమేశ్వరాదయః। ఏతేన్యే బహవః సిద్ధాః జీవన్ముక్తాశ్చరంతి హి। తనుం రసమయీం ప్రాప్య తదాత్మక కథాచన.'' కాఁబట్టి రసాది సాధనములచేత నిత్యశరీరమును సంపాదించుకొని నిత్యజీవన్ముక్తులయి యోగులుందురు. గోవిందభక్తునిచే నాజ్ఞాపింపఁబడిన విధముగా చేయఁబడిన పాదరసముయొక్క ప్రయోజనమువలన అనేకులు దైవశరీరమును పొందినవారైరి. ఈ పాదరసమును మొదట రక్తమునకును, తదనంతరము శరీరమునకును ఉపయోగింపవలయును. ఇది శరీరమును పరలోకసంబంధ మైనదానిఁగాఁ జేయును. అట్టి శరీరము లేనిచో పాపపరిశుద్ధజ్ఞానమును ధ్యానమును కలుగుటకు వీలులేదు. దృష్టిచేతగాని స్పర్శముచేతగాని లేక పూజచేతగాని పాదరసముయొక్క ప్రయోజనమును పొందనగును. పాదరసముయొక్క సహాయమువలన దైవశరీరమును పొందగానే పరిశుద్ధజ్ఞానము ప్రకాశించును. అంతట మానవుఁడు మాయనుండి విముక్తుఁడై పరిపూర్ణత్వమును మోక్షమును పొందును.

## అభినవగుప్తాచార్యమతము.

ఈ మతము శంకరాచార్యులకు 226 సంవత్సరములకు తర్వాత కాశ్మీరములో జన్మించిన మహామహేశ్వరాచార్యుఁ డను బిరుదనామము గల అభినవగుప్తాచార్యునిచే స్థాపింపఁబడినది, ఇది ప్రత్యభిజ్ఞశైవమత మనఁబడును. శివుఁడే నేనని తెలియుట ప్రత్యభిజ్ఞ యనఁబడును. ఈ ప్రపంచము భగవంతుఁడైన శివునియాకారమే యనియు, పదార్థము ఆత్మ అనునవి శివునికంటె భిన్నమైన పదార్థములే యనియు, శివుఁడే స్వతంత్రుఁ డనియు, బ్రహ్మాదులు అస్వతంత్రు లనియు ఈమతసిద్ధాంతము. అయినను ఇందు మాయ యను పదార్థము గలదు. ఆమాయ జనించినవిధము స్పష్టము కాదు. మాయకు లోఁబడియుండువఱకు మానవుఁడు తనకర్మములనుబట్టి చచ్చుచు పుట్టుచు నుండవలయును. గురూపదేశముచేత తాను మాహేశ్వరుఁడే యని తెలిసినతోడనే బంధమునుండి విముక్తుఁడై సర్వశక్తిత్వాది గుణములను పొందును. ఈ గుణములను

 

బొందుటకు ఆత్మయొక్క ముఖ్యస్వభావమును ముందుగా నెఱుంగవలయును. బం
మునుండి విముక్తుఁడగుటయే మోక్షమని యీమతసిద్ధాంతము. ఈ మతకర్త 'ప్ర
భిజ్ఞావివృతి విమర్శని' యను పేరుతో శైవసూత్రభాష్యము మొదలగు గ్రంథము
రచియించి యున్నాఁడు.

## చైతన్యమతము

వంగదేశమునందు నవద్వీపమున క్రీస్తుశకము 1486 వ సంవత్సరమునందు చై
తన్యుఁడు విష్ణ్వంశమున పుట్టెను. ఈ చైతన్యాచార్యులతండ్రి జగన్నాథమిశ్రుఁడు
ఇతఁడు గంగాతీరమునందలి నవద్వీపమున తపస్సు చేసెను. ఈ జగన్నాథమిశ్రు
భార్య శచీదేవి. జగన్నాథమిశ్రునకు యెనమండ్రు ఆడుబిడ్డలు పుట్టిరి. అందఱు
మృతులయిరి. తొమ్మిదవవాఁడు విశ్వరూపుఁడు. పదియవవాఁడు చైతన్యుఁడు
చైతన్యునియొక్క మొదటిపేరు విశ్వంభరుఁడు. చైతన్యుఁడు మిక్కిలి తేజస్సు గ
వాఁడుగ నున్నందుచే ఇరుగుపొరుగువా రందరును ఈతనిని ప్రేమించుచుండిరి. అ
నను వీఁడు కృష్ణునివలె బాల్యమునందు తోడిబాలుర నేడ్పించుచును, తనకు నలు
వస్తువులను ఇతరులయిండ్లలోదూరి యెత్తికొనిపోవుచును, గంగకు వచ్చిన ఆడువా
తొందరపెట్టుచును నుండెను. చైతన్యునిదుర్మార్గమునకు దాళజాలనిస్త్రీలు శచీదేవి
దూరుచెప్పుచుండిరి. ఆమె చైతన్యుని తిట్టుచుండెను.

ఈ చైతన్యుని బుద్ధి మిగుల చురుకుదనముతో నున్నందువలన జగన్నాథుని మ
స్సునందు దుర్విచారములు పొడచూప నారంభించెను. కారణ మేమనఁగా:—స
స్కృతమును సంపూర్ణముగా నేర్చి విశ్వరూపుఁడు సన్న్యాసి యైనందున చైతన్యు
డును ఆలాగే యగు నని భయపడుచుండెను.

ఆ కాలమున వాసుదేవసార్వభౌముఁ డనెడు దర్శనములను చదివిన పం
తుఁ డొక్కఁడు నవద్వీపమునం దొక చతుష్పథిని యుంచియుండెను. చైతన్యుఁ
ఈపాఠశాలయందు తన సహపాఠకు లందఱికంటె చదువరి యాయెను. ఈ విద్యా
భ్యాసమువలన చైతన్యుఁడు శాంతస్వభావము గలవాఁడై తలిదండ్రుల యిష్ట
ప్రకారము నడుచుకొనుటకు ప్రయత్నించెను. ఇట్లుండఁగా జగన్నాథమిశ్రుఁడు ప
లోక మేగినందున శచీదేవి దుఃఖము చెప్పుట కలవిగాకుండెను. ఇట్లు వైధవ్యమొం
దుఃఖస్థితియందుండుకాలమున చైతన్యుని సమాధానవాక్యములవలన నామెదుఃఖమ
చాలవఱకు మఱిగిపోయెను. శచీదేవియు తన పెద్దకుమారునివలె విరక్తుఁడగు నేమో
యని భీతిజెందుచుండెను గాని, చైతన్యుని పెండ్లిచేసికొని యింటియందే యుండవల
యు నని సదా కోరుచుండెను. అట్లే వల్లభాచార్యునికూఁతు రైన లక్ష్మీదేవిని చై
తన్యుఁడు వరించెను.

వివాహమైన తర్వాత చైతన్యుం డొక సంస్కృతపాఠశాల నుంచెను. ఇతఁడు ప్రసిద్ధపండితుఁ డైనందున నాలుగుప్రక్కలనుండియు బాలురు వచ్చి చేరుచుండిరి. ఆ కాలమున న్యాయశాస్త్రప్రాబల్యము మెండుగనుండెను; విశేషముగఁ జదివిన పండితులుకూడ చైతన్యుని వాదమున జయించుటకు వెఱగందుచుండిరి. ఒకప్పుడు శ్రీవాసుఁడు చైతన్యునిగూర్చి "కృష్ణునియందు భక్తిలేని సమర్థత నిరుపయోగమైనది. కాఁబట్టి మిథ్యావాదమునందు ప్రొద్దుపుచ్చక శ్రీకృష్ణపరమాత్మను భజించుము" అనినంత చైతన్యుఁడు "దేవుఁడు నాకు భక్తిని దయచేయ నిండు" అనెను.

ఇట్లుండ ఒకనాఁ డొక పండితునిం గని సంతసించి యాతనితోఁ బల్కుచుండఁగా చైతన్యునిచేతియం దొక పుస్తకముండెను. ఆ పుస్తకనామ మేమని చైతన్యుని యడుగఁగా, చైతన్యుఁడు నేను వ్రాసిన న్యాయశాస్త్రటీక యనెను. ఆమాటను విని నంత ఆ పండితుఁడు ఖిన్నుఁడాయెను. వానింజూచి చైతన్యుఁడు కారణ మేమని యడుగఁగా, ఆపండితుఁడు నేను మిగుల శ్రమపడి యొకన్యాయశాస్త్రటీకను వ్రాసియున్నాఁడను. తాము టీకచేసినందున నాటీకను యెవ్వరును ఉపయోగింపరు; అని చెప్పినంత, చైతన్యుఁడు తనటీకను మాఱాడక చించి పారవైచెను. ఈతని ఔదార్యగుణము నెంతయైనను పొగడవచ్చునుకదా.

తర్వాత కొన్నాళ్లకు మిత్రులు కొందఱితోఁ గూడి చైతన్యుఁడు బంగాళదేశభాగములను జూచుటకుఁ బోయెను. ఇతఁడు పోయిన చోట్లలో నెల్ల జనులు మిగుల గౌరవించిరి. చైతన్యుఁడు తన గ్రామమునకువచ్చి భార్యగతించిన సమాచారము విని కొంతదడవు దుఃఖించెనుగాని విశేషముగ జ్ఞప్తికి దెచ్చుకొనక, విష్ణుప్రియ యను మఱియొక కన్యకను వివాహమాడెను. చైతన్యుఁడు తనవిద్యను ప్రకాశపఱుచుటయు, నిష్ప్రయోజకమైన వివాదమునందు బుద్ధిని ప్రవేశపెట్టుటయు, వైష్ణవులకు సరిపడక యితఁడు వైష్ణవుఁ డైనచో శ్రేయముగ నుండు నని మాటలాడుచుందురు.

ఇట్టికాలమునందు తండ్రికి పిండశ్రాద్ధము చేయుటకై శిష్యులతోఁగూడి చైతన్యుఁడు గయకు పోయి యచ్చట పితృప్రీతిగా శ్రాద్ధాదులనంతయు చేసెను. ప్రయాగయందు ఈశ్వరపురి యను యోగీశ్వరుని దర్శనము గలిగెను. ఈ యోగీశ్వరునకు శిష్యుండై ధర్మతత్త్వములను తెలిసికొనవలయు ననెడు ఆతురము చైతన్యునకు కలుగఁగా, ఈశ్వరపురియును చైతన్యుని అనన్యప్రవృత్తిని తెలిసి ఉపదేశించుటకు సమ్మతించెను. చైతన్యుఁడు ఈశ్వరపురియొద్దనేయుండి ఆయోగియొక్కసదుపదేశమువలన సంసారవిచారమును వదలి భగవంతునిధ్యానమునందే కాలము గడపవలయు నని యెంచెను. ఇంతేగాక నిత్యానందులను భక్తులొకరు వీరికి వైష్ణవమతమును బోధించిరి. అది

మొదలు 'శ్రీహరి, నీయొద్దికే నెట్లు రాఁగల్గుదును' అని చెప్పుచుండును. ఒకనాఁ అర్ధరాత్రియందు అతఁడెవ్వరికిని దెలియక కృష్ణునిజన్మభూమియైన మథురమార్గము నడిచెను. అతఁడు సగముదూరము పోయినమీఁద 'నీవు సంసారమును ఇప్పుడు వి చుట సరికాదు; కాఁబట్టి వెనుకకు మరలుము' అని అశరీరివాక్యము వినఁబడెను.

చైతన్యుఁడు యాత్ర చేసికొని సురక్షితముగా వచ్చినదానిని జూచి, శచీ యొక్క సంతోషము పట్టఁగూడనిదిగా నుండెను. చైతన్యుఁడు అందఱితోడను యాత్రాసమాచారమును చెప్పెను. వైష్ణవులకు మాత్రము గయయందు జరిగిన చారములను కృష్ణునిపై తనకు భక్తివిశేషమైనందునకు కారణములను సహా వారికి వి పించెను. కృష్ణునిమీఁది భక్త్యతిశయముచే, నాతఁడు తన దేహమును మఱచిపో కొంతసేపటికి మూర్ఛదేరెను. శచీదేవి భయపడి తనకుమారుఁడు రోగపరిణామము నిట్లు పలవరించుచున్నాఁడని యెంచి తన్నివారణార్థమై దేవుని ప్రార్థించుచుండె

మఱునాఁడు చైతన్యుఁడు శుక్లాంబరబ్రహ్మచారియింటికి బోయి, అక్క బసిసియున్న వైష్ణవులను దర్శించి, మైమఱచి, తెలివివచ్చినమీఁద 'నాతోఁగూ యున్నదేవుఁ డెక్కడ పోయినాఁడు అని చెప్పి, ఆయింటికంబము నొకటిని ఆ ముచే కౌగిలించుకొనెను.

చైతన్యునియొక్క ఈస్థిత్యంతరసమాచారము నవద్వీపమంతయు వ్యాపించె ఈమహావిద్వాంసుఁడు వైష్ణవమతమునుగైకొని హరిభక్తుడైన మాటనువిని యాదఱ వెఱగందిరి. ఎచ్చట జూచినను అతని హరిభక్తిపరాయణత్వమును, అతని విచారము అతని నిట్టూర్పులును, అతని మైమఱుపులును, అతఁడు హరినిగూర్చి విలపించుటయు గూర్చియే సదా జనులు మాటలాడుచుందురు. మఱికొందఱు కృష్ణుఁడు చైతన్య మూలకముగా వైష్ణవమతమును భూమియందు వృద్ధిచేయనెంచి యీతని హృదయ నందు వసించుచున్నాఁడని తెలిసికొన నారంభించిరి.

చైతన్యుఁడు భాగవతపఠనముచేతను, హరినామస్మరణముచేతను, ప్రొద్దుపు చుండె. హరినామస్మరణముయొక్క మధ్యకాలమున నిట్టూర్పులు విడుచుచు నొక కప్పుడు నొడలు తెలియక పరవశుఁడగును. "హరీ, హరీ, నీవెక్కడ యున్నా అని పలవరించుచుండును. చైతన్యుఁడు తన 24 వ సంవత్సరమున ఒరిస్సాప్రాంత లోని జగన్నాథమునకుఁబోయి వాసముచేయుచు జనులకు వైష్ణవమతమును ఉపదే చేయుచుండెను. ఇతడు 31 వ సంవత్సరమున నరాజలా యను క్షేత్రమున కొంతకాల నివసించియుండి శాంతిపూర్, కాశి, మథుర, బృందావనము, మొదలగు స్థలము దర్శించుకొని దక్షిణమునందలి రామేశ్వరమువఱకును దర్శించెను.

చైతన్యుఁడు బ్రాహ్మణులుమాత్రమే గాక అన్నిజాతులవారును ఉపదేశమునకు పాత్రు లని యెంచి మాలమాదిగ లాదిగాఁ గల సకలజాతులవారికిని తన మతమును బోధింప నారంభించెను.

చైతన్యమతసిద్ధాంతము:—చైతన్యుఁడు ముక్తిమార్గమునే బోధింప నారంభించెను ఆతనికి కర్మమార్గమునందు నమ్మికలేదు. యజ్ఞ, యాగ, హోమాదులవలన మోక్షము లభించుట అబద్ధమనియెంచెను కర్మమార్గమును తిరస్కరించి భక్తిమార్గమును జనులమనస్సునందు ప్రతిఫలింపఁజేయుటకు యత్నించెను చైతన్యునిమతమునందు ముక్తిమార్గములు రెండు; మోసములేని విశ్వాసము, ఎడతెగనిభక్తి.

విశ్వాస మనఁగా:—దేవుఁడు ఈ జగత్కర్తయును, నియామకుఁడును, దుర్గుణదండ్యుఁడును నై యున్నాఁడని విచారించి, తన మనస్సున తెలిసికొనుట. భక్తియనఁగా:—అనన్యభావప్రీతి అనఁగా, మనము పెండ్లాము బిడ్డలను ప్రీతి చేయుచున్నాము, ఆస్తులమీఁద మనుతఁ గొనియున్నాము. ఇది యింద్రియములకు లోనైనట్టియు, మఱియు సంసార వ్యామోహముచేత పుట్టినట్టిదియు నగు ప్రీతి యనఁబడును. ఇట్లే ఇంద్రియనిగ్రహము చేసి, సంసారవ్యామోహమునకు లోఁబడక స్వార్థబుద్ధిని విడిచి, శుద్ధాంతఃకరణముచే. రాధాకృష్ణునిపై ప్రీతిని యుంచుట అనన్యభావప్రీతి. ఇట్టి భక్తి విశ్వాసములు మోక్షమునకుఁదగిన ఉపాయము లని చైతన్యుఁడు ఉపదేశము చేసెను. ముక్తి లభింపవలసినయెడల సంసారమును విడువవలయు నని చైతన్యుఁడు చెప్పలేదు. సంసారమునుండియే ముక్తిమార్గము నవలంబింపవచ్చు ననెను.

ఆత్మ దేహసంసర్గముచే వేర్వేఱువిధము లగు దోషములను బొందుచున్నది. ఆదోషము లేవి యనఁగా:—కామక్రోధాద్యరిషడ్వర్గములు. కులమద, విద్యామదాది అష్టమదములు. ఇవి మనుష్యుని బుద్ధిని చెఱుపుచున్నవి. కాన వీనిని విడిచి, సదసద్విచారము చేసి దేవునియందు నిష్కపట మయిన విశ్వాసమును, నిరంతర మయిన భక్తిని యుంచినచో ముక్తిని బొంద నగునని చైతన్యునకు సంపూర్ణవిశ్వాసము కలదు. ఇంతియకాక, స్వార్థపరత్వమును దూరము చేసి, పరోపకారబుద్ధిని వహించుటయే చైతన్యునియొక్క ముఖ్యోద్దేశ్యముగను నుండెను.

ఆచారములు:—ఈ మతస్థులు 108 తులసీమణిమాలికను ధరించి కృష్ణనామమును జపింతురు. ముఖమున రెండు తెల్లని గోపీచందనపుగీతలను ధరించెదరు.

చైతన్యునకు భాగవతము, భగవద్గీత యివి రెండును పారాయణగ్రంథములు. ఈ చైతన్యుఁడు 12 సంవత్సరములు కటకదేశమున సదా కృష్ణభజనము సేయుచు మతోద్ధారణము జేసెను. తన 43-వ సంవత్సరమున వైకుంఠమునకుఁ బోయెను.

చైతన్యులు గౌర్ అనుచోట వైష్ణవమతమును బోధింపఁగా యిద్దఱు మహా
యులు శిష్యులైరి. వారికి రూప, సనందన యని నామములిడిరి. బృందావన
రూప, సనందన, పీఠస్థులే ముఖ్యగురువులైయున్నారు. చైతన్యునకు 'గౌరాం
యని మఱియొకనామము కలదు. ఈ మతసిద్ధాంతమంతయు యించుమించుగా
సిద్ధాంతమును బోలియున్నది. (చరిత్రచింతామణియందు విశదీకరింపఁబడును.)

## వల్లభమతము.

శ్లో. ఆదౌ శ్రీపురుషోత్తమం పురహరం శ్రీనారదాఖ్యం మునిం
కృష్ణ వ్యాసగురుం శుకం తదను విష్ణుస్వామినం ద్రావిడమ్।
తచ్ఛిష్యం కిల బిల్వమంగళ మహం వందే మహాయోగినం
శ్రీమద్వల్లభనామధామచ భజే ఽస్మత్సంప్రదాయాధిపమ్.

ఈ మతస్థాపకుఁడైన వల్లభాచార్యులు క్రీస్తుశకము 1478-వ సంవత్సరమున
దవతరించిరి. ఆదియందీ వైష్ణవసంప్రదాయమును పురుషోత్తముఁడు నిర్మించె
అతఁడు రుద్రమూర్తికిని, రుద్రమూర్తి నారదులకును, నారదులు వ్యాసులకు
వ్యాసులు శుకులకును, శుకులు విష్ణుస్వామికిని యుపదేశించిరి.

విష్ణుస్వాములు విక్రమశకమునకు 600 సంవత్సరములకు ముందు, ద్రవిడ
మున జన్మించి శిశుప్రాయకాలములోనే విద్యాభ్యాసము చేసి సకలవిద్యలను గ్రహిం
యొక మండలాధిపతియొద్ద మంత్రిగానుండి యా మండలేశ్వరుఁడు మరణము నొం
మీఁద మనుష్యులను సేవించుట తగదని నిశ్చయించి విష్ణుభక్తి చేయనెంచిరి. ఇట్లు
డఁగా విష్ణుస్వామియొద్దకు శ్రీ శుకదేవులు విచ్చేసి యిట్లనిరి. విష్ణుభక్తియనఁగా
వంతుని పూజించి భగవత్ప్రసాదమును స్వీకరించుటయని యానతిచ్చి యదృశ్యులైరి
అదిమొదలు విష్ణుస్వామి భగవంతుని ధ్యానించుచు యేడుదినములు నిరాహారియై
భగవంతుఁడు ప్రత్యక్షముకాఁగా దర్శనముజేసి షోడశోపచారంబు లొనర్చి భగ
త్ప్రసాదమును స్వీకరించిరి. అమీఁద భగవంతుఁడు విష్ణుస్వామితో మత్స్యరూపవి
హము నిర్మించి సేవించుచు ప్రసాదమును గైకొనుచుండుమనఁగా, విష్ణుస్వామి స్వా
నాగురుండు విగ్రహపూజచేయుట కనుజ్ఞ యొసంగలేదని విన్నవించిరి. అప్పుడు
వంతుఁడు విష్ణుస్వామియొక్క గురుభక్తికి మెచ్చి నేను ప్రతిదినమును దర్శన మిచ్చె
చెదనని చెప్పి యంతర్ధాన మాయెను. విష్ణుస్వామి పరమపద మొందుసమయము
తమ సంశిష్యులను విష్ణుప్రతిమారాధనంబు చేయుచుండునట్లాజ్ఞాపించిరి. తర్వా

కొంతకాలమునకు వైష్ణవమతము శూన్యమై పోయెను. అట్టికాలమునందు విష్ణుస్వామి శిష్యులైన బిల్వమంగళులను మహాయోగీశ్వరు లొకరు వైష్ణవసంప్రదాయము విచ్ఛిన్నమైన దని చింతింపుచుండఁగా వల్లభాచార్యు లవతరించిరి.

## వల్లభాచార్యచరిత్రము.

ఆంధ్రదేశమున అకివీడుసమీపమునందలి కాకరవాడగ్రామమునందు యజుర్వేద తైత్తిరీయశాఖ భారద్వాజగోత్ర మహాదేవపాత్రవంశస్థు లగు వెలనాటి లక్ష్మణభట్లు అనువా రొకరుండిరి. వీరి వంశపరంపరయందు తొంబదియైదు సోమయజ్ఞములు పరిపూర్తియైయుండెను. తర్వాత లక్ష్మణభట్లు అయిదుయజ్ఞములుచేసి శతసోమయజ్ఞములు పూర్తిచేసిరి. కడపటి సోమయజ్ఞము పరిసమాప్త మగు సమయమునందు ఆ గుండమునుండి "మీ గృహమునందు సాక్షా న్నారాయణమూర్తి అవతరించబోవుచున్నారు" అని అశరీరవాక్కు వినఁబడెను.

లక్ష్మణభట్టువారు భగవద్వాక్యమును విని మిగుల ఆనందమును బొంది లక్షా యిరువదియైదువేల బ్రాహ్మణులను కాశిలో సంతర్పణచేసెద నని సంకల్పముచేసి సంతర్పణకు వలయుధనమును గైకొని శిష్యులతో ప్రయాణమైపోవుచు భృంగసార్థకమను గ్రామమున నిలిచినప్పు డొక ఏకాదశినాఁటి అర్ధరాత్రియందు రాధాసహిత శ్రీకృష్ణమూర్తి స్వప్నమునందు దర్శనమై, మీరు కాశినుండి మరలి చంపారణ్యక్షేత్రమునకు రాఁగా నాయవతారము మీకు లభించునని చెప్పి ఉత్తరీయమును, తులసీమణిమాలికయును, తాంబూలమును నొసంగి, ఆ వస్త్రమును శిశువునకు కప్పవలసినదనియును, తులసీమణిమాలికను కంఠమున ధరింపఁజేయవలసిన దనియును, తాంబూలమును ఉగ్గుగాఁ బెట్టించవలయు ననియు ననుజ్ఞయొసంగి యంతర్ధాన మాయెను. అనంతరము లక్ష్మణభట్లు మేల్కొని చూడఁగా స్వప్నదృష్టపదార్థములు ప్రత్యక్షముగ నుండెను. ఆ పదార్థములను లక్ష్మణభట్లు మహదానందముతోఁ గైకొని కాశీక్షేత్రముపోయిచేరిరి.

అచ్చట గంగాస్నానమును దేవతాదర్శనములును జేయుచు, శీఘ్రకాలములోనే లక్షాయిరువదైదువేల బ్రాహ్మణులను సంతర్పణ చేసిరి. ఇట్లుండఁ గొన్నాళ్లకు పశ్చిమోత్తరదేశమునందలి తురుష్కులు కొల్లకై కాశీనగరమునకుఁ రాఁబోవుచున్నారనివిని దేశోపద్రవము తొలఁగుదాఁక వేఱుస్థలమున వసించుట యుత్తమమని యెంచి కుటుంబముతో నాగపూరుదగ్గరనుండు చంపారణ్యము పోయి చేరిరి. అదివఱకే లక్ష్మణభట్లపత్ని యెల్లమ్మగారు గర్భమును ధరించి యుండిరి గాన చంపారణ్యమును చేరునప్పుడు ఏడవమాసముగానుండెను. ఆ మాసముననే గర్భస్రావమైనది; అప్పుడు యెల్లమ్మగారు చింతించి దానిని యరఁటియాకులందుచుట్టి జమ్మిచెట్టు తొఱ్ఱలో దాఁచి యుంచి చౌడానగరము పోయి చేరిరి.

ఇంతలో కాశియందు ఉపద్రవముతీరి జనులు క్షేమముగనున్నారని విని కాశి పోవుటకు నిశ్చయించి మరునాఁ డామార్గముగ వచ్చుచుండఁగా గర్భమును దాఁచి యుంచిన జమ్మిచెట్టుక్రింద నొక యగ్నిగుండమున శిశువు ఆటలాడుచుండుట జూచి ఆ కుండమును సమీపించుటకు సాధ్యముకాక దూరమున నిల్చి భగవంతుని మహిమను గొనియాడుచు 'ఈ బిడ్డ నా బిడ్డగా నుండినయెడల అగ్నిదేవుఁడు దారి విడువవలసి నది' అని యెల్లమ్మగారు చెప్పఁగా, అగ్నిదేవుఁడు మార్గమును విడువఁగా, యెల్లమ్మ గారు ఆ శిశువు నెత్తికొనిరి. అప్పుడు లక్ష్మణభట్లవారికి స్వప్నమున ప్రసాదించిన తాంబూలమును నూరి ఉగ్గుబెట్టి, తులసీమణిహారమును కంఠమున ధరింపఁజేసి, వస్త్ర మును గప్పిరి. లక్ష్మణభట్టువారు అచ్చోటనే జాతకర్మ నామకరణము మొదలగుకర్మ లను నెఱవేర్చి కాశీదేశము పోయి చేరిరి.

ఇట్లుండఁగా యెల్లమ్మగారు గోకులము బృందావనము మొదలగు దివ్యస్థల యాత్రను చేయవలయునను అభిలాషకలిగి భర్తతోఁ జెప్పఁగా, వల్లభుల ఉపనయనా నంతరము పోవుద మనిరి. ఈ మాటలు గడచినకొన్నాళ్లకు బిడ్డను తొడపై నిడికొని పాలిచ్చుచు వ్రజస్థలదర్శన మగునో కాదో యని చింతించుచుండఁగా, పాలుద్రాగు చుండు బిడ్డ ఆవులించెను. ఆ యావులింతతోఁ గూడిన ఆచార్యులవారి ముఖారవింద మున యెల్లమ్మగారు వ్రజములోని సకలస్థలములను దర్శనము చేసి ఆశ్చర్య మొందిరి.

కాశీవిశ్వనాథస్వామి యోజించినదే మనఁగా, మోహరూపమైన మాయావాద మతమును విస్తరింపఁజేయుమన్నట్లు నా కాజ్ఞనొసంగిన పురుషోత్తములవారు అట్టి మోహ ముతోఁ గూడిన మతమును నిర్మూలము చేయుటకై మానవరూపముతో నవతరించి యున్నారు. గాన నేను వారిని దర్శించి, వారి యభిమతము నెఱింగెద నని నిశ్చయించి యోగివేషమును బూని బిడ్డయొద్దికిఁబోయి 'భగవన్ కోయంవేషః' ఓ భగవంతుఁడా! ఇదేమి వేషము అనిరి అదివఱ కెన్నఁడును మాటలాడుటయే యెఱుఁగని శిశువు ఒక శ్లోకమును మహాదేవునకు చెప్పెను. 'సర్వేశ్వరశ్చ సర్వాత్మా నిజేచ్ఛాతః కరిష్యతి' భగవంతుఁడు తన యిష్టానుసారము చేయఁగలఁడు. అనఁగా అందఱును ఆశ్చర్యో పేతు లైరి.

సారోంజి యను క్షేత్రమునందు కేశవానందులను యోగీశ్వరులు శిష్యులకు వైష్ణవసంప్రదాయమును బోధించునప్పుడు, ఇప్పుడు భగవదవతారము కలిగియుండ వలయు ననిరి. ఆ వినిన శిష్యులలో కృష్ణదాసుమేఘన యనువారు తమ గురువాక్య మును విని, భగవంతుని దర్శింపవలయు నని యనేకస్థలములు సంచరించుచు కాశి యందు వల్లభాచార్యుల ఉపనయనసమయమున కాశికి వచ్చిచేరిరి.

అప్పుడు వల్లభులు కృష్ణదాసు మేఘునా ! వచ్చినావా యని యడుగఁగా, ఈ తఁడే భగవంతుఁడని దెలిసి సాష్టాంగప్రణామంబు చేసెను. మఱియు లక్ష్మణభట్ల యింటి సమీపమునందుండు ధాఢి యను హీనకులస్థుఁడైన సగుణదాసు అనువాఁడు ప్రతిదిన మును వల్లభాచార్యుల దర్శనముచేసి యనంతరము ప్రసాదము స్వీకరించు చుండెను. ఆచార్యులవారు నడుచుటకు ప్రారంభించినది మొదలు ప్రతిదినమును వానియింటికిఁ బోవుచుండిరి. లక్ష్మణభట్లు తక్కువజాతి వానియింటికి పోవల దనఁగా, వల్లభులు— 'స్త్రియో వైశ్యా స్తథా శూద్రా స్తేపి యాంతి పరాంగతిమ్' అని యున్నదికదా యని చెప్పిరి. లక్ష్మణభట్లు వల్లభాచార్యులను ఉపవీతధారణమైన తర్వాత, మధ్వానంద స్వామివారికడకు అధ్యయనము చేయుటకు బంపించిరి. ఆచార్యులవారు నాలుగు నెల లలో నాలుగు వేదములును, షట్శాస్త్రములును జదివిరి.

వైష్ణవధర్మస్థాపనమునందు వల్లభాచార్యులవారికి మిగుల ఆసక్తికలిగియుండి నందుచే యెక్కడ సభలుచేసినను అక్కడి కెల్లనుపోయి విద్వాంసులతో శాస్త్రార్థము చేసి వారినందఱిని యోడించుచుండిరి. విశ్వనాథస్వామి ఆలయములో అప్పుడప్పుడు సభలుచేసి యేదైన నొకవిషయమును సిద్ధాంతము చేసికొని పోవుచుందురు. ఇట్లు సిద్ధాంతముచేసిన ఒకవిషయమును గూర్చియే వల్లభులు వారి సిద్ధాంతమును దోష మని సాధింతురు. ఈలాగు ముప్పదిదినము లొకతూరి వారిసిద్ధాంతమును ఖండించిరి. ఈ విషయము 'పత్రావలంబనమ్' అను గ్రంథమునఁ గనఁదగును. ఆ తర్వాత లక్ష్మణ భట్లు స్థలయాత్రలు చేసికొనుచు తిరుపతికివచ్చి అచ్చోటికి తనయొక్క పెద్దకుమారుని రప్పించి యతనిని, వల్లభాచార్యులను, చిన్నకుమారుని, దగ్గర కూర్చుండ బెట్టుకొని యిట్లనిరి. పెద్దకుమారుఁడైన రామకృష్ణభట్లనుజూచి నీవు కాకరవాడయందే బంధు వులతోఁగూడి వాసముచేయుచు మనయింట్లో పూజలందుచున్న రామచంద్రమూర్తి విగ్రహమునకు ఆలయనిర్మాణము గావింపుమని చెప్పి ఆవిగ్రహము నొసంగిరి. వల్లభా చార్యులను జూచి విష్ణుస్వామి ధర్మమును ప్రకటింపఁబోవుచున్నారు గాన మీరొక చోటనే యుండుటకు వలనుపడదు; అయినను మదనమోహనవిగ్రహమును, సాల గ్రామమును ఆరాధించు చుండవలసినదని చెప్పినదేగాక, తల్లిని సంరక్షించు చుండవల సినదని చెప్పిరి. కాశిలోఁ బుట్టిన కడపటికుమారుఁడైన రామచంద్రభట్లనుజూచి నీవు స్వగ్రామమునందు నీయన్నతోఁగూడి యుండవలసిన దని చెప్పిరి.

అంత విక్రమశకము 1546-వ సం, శ్రీరామనవమి దినమున లక్ష్మణభట్లు వేంక టేశ్వరస్వామి దర్శనముచేసి అచ్చట స్వామికిఅలంకారముచేయు సమయమున లక్ష్మణ భట్లు విష్ణుతేజముతో నైక్యమైరి. అప్పుడు శ్రీవల్లభాచార్యులవారికి పదునొకండు

 

సంవత్సరములు పూర్తియైనది. లక్ష్మణభట్లు ధరించిన వస్త్రముమాత్రము మిగిలియు డెను. ఆ వస్త్రమునకు యథావిధిగా ఆచార్యులవారు సంస్కారాదులు పూర్తి భూప్రదక్షిణము చేయవలయునని నిశ్చయించి, తల్లితోడను శిష్యునితోడను కూడి కృ దేవరాయలవారిసంస్థానమున దానాధ్యక్షుఁడుగ నుండు విద్యాభూషణుండను పే తనమేనమామయొద్ద తనతల్లిని విడిచిపోవలయుననిరూపించి, విజయనగరముపోయిచే అచ్చట రాజసభలో మాయావాదులును బ్రహ్మవాదులును శాస్త్రార్థము చేయుచున్నా రనియు, విష్ణుధర్మము నెలకొనుట దుస్తరముగాఁ గనఁబడుచున్నదనియు తెను మా వలన విని, అగ్నిరూపిరైన బ్రహ్మవాదిముందు మాయావాదులు తృణమాత్రము కదా చెప్పి, రేపు నేను శాస్త్రార్థముచేయుటకై సభకునచ్చెదననిరి. అంతట వారిమామగా భోజనమునకు లెండనిచెప్పఁగా, మీరు పంచద్రైననివేదనముచేసి ప్రసాదమును స్వీ రించువారుగ నున్నారు; నేను విష్ణుసంప్రదాయస్థుఁడుగను, బ్రహ్మచారిగ నుండుట పరాన్నము స్వీకరించుటలేదనిచెప్పి, మార్గమధ్యమున శిష్యుఁడైన దామోదరదాసుని కృష్ణదాసుమేనునునిక్తా బిలిచికొని ప్రత్యేకస్థలమునకుం బోయిరి.

మఱునాఁడు ప్రాతఃకాలమునలేచి స్నానసంధ్యాది నిత్యకృత్యములం దీ కొని వల్లభాచార్యులు దండకమండలపాదుకాధారులై కృష్ణదేవరాయలసభకు బో నంత, రాజులేచి నమస్కరించి పండితసభకుం దోడ్కొని పోయిరి. ఆ సభయం ఆనందగిరి మొదలగు మాయావాదపండితు లనేకులును, బ్రహ్మవాదులలోనింబార్క మధ్వ, రామానుజ సిద్ధాంత ప్రవీణు లగు పండితోత్తములు నుండిరి. ఆ సభయం ఇరువదిరేడుదినములు వాదము జరిగెను. మాయావాదులు పరాభవము నొందిరి. తర్వాత మాయావాదులు జైనులను, బౌద్ధులను రప్పించిరి. వల్లభులు ఆ జైనుల బౌద్ధులను పరాభవము నొందించిరి. అప్పుడు కృష్ణదేవరాయలవారు వల్లభాచార్యుల శిష్యులైరి అనంతరము బిల్వమంగళులు ఆచార్యులయొద్దకువచ్చి విష్ణుస్వాములవా సంగిన పత్త్రిము నొసంగి, వైష్ణవసంప్రదాయ వ్యవస్థలనన్నియుం దెలియఁజేసి తాసన్నిధ్య మొందిరి.

తర్వాత వల్లభాచార్యులు విక్రమశకము 1548-వ సంవత్సరమునందు వై సంప్రదాయము నుద్ధరించుటకై భూప్రదక్షిణము చేయుటకై బయలుదేరి పండరి రము, పుష్కరక్షేత్రము, గోకులము, బృందావనము, మథుర, అయోధ్య, నైమిశా ణ్యము, బదరికాశ్రమము, జగన్నాథము, శ్రీ పట్టభద్రరామగిరిక్షేత్రము, తిరుమల కాంచీపురి, శ్రీరంగము, అనంతశయనము, జనార్దనము మొదలగు స్థలములను దర్శి చుచు, పుణ్యనదులయందు స్నానముచేయుచు, అచ్చటచ్చట భాగవతమును పారాయణ

చేసి విశ్రాంతిఘట్టములలో తమపీఠములను స్థాపించుచు, మఱియు రామానందీయులు, రామానుజమతస్థులు, మాయావాదమతస్థులు మొదలుగాగలవారిని ఖండించుచు, స్వమతమును స్థాపించుచు, నివ్విధముగ ప్రదక్షిణము చేసిరి. రెండవసారి ప్రదక్షిణము చేయునప్పుడు గోవర్ధనమున శ్రీకృష్ణమూర్తి యావిర్భవించి వల్లభాచార్యులవారికి దర్శన మిచ్చిరి.

తర్వాత ఆచార్యులవారు కాశికిపోఁగా నచ్చట మధురమంగళుఁడను బ్రాహ్మణుఁడు తనకుమార్తెయైన మహాలక్ష్మీదేవిని సాలంకృత కన్యాదానముచేసి యిచ్చెను. విక్రమశకము 1568-వ సం, మునందు వల్లభాచార్యులవారికి ప్రథమపుత్త్రజననమును, వి.శ 1572-వ సం, మున ద్వితీయపుత్త్రజననమును గలిగెను. వి.శ 1587-వ సం. ఆచార్యులవారు సన్న్యాసమును స్వీకరించిరి. వి.శ 1587-వ సం, ఆషాఢశుద్ధతృతీయాదివసమునందు శ్రీవల్లభాచార్యులవారు భగవత్సన్నిధానము నలంకరించిరి.

వల్లభమతసిద్ధాంతము:— ఈ మతాచార్యులు గోపికాస్త్రీవేషమును ధరించి కృష్ణమూర్తిని పూజింతురు. ఈమతాచార్యులు కృష్ణునకు ప్రతినిధులుగా నెన్నఁడుదురు. శిష్యులు గురుపాదతీర్థమును అమృతముగా భావించి సేవింతురు. వారు నమలిన తమ్మను ప్రసాదముగా స్వీకరింతురు. ఆచార్యులు కోరినయెడల యువతులు సహా అంతరంగసేవకు లోఁబడుదురు. ఈమతగురువులు గృహస్థులయి యున్నారు.

ఒకానొక శ్రావణశుక్లపక్ష ఏకాదశినాఁడు శ్రీకృష్ణమూర్తి యీమతాచార్యులకు ప్రత్యక్షముగ వచ్చి మతసిద్ధాంతరహస్యమును బోధించిరి. ఆ రహస్య మేమనఁగా; దేహము, ప్రాణము, ధనము అను నీమూఁడును శ్రీభగవంతునకు సమర్పించినచో బ్రహ్మసంబంధ మనెడు జీవమును ఆత్మయును ఏకమగును. అందువలన ఆగామి సంచిత ప్రారబ్ధకర్మలును సకలపాపములును నశించును.

భగవంతుఁడగుకృష్ణుఁడుసత్తనియు, (స్థితి) చిత్తనియు, (జ్ఞానము) ఆనందమనియు మూఁడువిధములు గలవాఁడు. పదార్థము సత్తుయొక్క భాగము. ఆత్మచిత్తుయొక్క భాగము. ఆత్మ లనేకములు గలవు. కృష్ణుని యాజ్ఞవలన ఆత్మ దేహమునందు జొచ్చి తన నిజమైన జ్ఞానమును మఱచిపోవుచున్నది. అయినను కృష్ణపరమాత్మ దయవలన మరల తన జ్ఞానమును బొంది, యాతనితో వసించుటకై, కృష్ణునిసన్నిధానము (గోలోకము) నకుఁబోయి, నిత్యపదవిని బొందుచుండును. కృష్ణునికృపను బడయుటకును, అతనిపదమును బొందుటకును భక్తియే ముఖ్యకారణము. ఆ భక్తిని బొందుటకు శాంతము, దాస్యము, సఖ్యము, మాధుర్యము అను నాలుగుదశలు గలవు. కృష్ణునియందు స్త్రీల కెట్టిభావము కలిగియుండెనో యట్లుండవలసినది.

మఱియు సన్న్యసించుట, ఉపవాసము లుండుట, అహంకారము నణచుట, ఇంద్రియవశీకరణము మొదలగునవి యనవసరము లనియును, ప్రపంచమునందలి యోగ్యవస్తువులెల్లను అనుభవించుటకు గల్గిన వనియును ఈ మతస్థుల యభిప్రాయము. వీరికి భక్తి మిక్కుటమై యున్నది. ఈ మతమునకు పుష్టిమార్గమనియును, శుద్ధాద్వైత మత మనియును నామములు కలవు. వీరిగ్రంథములను మూఁడు తెఱఁగులుగ విభజించి యున్నారు. వల్లభాచార్యులు భాగవతటీకా సుబోధిని, వ్యాససూత్ర భాష్యము, జైమిని సూత్రభాష్యము, తత్త్వదీపనిబంధనము మొదలగు అనేకగ్రంథములను రచియించి యున్నారు.

## వల్లభమతభేదము.

క్రీస్తుపుట్టిన 1781-వ సంవత్సరమున స్వామినారాయణులనువారు అయోధ్యకు సమీపమునందుండు సభానగరమునందు విష్ణువవతారముగా జన్మించి, సకలశాస్త్రములను పరిశోధించి ఘూర్జరదేశమున బ్రహ్మచర్యాశ్రమమున నివసించి, వల్లభమతమునం గల అంతరంగసేవ మొదలగు దురాచారములను ఖండించి, యామతమును పరిశుద్ధము చేసిరి. వీరు తమయొక్క 49-వ సంవత్సరమున దేహయాత్రను చాలించిరి. వీరికి శిష్యు లనేకులున్నారు. స్వామినారాయణులు స్థాపించిన మతమునకు ఉద్ధవసంప్రదాయ మని పేరు. ఉద్ధవమతపద్ధతిని అవలంబించనివారు వల్లభమతదురాచారములయందు సానము గలవారై యున్నారని తెలియుచున్నది.

## మహానుభావమతము.

ఈ మతమును స్థాపించిన కృష్ణభట్టు అనునతఁడు శాలివాహనశకము సుమారు 1101 లో రాక్షసభువనమునకుఁ దూర్పుననుండు శేంబే అను గ్రామమునందు జన్మించెను.

ఇతఁడు బేతాళుని యుపాసించి యొకకిరీటమును బడసెను. ఆకిరీటము శిరంబున నున్నంతవఱకు సాక్షాత్ శ్రీకృష్ణమూర్తివలెనే లోకులకుఁ గనఁబడు చుండును. కావున ఇతనిని కృష్ణమూర్తియొక్క అపరావతారమని దలంచి సేవించుచుండిరి. ఈ కారణముచే నితఁడు శాలివాహనశకము 1125 వ సంవత్సరమునం దొక క్రొత్తమతమును స్థాపించెను.

ఆచారాదులు:—ఈమతస్థులు నల్లనివస్త్రములను ధరింతురు. వీరిలో సన్న్యాసులు మాత్రమే క్షౌరము చేసికొందురు. గృహస్థాశ్రమమున నుండువారు క్షౌరమే చేసికొనఁగూడదు. సన్న్యాసులకు మహాంతు అనిపేరు. వీరు ఈకృష్ణభట్టు అను శ్రీకృష్ణమూర్తినిని, దత్తాత్రేయునిని బూజింతురు. అహింసాది కార్యములు చేయరు. షణ్ముఖ

ఖీముద్రచేత ఇష్టదైవోపాసన చేయుదురు. కృష్ణభట్టకృత మైన కృష్ణచరితామృతము, గీత; లీలానిధి, లీలామృతము మొదలగుగ్రంథములు వీరికిఁ బ్రమాణములు. ఈ మతస్థులు మహారాష్ట్రదేశమునను, ఐరాడదేశమునను నున్నారు సన్న్యాసులైన మహంతులుండెడి మఠములు సుమారు పదికంటె నెక్కుడు గలవు. (ఈ మతమునుగూర్చిన మఱిఁ గొన్నివిషయములు "చరిత్రచిన్తామణి" యందు గనందగును).

## ఆర్యమతము.

ఈ మతమును స్థాపించినవారు దయానందసరస్వతీస్వాములవారు. వీరి మొదటిపేరు మూలశంకరులు క్రీస్తుశకము 1824 కు సరియైన విక్రమశకము 1881 వ సంవత్సరమునందు మర్యాదగల్గినట్టి ఔదీచ్య బ్రాహ్మణకుటుంబములో జన్మించిరి. ఘూర్జరదేశమునందు కాథియవాడ అర్ధద్వీపమునందుండు మోర్వి అను రాజసంస్థానపు న్యాయస్థానమునందు న్యాయవాదియుద్యోగమును ఈ కుటుంబస్థులు పరంపరగాఁ బడయుచుండిరి. ఈ దయానంద సరస్వతీస్వాములవారు 14 గు సంవత్సరముల లోపల భాష్యసహితముగా యజుర్వేదమును, తక్కిన మూఁడు వేదములలో కొన్ని భాగములను, వేదనిఘంటువును, వ్యాకరణమును, పాండిత్యమునకు నలయు మఱి కొన్ని యుత్కృష్టగ్రంథములను గ్రహించిరి. శైవసమయమునం దత్యంతము ప్రీతి గల యాతని తండ్రి తనకుమారుని శివభక్తియందు ప్రబుద్ధునిగాఁ జేయుట కిది సమయ మని యెంచి యొకశివరాత్రిదినమున కుమారుని వెంటబెట్టుకొని యొకశివాలయమునకుఁ బోయి శివపూజావిధానము లన్నింటిని యుపదేశించి పూజగావించెను. ఆ తర్వాత అచ్చటనుండు అర్చకులు మొదలగువా రందఱును నిద్రచే కన్నులుమూసికొని యుండిరి. అప్పుడు శివలింగముపై నున్న పత్త్రిపుష్పముల నెల్ల యెలుకలుకొఱుకుచును. సమీపమునందున్న ఫలముల నెల్లను తినుచునుండుటను దయానందసరస్వతీస్వాములు చూచి యాశంకించి తమలో నాలోచించిన దేమనఁగా:—ఎలుకలను తోలుటకు శక్తిలేనప్పుడు సర్వరక్షకుఁడైన దేవుఁ డితఁడని యెట్లని నమ్మనగును? అని యీవిషయమై తండ్రితో చర్చించుచుండఁగా కుమారునియొక్క చిత్తవిక్షేపమును బోఁగొట్టుటకై యనేక పురాణేతిహాసములను బోధించెను. దయానందులు దానిని నమ్మక, వేదమతమే సర్వోత్తమమైన దనియు, దీనిని బోధించినచో లోకోపకారముగ నుండు ననియు నెంచిరి.

ఇట్లుండ కొంతకాలమునకు దయానందసరస్వతీస్వామి నిరుక్తము, మీమాంసము, వేదనిఘంటువు మొదలగునవి యభ్యసించినవారైనను వానియందు సంపూర్ణ

జ్ఞానమును బొంద నిశ్చయించి కాశీక్షేత్రమునకు పోవలయు నని తండ్రినియడుగ నాతఁడు సమ్మతింపక పోయినందుచే తనయూరికి 6 మైళ్ళదూరమునందుండు నొక పండితునియొద్ద విద్యాభ్యాసము చేయుచుండిరి. ఇట్లు తనకుమారుఁడు లౌకికవిష మునం దుపేక్షకల్గి యుండుటను గని త్వరగా వివాహము చేసినచో విద్యాభ్యాస తప్పునై యగు నని తలంచి యొక సుందరవతి యైన కన్యను నిశ్చయించి వివాహము కుపక్రమించెను. జ్ఞానాభిలాషియు వైరాగ్యశీలుఁడు నగు దయానందసరస్వతీస్వామి 18 వ యేఁట నిశ్చితార్థమునాఁటి రాత్రియందు ఏకాంగిరియై బయలువెరి పోయిరి.

ఇట్లుండ వివాహప్రారంభమునందు తప్పించుకొనిపోయిన తనకుమారుని వెదు నిమిత్తము సజ్జుపురౌతులను, సిపాయిలను బంపెనుగాని, వారున్నచోటు తెలియక మరలివచ్చిరి. మఱికొన్నాళ్లకు సిద్ధపురంబునం దుండుటను తండ్రివిని సిపాయిలతో గూడి సిద్ధపురంబునకుఁబోయి కుమారునింజూచి వారినిపట్టుకొనివచ్చి వారు ధరించి యున్న కాషాయమునుతీసి చించి పాఱవైచి సిపాయిలచేతికి యొప్పగించెను అప్పుడు దయానందసరస్వతీస్వాములు పహారావారలను జాగ్రతగానుండు సమయము జూచి తప్పించుకొని స్వేచ్ఛగా సంచరించుచు; జ్ఞానులుండు స్థలములకల్లఁ బోయి తమకు తెలియని దానిని వారియొద్దనుండి గ్రహించుచు, నర్మదాతీరము జేరి యచ్చో వసించు పూర్ణానంద పరమహంసవలన ననేక వేదాంత తత్త్వశాస్త్రములను జదివి, తర్వాత బరోడాసమీపమున శంకరాచార్యుల ఆశ్రమమునందుండు పరమానందసరస్వ యను సన్న్యాసివలన సత్యజ్ఞానబోధముం బడసి, వారివలన ". దయానందసరస్వతి" యను అంకితనామమును, సన్న్యాసమును బడసిరి.

ఇట్లు సన్న్యాసాశ్రమమును స్వీకరించిన యనంతరమును జ్ఞానాభివృద్ధి నొంద వలయు నని నిశ్చయించి చైతన్యాశ్రమమునకువచ్చి పరమానందులయొద్దను, సచ్చిదా నందులయొద్దను వేదాంతాభ్యాసముచేసి, యోగములనభ్యసించి, తర్వాత అహమద బాదునంగు జ్వాలానందులయొద్దను, ఆబుపర్వతమునందు శివానందులయొద్దను, తత్త్వ జ్ఞానమును యోగాంగలక్షణములను గ్రహించి, అనంతరము విక్రమశకము 19.1- సంవత్సరమునందు హరిద్వారమునకుబోయి మహర్షులదర్శనముచేసి వారివలన కొన్ని విద్యలను గ్రహించి, చాందీ అరణ్యమునకుం బోయి యోగాభ్యాసము చేసి, తర్వాత మహామునులు వసించు కేదారము, గౌరీఖండము, భీమఘోరా, అగస్త్యాశ్రమము, గుప్తరాశి, త్రిజోగినారాయణము మొదలగుస్థలములకుంబోయి పెద్దలను సందర్శించి తమకుఁదెలియని విద్యలను వారివలనసంగ్రహించి, మథురకు వచ్చి యచ్చోటవసించి అంధుడగు విరజానందస్వాములవారివలన తా మభ్యసించిన వానిని పునర్విమర్శ

చుచు, సర్వజ్ఞశిరోమణి యగు విరజానందులవారివలన యనేకవిషయములను గ్రహించిరి. తర్వాత దయానంద సరస్వతీస్వాములవారు లోకోపకారార్థమయి జ్ఞానమును వినియోగపఱచవలయునని యెంచి కొన్నిస్థలములయందు విద్యాశాలలను స్థాపించి, వేదములయొక్క యర్థమును విద్యార్థులకు బోధించుటకై వేతనమిచ్చి పండితులనియమించి, తాము పైవిచారణచేయుచుండిరి. ఆయినను ఉపాధ్యాయులు నిజమైన యర్థము నుపదేశింపనిచే దయానంద సరస్వతీస్వాములవారు హిందీభాషను శీఘ్రకాలమున అభ్యసించి, యుపన్యాసములు చేయుట కారంభించిరి. అంతేగాక అనేకగ్రంథములను, చతుర్వేదము లను నవీనభాష్యమును రచియించిరి.

మఱియు పంజాబు అనఁబడు పాంచాలము మొదలగు గొప్పపట్టణములయందెల్లను విక్రమశకము 1932 వ సంవత్సరమున ‹‹ ఆర్యసమాజము ›› అనుపేర ననేక సంఘములను స్థాపించిరి. వీరికి అనేకరాజులును ధనవంతులును శిష్యులైరి. వీరివలన యోగాభ్యాసము నభ్యసింపఁగోరి అమెరికాదేశములోని కర్నల్ ఆల్కాటుదొరయును, మేడం బ్లావట్స్కి దొరసానియు వచ్చి ఆశ్రయించిరి మఱికొన్నాళ్లకు ఈ హూణులు ఆర్యమతమునుండి వేఱై దివ్యజ్ఞానమతమును స్థాపించిరి ఇట్టి మహానుభావునకు జోథ్‌పూరులో నొకఁడు విషము ప్రయోగముచేసెను కనుక క్రీస్తుశకము 1883-వ సంవత్సరము సెప్టంబరునెల 29-వ తేది దీపావళి పండుగనాఁటి సాయంకాలమునందు లోకులందఱును సంతోషముతో నుండఁగా గాయత్రీధ్యానముచేయుచు ముక్తిని బొందిరి.

ఆర్యమతసిద్ధాంతము:—ఈ మతము అద్వైతము ననుసరించినది. ఇందు దేవుఁ డొక్కఁడేగలఁడు. స్థూలదేహమునం దుండు ఆత్మవేఱు, పరమాత్మవేఱు, బ్రాహ్మణాది చాతుర్వర్ణములును వారివారివృత్తుల ననుసరించినవి. బ్రహ్మచర్యాది చతురాశ్రమములు ప్రతివానికిని గలవు. విగ్రహారాధనలు మొదలగునవియు జాతిభేదమును వేదసమ్మతముకాదు. హింసచేయకూడదు. ఇపుడీమతస్థులు క్రీస్తుమతమునందును తురకమతమందును మఱియు పంచము లను శుద్ధిసభయందు గలిగిన హిందువులను ప్రాయశ్చిత్తముచేసి, మరల ఆర్యమతమునఁ జేర్చుకొనుచున్నారు.

1. ఈ దయానంద సరస్వతీస్వాములవారి చరిత్రమంతయు దయానంద దిగ్విజయమునందు గనఁదగును. దయానంద సరస్వతీస్వాములవారు కాశిలో నొక విప్రశ్రేష్ఠునింటికి భిక్షకుపోఁగా నతఁడు మాంసాదులను పచనముచేసియుంచినం గని యిది చండాలభోజనము కదా యనఁగా, వారిది తంత్రశాస్త్రోక్త ప్రకారమని చెప్పినందున, అది నిషేధమని వార్తితో వాదించి ‹గోకరుణానిధి› యను గ్రంథమును రచియించిరి.

## థియాసఫి (దివ్యజ్ఞానమతము.)

‘థియసాఫికల్ సొసైటి’ అనఁగా దివ్యజ్ఞాన సమాజము, లేక అధ్యాత్మస
జము. ఈ సమాజము 1875-వ సంవత్సరమునందు న్యూయార్కులో స్థాపింపఁబడె
తర్వాత 1879-వ సంవత్సరమున మేడంబ్లావట్స్కియును, కర్నల్ ఆల్కాట్ గారు
బొంబాయి చేరి అచ్చట వీరి యభిప్రాయమును చెప్పఁగా నచ్చటి వారలకు రుచింప
పోయినందున మద్రాసుతో చేరిన అడయారులో నీ సమాజమును స్థాపించిరి. ఇప్పు
వేలకొలది థియసాఫికల్ సొసైటీ లేర్పడి యున్నవి.

మేడంబ్లావట్స్కి:—ఈమె రష్యాదేశములో గొప్పసంతతిలోఁబుట్టి గొప్పవా
ని నే పెండ్లాడెనుగాని యతఁడు శీఘ్రకాలమున మృతినొందెను తర్వాత యీమె
తన్ను తామఱచినట్లు పడియుండునట్టి వ్యాధియొకటి సంభవించెను. అట్టి సమయములో
హిందూదేశపురుషులతో అధ్యాత్మవిషయమైన ప్రశ్నలు జరిగినందున, ఆ బ్రహ్మవిద్య
ను బాగుగా నభ్యసింపఁ దలంచి 1885-వ సంవత్సరమున హిమవత్పర్వతమునందు
గురువుల నాశ్రయించి వారియెడల వేదాంతవిద్యను గ్రహించి వారియనుమతిమీ
అనఁగా మహాపురుషులయనుమతిమీద ఈ సమాజమును స్థాపించెను.

ఈ సమాజములో నేమతమువారైనను చేరవచ్చును. ఇందుకై సదరూపాయ
మొదట యీయవలయును. మఱియు ఈసమాజములోచేరినవారని కనుగొనుటకు కొన్ని
గుఱుతులను సాంకేతికపదములతో నేర్పుదురు. వీనిని ప్రాణావసానమందైనను ఇత
లకు తెలియఁజేయఁ గూడదని ప్రమాణము చేయించుకొందురు.

ఈ సమాజమున చేరునట్టి సభ్యులు వారివారి మిత్రుల ప్రోద్బలము ననుసరిం
యోగ్యతకొలఁది అంతర్యులనియు బాహ్యులనియు నిరుదెఱంగులుగా నుందురు.

ఈ మతసిద్ధాంతము లన్నియు ముఖ్యముగా సకలదేశ వేదాంతగ్రంథములలో
జెప్పియుండునవియేగాని వేఱుగాదు. అయినను, హిందూదేశములోని వేదా
గ్రంథములుకూడ బహుదేవతలను; బహుదేవతాఉపాసనలను జెప్పును థియసాఫికల్
సొసైటీవారు అట్టివానినంతయు నొప్పుకొనరు. పరబ్రహ్మ ప్రతిపాద్య గ్రంథముల
గైకొందురు. అయినను, ముఖ్యముగా బుద్ధుఁడు చెప్పినట్టి విషయము లన్నియు
వీరికిఁ బ్రమాణము.

దివ్యజ్ఞాన సమాజసిద్ధాంతము:—1. మనుజునియందు నాశరహితమయి శాశ్వ
మయిన వస్తువు ఆత్మయొక్కటి, పలువిధము లయిన తత్త్వములచేత చేయఁబ
ప్రకృతిసంబంధ మయిన దేహము నాశాస్పదమయినది. 2. ప్రపంచమంతయు

బ్రహ్మములోనుండి వికసించియుండుటం బట్టి అందలివస్తువులు, జీవరాసులు, ఆ పర బ్రహ్మసంబంధము కలిగి యున్నది. కావున ఒకరికి మనోవాక్కాయకర్మములవలన చెఱుపు చేసినను మేలు చేసినను ప్రపంచమందలి యెల్లమానవకోట్లకును ఆ చెఱుపుగాని మేలుగాని వ్యాపించును. అది కేవలము స్వల్పమయి యుండుటం బట్టి మన ప్రకృతి సంబంధ మయిన దృష్టికి అగోచరమయి యుండును 3. ప్రతిమనుజునియందు ఆత్మను తెలియునట్టి జ్ఞానేంద్రియము గూఢముగ నుండును. దానిని దేహమును జ్ఞానమును వృద్ధిపొందించులాగున వృద్ధి పొందింపనగును. 4. ప్రాపంచికవస్తువులయందు వైరాగ్యము గలిగి ఆత్మసంబంధ మయిన ప్రయత్నములయందు కృషిచేసినచో ఆ జ్ఞానము వృద్ధిపొందనగును. 5. ఈ లాగున క్రమక్రమముగా ఆత్మను తెలిసికొనుబుద్ధిని ప్రజ్వలింప చేసినవారు; మనము బాహ్యేంద్రియముల చేత ఈప్రాపంచిక వస్తువులను తెలిసికొనునంతటి స్పష్టముగా నిరాకార మయిన ఆ శరీరవిషయములను, అందలి అద్భుతక్రియలను, అంతరేంద్రియములచేత కనుగొనుచున్నారు. 6. అట్టికాలమందు ఆ పురుషుఁడు పామరజనులకు గోచరముగాని కొన్ని స్వాభావికము లయిన భూతముల తత్త్వములను యెఱిఁగినవాఁడై మనకు అద్భుతముగ నుండునట్టి కార్యములచే శక్తుఁడగును. అట్లు చేయునది వాస్తవముగ అద్భుతము. కను కట్టుకాదు. నిజ మయినదియే. ఆ భూతములయెఱుక లేమింజేసి మనము అట్టి కార్యములను చేయఁజాలక యున్నారము అను నీ మొదలగు విషయములను విచారించుటయును, వానిని అభ్యసించుటయును ఈ మతముయొక్క సిద్ధాంతమై యున్నది. ఇప్పుడీ మతము ఇగ్లండు మొదలగు దేశములందును హిందూదేశమునందును విశేషముగా వ్యాపించి యున్నది.

## బ్రాహ్మమతము.

ఈ మతమునకు కర్త రాజారామమోహనరాయ్ బహదర్‌గారు. వీరు క్రీస్తు పుట్టిన 1774 వ సంవత్సరమున భరద్వాజజిల్లాలోఁ జేరిన రాధానగరంబునందు బ్రాహ్మణకులమందు జన్మించిరి. వీరు బాల్యము మొదలు మతవిషయక గ్రంథశోధనము జేయుచుండిరి. అక్కాలంబున సహగమనము, మతకలహములు మొదలగునవి వ్యాపించియుండెను. వీరి తండ్రిగారు 1803-వ సంవత్సరమున గతించిరి. వీరు 16-వ సంవత్సరమునకుమీఁద పార్సి, అరబ్బి, గ్రీక్, హిబ్రు, సంస్కృతము, ఇంగ్లీషు మొదలగుభాషల నభ్యసించి, టిబేతుకుపోయి బుద్ధమతగ్రంథములను జూచిరి. 1830 సంవత్సరమున కలకత్తానగరమున బ్రహ్మసమాజమును స్థాపించి, విగ్రహారాధనము, జాతిభేదము మొదలగునవి వేదవిరోధ మని బోధించిరి. క్రీసుమత ఖండన గ్రంథము

లను కూడా ప్రచురపఱిచిరి. 1831-వ సంవత్సరమునందు రాజకీయవిషయము ఇంగ్లండునకు పోయి హూణులచే గౌరవింపంబడు చుండి 1833-వ సంవత్సరము ఇంగ్లండునందే తమ 61-యేట కాలధర్మము నొందిరి. ఆ మీఁద కొంతకాల బ్రహ్మసమాజము తెలిసి తెలియక యుండెను. దానిని మహర్షి దేవేంద్రనాథఠాకూ గారు పునరుద్ధారణము చేసిరి.

క్రీస్తుపుట్టిన 1818-వ సంవత్సరమునందు బ్రాహ్మణవంశస్థుఁడై కోటీశ్వ డైన బాబుద్వారకనాథఠాకురుగారికి దేవేంద్రనాథఠాకురుగారు జన్మించిరి. తమ 25-వ సంవత్సరమునందు బ్రహ్మసమాజమునందు చేరి, 1839-వ సంవత్సర నందు తత్త్వబోధిని సభను స్థాపించి తత్త్వవిషయవిచారము చేయు చుండి 1842-వ సంవత్సరమునందు బ్రహ్మసమాజవిషయబోధనకై పాఠశాల నొకటి స్థాపించిరి. మఱియు తత్త్వబోధిని యను పత్రికను ప్రకటించిరి. 1859-వ సంవ రమున తత్త్వబోధిని సభ మొదలగునవియు బ్రహ్మసమాజముతో చేరి పోయిన ఆ తర్వాత దేవేంద్రనాథఠాకురుగారును ఉపనయనాది సంస్కారములు పనికిరావ యనఁగా, కొందఱు వదలుకొని కేశవచంద్రసేనులవారి సాహాయ్యమున "పరమార్థ స్తికమత" మను వేఱొక సమాజమును స్థాపించుకొనిరి. ఆ మీఁద రాజానారాయ వసు మొదలగువారికి బ్రహ్మసమాజమును నొప్పగించి, దేవేంద్రనాథఠాకురుగా హిమాచలమునకు బోయి యోగియై కాలము గడపు చుండిరి. తర్వాత వీరికి మహ యను బిరుద మొసంగిరి. వీరికి తర్వాత కేశవచంద్రసేనులవారును బ్రహ్మసమాజ మునే యవలంబించిరి.

క్రీస్తుశకము 1838-వ సంవత్సరమునందు బాబుకేశవచంద్రసేనులవారు క కత్తానగరమం దొక వైద్యవంశమున జన్మించిరి. వీరి తండ్రిగారు వీరి చిన్ననయస్సు లోకాంతరు లగుటచే తాతగారిచే నాదరింపఁబడుచు తల్లిగారిచేఁ బెంపఁబడుచుండి చంద్రసేనులవారు మొదట నొక చిన్నబడియందు బంగాళీభాష నభ్యసించి, యే మిదవసంవత్సరము మొదలు ఆంగ్లేయభాష నభ్యసించుచుండిరి. ఆ కాలమున క్రై వమతగ్రంథమయిన బైబిలును చదివి, అప్పటినుండి ఏకేశ్వరారాధనమును మానసి ముగఁ జేయుచు, విగ్రహారాధనమును విసర్జించిరి 1855-వ సంవత్సరమున "భ్రాతృ భావప్రవర్ధకసమాజ" మను పేర కలకత్తాలో నొక సమాజము నేర్పఱిచి, ప్రార్థ యొక్క ముఖ్యతను గూర్చియు, ఇతరమతధర్మములను గూర్చియు నుపన్యాసము మూలముగ వారికి బోధించుచు వచ్చిరి. చంద్రసేనులవా రొకప్పుడు "బ్రహ్మసమా ముఖ్యసిద్ధాంతము" అను దానిని జూచి, అది తమసిద్ధాంతమునకు ... మే యన్న

యపరిమితానందభరితులయి, 1858-వ సంవత్సరమున బ్రహ్మసమాజమునఁ జేరఁగా, వారి మిత్రులును యీ సమాజమునఁ జేరిరి. కొంతకాల మయినతరువాత చంద్రసేనుల వారు (1) వర్ణభేదము లేకుండునట్లు చేయుటకును, (2) సామాజికు లొనర్చు ప్రతిమార్చనవిధులు మాన్పించుటకును, (3) స్త్రీపునర్వివాహము నెలకొల్పుటకును, (4) ఒక వర్ణమువారితో మఱియొకవర్ణమువారు వివాహములనుఁ జేసికొనుటకును ఆపదేశించి "సంగత సభ" యను పేర నొకసభ నేర్పఱిచిరి

ఇంతవఱకు వీరు యేసమాజము నేర్పఱచక మతధర్మములనుమాత్రము జనులకు బోధించుచు, 1866-వ సంవత్సరమున జాతి మతభేదములు లేక సర్వమతములవారును చేరియున్న యొకసభయం దీక్రింది విషయములను వారి యాలోచనకుఁ దెచ్చిరి. (1) భరతవర్ష బ్రహ్మసమాజ మను పేరిచే నొకసమాజము నేర్పఱచి, అందుమూలముగ సన్మతమును దేశమునందు వ్యాపింపఁజేయుట; (2) ఈ సమాజమునం జేరినవారేకమతావలంబకులుగ నుండుట; (3) స్త్రీపురుషభేదము లేక యీ సిద్ధాంతముల నంగీకరించు సకలజనుల నీసమాజమునఁ జేర్చుకొనఁబడుట; (4) తత్సంబంధము లయిన సత్యము లేమతగ్రంథములయం దుండినను వానిని గ్రహించుట; ఈ మొదలగునవి. అంత నాసామాజికు లీ విధుల కొడంబడి యొక సమాజముగా నేర్పడిరి. అప్పటి నుండియు ఠాకురుగారిసమాజము "ఆది బ్రహ్మసమాజ" మనియు, చంద్రసేనులవారి సమాజము "భరతవర్ష బ్రహ్మసమాజము" లేక "నవవిధానము" అనియు, పేర్కొనఁబడియున్నది. చంద్రసేనులవా రిట్లు తమ మతమును దేశమంతటను వ్యాపింపఁజేయుచు, ఠాకురుగారితో మిగులఁ గలిసిమెలసి సంచరించుచు, రామమోహనరాయలవలె నింగ్లండునకుఁ బోవ సమకట్టి 1871-వ సంవత్సరము నింగ్లండుజేరి, తమ మతమునుగూర్చి యుపన్యాసముల జేసి మరలిరి. చంద్రసేనులవా రింగ్లండునుండి తిరిగి వచ్చినప్పుడు, ఠాకురుగారు శాస్త్రవిరుద్ధముగా నింగ్లండునకుఁ బోయివచ్చి రనెడు సంకోచమును లేశమాత్రమును మనస్సునం దుంచుకొనక వారితోఁ గలిసిమెలసి యుండిరి.

అనంతరము 1882-వ సంవత్సరమున చంద్రసేనులవారు బ్రాహ్మమతస్థు లెట్లు తమ జీవయాత్రలఁ జేయవలయునో, ప్రాపంచికసుఖముల నెంతవఱ కనుభవింపవలయునో చూపుటకయి "నవసంహిత" యను పేర నొకగ్రంథమును చేసిరి. చంద్రసేనులవారు వ్యాధిగ్రస్తు లయి 1884-వ సంవత్సరమున దైవసాన్నిధ్యమును బొందిరి. వీరికి "బ్రహ్మానందు" లను బిరుదు నిచ్చిరి.

బ్రహ్మసమాజ సిద్ధాంతము:—ఈ మతమునందు బ్రహ్మమే సకల కారణకార్య కర్త. ఆతనిని విగ్రహముగాఁ జేసి పూజింపఁదగదు. జాతిభేదము లేదు. స్త్రీ పురుష

లిరువురును సమానధర్మము గలవారు. వితంతువివాహము చేయుట శాస్త్రసమ్మతమై కార్యము. ప్రకృతమున వారు వారించియుండు ఉపనయనము, చక్రాంకనము, లింగధారణాదులు వేదగర్హితములు; అను నీమొదలగునవి యీమతముయొక్క ము సిద్ధాంతము.

## లౌకైకమతము.

ఈ మతమునకు కర్త రామకృష్ణపరమహంసు లనువారు. వీరు బంగాళదేశము హుగ్లీజిల్లాలో చేరిన కమార్‌పుఖర్ (కర్మకారపుష్కరము) అనుచోట క్రీస్తుశకము 1833-న సంవత్సరమునందు క్షుధిరామచట్టోపాధ్యాయులను ఉత్తమబ్రాహ్మణునకు వారిధర్మపత్ని యైన చంద్రమణీదేవియందు అవతరించిరి.

వీరు బాల్యముమొదలు దైవభక్తి కలిగియుండినదేగాక, దక్షిణారామము నందలి కాళికాలయమునకు అర్చకు లైనదిమొదలు దేవీ వుపాసనచేసి ఆమెను ప్ర న్నము చేసికొనిరి. ఇదిగాక సకలమతములనిజమును కనుగొనిరి. ఇట్లుండగా యోగినివలనపాతంజలయోగశాస్త్రప్రకారముగా యోగాభ్యాసలక్షణములను తెలిసి కొని, తద్విధముగా నిర్వికల్పసమాధిస్థితిని సంపాదించుకొనిరి. ఆమీద తోతా యను మహాత్ములవలన వేదాంతరహస్యముల నెఱింగిరి. మఱి కొన్నాళ్లకు అనేకపుణ్య స్థలయాత్రలు చేసి మహాత్ములను సందర్శించిరి. వీరి బ్రహ్మనిష్ఠాసమాధిస్థితిని జూచి వారందఱును వీరు మహర్ష్యంశసంభూతులుగా నుందు రనియే భావించిరి. వీరికి కేశ చంద్రసేనులు వివేకానందులు మొదలగువా రనేకులు శిష్యులు కలరుకాని, వివేకా నందులవలె గురుకటాక్షమునకు పాత్రు లైనవారు వే ఱొక్కరును లేరు. ఈ రామ కృష్ణులు గ్రంథాదులను రచియింపకపోయినను, వీరు శిష్యుల కపుడపుడు బోధించి ఉపదేశవాక్యములు వేదవేదాంతార్థములను బోధించునవియును, అద్వైతసిద్ధిని కలుగ జేయునవియునై యున్నవి. ఈ మహానుభావులకు వివాహ మాయెనుగాని, ఆమె యుక్త వయస్సు వచ్చినమీఁద పుట్టినింటనుండి భర్తకడకు రాఁగా, వీరు ఆమెను తల్లిగా భావించిరి. అదిమొదలామెయు యోగిని యైనది. ఈ రామకృష్ణపరమహంసస్వామి క్రీస్తుశకము 1886-న సంవత్సరము బ్రహ్మైక్యము నొందిరి.

## వివేకానందులు.

శ్రీరామకృష్ణపరమహంసస్వామియొక్క మతము నుద్ధరించి, లోకమందు ప్రఖ్యాతి వహించిన శ్రీవివేకానందస్వాములు క్రీస్తుశకము 1863-న సంవత్సరమునందు కాయ

కులమునందు కలకత్తానగరమునం దవతరించిరి. తలిదండ్రులు లిడినట్టి మొదటి పేరు నరేంద్రనాథదత్తు. వీరు క్రమముగా విద్యాభివృద్ధి నొంది పట్టపరీక్షయందు ఉత్తీర్ణులైరి. బాల్యమునుండియే మతవిషయమునందు శ్రద్ధకలవా రగుటచే రామకృష్ణులు సేవచేసి అద్వైతమతసిద్ధాంత రహస్యముల నెల్లఁ దెలిసికొనిరి. ఇట్లుండఁగా 1893 - వ సంవత్సరమునందు అమెరికాలో జేరిన చికాగోనగరమునందు మతసంబంధమైన సభ చేర్పఁబడెను. అప్పుడు వివేకానందులవారు అచ్చటికిఁ బోయి హిందూమతమే శ్రేష్ఠమైనది యనియును, ఇది సరైనతత్త్వములను బోధించి ఫలము నొసంగఁ జేయునది యనియును ప్రసంగించిరి ఆ కాలము మొదలు ఆ దేశములయందు వీరి మతమును చాలాజను లవలంబించిరి. ఈ మహాత్ములు అమెరికా యిరోపా మొదలగు విదేశములలో నధిక గౌరవమును సంపాదించి కీర్తిని బొంది, 19 2 - వ సంవత్సరము జూలై నెల 4 - న తేది వారాసమీపమునం దుండు బెలూరునందు పరలోకయాత్ర జేసిరి. ఈ మతము ననుసరించి బేలూరు మొదలగు ప్రాంత్యములయందు అనేక మతములు స్థాపింపఁబడి యున్నవి. ఈమఠాధిపతులు అద్వైతప్రచారము చేయుచున్నారు.

## శాక్తేయమతము.

ఈ మతమును దేవీమతమనియుం జెప్పుదురు. ఈ దేవీసంప్రదాయము దక్షిణసంప్రదాయ మనియు, ఉత్తరసంప్రదాయ మనియు రెండు విధములు. ఉత్తరసంప్రదాయమును వామమార్గ మనియు, దీనిని అవలంబించువారు వామాచారు లనియుం జెప్పుదురు. దక్షిణసంప్రదాయస్థులు దేవీయుపాసన జేయుచు నీతిబాహ్యకార్యములను వదలి యుందురు. వామాచారులు చేయు కార్యము లెల్లను నీతికి దూరములై యుండును. ఈ మతమునకు రుద్రుఁడు కర్త. ఈ మతగ్రంథమునకు తంత్రశాస్త్ర మని పేరు. దీనినే వామతంత్ర మనియుం జెప్పుదురు. ఈ మతస్థులకు మద్య, మాంస, మత్స్య, ముద్రా, మైథునములను పంచ మకారములు భోగ మోక్షసాధనములు. ఈ మతస్థులు మద్యమును తీర్థ మనియు, మాంసమును శుద్ధమనియు, మద్యపానపాత్రమును పద్మ మనియు, ఉల్లిగడ్డను వ్యాసు లనియు, తెల్లగడ్డను శుకదేవు లనియు, మద్యపానము చేయువారిని దీక్షితు లనియు, వేశ్యాది చండాలస్త్రీలను ప్రయాగవాసిని, కాశీవాసిని యనియు, అత్యంతవ్యభిచారము చేయు స్త్రీని యోగిని యనియు, పూజాకాలమునందుండు అనేకదోషభూయిష్ఠమైన స్త్రీని ఉత్తమశక్తి యనియుఁ జెప్పుచున్నారు. మఱియు నీచజాతిరైయె భ్రష్టురాలైయుండు స్త్రీని దేవి యని భావించి పూజించెదరు. అట్టిది పానము చేసిన ఉచ్ఛిష్టమద్యమును పానము చేయుదురు. ఆ స్త్రీ అధికముగ

పానముచేసి వమనము చేసినయెడల దానిని భూమిలోఁ బడనీయక చేతులతోఁ దీ
ఆచార్యుఁడుసహితముగా పానము చేయుచున్నారు. అట్టి వమనమునకు భైరవా అ
పేరు. పైని చెప్పిన విషయము లన్నియు విస్తరముగ రుద్రయామళములోని దేవీరహ
స్యమునఁ గనందగును.

శ్లో. నటీ కాపాలినీ వేశ్యా రజనీ నాపితాంగనా
బ్రాహ్మణీ శూద్రకన్యాచ తథా గోపాలకన్యకా.
మాలాకారస్య కన్యాపి నవకన్యాః ప్రకీర్తితాః
ఏతాసు కాంచిదానీయ పూజాయేద్భక్తికాలనః.
విశేషవైదగ్ధ్యయుతాః సర్వాత్వైపి కులాంగనాః
రూపయౌవనసంపన్నా శీల సౌభాగ్యశాలినీ.
పూజనీయా ప్రయత్నేన తతః సిద్ధిర్భవేద్ధ్రువమ్
మహానిశాయా మానీయ నవకన్యాశ్చ భైరవాన్.
ఏకాదశ నవాష్టావా కాలికః కాలికేశ్వరీ
శోధయే న్నవభి ర్మన్త్రైః పూజయేత్ కాళికోత్తమైః.
తదీయం మంత్రమాలిఖ్య తస్మిన్నా మేన పూజయేత్
శ్రీచక్రస్థాపయే ద్వామే కన్యాం భైరవవల్లభామ్.
ముక్తకేశాం వీతలజ్జాం సర్వాభరణభూషితామ్
ఆనందలీనహృదయాం సౌందర్యాతి మనోహరామ్
శోధయే చ్ఛుద్ధిమంత్రేణ సురానందామృతాంబుధిః.

పైని చెప్పిన శ్లోకంబువలననే యీ మతముయొక్క లక్షణము వెల్లడి యగు
చున్నది. ఇట్టి నీచమైన యీ శాక్తేయసిద్ధాంతమును స్మార్త, వైష్ణవ బ్రాహ్మణులలో
కొంద ఱవలంబించి రహస్యముగ జరుపుచున్నారు. మఱియు వేద వేదాంతవిచక్షణు
లగు అవధూతలు సన్న్యాసులు మొదలగువారు ననుష్ఠించుచున్నా రని తెలిసెడిని.

శాక్తేయమత సిద్ధాంతము:—సమస్తమునకు శక్తి యాదికారణమై యున్నది.
త్రిమూర్తులను సృష్టించి రక్షించుటకు శక్తికే సమర్థత గలదు. జీవాత్మలు ఆదిశక్తి
యొక్క తేజస్సులై యున్నవైనను మాయకు లోనై దానికంటె తాము భిన్న మని
తలఁచు చున్నవి. జీవపదార్థములును నిర్జీవపదార్థములును పూర్వజన్మమునందు చేసిన
కర్మములకుఁ దగినట్టి యాత్మలను కలిగియున్నవి. కర్మము అనాదిరయై యున్నది. ఆత్మ
లు ఒకశరీరమునుండి మఱియొక శరీరమును పొందుచుండును గాని, మానవశరీరము
పొందినతరువాతనే ఆత్మలకు స్వర్గమును బొందుటగును. స్వర్గమును బొందుటకు

శక్తికి బదులుగా స్త్రీలను మానవులు పూజింపవలయును. స్త్రీలకు అసౌఖ్యము నిచ్చు దానిని చేయఁగూడదు. స్త్రీని పుష్పముతోనైనను కొట్టఁగూడదు. ఆమెయొక్క ప్రతియవయవమును శాక్తమతమునందు విధించినప్రకారము పూజించి, అన్నమును సారాయిని ఆమె కిచ్చి యామె భుజించినతరువాత యామెను భోగింపవలయును. అట్టి పూజ యీ లోకమునందును రాఁబోవులోకమునందును సుఖమును కలుగఁజేయును. స్త్రీలను విధిప్రకారము పూజించినందువలన ఆత్మలు స్వర్గలోకమునకుఁ బోవును. అచ్చట సుఖముకంటె భిన్నమైనపదార్థము లేదు. ఆ సుఖము స్త్రీసంభోగము, సంపూర్ణముగ కల్లు సారాయి త్రాగుట, వీనివలన కలుగు సుఖమునంటిదిగ నుండును. ఉపవాస ముండుటవలనఁగాని, స్నానము చేయుటవలనఁగాని, బలు లిచ్చుటవలనఁగాని, ప్రార్థనలు చేయుటవలనఁగాని, కర్మలు చేయుటవలనఁగాని, లేక శాక్తమతమునందు విధించినప్రకారముగా గాక యితరవిధముగా కల్లుత్రాగినఁగాని, ఆహారము భుజించినఁగాని, స్త్రీసంభోగము చేసినఁగాని ప్రయోజనము లేదు. ఈ మతమునందు విధింపఁబడినప్రకారము ఆదిశక్తిని పూజించు భక్తునికిని, లేక యోగికిని, తనతోఁ బుట్టువునుగాని, కుమార్తెనుగాని యిచ్చుటవలన పుణ్యము గలదు. అందము గల యువతులు పూజార్హులు.

పైన వివరించినప్రకారము శైవులలోను వైష్ణవులలోను నొకవిధ మైన వామాచారపరులు ఉన్నారు. ఇదివఱకు చెప్పినట్టి వామాచారసంప్రదాయకర్త రుద్రుఁడని (శివుఁడని) యెట్లు తలంచెదరో, అట్లే వైష్ణవమతమునందుఁగల వామమార్గమునకు కర్త విశిష్టాద్వైతమతప్రవర్తకు లైన శ్రీరామానుజులవారి సోదరీలైన కూచి, మాచి అనువారి వలనఁ గలిగిన దని కొందఱు భ్రమించెదరు. రామానుజులవారికి తోఁబుట్టువు లెవరును లేనేలేదు. పైని చెప్పినచొప్పుననే వీరిలోను దుష్పదార్థములకెల్లను దివ్యనామము లొసఁగఁబడి యున్నవి. మద్యమును సుజ్ఞానరస మనియు, మాంసమును మోక్షద్రవ్య మనియు నిట్లు వచించెదరు. ఇందును స్త్రీభోగము కలదు. ఈ దుష్టకార్యమునకు శరణాగతియని దివ్యనామము నొసంగియున్నారు. శిష్యుఁడు తనతొడపై తన భార్య యొక్క శిరస్సునుంచి పరుండఁబెట్టుకొనఁగా, ఆచార్యుఁడు సంభోగించునప్పుడు శిష్యవర్గమెల్ల మంత్రము నుచ్చరించుచుందురు. వీరును విశేషముగా సారాయిత్రాగి మాంసమును దిని దయ్యములవలె వర్తించుచుందురు. పైని చెప్పిన స్మార్తశైవవైష్ణవవామాచారు లిట్టి యసహ్యకార్యములను జేయుటకు సమ్మతిగొనియుండుట మిగుల విచారకరమై యున్నది.

## బౌద్ధమతము.

ఈ మతమును స్థాపించినవాఁడు బుద్ధుఁడు. ఇప్పటికి సుమారు రెండువేలయేను రేండ్లకు ముందు ఉత్తరకోసలదేశమున రోహిణీనదీతీరమందు కపిలవాస్తు వను నగరము ప్రసిద్ధిజెందియుండెను. ఆ దేశమును యిక్ష్వాకుసంతతియందు జేరిన గోతమవంశస్థులైన శాక్యు లనురాజులు పాలించుచుండిరి. ఇట్టి పరంపరయందు శుద్ధోదనుఁడనురాజు మిక్కిలి సద్ధర్మపరాయణుఁడై రాజ్యము నేలుచుండెను ఈ శుద్ధోదనునికి మాయాదేవి యనియును, గౌతమి యనియు నిర్వురు భార్యలుకలరు. మాయాదేవి గర్భమును ధరించెను.

ఇట్లు గర్భమును ధరించియుండిన మాయాదేవి నవమమాసమునందు పతియాజ్ఞం బొంది లంబిని యను ఉద్యానవనంబునకు సఖీజనులతోఁగూడి పోయి యొక పలాశ వృక్షముక్రింద విశ్రమించియుండఁగా, ప్రసవవేదన యేదియు లేక మాయాదేవియొక్క దక్షిణబాహువునుండి శిశువు వుదయమాయెను. అప్పు డా శిశువుయొక్క స్నానార్థము దివ్యతీర్థము ప్రవహించెను. ఇంతలో రాజు శిశు జనన శుభవృత్తాంతమును దెలిసి మహాసంతోషముగ నతివైభవముతోవచ్చి శిశుసహితయగు మాయాదేవిని నగరమునకు బిలిచికొనిపోయెను తర్వాత సకలవిధము లగు దానధర్మములను గావించెను అప్పుడు జ్యోతిష్కులు జాతకమును పరీక్షించి శుభఫలములను చెప్పందొడంగిరి. వారిలో దీర్ఘ దర్శియగు అసితఋషి ఆ శిశువుయొక్కచరణకమలములను తన కన్నులయందు నొత్తి కొని శుద్ధోదనునిం జూచి యి ట్లనియె. ఈ శిశువునకు దేవతాలక్షణములు ముప్పది రెండును, మనుష్యలక్షణములు యెనుబదియును గలవు. వీఁడు లోకమునంతయు పాలించురాజుగా నైనను, లేక నీవు మొదలుగా లోకమంతయు నుతింపఁదగిన మహా చార్యుఁడుగానైన నగుననియును జెప్పినదేగాక, తుషితలోకవాసి యైన ప్రభాపాలుఁ డిట్లు అవతరించియున్నాఁ డనియును, నేను ముసలివాఁడై చావునకు సిద్ధముగ నున్నాఁ డను కనుక నేను చెప్పినవిధమున ప్రకాశింపఁబోవు నీ కుమారునిఁ జూచు భాగ్యంబు నాకుఁ గలుగదు గాన నే నిప్పుడే స్తుతించి చనెద ననియును చెప్పి యిట్లు స్తుతించెను.

శ్లో॥ యస్త్యక్త్వా క్షితిపాలతాం ప్రియవధుం భోగాంశ్చ చిత్రాసనే
శీతోష్ణాది విసహ్య దుర్ఘటవనే సంతాపహేతుం నృణామ్,
పౌనర్జన్మరహస్యమీక్ష్య పరమం ధర్మం తథా స్థాపయత్
తం వందే నవమావతార మధునా బుద్ధం సుబద్ధాంజలిః.

ఆమీఁద శుద్ధోదనుఁడు అసితమహర్షికి వివిధోపచారములు చేసి పంపెను మాయాదేవి శిశువు జన్మించినయేడవనాఁడు పరమపద మొందెను. ఆ తర్వాత మహా

వియోగమైన శిశువునకు శుద్ధోదనుని రెండవభార్యయైన గౌతమి యను పేరుగల మహా ప్రజావతి కాపాడుచుండెను. శిశువునకు 'సర్వార్థసిద్ధి' యని నామకరణంబు చేసిరి. కొందఱు 'సిద్ధార్థి' యని పిలుచుచుండిరి. ఇట్లు సర్వార్థసిద్ధి శుక్లపక్షచంద్రునివలె వృద్ధి నొందుచుండెను. ఎనిమిదవయేట విశ్వామిత్రుఁ డను ఋషియొద్ద అతిత్వరితముగ సకలకళలను గ్రహించినవాఁడై ప్రకాశించు చుండెను.

ఇట్లుండఁగా వసంతకాలంబున సిద్ధార్థి యుద్యానవనంబున విహరించుచు, హిమపర్వతమునకుఁ బోవు హంసపక్షులను జూచి యానందించుచు నుండెను. ఆ పక్షులలో నొక్కదానిని తనమిత్రుఁడైన దేవదత్తుఁడు బాణముచేతఁ గొట్టెను. అది సిద్ధార్థియెదురఁ బడెను. దానినిజూచి మిగుల చింతనొంది కన్నీరు కార్చుచు రెక్కయందు నాటుకొనియుండిన అమ్మును పెఱికివైచి ఆ గాయమునకు మందుపెట్టి సేద దీర్చి నిమురుచుండఁగా, దేవదత్తుఁడు సిద్ధార్థియొద్దకు వచ్చి పక్షి నిమ్మనెను. సిద్ధార్థి యీయుటలేదని యాపక్షిని విడిచిపెట్టఁగా నది తన నెలవునకుం బోయెను. అది మొదలు సిద్ధార్థియొక్క పశ్చాత్తాప భూతదయాది సుగుణములకు లోకులెల్లరు మెచ్చుకొనుచుండిరి.

శుద్ధోదనునికుమారుఁడు, అసితఋషి చెప్పిన రెండువిషయములలో మొదటిదానియందు కుమారుని, ప్రబుద్ధునిగాఁ జేయవలయు నని యెంచినవాఁడై నందుచే సిద్ధార్థియొక్క పంద్రెండవయేట లోకసంపత్తిని చూచుటకై చారులను గొందఱం గూర్చి పంపించెను. అప్పుడు వసంతకాలమైనందున చెట్లన్నియు కాచి పూచియుండెను. నగరమెల్లయెడల వివాహాది శుభకార్యములు జరుగుచుండెను. వీనినంతయును చారులు సిద్ధార్థునకుం జూపుచు పిలిచికొనిపోవుచుండిరి. ఇట్లు చూచుచు ఆ యానందముతోఁ గూడ నెన్నియోసంకటములును మిళితమై యున్నవి యని కనుఁగొనెను. సేద్యము చేయువారిని జూచి వారియొక్క కష్ట సుఖము లిట్టివని యెంచెను. వనములయందు సంచరించినప్పుడు గొప్పజంతువులు చిన్నజంతువులను భక్షించుటను జూచెను. నదీతీరమున సంచరించుకాలమున చిన్నమత్స్యములు పెద్దమత్స్యముల కాహారమగుటను తెలిసికొనెను. ఇవన్నియు జూచి మనోవేదన యధికమై యేమియు దోఁచక కొన్నాళ్లు గడుపుచుండెను.

సిద్ధార్థునకు పదునెనిమిదేండ్లయినది. అట్టికాలమునను తదితర యావనవంతుల వలె శరీరాలంకారములను భోగకాంక్షయును లేక చింతాకులుడై యుండుటను శుద్ధోదనుఁ డెఱింగి అసితఋషియొక్క రెండవవాక్యమును జ్ఞప్తికిం దెచ్చుకొని ,యిప్పుడే వీనిని లౌకిక వ్యాపారమునం బ్రవర్తింప జేయవలయు నని యెంచి మంత్రులతో నాలోచించి లోహాదిబంధనములకుం గట్టుపడని !మనస్సు స్త్రీల భ్రూలతలచే కట్టు

నడు నని యెంచినవాఁడై తన భావమరఁది యైన సుప్రబుద్ధునిం బిలిచి తనకుమారునకు యశోధర నీయవలయు ననెను. అంత సుప్రబుద్ధుఁడు మనదేశాచారప్రకారము నీకుమారుఁడు విలువిద్యయందును గుఱ్ఱపుసవారియందును జయ మొందినచో నిచ్చెద ననెను.

ఆ సంగతిని శుద్ధోదనుఁడు తనకుమారునకుఁ జెప్పఁగా నతఁడంతయు సమ్మతించి సుప్రబుద్ధునియొక్కయు, పురజనులయొక్కయు మనస్సు రంజక మగునట్లు విలువిద్యయందును గుఱ్ఱపుసవారియందును జయ మొందెను. అనంతరము యశోధరకును సిద్ధార్థునకును వైభవముతో వివాహ మాయెను. ఈ యశోధర పూర్వజన్మమునందు వనసంచారిణి యైన తనమోహస్త్రీ యని సిద్ధార్థి ప్రజ్ఞాపారమితాప్రాప్తి యైన తర్వాత చెప్పి యున్నాఁడు.

అనంతరము శుద్ధోదనుఁడు తనకుమారుని యైహికసుఖములందే కాలము గడపునట్లు చేయవలయు నని యెంచి దేవేంద్రనగరమువలె నొకకోటను గట్టించి, దానిలో ననేకాద్భుతములతో నొప్పు శృంగారాంతఃపురముల ననేకముల నిర్మించి, యొక్కొకదానియందును అతిసుందరాకారులై జగన్మోహిను లనంబడునట్టి అవివాహితకన్యకల నుంచి, వారిచేతనే పుష్పములు కట్టి యిచ్చునట్లును, గంధ మలఁదునట్లును, పన్నీరు చల్లునట్లును, పాటలు పాడునట్లును, స్నానము చేయించునట్లును, ఇట్లు అనేకము లైన యిహసౌఖ్యవిధానము లన్నియును చేసి కుమారుని బయట రాకుండునట్లు ఆ కోటయందే యుంచెను. ఇట్లుండఁగా తాను అదిరాజై లోకమును రక్షించుటకుపాయ మాలోచించుచుండినవాఁ డైనందున నగరము చూడవలయు నను కోరికచే తండ్రియనుమతిమీఁద తనకు స్నేహితుఁడునుసారథియును నైన సంతకునిరథము నెక్కి యం దెక్కి నగరమును చూచుటకై బయలుదేరెను. కొన్నిస్థలములలో జయశబ్దములు నుండెను. మఱికొన్నిస్థలములకుఁ బోయి చూడఁగా వారు నారుచేయు మోసములు కనఁబడెను. అచ్చటచ్చట జరుగు అన్యాయములను తెలిసికొనెను. మఱియొకస్థలమున నొకశవమును శ్మశానమునకు తీసికొనిపోవుచు ప్రేతబంధువులు రోదనము చేయుచు గుంపుగా పోవు చుండిరి. దానిం జూచి సిద్ధార్థి, ఓ సంతకా! ఇదేమివింత. గుంపులు గూడి యేడ్చుచు దేనినో మోసికొని పోవుచున్నారే, దానిని చూతము రమ్మనఁగా, వాఁడు పోరాదనినను వినక, వానిని బలవంతిముగాఁ బిలిచికొని శ్మశానమునకు బోయెను. అచ్చట చితిపై శవము నుంచినదియు, వానికొడుకు యేడ్చుచు కొరవిపెట్టినదియు, కొంచెముసేపున నాశవము భస్మమైపోఁగా నా బూడిదట్లు నదిలో పడవైచినదియుఁ జూచి సిద్ధార్థి మనస్సుమిక్కిలి యట్లుతాపము నొంది 'ఇదేనా మన అంత్యము' అని చెప్పుచు సంతకునితోఁ గూడి తననగరునకు పోయెను.

ఆకాలంబునందు ఇతనికి కుమారుఁడు కలిగియున్నందున యశోధర మహా సంతోషముతో నుండెను. ఆ రాత్రియందు సిద్ధార్థి శృంగారాగారమును బోయి చూడఁగా, నొకచోట వీణియలఁమీటుచు నట్లే యొడలు తెలియక నిదురించువారును మఱి యొకచోట పుష్పములను గూర్చుటకై చేతపట్టినదార మొకప్రక్కయు పుష్పము లొకప్రక్కయును గాపరుండియుండువారును, వేఱొకచోటనొడలు దెలియకనిదపోవు వారునుగానుండిరి. ఇట్లుండిన కన్యలనుజూచిసిద్ధార్థి, అయ్యో! వీరు నిద్రపోనియెడల తమతమపనులయందు జాగ్రత్తతో నుందురుకదా! మఱియు మాయువరాజు వచ్చినాఁడని మర్యాద చేయుదురు; ఇప్పుడన్ననో తమస్థితినే మఱచియున్నారు. ఇట్లే తుదకు ప్రజ్ఞాహీనులగతి యని యెంచినవాఁడై లోకరక్షణోపాయమును చింతించుచు తనభార్యశయనించి యున్న మంచమున తానుపోయి పరుండెను గాని నిదుర రాలేదు.

అనంతరము సిద్ధార్థి లోకరక్షణమున కుపాయము నాలోచించు నాకు పత్నీ పుత్రాదులు శత్రువులు; వీనివలన సంసారసాగరోత్తరణముకాదు. యజ్ఞయాగాదుల చేతను కాదు. బహుదేవతోపాసనలచేతను కాదు. నిజమును కనుఁగొనవలయు నని చింతించి అంతఃపురమునుండి బయటవచ్చి లోకహితమును సత్యమును కనుఁగొన వలయు నని నిశ్చయించెను. ఇదే మహాభినిష్క్రమణము. ఇప్పు డీతనికి వయస్సు 29-వ సంవత్సరములు. తర్వాత తనప్రియుఁడైనట్టి సంతకుని కంటక మను గుఱ్ఱమును దెమ్మని, యాగుఱ్ఱమునధిష్ఠించి యరణ్యమార్గముగఁబోయి యరుణోదయమగు సమయమున గుఱ్ఱమునుండి దిగి, తన యాభరణములను ఖడ్గమును సంతకునిచేతి కిచ్చి దీని నంతయు నాతండ్రికిమ్ము; మఱియు "శ్రీమంతుఁకంటె పదిరెట్లధికకీర్తిగలవాఁడై వచ్చుదనుక నీకుమారుని మఱచి పొమ్ము" అని చెప్పు మనెను. అప్పుడు సంతకుఁడా మాటలను విని మిగుల దుఃఖించి యేమిచెప్పుటకును నోరాడక కన్నీరు కార్చుచుండఁగా సిద్ధార్థి, ఓయి సంతకా! నేను సంపాదింపనెంచినది చేఁగూడినచో నీకును అందు భాగము కలదనిచెప్పి వానిని సమాధానపఱచి తానొకదారింబట్టి పోయెను. సంతకుఁడు కన్నీరుకార్చుచు గుఱ్ఱమును చేతితోపట్టి నడిపించికొనుచుకపిలవాస్తుచేరి శుద్ధోదనునకు కుమారునివృత్తాంతం బంతయు దెల్పఁగా నాతఁడు స్వర్గమునుండి నరకములోఁ బడినంతటిదుఃఖమును బొందెను. యశోధరయొక్కవ్యసనమునకు మితియే లేదు. ఆ దినము మొదలు యశోధర యోగినివేషము ధరించి యుండెను.

సిద్ధార్థి యరణ్యమునంటిపోయి బింబసారునిరాజధానితోఁ జేరిన రత్నగిరియం దుండు పర్వతగుహలలో వసించి కందమూలములచే కొన్నిసమయములయందును, ధర్మాత్ములిచ్చు భిక్షాన్నముచే కొన్నిసమయములయందును, క్షుద్బాధానివృత్తి చేసి

కొనుచు, ఎండ గాలి వాన అను నీవిచారములేక తదేకమనస్కుండై ధ్యానము చేయుచుండెను. ఒక్కొక్కప్పుడు ధ్యానమును విడిచి జీవజంతువులయొక్కయు క్రూరవ్యా ములయొక్కయు స్థితినిచూచి విచారించుచుండును. మఱికొందఱు యోగులతో సహవాసము చేసెను. ఆ యోగులు వారివారికిఁ దోఁచినదానిని చెప్పిరి. వారికి సిద్ధా సమ్మతమగు నుత్తరములను జెప్పి వారివలన సత్యధర్మమార్గ మగపడదని యెంచి మఱల తపస్సు చేయుచుండెను.

ఇట్లుండఁగా, మేకలమందను గొల్లవాండ్రు మధ్యాహ్నమునం దెండలో తోలుకొనిపోవుచుండిరి. సిద్ధార్థి ఆ గొల్లలనుం జూచి, అయ్యలారా! మీ రిన్నాళ్లు సాయంకాలము తోలుకొనిపోవుచుంటిరికదా! నేఁడేల యెండలో తోలుకొనిపోవుచున్నారనఁగా నాగొల్లలు స్వామీ బింబసారుఁడు యజ్ఞము చేయుచున్నాఁడు, దా నిమిత్తము తోలుకొనిపోవుచున్నా మనఁగా, సిద్ధార్థి భూతదయాళువుగాన అయ్యో ఇన్ని మేకలను హింసించి వీరేమి పుణ్యము సంపాదింతురు, పాపము లభించు నను జ్ఞానము లేకున్నది కదా, లోకము నుద్ధరించుటకు మార్గము నెవ్వఁడును కనిపెట్టకున్నాఁ యని చింతించుచు ఆ మేకలవెంబడిగ పోవుచుండెను.

ఇట్లు పోవుచుండఁగా నాటి మొదటిదినము ఉదయమున నొకస్త్రీ తన బిడ్డను రత్నగిరిచరియయం దొకచెట్టుక్రిందవిడిచిపెట్టి తాను కట్టెల నేర్పఱుచుకొనుచుండఁగా నాబిడ్డను పాము కఱచెను. ఆ స్త్రీ యచ్చోటనున్న ఋషులను తనబిడ్డను బ్రతుకునట్లు చేయవలయు నని వేడుకొనియెను. వారు సిద్ధార్థుఁ డున్నచోటు గనపఱచఁగా నాస్త్రీ సిద్ధార్థునికాళ్లపైఁబడి రోదనముచేయఁగా, తల్లీ! నీవు వ్యసనపడకుము, నీ బిడ్డను బ్రతికించుటకు మిరియములు కొన్ని కావలయును. ఆ మిరియము లిచ్చువారియొక్క వంశమునందు మరణము సంభవించియుండక యుండవలయునని చెప్పఁగా, నాస్త్రీ తనబిడ్డను భుజముపై మోసికొని బింబసారునిరాజధాని యైన రాజగృహమునకుం బోయి మిరియము లడుగఁగా కొందఱు తమవంశమునం దనేకులు గతించియున్నా రనిరి. కొన్ని యిండ్లలో చచ్చినవారినిగూర్చి దుఃఖించుచుండిరి. కొందఱు తమవారు మృతులైనందున కటుకుపైనుంచుటకు సమ్మతింపక రోదనము చేయుచుండిరి. కావున మిరియములు దొరకక సిద్ధార్థునియొద్దకు వచ్చుచుండఁగా, దారియందు మేకపిల్లను మోసికొనిపోవు నతనిం జూచి యెచ్చోటను మిరియములు దొరకలే దనెను. అప్పు డామెను జూచి అమ్మా! లోకములో జీవులగతియంతయు నిట్లేయున్నది. ఈమేకలను గొల్లలు చంపుట కిట్లు తీసికొనిపోవుచున్నారో, అట్లే విధి మనలను తోలుకొని పోవుచుండును. నీ బిడ్డను సంస్కారముచేయుమని చెప్పఁగా నాస్త్రీ సిద్ధార్థియొక్క వాక్యములను విని జ్ఞానము గలదై పాశబద్ధమునుండి వీడి తనదారిం బోయెను.

తర్వాత రాజగృహమునకుం జని యాగశాలయొద్దకుఁబోగా నచ్చట మేకలను చంపిన దుర్గంధము పట్టరానిదై యుండెను. వానిరక్తము ప్రవాహముగ గనంబడెను. అధ్వర్యుడు, ఉద్గాతృలు, హోతలు గుమిగూడి యుండినదేగాక, అనేకవేలబ్రాహ్మణులు నుండిరి అప్పుడు యూపస్తంభమున కొన్నిమేకలను గట్టి చంపుటకు ప్రయత్నించిరి ఆ క్షణమున సిద్ధార్థి యాగదీక్ష వహించిన బింబసారునిం జూచి, రాజా! మేకలను జంపవల దని చెప్పుమని యెలుగెత్తిచెప్పెను. అంత బింబసారుఁడు యాగము విఘ్నమైనదే యని తలంచినవాఁడై యిట్లు చెప్పినవాఁ డెవఁడని తిరిగి చూచెను. అట్లే అందఱును చూచిరి, భూతదయాదిసుగుణములే యాకారముగాఁ గలిగిన తేజోమూర్తియగు సిద్ధార్థినిం జూచి నిశ్చేష్టితులై యుండఁగా బింబసారునితో సిద్ధార్థి యిట్లనియె.

ఓ రాజా! లోకములో సకలజంతువులకును ప్రాణమునకంటె ప్రియతమము వేఱొద్దియును లేదు. నిరపరాధజంతువులను చంపుటవలన ప్రయోజన మేమి? ఈ పాపముతప్ప వేఱొద్దియు లభింపదు. పిచ్చివానివలె నీవు రాజై యుండి యీ కార్యమునకుఁ బూనుట ధర్మమా యని పలువిధము లగు హితములను బోధింపఁగా, బింబసారుఁడు వారి యుపదేశమును సదా వినుచుండవలయు నని గోరి తనదగ్గర నుండునట్లు వేడుకొనినదే గాక, నాకు సంతానము లేదు గాన యీ రాజ్యమును నీవు రేలుచుండు డనియుఁ జెప్పెను. అంత సిద్ధార్థి, రాజభోగము లనుభవించియైనది; అయినను నీకోరిక ప్రకారము నేను నిజమునుకనుగొని మరల నీయొద్దకువచ్చెదనని చెప్పి బయలుదేరిపోయెను. బింబసారుఁ డదిమొదలు జీవహింస చేయఁగూడ దని తనరాజ్యములో చాటించెను.

తర్వాత సిద్ధార్థి మగధదేశమున గయాసమీపస్థలమున నైరంజర (ఫల్గుని) నదీతీరమునందు బోధివృక్షము (రావిచెట్టు) క్రింద వీరాసనస్థుఁడై నిమీలితలోచనుండై తూర్పుముఖముగా నిశ్చలచిత్తుఁడై కూర్చుండి బహుకాలము తపస్సు చేయుచుండెను. దినము లెన్నిగడచినదియు తెలియక యొక్కొక్కప్పుడు 7-8 దినములదాక సమాధినుండి కన్నులు తెఱచిచూడక సత్యవిచారమున తదేకధ్యానపరుఁడై యుండెను. మఱియొక సమయమున సిద్ధార్థి మూర్ఛపోయి పడియుండఁగా బలుఁ డను గొల్లవానికూఁతురు సుజాత యనునది తనకు సత్పుత్రసంతానము కల్గినచో నా యడవిలో నుండు వనదేవతకు పంచామృత మర్పించెద నని ప్రార్థించుకొనెను అట్లే సుజాతకు సత్సంతానము కలిగినందున పంచామృతమును బంగారుగిన్నెయం దుంచికొని చెలికత్తెతోఁ గూడి యావనమునకు వచ్చెను. ఇట్లురాగ తపముచే తేజోమయుఁడై ప్రకాశించు సిద్ధార్థినిం జూచి యీతఁడే వనదేవతయనితలంచి పంచామృతము నెదురుగనుంచి నమస్కరింపఁగా నాతఁడు దానిని భక్షించి యామెనుం జూచి దీని నేల నాకర్పించితి వనఁగా, నాకు

పుత్రసంతానము కలిగినచో వనదేవతకు పంచామృత మర్పించెద నని ప్రార్థన జే
కొంటిని; నా ప్రార్థన ఫలిత మైనందున నేడు వనదేవతవైన నీకు పంచామృత మర్పి
చితి ననఁగా, సిద్ధార్థి, తల్లీ! నేను వనదేవతగాను, నేను నీ వర్పించిన యన్నమువలన తృ
నొందితిని. భగవంతుఁడు మీకు మేలు చేయునని చెప్పి యామెను దీవించెను. సుజా
సంతోషము నొంది తన యింటికిం బోయెను. మఱియు నెప్పటియట్ల బోధివృక్ష
క్రిందుగ తపస్సు చేయుచుండెను. ఆరాత్రి సకలప్రాణులును తమతమ వైరమును మ
యుండెను. లోకులందఱు నుత్సాహముతో నుండిరి దేవతలందఱు తృప్తి నొంది
తమోగుణయుక్తుఁ డైన మారుఁడు సిద్ధార్థియొక్క దివ్యగుణములను జూచి యోర్వ
తనదూత లైన కామాదులతోఁ గూడ సిద్ధార్థిని పీడింపఁగా నతఁడు చలింపక ధీరుఁడై
యుండెను. అప్పుడు మారుఁడు నిరాశుడై తనదారిని పోయెను మఱియు నారాత్రి
సిద్ధార్థి బుద్ధత్వమును, అభిజ్ఞను, దుఃఖసత్యజ్ఞానమును బొందెను. ఇట్లుండఁగా, కపి
వాస్తునగరమున శుద్ధోదనుఁడు పుత్రశోకమునందు మునిఁగియుండెను. యశోధరకు గ
మనోవ్యథ చెప్ప తరము కానిదై యుండెను. అపుడు సిద్ధార్థికుమారుఁ డైన రాహ
లుఁడు యేఁడేండ్లవయస్సు గలవాఁడై యుండెను.

ఇట్లు సిద్ధార్థి బోధివృక్షముక్రింద తపస్సుచేసి బుద్ధాది దివ్యనామములను జ్ఞా
లాభమును బడసి అచ్చటచ్చట వసించుచు అచ్చోటికి వచ్చువారలకు జ్ఞానమార్గము
బోధించుచు అనేకశిష్యమండలితో కపిలవాస్తునగరమునకు వచ్చెను. ఇట్లు బుద్ధుఁడు
కాశ్యప, అశ్వజిత్ మొదలుగాఁ గల శిష్యులతోఁ గూడి పాదచారియై రాఁగా నితఁడు
బోడియై పసుపుకావివస్త్రమునుధరించి మట్టితోఁ జేయఁబడిన భిక్షాపాత్రను చేతఁబూ
జాతిభేద మెంచక భిక్షాన్నమును గ్రహించుచు వచ్చుచున్నాఁడని శుద్ధోదనుఁడు వి
వానియొక్క తేజోరూపములను జూచి వెఱగంది పుత్రవాంఛచేత, నీ విట్లు జా
భేదము లేక కన్నవారింటియన్నము తినవచ్చునా యనఁగా, సిద్ధార్థి, నాయనా! ఇ
మా వంశాచార మనియెను. అప్పుడు శుద్ధోదనుఁడు నూతనతరములుగ కులభ్రష్టత్వ
గాక వచ్చిన మనకులమున నిట్లెవ్వరు వర్తించిరనఁగా, బుద్ధుఁడు తండ్రీ! ప్రతియుగమ
నందును తత్త్వప్రకటన గావించుటకై యవతరించు ప్రతిబుద్ధునియొక్కయు కులాచా
మిది యని చెప్పినదే గాక, నే నింతకాలము ఆఁకలిదప్పులకును శీతోష్ణములకు నో
సంపాదించిన నిధిని సమర్పించుటకువచ్చితినన, శుద్ధోదనుఁడు "ఏమినిధి" యనఁగా
నొప్పెద నని చెప్పుట కుపక్రమింపఁగా, బుద్ధుని యెడమప్రక్క యశోధరయు కుమా
రుఁడును, కుడిప్రక్క తండ్రియును, తక్కిన బంధుమిత్రాదు లెదురుగను కూర్చుం
యుండిరి.

తత్త్వాభిలాషులారా! లోకములోని దేవతాంతరభజనము ప్రయోజనము నొసంగదు. ప్రకృతియను స్వభావశక్తి వలన సమస్తజీవరాసు లుదయించి లయ మొందు చుండును, సూర్యచంద్రనక్షత్రములాదిగాఁగల వన్నియు ప్రకృతియొక్క అవి ర్భావములై యున్నవి. పృథివ్యాదిభూతములన్నియు దానియొక్క ఆధీనము. శీతోష్ణ ములు. నదీప్రవాహములు, జననమరణములు, వీని నన్నిటిని నెవ్వరిచేతను అడ్డగించు టకు కానేరదు. కాఁబట్టి ప్రకృతిబుద్ధుఁడైన నరుఁడు పశ్చాత్తాపము. భూతదయ, పరిశుద్ధత, సత్యము, నీతి మొదలగు సుగుణములతోఁ గూడినవాఁడై యుండెనేని ఉత్తమజన్మములను పొందుచు, తుదకు శాశ్వతమైన నిర్వాణమును బొందును. ఇట్టి ముక్తిని బడయుటయే నిధి యనెను. అప్పుడు శుద్ధోదనుఁడు మొదలగువా రందఱును జనన మరణ సంసారరూప సాగరము నుండి బుద్ధని నాగమృతనావికవలన నుద్ధరిం పఁబడినవారైరి. అంత యశోధర తనకుమారుని బుద్ధునికాళ్లపైఁ బడవైచి వీనికి నీ వా ర్రాజ్యాధిపత్యము నొసంగు మని చెప్పి తానును యోగినియై ఐహికసుఖమును తుచ్ఛ మని తలంచెను. ఆతర్వాత బుద్ధుఁ డనేకస్థలములకు అనేకవేల శిష్యులతోఁ గూడ బోయి తన మతమును బోధించు చుండెను. (బుద్ధునిచరిత్రమును సమగ్రపముగాఁ దెలి యఁగోరువారు నాచే రచియింపఁ బడిన బుద్ధచరిత్రను జూడఁదగును.)

బౌద్ధమతసిద్ధాంతము:—«సర్వం క్షణికం క్షణికం దుఃఖం దుఃఖం స్వలక్ష ణం స్వలక్షణం శూన్యం శూన్యమ్" అని ఈప్రకారముగా నాల్గువిధములయిన భావ నలు, మొదటిభావన:—«సర్వం క్షణికం క్షణికమ్" నీలము మొదలయినవి క్షణిక ములు. ఎందుకనఁగా, సత్త్వముండుటవలన ఏది సత్తుగా నున్నదో అది క్షణికముగా నుండవలయును. ఇందులకు మేఘపటలము దృష్టాంతము. అనఁగా ఈదృశ్య మగు ప్రపంచ మంతయు మేఘపటలమువలె క్షణికముగా నుండును. ఈ లోకములో సమస్త పదార్థములును నశ్వర మగును. అనఁగా రూపభేదముచే మాఱుననుట. మంచుగడ్డ దృశ్యము; అది వేఱురూపముతో నీరగును; నీరయింకి సూక్ష్మమైన ఆవిరిగా మారును; ఇంకను సూక్ష్మమైనయెడల ఆకాశరూపమై తుదకు ఆత్మస్వరూపమును పొందును. కాఁబట్టి క్షణిక మని చెప్పఁబడెను. రెండవభావన:—«సర్వం దుఃఖం దుఃఖమ్" అనఁగా సమస్తమును దుఃఖస్వరూప మని భావము. దుఃఖస్వరూపము కానియెడల సర్వజనులును దీని నివర్తికై నిత్యమెందులకు పాటుపడుదురు? కాఁబట్టి సర్వము దుఃఖ మనుట యుక్తమే దీనికి దృష్టాంతము లేదు. కావుననే మూడవభావనయందు «సర్వం స్వలక్షణం స్వలక్షణమ్" అని చెప్పఁబడెను. నాల్గవభావన:—సమస్తమును అస్థిరత్వ ముగాన «సర్వం శూన్యం శూన్యమ్" అని చెప్పఁబడినది. దీని ముఖ్యతాత్పర్య మేమనఁగా, సత్తు, అసత్తు, సదసత్తు, అనుభయము, అను ఈ నాలుగువిధములు గాని శూన్యస్వరూపయే తత్త్వము.

మఱియు స్థితియే బాధ. బాధకు కారణము కామము. కామము నణఁచుటవలన బాధ నివారణ మగును. దానినణఁచుటకు మార్గము జ్ఞానము. ఈ జ్ఞానమును సంపాదించుటకు మానవుఁడు క్రమమైన భక్తికిని, క్రమమైన యభిప్రాయమును, క్రమమైన మాటను, క్రమమైన సిద్ధాంతమును, ఆహారసంపాదనమునకు క్రమమైన సాధనమును, క్రమమైన యత్నమును, క్రమమైన జ్ఞాపకమును, క్రమమైన ధ్యానమును అభ్యాసము చేయవలయును.

ఆచారములు:—జీవహింస చేయరాదు, మధుపానము చేయకూడదు, వ్యభిచారము చేయకూడదు, చల్దితినకూడదు, వాసనద్రవ్యాదులును పువ్వులును ధరింపగూడదు, తల్లిదండ్రులను భార్యాపుత్త్రాదులను భరింపవలయును. అబద్ధములు అక్రమములు లేని వ్యాపారము చేయవలయును. సన్న్యాసు లగు భిక్షుకులు గ్రామాదులలో విశేషముగ సంచరింపక విహారమంటపములలో సంచరింపవలయును.

ఈ బౌద్ధులు మాధ్యమికు లనియు, యోగాచారు లనియు, సౌత్రాంతికులనియు వైభాషికు లనియు నాలుగు తెగలుగా నున్నారు. మాధ్యమికులు సర్వశూన్యత్వవాదమును, యోగాచారులు బాహ్యశూన్యత్వవాదమును, సౌత్రాంతికులు బాహ్యార్థానుమేయత్వవాదమును, వైభాషికులు బాహ్యార్థప్రత్యక్షత్వవాదమును చేయుదురు.

## మాధ్యమికమతము.

ఈ మతము బుద్ధునిశిష్యుఁడైన మాధ్యమికునిచే స్థాపింపఁబడినది. ఈ మతమును శూన్యవాదిమతమనియుఁ జెప్పఁబడును. ఈ మతమునందు సర్వమును శూన్యము. శూన్యమే పరమతత్త్వము. ఆత్మ నిరంశము. కావున ఆత్మకు ప్రకాశమును అప్రకాశరూపము నుండునట్లు చెప్పఁగూడదు, ఆకాశప్రకాశముయొక్క నొకఅంశము ప్రకాశరూపముగను, మఱియొక అంశము అప్రకాశరూపముగ నుండునట్లు, నిరంశమైన ఆత్మయందు రెండురూపములు చెప్పుట సరికాదు. కావున రెండురూపములను చెప్పవలసినప్పుడు ఆత్మకు అంశము లుండునట్లు సిద్ధించుచున్నది. అంశములతోఁ గూడిన ఘటాదిపదార్థములు వుత్పత్తినాశములతోఁ గూడియున్నవి. ఇట్లు ఆత్మ అంశసహితమైనచో ఆత్మను ఉత్పత్తినాశములతోఁ గూడినట్లు ఒప్పుకొనవలయును ఉత్పత్తినాశములతోఁ గూడిన పదార్థము ఉత్పత్తికి పూర్వమునందును నాశనమునకు ఉత్తరమందును అసత్తైయున్నది. ఆద్యంతములయందు అసత్తై యుండు పదార్థము మధ్యమందును అసత్తయ్యే యుండును. కావున ఆత్మ అసద్రూపము. ఇట్లే ఆత్మకు భిన్నమైన సకలపదార్థములును ఉత్పత్తినాశములతోఁ గూడి యుండుటవలన అసద్రూపములే

యున్నవి. ఈవిధముగ ఆత్మ అనాత్మము లైన సకలపదార్థములు అసద్రూపములై యుండుటను బట్టి శూన్యమే పరతత్త్వము.

అనఁగా, సర్వమును ఈషత్కాల ముండునది గనుక ఏదియును జ్ఞానము నిచ్చుటకు సాధనమైన పదార్థము గా దనియును, అన్నియును ఐట్టియూహ యనియును, ఈ యూహ లన్నియు అంతము నొందినపుడు శూన్యరూపక మైన అంత్యనాశనము కలుగు ననియును, పునర్జన్మము బాధకం బె వేరకా దనియును సిద్ధాంతము.

## యోగాచారమతము.

ఈ మతము బుద్ధునిశిష్యుఁ డైన యోగాచారుఁ డనువానిచే స్థాపింపఁబడినది. ఈ మతస్థులకు క్షణికవిజ్ఞానవాదిమత మనియును పేరు గలదు. ఈ మతస్థులసిద్ధాంత మెట్లనఁగా.—మనోవ్యాపారము బుద్ధికి అధీనమైయున్నది. బుద్ధియొక్కఆకారమే మన స్సనఁబడును. కావున క్షణికవిజ్ఞానరూపబుద్ధియే ఆత్మ. మనస్సు ఆత్మకాదు. సకలపదార్థములును విజ్ఞానాకారములై యున్నవి. ఆ విజ్ఞానము ప్రకాశరూపము. ప్రతిక్షణమునందును విజ్ఞానముకల్గి నాశ మగుచున్నది. ప్రథమవిజ్ఞానమునకు సమాన మైన మఱియొక విజ్ఞానము కలుగుటవలన ప్రథమవిజ్ఞానము నష్ట మగుచున్నది. ఇట్లే తృతీయవిజ్ఞానముయొక్క ఉత్పత్తి ద్వితీయవిజ్ఞానముయొక్క నాశము. చతుర్థ విజ్ఞానోత్పత్తి తృతీయవిజ్ఞానమునకు నాశము. ఇట్లు నదీప్రవాహమువలె విజ్ఞానధార యున్నది. ఈ విజ్ఞానధార రెండువిధములై యున్నవి.

ఒకటి ఆలయవిజ్ఞానధార, మఱియొకటి ప్రవృత్తివిజ్ఞానధార నేను నేను అను విజ్ఞానధారకు ఆలయవిజ్ఞానధార యనియును, బుద్ధి యనియును పేరు. ఇది ఘటము, ఇది శరీరము, అను విజ్ఞానధారకు ప్రవృత్తివిజ్ఞానధార యని పేరు. ఆలయవిజ్ఞానధారచేత ప్రవృత్తివిజ్ఞానధార కలుగుచున్నది. మనస్సుయొక్కస్వరూపము ప్రవృత్తి విజ్ఞానధారయం దున్నది. కావున ఆలయవిజ్ఞానధారారూపబుద్ధి కార్యమై యున్నది. ఈబుద్ధియే ఆత్మ యనఁబడును. ఆలయవిజ్ఞానధారయందు ప్రవృత్తిజ్ఞానధార లయ మగుటవలన నిర్విశేషక్షణికవిజ్ఞానధార కలుగును. ఇట్టి నిర్విశేషక్షణికవిజ్ఞానధారా స్థితియే మోక్షమనఁబడును. ఇవ్విధముగా విజ్ఞానవాదులు బుద్ధిని క్షణికరూపముగాను, స్వయంప్రకాశరూపముగాను భావించి, దీనినే ఆత్మ యని చెప్పుదురు. అయినను, బాహ్యపదార్థములు, శూన్య మని యొప్పుకొనినను లోపలిపదార్థమును శూన్య మని యొప్పుకొనరు అనఁగా, మనస్సంబంధ మైన యద్భుతములు నిరాధారము లైన వని యనరు. జ్ఞానము దానియొక్కమాత్ర మనియును, తనంతట తానే పోషించుకొనునది

యనియును, స్వయముగా ప్రకాశించునది యనియును తెలిసికొనుటయే జ్ఞానమనియును, జ్ఞానమువలన నిరాకరింపఁబడునదేదియును లేదనియును, జ్ఞానమునకు మించిన తెలివి వేఱొకటి లేదనియును, కర్తయైన తెలివికిని కర్మమైన తెలివికిని నడుమనుండెడి మాయ రెండుతెగని యాలోచనవలన నశించు ననియును జెప్పుదురు.

## సౌత్రాంతిక మతము.

ఈ మతము బుద్ధుని శిష్యులలో నొకఁడైన సౌత్రాంతికునిచే స్థాపింపఁబడినది. బాహ్యప్రపంచము లేదనువాదము నిస్సారమైనదనియును, దృశ్యమగుచుండు బాహ్యప్రపంచ మున్నదనియును, అది యూహవలన కలుగు అనుమానసమయములందు ఒక కాలము మొదలు మఱియొక కాలమునకు వుండునది కాదనియును, సౌత్రాంతిక మతసిద్ధాంతము.

## వైభాషికమతము.

ఈ మతము బుద్ధుని శిష్యపరంపరలోఁ జేరిన విభాషికునివలన స్థాపింపఁబడినది. సౌత్రాంతికులయభిప్రాయములలోఁ గొన్నిఁటిని వైభాషికులొప్పుకొను చున్నారు. బాహ్యపదార్థము లూహింపఁదగినవే యనుట యసంగతమనియు, పదార్థములు ఇంద్రియములచే గ్రహింపఁదగినవి కొన్నిగాను మనస్సుచే గ్రహింపఁదగినవి కొన్నిగాను వున్ననియు, ఇంద్రియములచే గ్రహింపఁబడినవానిని నిరూపించుటకు ఇదే శ్రేష్ఠమైన పద్ధతి యనియు వైభాషికులసిద్ధాంతము.

ప్రకృతమున ఈబౌద్ధమతము ఎన్నిభేదములతోఁ గూడియుండినను ప్రపంచములోని అన్నిమతములకంటెను విశేషముగా సకలదేశములందును వ్యాపించి యుండు మతము బౌద్ధమతమే. ఈ బౌద్ధులు ఆర్యమతస్థులయొక్క త్రిమూర్తులను పూజించు చున్నారు. చీనాదేశమున నిప్పటికిని త్రిమూర్తుల నారాధించుచున్నారు. మఱియు సయాం, బర్మా, మొదలగు బౌద్ధమతరాజులు బ్రాహ్మణులను మిగుల గౌరవించు చున్నారు. ఆర్యమతపురాణగ్రంథములయందును బుద్ధప్రశంస గలదు.

## జైనమతము.

ఈ మతమును బుద్ధమతముతోఁ దుల్యముగా నుండును. అయిన నిది బుద్ధమతమునకంటె పూర్వమునందు స్థాపింపఁబడినది.

లోకము:—లోకము అనాదిగా నున్నది. ఎప్పుడును నాశమొందదు. ఈలోకమును దేవుఁడుమొదలగు వారిచే సృజింపఁబడలేదు. స్వతస్సిద్ధముగా నున్నది. మఱియు ఊర్ధ్వలోకము, మధ్యలోకము, అధోలోకము అని మూఁడువిధములుగ నున్నది. ఈ లోకమునకు దిగువ నరకలోకము లేడును, భవనలోకములు పదియును; దానికి మీఁద ఈ మర్త్యలోకమును గలదు. ఈ మర్త్యలోకమునకుమీఁద జ్యోతిర్లోకమును, వియంతరలోకమును, దానికిమీఁద దేవలోకములు పదునాఱును, దానికిమీఁద దేవాధిపతులలోకము లెనుబదియొకటియును, దానికిమీఁద పరాత్పరవస్తువుండు నిర్వాణలోకమును గలదు.

కాలము:—కాలము అనిత్యమైనందుచే శాశ్వతముగా కాలము జరుగుచున్నది. కాలము ఉత్సర్పిణి, అవసర్పిణియని రెండువిధములుగ నుండును. వృద్ధికాలము ఉత్సర్పిణియనఁబడును; క్షీణకాలము అవసర్పిణి యనఁబడును. ఇప్పుడు జరుగుచుండుకాలము అవసర్పిణికాలము గాన జనుల కాయుఃక్షీణము మొదలగునవి కలుగును. ఉత్సర్పిణి, అవసర్పిణి అను నీరెండుకాలములును ముగిసినచో నొకయుగ మగును. జరిగిపోయిన ఉత్సర్పిణికాలమున పదునల్వురు మనువు లుదయించిరి. పదునాలుగవ మనువుపేరు నాభిమహారాజు. అతనికాలమున విజ్ఞానము అధికరించినది గాన ఇతఁడే బ్రహ్మదేవుఁడు, ఇతని భార్య మరుదేవి. వీరికాలమున వృషభతీర్థకరు లవతరించిరి. వృషభతీర్థకరులకు తర్వాత అజిత, శాంభవ, అభినందన, సుమతి, పద్మప్రభు, సుపార్శ్వ, చంద్రప్రభు, పుష్పదంత, శీతల, శ్రేయస, వసుపూజ్య, విమల, అనంతధర్మ, శాంతి, కుంధ, ఆరా, మాలి, మానసువ్రత, నామి, నేమి, పార్శ్వ, వర్ధమానస్వామి అను ఇరువదిమువ్వురు తీర్థకరులు (జైనస్వాములు) నవతరించిరి వృషభతీర్థకరులతో 24 గురు.

ఇప్పుడు జరుగుచుండు నవసర్పిణికాలమునందు నిర్వాణ, సాగర, మహాంత, విమలప్రభు, శ్రద్ధారా, సుదంత, అమలప్రభు, ఉదార, అంగిర, సుమతి, సింధు, కుసుమంజరి, శివగంగ, ఉత్సాహ, జ్ఞానేశ్వర, పరమేశ్వర, విమలేశ్వర, యశోధర, గురుసదా, జ్ఞానమూర్తి, సిద్ధమతి, శ్రీభద్ర, అతిరిక్త, శాంతి, అను ఇరువదినల్వురు తీర్థకరులు అవతరించియున్నారు.

ఇఁకను మహాపద్మ, చరదేవ, సుపార్శ్వ, స్వయంప్రభు, సదాత్మబుద్ధి, దేవబుద్ధ, కులశాత్రి, ఉదనక, కురుత్స, జయకీర్తి, మానసువ్రత, హర, నిభ, నిశ్చాస్య, విమలక, నిర్మల, చిత్రగుప్త, సమాధిగుప్త, స్వయంభు, అనువంలిక, జయ, విమల, దేవబల, అనంతవీర్య, అను ఇరువదినల్వురు తీర్థకరులు అవతరింపఁగలరు.

ఈ అవసర్పిణికాలముయొక్క మొదటితీర్థకారులు 8400000 సంవత్సరములు జీవించియుండిరి. వీరికి తర్వాత అవతరించినవారు మొదటివారికంటె కొంచెము తక్కు

వగా జీవించియుండిరి. ఇట్లే క్రమముగా ఆయువు తగ్గెను. ఈ తీర్థకరులు త్రికాలజ్ఞానులుగను, గురూపదేశము లేనివారుగను, దేవతలచేఁ జేయఁబడిన అయిదుమంగళములను పొందినవారుగను, మోక్షసుఖము నిచ్చువారుగను అవతరింతురు.

వేదములు:—పండ్రెండు వేదములు గలవు. ఇవియును బ్రాహ్మణుల వేదములవలె గ్రంథములయందు వ్రాయక అధ్యయనము చేయఁబడుచుండును. బ్రాహ్మణుల వేదములవలెనే వీరివేదమును యిప్పుడు సంపూర్తిగ దొరకదు

ముఖ్యగ్రంథములు:—మహాపురాణము, త్రిలోకసారము, పదార్థసారము, రత్నకరండము, ధర్మపరీక్ష, చింతామణి, మేరుమందిరపురాణము, నీలకేశివాదము, నయచక్రము, ధవళము, విజయధవళము, మహాధవళము, సుబోధిని మొదలగునవి.

దేవుఁడు:—ఈ మతస్థుల దేవునిపేరు జినదేవుఁడు. ఈదేవుఁడును వేదము, లోకము, కాలము, ప్రాణులు, కర్మము, వీనివలె అనాదిగ నుండును. ఈ దేవునకు కర్మములు 148యును లేవు. మఱియు అద్యంతరహితుఁడు అశోకవృక్షముక్రిందుగ నుండి మూఁడుధర్మచక్రములను గలిగినవాఁడు. నాలుగుముఖములు గలవాఁడు. ఒకదానినుండి మఱియొకదానిని కలుగఁజేయుట మొదలగు గుణములు లేనివాఁడునై యున్నాఁడు. అనఁగా స్వయంనిర్మాత.

ఈ జైనమతస్థులకు అర్హదేవుఁడు శ్రేష్ఠుఁడైనను, విష్ణువు మొదలగు దేవతలు అర్హదేవనిభక్తు లని యెంచి పూజించుచున్నారు, కొందఱు జాతిభేదము కలిగియున్నారు. ప్రకృతమున నీదేశమున జైనులు 14 లక్షలజను లున్నారు. వీరు గణేశపూజయు చేయు చున్నారు.

జైనసిద్ధాంతము:—ఈ సిద్ధాంతము నవలంబించువారు జైనులు. వీరు సమస్తము క్షణకాలముండునదియే యను బౌద్ధసిద్ధాంతము నంగీకరింపరు. ఆ సిద్ధాంతము అనుభవమునకు విరుద్ధమని చెప్పుచు బౌద్ధులు చెప్పునట్లుగా ప్రత్యక్షముగాఁ గనఁబడు పదార్థము లేకుండుటయు, పదార్థముండుచోట ప్రత్యక్షము లేకుండుటయు నిజ మగునేని ప్రాపంచికచర్య లన్నియు అంతమును పొందవలయు నని చెప్పుదురు.

మఱియు (1) ఈ ప్రపంచమును తన యిచ్ఛానుసారముగా సృజించిన సృష్టికర్త లేడు. (2) ఆత్మయును పదార్థములును ఆద్యంతములు లేనివి. (3) తెలివి ఆత్మలకన్నిఁటికి సహజము. (4) జీవులలో కొందఱు ప్రాపంచికులుగాను కొందఱు ప్రపంచమును త్యజించినవారుగా నున్నారు. ప్రాపంచికులు ఒకజన్మమునుండి మఱియొకజన్మ మెత్తుచుందురు. ప్రపంచమును త్యజించినవారలు జన్మరహితులు గాన సర్వకర్మపరిత్యాగము చేయుదురు. ఇట్లు పరిత్యాగము చేసిన జీవాత్మ ప్రపంచమును విడిచిపోవును. లేక, కొందఱు తలఁచునట్లు ... యిచ్చునుగాని కలుగఁజేయని

ప్రపంచమునకుఁ బోవును. (5) క్రమమైనబుద్ధియు క్రమమైనజ్ఞానమును క్రమమైనధర్మమును కలిగినవానికి జన్మరాహిత్యము కలుఁగును. (6) అంతరాయములు లేనట్టులైన సర్వవిషయములను తెలిసికొనగోరును. కనుక ఆ జ్ఞానసంపాదమునకు అంతరాయములు తగ్గినట్టులైన ఆత్మ సర్వదర్శియగును. క్రమమైనబుద్ధి,క్రమమైనజ్ఞానము,క్రమమైనధర్మము, ఈ మూఁడింటివలనను అంతరాయములు తగ్గిపోవును నింద్యమైనపనులను మానుటయే క్రమమైన ధర్మము. కష్టములన్నింటిని ఓర్పుతో సహించుటయే క్రమమైన జ్ఞానము. కష్టములనుగురించి జైనుఁడు చెప్పినదానిని అంగీకరించుట క్రమమైనబుద్ధి. తప్పులు, ఇచ్ఛలు మొదలగువానిని నశింపజేసుకొనిన ఆత్మ సర్వదర్శియయిన జైనుఁడగును. అట్టి జైనులు ఒకరితరువాత ఒకరు సర్వదా వచ్చుచుందురు ఈ జైనులద్వారా నేర్చుకొనుటవలనను వారిగ్రంథములను విశ్వసించుటవలనను మానవులు క్రమ మయినబుద్ధిని క్రమమయినజ్ఞానమును క్రమమయినధర్మమును పొందుదురు వీరుసంపూర్ణత్వము నొప్పుకొనరు గాన ఈ మతావలంబకులకు స్యాద్వాదవేదు లని పేరు. పదార్థము కలదా యని వారిని యడిగిన ఒకవిధముగానున్నదని వారు చెప్పుదురు. పదార్థములేదని యెవరుగాని చెప్పిన ఒకవిధముగ- లేదని వారొప్పుకొందురు ఇందువలన పదార్థముయొక్కయు ఆత్మయొక్కయు స్థితినిగురించి చెప్పినవిషయ మేదియైనను ఒకవిధముగ సత్యమైనది. ఎట్లనఁగా, రూపమునుబట్టి విచారింపఁగా పదార్థమునకు ఉనికి లేదు. మనకు దృశ్యముగు పదార్థములయొక్క వివిధపరమాణువులనుబట్టి విచారింపఁగా పదార్థమునకు వునికి గలదు. నిదర్శన మెట్లన, ఘటము శాశ్వతపదార్థము కాదు, దానిని ఘటాకారముగ చేసిన పరమాణువులు శాశ్వతములు.

ఈ మతమున శ్వేతాంబరు లనియు దిగంబరు లనియు నిరుతెగలవారు గలరు. శ్వేతాంబరులు భిక్షువలన జీవింతురు. సన్న్యాసులందఱును ముండనము గావించుకొందురు. ఓర్పు గలిగి యుందురు. ఏకాంతముగ నుండఁగోరుదురు. స్త్రీలు జ్ఞానాధికులని చెప్పుదురు. దిగంబరులు దాత యింటివాఁకిట నిలుచుండియే నీటినిగాని అన్నమును గాని చేతితోఁదీసికొని యట్లే పుచ్చుకొందురు. గృహస్థులకును, స్త్రీలకును, మృగములకును, దేవతలకును, పావులకును మోక్షము దొరకదు. దిగంబరమతస్థులు తమ దేవునికి వస్త్రమును ధరింపఁజేయరు. ఉత్సర్పిణికాలమునం దందఱికిని మోక్షము కలుగును. తక్కినసిద్ధాంతము లిరుతెగలవారికిని సమములై యున్నవి.

ఈభూమియందు ముగురు తక్కువగా తొమ్మిదికోట్లమునులున్నారు. మానుషీక ఆత్మయైనది నిత్యసిద్ధాత్మయనియును, ముక్తిమత్త్వాత్మ యనియును, బంధాత్మ యనియును మూఁడువిధములుగానుండును. సరియైన ధర్మమును, సరియైనజ్ఞానమును గలిగిన చో నిర్వాణము లభించును.

ఆచారాదులు:—జీవహింసచేయకుండుట, అబద్ధ మాడకుండుట. ఇతరులద్రవ్యము నభిలషింపకుండుట, హత్యచేయకుండుట, పరస్త్రీల గోరకుండుట, మత్తుద్రవ్యములను సేవింపకుండుట, స్త్రీ ధన పశు గృహారామములను అధికముగాఁగోరకుండుట, రాత్రికాలములయందు భుజింపకుండుట, (అట్లుభుజించినచో దీపము కావలయును. గాన ఆ దీపమునందు పురుగులు మొదలగునవి పడిచచ్చును). జలమున పురుగులుండును గాన శోధించి గ్రహించుట, ఈ మొదలగునవి ముఖ్యములు.

సన్న్యాసులు త్రోవ నడుచునపుడు మార్గమున కాలియడుగున ప్రాణులు చచ్చునుగాన నెమలియీఁకలకట్టను చేతనుంచుకొని మార్గమును వూడ్చుకొనుచు నడిచి పోదురు తలలో పేలుమొదలగునవి పట్టకుండుటకై ముండనముచేసికొందురు. గుడ్డలలో చీరపేలుపట్టకుండుటకై కరక్కాయనీటిలో బట్ట లుదుకుదురు.

మఱియు అత్తి, మఱ్ఱి, రావి, రేగు, పొల్ల, సాగ, అగు వీనికాయలును; తెల్లగడ్డ, ఉల్లిగడ్డ, గంజా, అభిని, ఇంగువ, ముల్లంగి, మత్స్యమాంసములు మొదలగునవియును భక్షింపరు.

ప్రస్తుతమున జైనులు పశ్చిమహిందూస్థానమునందు విశేషముగ నున్నారు. మఱియు కాంచీపురము, రాజమహేంద్రనగరము, శ్రీరంగపట్టణము, రత్నగిరి, కాశి, గయ, ఢిల్లి, పాట్నా, కొల్లాపురము, ఉజ్జయిని, గూడలూరు మొదలగు స్థలములలో నున్నారు.

## అర్హతమతము.

ఈ మతము, పాట్నానగరమ్మునందు యుధిష్ఠిరశకము 1445-వ సంవత్సరమునందు జన్మించిన అర్హతునివలన స్థాపింపఁబడినది. ఇతఁడు జైనమతమును ఖండించినవాఁడు.

అర్హ దేవతాలక్షణము:—శ్లో. "సర్వజ్ఞో వీతరాగాది. దోష స్త్రైలోక్యపూజితః యథాస్థితార్థ వాదీచ దేవోర్హన్పరమేశ్వరః" అనఁగా, పరమేశ్వరుఁడైన అర్హదేవుఁడు సర్వజ్ఞుఁడనియును, రాగాదిదోషములు లేనివాఁడనియును, మూఁడులోకములయందును గొనియాడఁబడువాఁడనియును, ఎల్లపుడును సత్యమును బోధించువాఁడనియును భావము.

పదార్థసప్తకము:—ఈ మతమున పదార్థములు ఏడువిధములు; జీవము; అజీవము, ఆస్రవము, సంవరము, నిర్జరము, బంధము, మోక్షము అని యేడువిధములు. వీనిలో జీవాజీవపదార్థములు రెండును ప్రధానములు. 1 జీవ మనఁగా, భోక్తయైన

జీవుఁడు. 2 అజీవమనఁగా, జీవుఁ డనుభవించుటకుఁ దగిన భోగ్యవస్తువులు. 3 ఆస్రవ మనఁగా, శబ్దాదివిషయములనుగుఱించి శ్రోత్రాదీంద్రియములు పోవుట. 4 సంవర మనఁగా, ఇంద్రియవ్యాపారమును దొలఁగింపఁ దగిన యమనియమాదులు. 5 నిర్జర మనఁగా, పాపపరిహారకమైన తప్తశిలారోహణాది కాయశుద్ధులు. 6 బంధ మనఁగా, కర్మ. 7 మోక్ష మనఁగా కర్మపాపనాశమైన సత్త్వలోకాకాశమును ప్రవేశించి సదా ఊర్ధ్వగమనము కలిగి యుండుట. ఈ సప్తపదార్థములయందు ప్రధానమైన జీవాజీవపదార్థములలో అవాంతరభేదములు చాలా గలవు. (అవి యంతయు చరిత్ర చింతామణియందు గనందగును.)

అర్హతమతసిద్ధాంతము:—1 సమ్యగ్దర్శనము; అనఁగా, అర్హతునిచేఁ జెప్పఁబడిన తత్త్వార్థములయందు నమ్మకము నుంచవలయును. 2 సమ్యక్జ్ఞానము; అనఁగా, జీవాదిపదార్థములయందు మోహము లేక యుండవలయును. 3 సమ్యక్చరిత్ర; అనఁగా, పాతకములను గలుగఁజేయు కర్మలను పరిత్యజింపవలయును.

ఈ మతసన్న్యాసులు భిక్షాశనులై, పాణిపాత్రులై, రక్తవస్త్రధారులై యున్నారు. కొందఱు శ్వేతవస్త్రమును ధరింతురు అనఁగా శ్వేతాంబరమతస్థులు శ్వేతవస్త్రమును, దిగంబరులు రక్తవస్త్రమును ధరింతురు. ఈ యిరుతెగల సన్న్యాసులును తమ తలలోనివెండ్రుకలను పెరికివేయుదురు కత్తితో క్షౌరము చేసికొనరు. తక్కిన సిద్ధాంతము లన్నియును చాలవఱకు జైనసిద్ధాంతము ననుసరించి యుండును.

## పారసీకమతము.

ఈ మతమును జరథుస్త్ర అనువారు స్థాపించిరి. కాఁబట్టి యీ మతమును జరథుస్త్రమత మనియుం జెప్పంబడును. జరథుస్త్ర అనఁగా ఋషి యని అర్థము.

ఈ జరథుస్త్ర అనువారికాలనిర్ణయమును పలువురు పలువిధముగఁ జెప్పుచున్నారు. ఎట్లన, 3512 సంవత్సరములకు ముందు పాక్టేరియా, పల్గు అను నగరముల యందు జన్మించినవా రని కొందఱును, క్రీస్తువునకు 400 సంవత్సరములకు ముందు జన్మించినట్లు ప్లేటోగారును, క్రీస్తువునకు 1300 సంవత్సరములకు ముందు జన్మించినట్లు అరిస్టాటల్ అనువారును చెప్పుచున్నారు. క్రీస్తువునకు 2000 సంవత్సరములకు ముందున్నవా రని యనేకులు చెప్పుచున్నారు. మఱియు వీరుగతించి యిప్పటికి 3534 సంవత్సరము లైన దని చెప్పుచున్నారు. * ఈ జరథుస్త్ర అనువారు బాల్యమునందే ఆర్యగ్రంథములైన వేదపురాణ జ్యోతిషాది సకలవేదవేదాంగములను అభ్యసించి, జెండ్ అను భాషలో తమ సిద్ధాంతమును రచియించి వ్యాపింపఁజేసిరి. జెండ్ భాషలో వేదమునకు అవేస్తా అని పేరు.

* అనఁగా, ఈగ్రంథమును వ్రాసినకాలమున కని గ్రహించునది.

పారసీక (జరథుస్త్ర) మతసిద్ధాంతము:—అవేస్తాయను వేదమునందు, ఆర్యుల వలె స్వరయుక్తమైన గానముతోఁ గూడిన నక్షత్రాదిదేవతలస్తుతు లున్నవి. ప్రస్తుతము న యీమతస్థులు బందీహిష్ఠ అను గ్రంథము ననుసరించి ప్రవర్తించెదరు. ఈ అవేస్తా వేదమునందు ఆర్యవేదమువలె నొకచోట అద్వైతమును, మఱియొకచోట ద్వైతమును ప్రశంసింపఁబడియున్నది. అయినను ప్రధానదేవుఁ డొక్కఁడు. ఆయనకు సకల కర్తృత్వమును గలదు. అతనికి జరాన ఆహూరాజ్ఞ అని నామము. అతఁడీలోకమును సృష్టించి, అహరిమ (అంధకారము) అను ఉపదేవుని సృజించి వానిని అజ్ఞానము అబద్ధము మొదలగు దుర్గుణములకు అధినాయకునిగాఁ జేసి, అహరిమచేయు దుష్కార్యములను బోఁగొట్టుటకు ఆర్మసడ్ అను ప్రభాకరుని సృజించినంత, వారిరువురును ౩౦౦౦ సంవత్సరములు యుద్ధముచేసిరి తుదకు ఆర్మసడ్ జయించెను. కావున జనులు అజ్ఞానాది దుష్కార్యములను బోఁగొట్టుకొనుటకును, ముక్తిని బడయుటకును ఆర్మసడ్డును స్తుతించినచో లభించును అట్టివారికి భూలోకమే స్వర్గలోక మగును. మృతి నొందినవారు ౩-౧ దినము దేవునియొద్దకి బోదురు. మృతశరీరములను కాకులకు గ్రద్దలకు వేయుట పుణ్యము.

మిత్ర అను దేవుఁడు ఆదిశగవంతునకును మనుష్యులకును మధ్యవర్తిగా నున్నాఁడు. ప్రవాసిస్ అను దేవదూతలు గలరు. సూసి అను దీర్ఘదర్శి లోకమున నవతరించిన మీఁద క్షేమము లభించును. ఆర్మసడ్ అను దేవునికి వాసస్థానము సూర్యుఁడు, అగ్ని, నక్షత్రములు గాన వానిని ధ్యానింపవలయును. నీతివిషయము లన్నియు విశేషముగ హిందూపద్ధతి ననుసరించియే యున్నది. ఇదివఱకుఁ జెప్పిన విషయములు అథర్వణవేదములోఁ జెప్పియుండు 'ఆసురం రుద్రమజమ్' మొదలగు శ్రుతివాక్యములు పారసీకభాషయందు అపభ్రంశమై ఆహూరాజ్ఞ అనియైనదనియును, అజశబ్దమే జరాన యైనదనియును, పాప పుణ్య దేవతలయుద్ధమే దేవాసురయుద్ధమనియును. అగ్నిని పూజించునప్పుడు శివ్ అని యొక ప్రమానిగూటమునుంచి పూజించెదరు గాన. అది శివాకృతి యైన లింగచిహ్న మనియును, సూర్యునియందు త్రిమూర్తిత్వ ముండుటచేత సూర్యుని యారాదించెద రనియును, ఋగ్వేదము ప్రథమాష్టక ప్రథమాధ్యాయములో "అగ్నిమీళే పురోహితం యజ్ఞస్య దేవమృత్విజం హోతారంరత్నధాతమం, అగ్నిః పూర్వేభి ఋషిభి రీఢ్యో నూతనై రుత సదేవాం ఏహవక్ష్యతి". అను నీ సూత్రములు అగ్నియొక్క మహిమను పొగడుచున్నందున, అగ్నిని ఆరాధించెదరనియును, ఆర్యులకును ప్రథమారాధన అగ్నియేయై యుండినదనియును ఆర్యులు చెప్పుచున్నారు. పారసీకులు తమ మతగురువులను సాస్కర్యంతో అని చెప్పుదురు. సాస్కర్యంతో అనఁగా అగ్నిహోత్రు లని యర్థము.

ప్రపంచసృష్టిక్రమము:—ఆదియందు దేవుఁడు వరుసగా ఆకాశమును, భూమిని, పర్వతములను, సూర్యచంద్రాగ్నినక్షత్రములను సృష్టించెను. ఆ తర్వాత 12000 సంవత్సరమున కందమూలములను సృష్టించెను. అనంతరము గేయోమార్డ్ న్ అను ఆదిమనుష్యుఁ డుత్పత్తికాఁగా వానిని జంపి పాతిపెట్టఁగా, ఆచోటనుండి యొకవృషభము పుట్టి దానికడుపులోనుండి పనుగురుపురుషులును పదుగురుస్త్రీలును పుట్టిరి. వారిలో మెజికియా, మెజికినా, అను ఆదితలిదండ్రులుపుట్టి మేకపాలుఁత్రాగి వారును వారికి పుట్టినట్టి సయమాక్ విచికాక్ అనువారిరువురును పాపులైరి. కాఁబట్టియే లోకు లందఱును పాపులై పోయిరి. ఈ లోకము తోఁక గల నక్షత్రమువలన నాశ మొందును.

## గ్రీకుమతము.

ఈ మతము బహుకాలముక్రిందట వ్యాప్తమై యుండెను. ఈ మతస్థులకు ఆదిదేవత లనియు, కవులదేవత లనియు, తత్త్వజ్ఞానదేవత లనియు మూఁడుతరగతుల దేవతలు గలరు. ఈదేవతలలో శ్రేష్ఠమైన ఆదిదేవత జ్యూసు అనఁబడును. ఈ జ్యూసు లోకమునకు ట్టి యేడ్చినవాఁడనియును ప్రధానుఁ డనియును చెప్పుదురు ఇతని స్థానము ఒలింపస్ అను పర్వతశిఖరము. మఱియు ననేకదేవతలను ఆరాధించెదరు ఈ దేవతలకును యుద్ధము కలదు. ఈ దేవతలలో యురాందీస్ అను దేవతలు మొదటితరగతిగాను, తితాన్స్ దేవతలు రెండవతరగతిగాను, ఒలింపస్ పర్వతములయందలి దేవతలు మూఁడవ తరగతిగాను నున్నారు.

ఆదియందు సమష్టిరూపమైన భూతములే గయా అను భూదేవి యైనది. అందుండి తార్తారస్ అను చీఁకటిదేవత కలిగినది. తర్వాత ఇరోస్ అను ప్రియదేవతయు, అమీఁద ఇథర్ అను దినదేవతయు పుట్టెను. ఈ దేవతలవలన యురానోస్ అను మోక్షలోకములు గలిగెను. తర్వాత గయాదేవతయు, యురానస్ దేవతయు సంగమించి సముద్రములను, కోయేస్, క్రియోస్, యాస్, హైపెరియన్, లేపిటస్, రియా మొదలగు దేవతలను ఉత్పత్తి చేసిరి.

ఒలింపస్ పర్వతములయందు దేవతలలో జియస్, పోసిడన్, హిర్, హెస్త్యా డెమిటర్ అను దేవతలు క్రోనస్ అను దేవతయొక్క పుత్రులు. అపోలో, ఆర్టిమిస్, హెఫాస్టోస్, ఆరెస్, హెర్మిస్, అథెని, అను దేవతలు జ్యూస్ దేవతయొక్క పుత్రులు.

కవులదేవతలు:—గ్రీకులు కవిశ్రేష్ఠులుగాన హిసైడ్, హోమర్, అఖిలస్, సొఫోఖిలస్, యురిపిడెస్ అను కవులు అందమైన పురుషులను, స్త్రీలను, కందమూల

క్రిమికీటాదులను దేవతలుగఁ భావించి శ్లాఘించిరి. వీరు జియూస్ ఉరుముదేవతగాను, నెప్ట్యూన్ సముద్రదేవతగాను, అపోలో సూర్యునిగాను, ఆర్టిమిస్ చంద్రునిగాను భావించి వీరి విగ్రహములను చేసి పూజించిరి.

తత్త్వజ్ఞానులదేవతలు:—క్రీస్తుపుట్టిన 610 సంవత్సరములయందుండిన థేల్సు అను నతఁడు జలమే దేవత యనియును; అనాక్సిమెన్సు అనునతఁడు వాయువే దేవుఁడనియును; హెరిక్లిటుసు అను నతఁడు అగ్నియే దేవుఁ డనియును; ఫిథగోరస్ అను నతఁడు దేవుఁ డొక్కఁడేయనియును; జెనోఫానెస్ అను నతఁడు దేవుఁ డొక్కఁడే సర్వవ్యాప్తియై యున్నాఁ డనియును; పార్మెండిస్ అనునతఁడు ప్రసిద్ధమైన తలంపే దేవుఁ డనియును; ఇంపెడోక్లెస్ అను నతఁడు జీవాత్మ పరమాత్మలు వేఱు వేఱనియును; గార్గియస్, అబ్డిరెట్, ప్రొతగోరస్, ప్రాడికస్, క్రిటియస్ మొదలగువారు దేవుఁడు లే దనియును; సాటాయికల్ అనువారు పరమాత్మయే ప్రపంచ మనియును; ప్లేటో అనువారు జీవాత్మపరమాత్మలు వేఱువే అనియును; అరిస్టాటల్ అనువారు దేవుఁ డొక్కఁడే యైనను అవికారరూప మైన వస్తువై యున్న దనియును చెప్పిరి. సాక్రెటెస్, అనువారు పరమాత్మ జీవాత్మలను నమ్మి సత్యమునకై ప్రాణముల నిప్పించిరి.

గ్రీకులు గుడికిపోవునపుడు స్నానము చేసి పోవుదురు. వారియొక్క ఆరాధనము చాలవఱకు హిందువులవంటిదిగా నుండును గ్రీకుదేశములో పూజారులును గురువులును ప్రత్యేకముగా నొకజాతివారుగా నుండక, బుద్ధిశాలురును,, ఉద్యోగస్థులును దేవతలను పూజించుటకు స్వతంత్రము కలిగి యుందురు వీరు దేవతలకు పశువులను మేకలను చంపి ఆనెత్తురును విగ్రహములకు పూయుదురు. కొన్నిసమయములయందు గంధపుష్పాదుల తోడను, కందమూలములతోడను పూజానివేదనములు చేయుదురు. మిగుల ఘోషముగ ప్రార్థన చేయుదురు.

## రోమకమతము.

రోమకులు గ్రీక్ మతము ననుసరించి తమమతమును స్థాపించిరి వీరిసిద్ధాంతము నందు జానస్ అను దేవుఁడు సృష్టికర్త. వీరిచేతనే సంవత్సరము ప్రారంభ మైనది జనవరినెలయే సంవత్సరాది. ఆ నెలయందు మిఠాయివస్తువులతో దేవునకు నైవేద్యము చేయుదురు ఈ దేవుఁడు జానికులం అను పర్వతమున నుండును

రోమకదేవతలు:—జ్యూపిటర్, ఈ దేవుఁడు ఒలింపస్‌పర్వతమున నుండి మోక్షము నిచ్చును ఇతఁడే ప్రధానదేవుఁడు. ఉరుమును కలుగఁజేయును. ఈ దేవునకు విక్టర్, ఇంపిరేటర్, ఇన్విక్టస్, ట్రింపాటర్ మొదలగు అనేకనామములు గలవు. ఇతఁడు ఉరుమును కలుగఁజేయువాఁడుగాన పిడుగుపడి చచ్చువారే పరిశుద్ధులై పరలోకమును బొందుదురు.

జూన్, ఈ దేవత దేవకన్యక; ఈమెవలన శుభము కలుగును. ఈమెకు జూన్ నెలలో ఉత్సవము చేయుదురు. మెనిర్వ, ఈమె జ్ఞానదేవత; ఈమెను విద్యాభివృద్ధికై పూజింతురు. ఈమెకు అథీనా యనియు పేరు కలదు.

మఱియు హిందువులకు ప్రతికార్యమునకు నొక్కొక్కదైవము వుండులాగున వీరికిని బ్రహ్మ మొదలు వాయువు జలము మేఘముదనుక సమస్తదైవములు గలవు. హిందువులవలె నుత్సవాదులను చేయుదురు. బలులు మెండుగ నిప్పింతురు. రోమకులు ధర్మశాస్త్రప్రకారము నడుచుకొనుచుందురు. అట్లు నడుచువారిని తదితరులు దేవతలుగ భావింతురు. అనేకకన్యకలను జీవపర్యంతము దేవతాకైంకర్యమున నియమింతురు. వారిలో వ్యభిచరించిన స్త్రీని జీవముతోనే పాతిపెట్టుదురు.

రోమకులలో తత్త్వజ్ఞానియైన సెనికా అను నతఁడు దేవుఁ డొక్కఁడే యనియును; ఇపిక్టిటస్ అను నతఁడు దేవత లనేకు లుండినను జ్యూపిటర్ శ్రేష్ఠుఁడనియును; లుక్రిటస్ అను నతఁడు, ప్రియమును రూపమునే దేవుఁ డనియును; అరూలియస్, అంటోనిన్సు అనువారు సమస్తమును దేవునియుపాధులే యనియును బోధించిరి.

## స్కాండినేవియామతము.

ఈ మతస్థుల ముఖ్యవేదములకు ఎడ్డాస్, సాగాస్ అని పేరు. ఎడ్డా అనఁగా అవ్వ యని యర్థము. వీరి మతప్రకారము సృష్టిక్రమ మెట్లనఁగా, అబిస్ అను పిండము ఉత్తర దక్షిణ లోకముగ నుండి, ఆమీఁద వెనం అను వర్షము కురియఁగా దక్షిణము నుండి వచ్చినగాలిచే ఆ పిండము కరిగెను. అట్లు కరిగినదానియందుండి ఇమిర్ అను రాక్షసుఁడు పుట్టి ఆ రాక్షసునివలన దుష్టులు కలిగి, ఆ దుష్టులవలన మాడమ్ల అను ఆవుపుట్టి, ఆ పశువులవలన బోర్, ఒండిన్, విలా మొదలగు దేవతలు కలిగిరి. ఇమిర్ అను రాక్షసుని బోర్ మొదలగు దేవతలు జంపఁగా వానిదేహమునందుండి ఆకాశమును భూమియును కలిగెను.

ఒడిన్ అనుదేవుఁడు లోకపిత. సృష్టించువాఁడు. ఆస్కావృక్షముక్రింద నుండువాఁడు. ఈతనికి భూమియే భార్య. ఇతనికి తార్ అను కుమారుఁడు కలఁడు. ఈ తార్ అపూర్వశక్తి గలవాఁడు. ఒడిన్ రెండవకుమారుఁడైన బాల్డర్ అను నతఁడు మహాబుద్ధిమంతుఁడు గాన పరలోకమునందుండి మోక్షవిచారణ చేయును. టైర్ అను దేవుఁడు యుద్ధమునం దతిసమర్థుఁడు. అతనికి ఒక్కచెయ్యిమాత్రము కలదు. మఱియు ననేకదేవతలు గలరు. ప్రపంచము అంత్యకాలమున అనేకులతో యుద్ధము చేయునపుడు బాల్డర్ మృతినొందఁగా ఆయనకై లోకమంతయు దుఃఖించును. తర్వాత

తార్ దేవుఁడు రాక్షసునితోడను, మిడిగార్డు అను పాముతోడను జగడము చేసి చానఁగా లోకము మండిపోవును. అమీఁద క్రొత్తలోకము కలుగఁగా విడార్, వాలి అను దేవత లిర్వురు నెత్తురు.

ఈ మతస్థులు ప్రతిసంవత్సరమునందును ఉత్సవములును చేయుదురు. అయినను స్వీడన్ దేశమున 9 యేండ్ల కొకపరి జరుగు విశేషవుత్సవమున 9 గురిని బలియిత్తురు. కొన్నిసమయములలో రాజులు తమపుత్రులను బలి యిత్తురు. వీరిలో యుద్ధమున దెబ్బలుపడి గాని లేక తాముగా పొడుచుకొనిగాని చచ్చినయెడల మోక్షము కలుగును. కాఁబట్టి వీరిలో కొంచెము ప్రాణ ముండునప్పుడు తమ్ముకను పొడిచిచంపుటకు బంధువులను వేడుకొందురు.

## మెక్సికో మతము.

మెక్సికోదేశమునం దుండువారు సూర్యుని, పక్షులను ఆదికాలమునందు పూజించుచుండిరి. మెక్సి అను ధర్మశాస్త్రి జనించిన తర్వాత ఆతఁడు చెప్పినవిధ మెట్లనఁగా, విట్ జలిపుట్ జలి అను దేవుఁడు ఆవియందు పక్షిరూపముగా జన్మించి యొక పర్వతశిఖరముపై వచ్చి కూర్చుండెను. ఆపక్షి కూర్చుండినస్థలమున మెక్సికో అను నగరము నిర్మింపంబడెను. మఱియు భయంకరమైన డియస్ అను దేవుఁడు గలఁడు. ఆతనికి లోకమే సింహాసనము. భూమి మొదలగు భాగ్యదైవములును, క్షామము మొదలగు దుష్కర్మదేవతలును గలరు. అని మెక్సి వ్రాసి యున్నాఁడు.

ఆచారము:—భూమియు వీరికి దేవత కావున నరబలులను భూమి కిత్తురు, వీరి దేవాలయములయందు మనుష్యులకపాలములను వ్రేలాడఁగట్టి యుంతురు. అనేకసర్పములను జీవములతో కోవెలలో నుంచి పోషించుచుందురు. పూజారులు ప్రతిదినమును స్నానముచేసి భయభక్తిగా పూజింతురు. కొన్నివ్రతములయందు 10 దినము లుపవాసముందురు. ఇట్లు వ్రత మాచరించువారికి టోపిట్జిన్ అని పేరు. వీరు దైవములకు విశేషవుత్సవములు చేయుదురు. వీరి కోరికయంతయు ఇహలోకసంబంధమైనదిగా నుండును. పునర్జన్మమును, దేవదండనమును నమ్మరు. వీరిలో పెండ్లి చేయునప్పుడు లిల బోడి చేసికొందురు. మఱియు పెండ్లి అయిన ఒకసంవత్సరమువఱకును పెండ్లి కూతురు పెండ్లికుమారుఁడును మాట్లాడరు.

## తార్తారమతము.

పూర్వము తార్తారదేశజనులు మార్సు అను దేవతను పూజించుచు గుఱ్ఱములను బలు లిచ్చుచుండిరి. తర్వాత గుఱ్ఱమును కొట్టి ... (చెయుదును) దైవముగ

నెంచి పూజించుచుండిరి. మంగోలియ తార్తారులు నిటిగే అను దేవతను సృష్టికర్త యని నమ్మిరి. మఱియు డావిలామా అను సన్న్యాసగురువు 2 0)) శిష్యులతో లాస అను స్థలమున నున్నారు గాన వారును దేవుఁడే యనిరి. ఈ సన్న్యాసికి హాక్ కింగ్ అనువారును, దేస అను వారును ముఖ్యశిష్యులు. వీరిలో సాధారణజనులు మానిస అను దేవతను తొమ్మిది తలలతోఁ జేసి గ్రామదేవతగా పూజించుచు బలు లిచ్చు చున్నారు. కటుచట అను దేవుఁడు పరిశుద్ధమును పునర్జన్మము నిచ్చును. వీరిలో కొందఱు ఈ భూమినే దైవ మని నమ్మియుండినదే గాక, అర్ధరాత్రియందు ఉత్తరు నేలఁ బడి పొర్లాడుదురు. ఈ తార్తాలలో ననేకజాతులు గలవు,

జుకాగిస్ అను తార్తారులు మృతి జెందినవారే దేవత లని భావించి పూజించు చున్నారు. టాంగుసెన్ అను జాతివారు సమామాక్ అను సృష్టికర్త యొక్కఁడు గలఁడనెదరు బ్రాట్ జాతివారు సూర్యచంద్రులు దేవత లనెదరు. ఇచ్చట నుండు కాకాషియజాతివారు పెద్దమనుష్యులే దేవత లని చెప్పుచున్నారు.

దేశాచారము:—తార్తారులు మాతృగమనము చేయుటయు న్యాయమే యని చెప్పెదరు. అయినను 4 ఏండ్లకు పైఁబడినవారిని వివాహము చేసికొనరు. తమ కొక్క తప్ప తక్కినవారితో స్త్రీలు సంగమించుటను కనుఁగొనుటకై యెలుగొడ్డు నెంద్రుక లను తాఁకుటకు నోరుదురు. ఏస్త్రీ తాఁకదో అది వ్యభిచారమునకు పాల్పడె ననియు, తాఁకినది వ్యభిచరించుటకు సమ్మతి గొనినది యనియు తెలిసికొని ఆ క్షణమే దానిని యిల్లు విడిచి వెడలఁగొట్టుదురు. ఉత్తమస్త్రీలు చనినచో వారినంటి పెద్దబొమ్మలను చేసి మంచెముపై పురుషులు తమతోఁగూడ పరుండబెట్టుకొందురు. నీచు లచ్చినవా రిని అప్పుడే పాతిపెట్టక గ్రానికికట్టి బాగా యెండినమీద ఆ శవమును వస్త్రాభరణ ములతో శృంగారించి పూజించి తర్వాత పాతిపెట్టుదురు.

## జపాను మతము.

పూర్వ మీదేశమునందు ష్నిటన్ అను నాస్తికమతమును, కన్ఫ్యూషియస్ మత మును, క్యాప్సుమతమును, జమ్మాబోస్ మతమును, సింటోయిసమ్ మతమును ప్రబల ముగా నుండెను. వీరిగురువులునిగాస్ అనఁబడుదురు. ఈగురువుల కనేకశిష్యులుగలరు. ట్రాస్ అను స్వర్ణదేవాలయము లనేకములు గలవు. దేవాలయముల కనేకులు ధనము దయ్యములతలలు చేసి యుంచఁబడును. ఆదికాలమున కాగితములతో బ్రాసిన పటములను పూజించుచుండిరి. తర్వాత విగ్రహములను అందముగ చేసి యుంచుచుండిరి. అమిడాస్ అను దేవుఁడు ముఖ్యుఁడు. ఇతఁడు పదునేడులక్షల సంవత్సరములు ...

తార్ దేవుఁడు రాక్షసునితోడను, మిడిగార్డు అను పాముతోడను జగడము చేసి చావఁగా లోకము మండిపోవును. ఆమీఁద క్రొత్తలోకము కలుగఁగా విడార్, వాలి అను దేవత లిర్వురు వత్తురు.

ఈ మతస్థులు ప్రతిసంవత్సరమునందును ఉత్సవములును చేయుదురు. అయినను స్వీడన్‌దేశమున 9 యేండ్లకొకపరి జరుగు విశేషవుత్సవమున 9 గురిని బలియిత్తురు. కొన్నిసమయములలో రాజులు తమపుత్రులను బలి యిత్తురు. వీరిలో యుద్ధమున దెబ్బలుపడి గాని లేక తాముగా పొడుచుకొనిగాని చచ్చినయెడల మోక్షము కలుగును. కాఁబట్టి వీరిలో కొంచెము ప్రాణ ముండునప్పుడు తమ్మను పొడిచిచంపుటకు బంధువులను వేడుకొందురు.

## మెక్సికో మతము.

మెక్సికోదేశమునం దుండువారు సూర్యుని, పక్షులను ఆదికాలమునందు పూజించుచుండిరి. మెక్సి అను ధర్మశాస్త్రి జనించిన తర్వాత ఆతఁడు చెప్పినవిధ మెట్లనఁగా, విట్ జలిపుట్ జలి అను దేవుఁడు ఆనియందు పక్షిరూపముగా జన్మించి యొక పర్వతశిఖరముపై నచ్చి కూర్చుండెను. ఆ పక్షి కూర్చుండినస్థలమున మెక్సికో అను నగరము నిర్మింపబడెను. మఱియు భయంకరమైన డియస్ అను దేవుఁడు గలఁడు. ఆతనికి లోకమే సింహాసనము. భూమి మొదలగు భాగ్యదైవములును, క్షామము మొదలగు దుష్కర్మదేవతలును గలరు. అని మెక్సి వ్రాసి యున్నాఁడు.

ఆచారము:—భూమియు వీరికి దేవత కావున నరబలులను భూమి కిత్తురు, వీరి దేవాలయములయందు మనుష్యులకపాలములను వ్రేలాడఁగట్టి యుంతురు. అనేకసర్పములను జీవములతో కోవెలలో నుంచి పోషించుచుందురు. పూజారులు ప్రతిదినమును స్నానముచేసి భయభక్తిగా పూజింతురు. కొన్నివ్రతములయందు 10 దినము లుపవాసముందురు. ఇట్లు వ్రత మాచరించువారికి టోపిట్ జిక్ అని పేరు. వీరు దైవములకు విశేషవుత్సవములు చేయుదురు. వీరి కోరికయంతయు ఇహలోకసంబంధమైనదిగా నుండును. పునర్జన్మమును, దేవదండనమును నమ్మరు. వీరిలో పెండ్లి చేయునప్పుడు తల బోడి చేసికొందురు. మఱియు పెండ్లి అయిన ఒకసంవత్సరమువఱకును పెండ్లికూతురు పెండ్లికుమారుఁడును మాట్లాడరు.

## తార్తారమతము.

పూర్వము తార్తారదేశజనులు మార్స అను దేవతను పూజించుచు గుఱ్ఱములను బలు లిచ్చుచుండిరి. తర్వాత గుఱ్ఱములను [illegible] జైట్ కౌన్ (చబుకును) దైవముగ

నెంచి పూజించుచుండిరి. మంగోలియ తార్తారులు నిటిగే అను దేవతను సృష్టికర్త యని నమ్మిరి. మఱియు డావిలామా అను సన్న్యాసగురువు 2 0)) శిష్యులతో లాస అను స్థలమున నున్నారు గాన వారును దేవుఁడే యనిరి. ఈ సన్న్యాసికి హోక్ కింగ్ అనువారును, దేస అను వారును ముఖ్యశిష్యులు. వీరిలో సాధారణజనులు మానిష అను దేవతను తొమ్మిది తలతోఁజేసి గ్రామదేవతగా పూజించుచు బలు లిచ్చు చున్నారు. కటుచట అను దేవుఁడు పరిశుద్ధమును పునర్జన్మము నిచ్చును. వీరిలో కొందఱు ఈ భూమినే దైవ మని నమ్మియుండినదే గాక, అర్ధరాత్రియందు ఉత్త నేలఁ బడి పొర్లాడుదురు. ఈ తార్తాలలో ననేకజాతులు గలవు,

జుకాగిస్ అను తార్తారులు మృతి జెందినవారే దేవత లని భావించి పూజించు చున్నారు. టాంగుసెన్ అను జాతివారు సహామాక్ అను సృష్టికర్త యొక్కఁడు గలఁడనెదరు బ్రాట్ జాతివారు సూర్యచంద్రులు దేవత లనెదరు. ఇచ్చట నుండు కాకాషియజాతివారు పెద్దమనుష్యులే దేవత లని చెప్పుచున్నారు.

దేశాచారము:—తార్తారులు మాతృగమనము చేయుటయు న్యాయమే యని చెప్పెదరు. అయినను 4 ఏండ్లకు పైఁబడినవారిని వివాహము చేసికొనరు. తనభర్త తప్ప తక్కినవారితో స్త్రీలు సంగమించుటను కనుఁగొనుటకై యెలుగొడ్డువెంట్రుక లను తాఁకుటను గోరుదురు. ఏస్త్రీ తాఁకదో అది వ్యభిచారమునకు పాల్పడ దనియు, తాఁకినది వ్యభిచరించుటకు సమ్మతి గొనినది యనియు తెలిసికొని ఆ క్షణమే దానిని యిల్లు విడిచి వెడలగొట్టుదురు. ఉత్తమస్త్రీలు చనినచో వారినంటి పెద్దబొమ్మలను చేసి మంచెముపై పురుషులు తమతోఁగూడ పరుండబెట్టుకొందురు. వీరు చచ్చినవా రిని అప్పుడే పాతిపెట్టక మ్రానికికట్టి బాగా యెండినమీద ఆ శవమును వస్త్రాభరణ ములతో శృంగారించి పూజించి తర్వాత పాతిపెట్టుదురు.

## జపాన్ మతము.

పూర్వ మీదేశమునందు క్సినిక్సు అను నాస్తికమతమును, క్సిడోరియాట్ మత మును, క్వాక్సుమతమును, జమ్మాబోస్ మతమును, సింటోయిసమ్ మతమును ప్రబల ముగానుండెను. వీరిగురువులునిగాస్ అనఁబడుదురు ఈగురువుల కనేకశిష్యులుగలరు. ట్రాస్ అను స్వర్ణదేవాలయము లనేకములు గలవు. దేవాలయముల కవాటములయందు దయ్యములతలలు చేసి యుంచఁబడును. ఆదికాలమున కాగితములలో వ్రాసినట్టి పటములను పూజించుచుండిరి. తర్వాత విగ్రహములను అందముగ చేసి యుంచుకొనిరి. అమిడాస్ అను దేవుఁడు పరాత్పరప్రభువు. ఆతఁడు ఏడువేలసంవత్సరములు ఏడు

తలలతో గుఱ్ఱముపైనుండి యేలుచుండును. ఈతనికి బలులను యిత్తురు. ఇప్పు డీదేశ మున బుద్ధమతము విశేషముగా వ్యాపించి యున్నది. ఇచ్చట నుండు బుద్ధవిగ్రహ మంత పొడవు మఱెచ్చటను లేదు. మఱియు, పూర్వపుసింటోయిసమ్ అనుమతస్థులు వాయువు, అగ్ని, కాలము, పితృలు, చక్రవర్తి మొదలగువారిని దేవత లని భావించి యున్నారు. ఇట్టి దేవతలు ఎనుబది (80) లక్ష లున్నారు. ఇంతేగాక ఈలాటిదేవ తల నెన్నిరైనను సృష్టించు అధికారము చక్రవర్తికి కలదనియు తలఁచియున్నారు. ప్రకృత జపాన్ దేశబౌద్ధమతములో పూర్వసింటోయిసమ్ మతపద్ధతులును గొన్ని చేరియున్నవి. ప్రతి జపాన్ దేశస్థుఁడును మంత్రములు వ్రాసిన వస్త్రమును ధరించి యుండును. ఈదేశములోను చచ్చినవారికి సుకృతముకొఱకు కర్మలుచేయుచున్నారు.

బుద్ధమతములోజేరిన జపానువారు శకునము చూచి ఏకపత్నీనిమాత్రము వివా హముచేసికొందురు. ఉత్సవకాలమున దేవుఁడు వూరేగునప్పుడు ప్రతివాఁడు నొక్కొ క్క లాంతరును చేతపట్టుకొనిపోవును. మృతులైనవారిని దహనముచేసి యాబూదిని సమాధిలోనుంచి మండపాదులనుకట్టి దీపముసుంతురు. స్త్రీలు వ్యభిచరించినయెడల వారిని చంపుదురు. సన్న్యాసులు పెండ్లిలేకరయే యుందురు. అట్లే యోగిని స్త్రీలు నుందురు, ఈ కార్యములన్నియు బుద్ధదర్శనము ననుసరించిన ముఖ్యసిద్ధాంతములు ఇపుడు క్రీస్తుమతమును కొందఱవలంబించియున్నారు.

## సయాంమతము.

ఈ దేశీయులు బుద్ధధర్మము ననుసరించినవారు. అయినను ఇది యొకవిధమైన పద్ధతి ననుసరించియున్నది. సోమగోతమ అనునతఁడు పుష్పమునంబుట్టి సర్వజ్ఞానియై యొకవృక్షముక్రింద తపముచేసి సిద్ధులను బొందెను. అతనికి దేవతాత్ (దేవదత్త) అను సహోదరుడుండెను. ఇర్వురును జగడము చేయఁగా సోమగోతముఁడే జయిం చెను. కాఁబట్టి సోమగోతముఁడు శ్రేష్ఠమైనదేవుఁడు. ఈ దేవున కనేకదేవాలయ ములు గలవు. కొన్నిసమయములయందు మేకపిల్లలను బలు లిచ్చెదరు.

బుద్ధగురువులకు తలపాయిన్సు అని పేరు. వీరు నొసలుతోకూడ సర్వాంగక్షౌర ము చేసికొని సన్న్యాసులై యుందురు. స్త్రీలును వివాహము లేక యోగినులుగా విహ రింతురు. వీరు మరణ మొందినవారిని మొదటకాల్చి తర్వాత ఆ బూడిదెనుంచి సమాధి కట్టుదురు. మృతులైనవారికి అగ్నిసంస్కారము చేయుట మిగుల శ్రేష్ఠకార్యమని భావింతురు. బీదవారయినను, ధనికులకుటుంబమునను మృతులైనవారి శవమును

చాలాదినములు గృహమందుంచి అలంకరించి విందులు వుత్సవములు సల్పుచునుందురు. ఆమీద మందిరముననుండి శవము నుంచిన చితిపరకు దారమునుకట్టి దానిమూలముగ నిప్పును రగులపెట్టుదురు.

## పెరువియన్ మతము.

ఈ దేశమున నుండు మతస్థులు గొఱ్ఱెలను పశువులను బలి యిచ్చుటయే గాక ఒక్కొక్కప్పుడు నరబలియు నిత్తురు. కొంచెముగా పాపము చేసినవారు తమ వ్రేలిని కాని, చెవులనుకాని, మఱి యేయితరఅవయవమునుగాని కోసి రక్తమును స్రవింపఁ జేయుదురు. మాంకోకూపెర్ ధర్మశాస్త్రకాలమునందు సూర్యుని, చంద్రుని దేవుఁడని యెంచి పూజించు చుండిరి. సూర్యుఁడు సృష్టికర్త. ఇతఁడు ఉఱుములను మెఱుములను దూతలుగ నియమించుకొని దుష్టులను శిక్షించు చుండును. హాకాకా అను దేవుఁడు చిరంజీవిదేవుఁడు. అపచితా అను దేవుఁడు కృపచేయు నతఁడు; గాన ఇతనిని నరబలి నిత్తురు సూర్యునిపత్ని చంద్రదేవత యని చెప్పుదురు. గుళ్లయందే గురువులు నసించుచుందురు. స్త్రీలు యోగినులై యావజ్జీవము నుందురు. వీరిలో అన్నదమ్ములు అక్కచెల్లెండ్రను వివాహ మాడుదురు. వీరిసిద్ధాంతమున మరుజన్మము కలదు.

## కనడా మతము.

న్యూఫౌండ్‌లాండ్ కనడాదేశములవారు ఆదియందు సూర్యుని ఆరాధించు చుండిరి. తర్వాత వీరిలోఁ గొందఱు చతుర్దేవత్వమును నారాధించు చుండిరి. అనఁగా మాతా, పితా, పుత్రుడు, సూర్యుడు అను నీనల్వురును ఒకే దేవుఁ డని తలంచిరి. ఓల్‌కాన్సుఓకి అను దైవము సృష్టికర్త - ఈ దేవుఁడు ఆదియందు భూమిని బాణము వేసి చీల్చి అందుండి స్త్రీని, పురుషుని యుత్పత్తి చేయఁగా వారివలన ప్రజలెల్లరును కల్గిరి. మఱియు మంచిచెడ్డలుచేయు దేవత లనేకులుగలరు. వీరిలోని స్త్రీలు సూర్యుని మాత్రము ధ్యానింతురు. యుద్ధవీరులు సాయంకాలమున నృత్యము చేసి దైవమును సంతృప్తి చేయుదురు. వీరిలో నొక పురుషుఁ డనేక స్త్రీలను వివాహము చేసికొన నచ్చును. చచ్చినవారిని పాతిపెట్టి కొంతకాలమునకు అస్థుల నెత్తుకొని దానిని పూజింతురు. వీరు నదిని దాఁటవలసివచ్చినప్పు డానదికి నమస్కరించి పూజలు కావించి తర్వాత దాఁటుదురు.

## పెగుమతము.

ఈ దేశీయులకు పంచదేవతలు గలరు. ఈ యైదుగురును లోకమును సంరక్షించు చుందురు. ఈ 5 దేవతలలో నాల్గవదేవుఁడు పుట్టి యిప్పటికి 2225-వ సంవత్సరము లక్షముంతు గతించిపోయెను. ఇఁక ఐదవదేవుఁడును త్వరలో మృతి నొందును. ఆ తర్వాత లోకమంతయు అగ్నిచే దగ్గమై పోవును.

మఱియు మంచికార్యములకెల్లను దేవుఁడు కర్త. చెడుకార్యములకెల్లను పిశాచి కర్త. వీరిగుళ్లను వెర్లాన్ అని పేరు. ఒకానొకగుడియందు 120000 విగ్రహము లున్నవి. వ్యాధి మొదలగునవి తొలఁగునిమిత్తము దైవప్రార్థన చేసికొందురు, పిశాచివసించుటకై కొందఱు పురుషులు తమయింటిని సంవత్సరమునకు మూఁడునెలలు విడిచిపెట్టుదురు. పూజ చేయుటకు సోమవారము ముఖ్యదినము. వీరిగురువు లొకమాఱు భుజింతురు. దుఃఖచిహ్నమునకు గుర్తుగా క్షౌరమును చేసికొందురు. కొందఱు భోజనము చేయుటకు ముందు మొదటి కబళమును కుక్కలకు పెట్టుదురు. ప్రతిపండుగలను విశేషముగాఁ జేయుదురు.

## పిలిప్పియన్ మతము.

ఈ ద్వీపవాసులు ముఖ్యముగా సూర్యచంద్రులను ఆరాధింతురు. మఱియు ననేకదేవతలను పూజింతురు. బాటలా అను దేవుఁడు సృష్టికర్త. ఈ బాటలా అను దేవుని అబ్బా అను పేరుతో సుందరవిగ్రహముగాఁ జేసి పూజించుచున్నారు.

## మలాకా మతము.

ఈ దేశీయులు పూర్వమున వాయువును పరాపరవస్తు వని తలంచియుండిరి. ఈ వాయుదేవుని లానిటో్చ అని చెప్పుదురు నిటో అను దుష్టదైవములును గలవు. వీరు ప్రతిసంవత్సరమునందును అనేకపండుగలను జేయుదురు.

## సుమేత్రా మతము.

బోర్నియో, సుమేత్రాదేశములయందుండువారు సూర్యచంద్రులను ఆరాధింతురు వీరు సకలకార్యములకును పక్షిశకునములను జూతురు. పెండ్లి చేసికొనువరుఁడు వివాహకన్యకకు శత్రువుల శిరస్సును ఖండించి అరణముగా నిప్పించవలయును. వీరి సిద్ధాంతప్రకారము శరీరమును ఆత్మయును నిర్వాణమును బొందును.

## జావా మతము.

ఈ దేశీయులలోని పూర్వులు సూర్యుని, చంద్రుని ఆరాధించుచుండిరి. మఱియు సృష్టికర్త వేఱుగా నున్నాఁడు. మఱికొందఱు చంద్రుని, పిశాచములను ఆరాధించుచుండిరి.

## లఫ్ సంజ్ మతము.

ఈ మతము మధ్యఏష్యాలో సుమారు 2800 ఏండ్లకు ముందున్న లఫ్‌సంజ్ అను రాజకన్యకచేత స్థాపింపఁబడినది. ఈ మతస్థులకు లవ్‌సంజను లని పేరు. ఈ మతమునందు విగ్రహారాధనము లేదు. మాయను (ప్రకృతిని) అంగీకరింపరు. అవతారములు నొప్పుకొనరు. ఈ మతస్థులు ప్రకృతమున నున్నారు.

## సింహళ మతము.

సింహళ మనెడు లంక (సిలోన్) లోనివారు బుద్ధమతము ననుసరించినవారై యున్నారు. కొందఱు తమ పూర్వమతము నవలంబించి యున్నారు. లోకమును సృజించుటకు కర్త యొకఁడు గలఁడు. ఆతనిని సహాయము చేయు నావికాయాత్రీకులును, సేద్యగాండ్రును నగు దేవతలు పెక్కుమంది గలరు. మఱియు జాకా అను పిశాచమును ఆరాధించు చున్నారు. మఱికొందఱు నవగ్రహముల నారాధించెదరు.

## మలయ మతము.

మలయద్వీపములో కొందఱు ఓడ నడపుటకు శక్తుఁడైన వాయుదేవుని, సముద్రమును దైవములుగ భావించి యారాధించెదరు. కొన్నిసమయములయందు వాయుసముద్రములకు మేఁకలను పశువులను బలి యిచ్చెదరు. కాఁబట్టి చండమారుతము వీచునప్పుడును, సముద్రమునను రెయెంగిలి యుమియుట పాతకమని తలంచియున్నారు. వీరికి టావిడస్ అను సృష్టికర్త యొక్కఁడుగలఁడు అతఁడే సేనాధిపతియై యున్నాఁడు. పంచభూతములను నొప్పుకొనుచున్నారు. వ్యాధులన్నియు పిశాచములవలన కలుగుచున్న నని తలంచి తత్పరిహారార్థమై బలు లిచ్చెదరు.

## లాప్లాండర్ మతము.

ఈ దేశీయులకు, జూమలా అను సృష్టికర్త గలఁడు. అజికా, స్టోర్జక్రా, బెయువి; అను ముమ్మూర్తులు గలరు. వీరికి సహాయము చేయుట కనేకపిశాచములు గలవు. కాఁబట్టి వానిందృప్తిచేయుటకై మేఁకలను పశువులను బలు లిచ్చెదరు. వీరిలో నొకయింట నెవ్వరేని మృతి నొందినయెడల ఆయింటియం దాఱునెలలదాఁక కాపురము చేయరు: పూర్వమున వీరు మృతి జెందినవారిని పాతిపెట్టు చుండిరి. ఇప్పుడు యినుపరేకుమీఁద నుంచి దహనము చేసెదరు.

## మిన్నిసిప్పి మతము.

ఈ దేశమునందలివారు సూర్యుని సృష్టికర్త యని నమ్మి మనోధ్యానము చేయు చుందురు. వీరిలో ననేకులు భూలోకమును, స్వర్గలోకమును, ఆదియందొక స్త్రీవలన సృజింపఁబడినదనియు, ఆస్త్రీయును నామెకుమారుఁడును లోకమును పాలించుచురాఁగా ఆస్త్రీ బలహీనముచేత స్వర్గలోకమునుండి క్రిందికిపడినప్పుడు తాఁబేలు ఆపెను భరించె ననియును చెప్పుచున్నారు. మఱికొందఱు ఒట్కొం అనునతఁడే ఆదికర్త యైన దేవుఁ డని నమ్మి యున్నారు. మఱికొన్ని దేవతలను, నదులను పూజించెదరు. నదీప్రవాహసమయమున యెలుగొడ్డుతోలును మర్యాదార్థముగ ప్రాకుల యందు వ్రేలాడ గట్టెదరు.

## ఫ్లోర్డియర్ మతము.

ఈ దేశీయులు విగ్రహారాధనముచేయువారు. మఱియు టాయ అను పిశాచమును గొల్తురు. వీరు గుళ్లయందు శవములను, శ్రేష్ఠ మైనపదార్థముల నుంచి పూజింతురు. వీరిలో అపాలసేట్ అనువారు సూర్యుని ఆరాధింతురు. అనేకము లైన పండుగలను చేయుదురు. వీరిగురువులకు జననసు లనిపేరు. వీరు సూర్యునిముందు మోఁకాలూని నమస్కరించుటయే గాక సాంబ్రాణిధూపమును వేయుదురు. మఱియు సూర్యుని చూచి కూయునట్టి పక్షుల కాహార మైన తేనెను నైవేద్యము చేయుదురు. ఈ జాతివారు తమ ప్రథమసంతతిని దేవతకును రాజునకును బలి యిత్తురు. ఈ జాతివారియందు భర్త గతించినచో స్త్రీ మూఁడుదినము లుపవాసము చేయవలయును. కొందఱు శవము నలంకరించి పెట్టెయం దుంచి మూఁడేండ్లదాఁక పూజింపు చుందురు. వీరిసిద్ధాంతమున పునర్జన్మము కలదు. మఱియు పుణ్యకార్యములు చేయువారు స్వర్గలోకమును, పాపకార్యములు చేయువారు నరకలోకమును బొందుదురు.

## కారబీ మతము.

కారబీదేశీయులు మంచి ఆవిరియును, చెడ్డ ఆవిరియును కల వనియును, మంచి ఆవిరిని చిమెక్ అనియును, చెడ్డ ఆవిరిని మాబోయ అనియును, ప్రతివానియందును చిమెక్ అను ఆవిరి యున్నదనియును, లూకో అను ఆదిమనుష్యునివలన సకలజీవకోట్లు కలిగెననియును, ఆలూకో గతించి స్వర్గలోకమునకుఁ బోయె ననియును, స్వర్గలోకము సృజింపంబడినది గా దనియును చెప్పుచున్నారు. మఱియు చిమెక్ అను ఆవిరి దేవలె శ్రేష్ఠ మని యెంచి పెదవిగ్రహము... దేవత దుష్ట

దేవత గాన దానిని చిన్నవిగ్రహముగాఁ జేసి పూజించెదరు. వీరిగురువులకు బోయాలు అని పేరు. గురువులు రొట్టెలను నీళ్ళను ఆహారముగాఁ గొనుచు చిన్నగుడిసెలయందు నసింపుచుందురు. వీరిసిద్ధాంతమునందు ప్రతిమనుష్యునియొక్క దేహమునందును ఆనేకాత్మ లున్న వనియును, ఆయాఆత్మ చేసిన పాపమును ఆయాఆత్మ మరుజన్మమందు అనుభవించు ననియును చెప్పఁబడి యున్నది.

## గి ని యా మ త ము.

ఈ దేశీయులు నాగరికతయును విద్యయును శాస్త్రమును లేనివారు. ఇట్లుండియు వీరికి దైవభక్తి కలదు వీరు పెట్చి అను దేవత లున్నారనియును, వారు తమవలె నల్లనై యుందు రనియును, చెడుపును మెండుగాఁ జేయుదు రనియును తలంచి యున్నారు. పిడుగుపడినస్థలము భయంకరస్థల మని తలంచి యచ్చోట విగ్రహములను జేసి యుంచి పూజించెదరు. వీరిగురువులకు మాసాకి అని పేరు. వీరియొక్క దుష్టదైవములు నల్లకుక్కలవలె అవతరించి చెడుపు చేయు నని తలంచి యున్నారు. మంగళవారము వీరికి విశేషదినము. ఆ దినమున నరబలియును మేకలు మొదలగునవియును దైవమునకు బలి యిత్తురు. ఈ జాతివారిలో చచ్చినపీనుఁగులను స్త్రీలే తీసుకొనిపోయి పాతిపెట్టుదురు.

## బె నిఁ అ ద్రా మ త ము.

ఈ దేశీయులు దుష్టదేవతలను ఆరాధించుచు, ఆ దేవతలకు మనుష్యులు మొదలగు అనేకప్రాణులను బలి యిచ్చెదరు. అయినను సృష్టికర్త యైన దేవుఁ డొకఁడు గలఁడు. అతఁడు సకలవిధము లగు సత్కార్యములను చేయు కరుణాకరుఁడు. కాఁబట్టి ఆతని పూజింపరు. దుష్కార్యములు చేయుచుండు దేవతలనుమాత్రము పూజింతురు. పాపనివారణమునకై ప్రార్థింతురు. ఈ జాతిలో స్త్రీలును బాలురును దేవత లనారాధించుట లేదు. యుద్ధమునం జచ్చినవారికి మోక్షము లభించునని వీరిసిద్ధాంతము గాన, పీనుఁగులచేతులను వెనుకప్రక్కగగట్టి నిలువంబెట్టి బాణములతోడను ఆయుధములతోడను అలంకారము చేసి, తర్వాత పాతిపెట్టుదురు. రాజులును ధనవంతులును జచ్చినయెడల వారికి శుశ్రూష చేయునిమిత్తమై వారితో నలుగు రైదుగురను కూడా చేర్చి పాతిపెట్టుదురు.

## కాం గో అం గో లా మ త ము.

కాంగో దేశీయులు తమరాజును దేవత యని తలంచి స్తుతించుచు ఆ రాజును సొంబెర్ అనియు, బెంగో అనియు, నిట్టిపేర్ల నేకములచే వ్యవహరింతురు. అయినను

ఆరాజును ప్రజలును మాకిస్సో, చికాకి, అను రెండువిగ్రహములను పూజింతురు. గంగాగంబేరి అనుదేవత సకలశుభములను దెలియఁజేయునది యని తలంచి యామెను ఆరాధింతురు. మాటాంబో మాగాణమునందు మిరాంబా అను భయంకరవిగ్రహము కలదు. దానిని జయశీలు రారాధించెదరు. కొందఱు పులి, పాము, మేఁక, అప్ప మొదలగువానిని ఆరాధించుచున్నారు. సృష్టికర్త లనేకులు గలరు. వారికి ద్యుస్కరా అని పేరు. వీరిగురువులకు గంగా అనిపేరు. ఈ గురువులు వ్యాధిగ్రస్తులను జూడఁ బోయినప్పుడు వారి ఆరోగ్యమునిమిత్తము యిష్టదేవతావిగ్రహము నొకటి నిత్తురు

అంగోలీయులకు సృష్టికర్త లనేకులు గలరు. వారికి జంబక్ పాన్యో అని పేరు. వీరు మాకిస్సో అను ననేక దేవతల నారాధింతురు. ఉత్సవకాలమున క్వింబరా అను మలెసంబంధనృత్యము చేయుదురు. మఱియు చితోంబి అను మహాత్ములను, నిగాంబో అను గురువులను, నికోని యను వైద్యదేవతను, ఇట్లే కుష్ఠరోగము, బధిరత్వము మొదలగు రోగములను బోఁగొట్టు ననేకదైవములను ఆరాధింతురు. ఇచ్చట నుండు కాకాషియూవారు క్విసాంగో అను దేవతను విగ్రహముగఁ జేసి పూజించుచున్నారు.

## అరకాన్ మతము.

ఈ దేశస్థు లనేకదైవముల నారాధించెదరు. అయినను క్వపురాగ్రయ అను దేవతను అందముగాఁజేసి చక్కఁగా శృంగారించి హిందువులవలె ఆ విగ్రహమును వాహనముపై నుంచి యూరేగించి పూజించి కొనియాడు చుందురు. కొందఱు సిడీలు పొడుచుకొని రక్తమును చెదఱునట్లు చేయుదురు. వీరు దేవతలకు వర్షముచే చలియు పడిసెమును గలుగుననితలంచి గుహలు గుళ్లనుకట్టి విగ్రహముల నందుంచెదరు. వీరు గురువులను రైవినియర్ అని చెప్పుదురు. గురువులు సర్వాంగక్షౌరము చేసికొని హారిద్ర వస్త్రమును ధరించి సన్న్యాసులై యుందురు. ఈ దేశపురుషులు నలుగురు స్త్రీలకంటె నధికముగ వివాహము చేసికొందురు. రాజులు పన్నిద్దరు స్త్రీలకంటె నధికముగ వివాహము చేసికొందురు. ఈ మతస్థులకును సృష్టికర్త గలఁడు. పునర్జన్మము కలదు. మృతకళేబరమున నుండు ఆత్మను యముఁడు తీసికొనిపోవుచుండునట్లు భయంకరముగా తప్పెట్లు వాయించుచుందురు.

## కాఫిరియ మతము.

సాధారణముగ వీరిని కాఫిరీ లని చెప్పుదురు. వీరియొక్క సృష్టికర్తను గువిని యాటిక్వోసా అనిపేరు. వీరు అనేకవిగ్రహములను జేసి యనేకదేవాలయములలో

నుంచి పూజింతురు. కొందఱు సూర్యుని, కొందఱు చంద్రుని, కొందఱు ఆకాశమును, కొందఱు నక్షత్రములను ధ్యానింతురు. వీరు మేబగ్ అను నొకవిధమైన పురుగు శుభముల నొసంగఁదగినదని తలంచి దానిని గాపాడుచుందురు. మేఁకలను, పశువులను దేవతలకు బలు లిత్తురు. వీరిగురువులకు స్పిక్ అని పేరు. గురువులు వయస్సునందును జ్ఞానమునందును శ్రేష్ఠులైనవారుగ నుందురు. గురువులు తమయిష్టమునకును శక్తికిని దగినంతమంది స్త్రీలను వరింతురు. వ్యభిచారులను శిరచ్ఛేదము చేయుదురు. విధవలు పునర్వివాహము చేసికొనునప్పుడెల్లను తనువ్రేళ్లకొనలను ఖండించుకొందురు.

## కాన్ ఫ్యూకస్ మతము.

చీనాదేశమునందు లు అను నగర మొకటి గలదు. అచ్చట క్రీస్తుపుట్టుటకు 551 సంవత్సరములముందు కాన్ ఫ్యూకస్ అను మతకర్త పుట్టెను కన్ ఫ్యూషియన్ అనియు చెప్పెదరు. ఇతనియొక్క 3 వ ఏయేఁట తండ్రి గతించెను. 15 వ సంవత్సరమున విద్యాభ్యాసము చేసెను. 19 వ సంవత్సరమున పరిణయము చేసికొనియెను. 51 వ సంవత్సరమున రాజునొద్ద మంత్రిత్వమును పొందెను. తుదకు జీవదశలోని నిజము నెఱింగి భగవంతుని మహిమలనెల్ల నుపదేశించెను. ఇతనికి 3000 శిష్యులు చేరిరి. ఇతఁడనేక యుద్గ్రంథములను రచియించెను. ఇతఁడు 57 వ సంవత్సరమున మృతినొందఁగా నితని శిష్యులలో నగ్రగణ్యుఁడైన లన్ త్యూతాల్లిత్యుల్కు కాన్ ఫ్యూకస్ అనువారు కాన్ ఫ్యూకస్ అనువారి ధర్మాసనము నధిష్ఠించిరి. ఈ మతస్థులకు 1660 గుళ్లు కలవు. ప్రతి సంవత్సరమును రెండుమార్లు ఉత్సవములు చేయుదురు. వీరిదేవతలకు బలు లిచ్చుట గలదు. ఈమతమునకు కాన్ ఫ్యూకస్ మత మని పేరు.

కాన్ ఫ్యూకస్ మతసిద్ధాంతమునందు దేవుఁ డొక్కఁడే గలఁడు. ఆదేవుని బొందుటయే మనుష్యజన్మమునకు శ్రేష్ఠత్వము. ఆకాశము, భూమి, మనుష్యులు ఇవి మూఁడును కూడినది యొకతత్త్వము. ఈ మూఁటిలో మనుష్యజన్మము శ్రేష్ఠము. సంపన్నులను పెద్దమనుష్యులను తక్కినవారు సేవింపవలయు. మనుష్యు లుత్పన్న మగుటకు మాతాపితలు ఆధారము గాన వారిని సేవింపవలయును. తలిదండ్రులమాటను మీఱరాదు. తలిదండ్రులు గతించిరేని మూఁడేండ్లదాఁక దుఃఖమును గొందాడుదురు. తర్వాత మాతృపితామహాలయ మని యొక సన్నిధిని నిర్మించి ప్రతినిత్యమును వారిని స్తుతించుచుందురు. బాలికలు వృద్ధస్త్రీలను పూజింతురు. జాతిభేదము లేదు. అందఱిని సహోదరులుగ జూడవలయును. సంతతి గలవారికి జన్మవిమోచనము కలదు. సకలజనులును నీతి, దయ మొదలగు సుగుణములతోఁ గూడి యుండవలయును.

## తాయిసమతము.

చీనాదేశములో మొదటిమతము కాన్ఫ్యూకస్ మతము. ఆతర్వాతిమతము తాయిసమతము. కాన్ఫ్యూకస్‌వారికాలమునందే యున్న, లౌయిస అను తత్త్వవేత్త యీమతమునకు కర్త. మనుష్యులు భూమి ఆకాశము అను నీ మొదలగునవి కలుగుటకు మూలకారణ మొకటి కలదు. ఆ కారణము అనాది ఆకారణము మున్మూరు మనుష్యా తారమెత్తినది ప్రతివారును యోగము ననుష్ఠించి యీజన్మమును పోఁగొట్టవలసినది అని వీరి సిద్ధాంతము. ఈ మతస్థులు యొక్కునమంది లేకపోయినను లోకులను రసాయన శాస్త్రముచే భ్రమింపఁజేయుచున్నారు. క్రీస్తుపుట్టుటకు ముందు 1 34 వ సంవత్సరమున జన్మించినట్టి చోతాజ్ అను విజ్ఞానిచే వ్రాయఁబడిన యనేకము లైన జడ అజడ తత్త్వగ్రంథములలోని ముఖ్యాంశములు ప్రమాణములు.

చీనాదేశములోని మూఁడవమతము బౌద్ధమతము. ఇప్పుడు విశేషవ్యాప్తమై యుండు నీబుద్ధమతము క్రీస్తువునకు ముందు 66 వ సంవత్సరమున అచ్చోట వ్యాపించి యున్నది.

ఇదిగాక క్రీస్తుపుట్టిన 1833 లో టేపింగ్ అను క్రీస్తుమత మొకటి కల్గెను. హంగ్ సాన్ట్స్యూ అనునతఁడొక చిన్నగ్రంథము నాధారముగాఁ గొని యీ క్రీస్తుమతమును వృద్ధి చేసెను. 185 1 వ సంవత్సరమునం దీమతము ప్రబల మైనది ఈ క్రీస్తువ్రులు అబిని మొద లగు మత్తు గల వస్తువులను భుజింపరు. నీతి ననుసరించి వర్తించువారు.

చీనావారియొక్క సృష్టివిషయ మైన యభిప్రాయ మెట్లనఁగా:—ఆదియందు జడపదార్థముమాత్రము ఏకపిండమై యుండి తర్వాత అది రెండై అందొకటి యాఁడు దియై మఱియొకటి మగవాఁడైనది మఱియు సూక్ష్మదేహముమీఁదుగను, స్థూలదేహ ముక్రిందుగను నై, అందుండి (అనఁగా ఆ తలిదండ్రులనుండి) సమస్తమును గల్గెను. కాఁబట్టియే ఆకాశమునకును భూమికిని సంబంధము కలదు. మఱియు సమస్తమును స్త్రీపురుషత్వముగాఁనే యున్నది యని వీరిసిద్ధాంతము.

## ఐగుప్తమతము.

ఈజిప్టుదేశము (ఐగుప్త = ఎగిప్తు) నందు ప్రబల మైన మతములు మూఁడు గలవు. అందొక్కటి ‘‘నేనే ఆత్మ’’ అను పద్ధతిననుసరించిన అద్వైతమతము. ఈమతస్థులను పాతా అనునతఁడే సకలకార్యనిర్వాహకుఁ డగు దేవుఁడు; అతఁడే యీప్రపంచము. సకలపదార్థములును దేవుఁడేను, ఆత్మ నాశము కానిది, పునర్జన్మము కలదు ఆత్మయు దేహము నొక్కటే అని చెప్పెదరు.

రెండవమతస్థులు త్రివిధదైవవాదులు. ఎట్లన, (1) అముక్ అను దేవుఁడు భూమియందును ఆకాశమందు నుండు దేవతలకురాజు. (2) మట్, సెటి, నీత్ మొదలగు అమ్మవార్లును సూర్యచంద్రులును గలరు. వీరికి ప్రతినిత్యము ఉదయ మగునప్పుడు బ్రతుకును అస్తమాన మైనమీఁద చావును గలదు. (3) పైన జెప్పిన మట్ మొదలగు వారు దేవతలపుత్త్రిలు.

మూఁడవమతస్థులు పౌరాణికులు. అనఁగా పురాణములయందుఁ జెప్పంబడిన వారిని ఆరాధించువారు. వీరు వివిధప్రాయశ్చిత్తములును అనేకము లైన ఆరాధనములను చేయుదురు. ఆదియందు ఆకాశమును భూమిని సృజించిన పురాణపురుషుఁడు ఆసిరీసు అను వృషభశీర్ష దేవుఁడు. తర్వాత గోముఖదేవి యైన ఒసిసు అనునామె సృజింపంబడెను. ఆసిరీసును వానిసోదరుఁ డైన టైఫన్ అనునతఁడు చంపెను అదిమొదలు భూమియందు వ్యవసాయము బాగా జరుగుట లేదు.

మరణ మైనమీఁద న్యాయతీర్పుదినమునందు 42 దేవతలచే నిండిన సభయందు తోత్ అను చంద్రాధిదేవతలవలన విచారణ చేయఁబడును. బలులు అధికముగా నిచ్చినయెడల పాపము పరిహార మగును. వీరు ప్రతిసంవత్సరమునం దనేకయుత్సవములను చేయుదురు. ప్రాయశ్చిత్తములు చేసికొందురు. క్రొత్తపంట వచ్చినప్పుడును, క్రొత్తనీళ్లు ప్రవహించినప్పుడును ఉత్సవములు చేయుదురు. తుట్టతుదకు ఈతెగలలో చేరిన మువ్వురును ఆత్మయు దేహము నొక్కటే యని చెప్పుచున్నారు. ఈ జాతివారు వ్యభిచారము, అబద్ధము, హింస, పరిహాసము, చోరత్వము, వీనిని నిగ్రహించుటయందే బుద్ధి గలవారై యున్నారు.

## మహమ్మదు మతము.

ఈ మతము మహమ్మదు అనువారిచే స్థాపింపఁబడినది. ఇతఁడు క్రీస్తు పుట్టిన 576 వ సంవత్సరము ఆగస్టు 29 తేది సోమవారమునందు ఖోరైష్‌గోత్రపువాఁడును, హాషింకుటుంబపువాఁడు నైన అబ్దుల్లా అను వతనికి అమీనా యను భార్యయందు మక్కాలో పుట్టెను. అబ్దుల్లా తనభార్య గర్భవతిగా నుండునపుడే చనిపోయెను. మహమ్మదు తల్లియైన అమీనాకూడ మహమ్మదు పుట్టిన నాలుగవసంవత్సరమున గతించెను. మహమ్మదుకు తాతయు అబ్దుల్లాకు తండ్రియు నైన అబ్దుల్ ముతలిబ్ అనునతఁడు మహమ్మదును సంరక్షించుచుండెను. అతఁడును శీఘ్రకాలమున మృతి నొందెను. ఆ తర్వాత అబ్దుల్ ముతలిబ్ పెద్దకుమారుఁడును మహమ్మదుయొక్క పెద్దతండ్రియు నైన అబుతలీబు మహమ్మదును రక్షించుచుండెను.

మహమ్మదు తన పెత్తండ్రితో వ్యాపారము చేయుచు, తన 25 సంవత్సరములకు ఖాదిజా (ఖుదైజా) అనే భాగ్యవంతురాలైన యొకవిధవరాలియొక్క వ్యవహారములు నడుపుచుండెను. మహమ్మదు ఖాదిజావ్యవహారములను ఆమెయొక్క మనస్సునకు రంజక మగునట్లు నడుపుచుండినందున, నలుబదియేండ్ల వయస్సు గల ఖాదిజా, ఇరువదై దేండ్ల వయస్సు గల మహమ్మదును పెండ్లి చేసికొనెను.

తర్వాత మహమ్మదుకు ఖాదిజాయందు ఇద్దరు కొమాళ్లును, ఇద్దరు కుమార్తెలును కలిగిరి. కొమాళ్లు యిద్దరును గతించినందున ఆలి యనువానిని, సయ్యద్ అను వానిని స్వీకారము చేసికొనిరియెను. మహమ్మదు నలుబదియేండ్లవయస్సు వచ్చినప్పుడు మతవిషయములను గూర్చి ఆలోచించు చుండెను. అప్పుడు బొస్రాపువాఁడైన బుహీరా అను నెస్తోరియ సన్యాసియును; తనభార్యకు జ్ఞాతి యైనట్టియు, యూధమతగ్రంథములను, క్రీస్తుమతగ్రంథములను బాగా తెలిసికొనినట్టి వరక అను నతఁడును, మహమ్మదుకు మతవిషయమున సహాయము చేయు చుండిరి.

మతముయొక్క సత్యమును కనుఁగొనుటకై మహమ్మదు పర్వతములలోని గుహలయందు నేకాంతముగ వాసము చేయు చుండెను అప్పుడు జిబ్రాయేల్ అను దేవదూత మతసంబంధ మైన సంగతులను మహమ్మదునకు తెలియఁజేసెను అంత మహమ్మదు తాను నూతన మత నిర్మాణము చేయుటకై వచ్చితి నని చెప్పెను ఇట్లు చెప్పిన మహమ్మదుమాటలను కొందఱు విశ్వసింపక పోయినను ఆయనతోఁ జేరినవా రందఱును నమ్మి యుండిరి. ఇవ్విధముగా మహమ్మదు నూతనమతమును స్థాపింపఁగా ఖోరైష్ గోత్రస్థు లైన అబ్దుల్ ముతలిబ్ సంతతివా రందఱును మహమ్మదుమతము ననుసరింపని వారై ఆయనను విరోధించుచు చంపుటకు ప్రయత్నించి యుండిరి. అయినను అబుతలీబు మహమ్మదువిషయ మై జాగరూకత గలిగి అతనికి కీడు రాకుండ కాపాడు చుండెను. తర్వాత కొంతకాలమునకు ఖోరైష్ గోత్రమువారు తప్ప తక్కినవా రందఱును మహమ్మదుమతము నవలంబించిరి.

మహమ్మదుపెత్తండ్రి యైన అబుతలీబు మహమ్మదుయొక్క ఏఁబదియవసంవత్సరమున మృతిజెందినందువలన మహమ్మదుశత్రువులు (కాఫర్లు) మరల మహమ్మదును తొందరపెట్ట నారంభించిరి. అబుతలీబు చనిపోయిన కొన్నాళ్లకు ఖాదిజాయును చనిపోయెను. ఆమీఁద రెండు నెలలకు మహమ్మదు సూదా యను స్త్రీ నొకతెను, అయేషా యను పడుచును పెండ్లాడెను. తర్వాత నాలుగేండ్లకు హఫ్జా యను స్త్రీని, మరల నొక సంవత్సరమునకు ఓంశల్మా అను యువతిని పెండ్లాడినదే గాక, మహమ్మదు తనపెంపుడుకుమారు డైన సయ్యదుభార్యను చూచి మోహింపఁగా, సయ్యద్ తన

భార్యను పరిత్యజించినంత దానిని, మఱియు రెండుమూఁడేండ్లకు సఫీయాయనుయొక్క-తెను, ఆతర్వాత మఱియు యను నొకబానిసకత్తెను, తుదకు మైమూనా అనుదానిని పెండ్లాడెను. మఱియు ఇద్దరు ఉంపుడుకత్తెలను నుంచుకొని యుండెను.

ఆమీఁద మహమ్మదు దేవలోకమునకుఁ బోయి దేవునిదర్శించి వచ్చి మఱికొన్ని మతవిషయములను బోధించుచుండెను ఇట్లు మహమ్మదు దేవదర్శన మైనదని చెప్పినందున ఖోరైష్‌గోత్రస్థులకు మఱింత ఆగ్రహము కలిగి మహమ్మదును చంపవలయు నని నిశ్చయించి ఆతనియింటిని చుట్టుకొనిరి. ఇట్లు శత్రువులు తనను చంపవచ్చు చున్నారను వర్తమానమును మహమ్మదు తెలిసికొని మక్కాను విడిచి యత్రిబ అనఁబడు మదీనాకు పోయెను. అరబ్బీభాషలో పోవుటకు "హిజరత్" అను పేరు గాన మహమ్మదు మదీనాకు పోయినదినము మొదలు మహమ్మదుశకమునకు "హిజర" అను పేరు పెట్టుకొనిరి. ఈ హిజరి మహమ్మదుపుట్టిన 52 వ సంవత్సరమున కలిగెను. అనఁగా క్రీస్తు పుట్టిన 622 వ సంవత్సరము జూలై నెల 15 తేది మొదలు హిజరసంవత్సరము ప్రారంభమైనది. మహమ్మదు మదీనాకుపోయినమీఁద మదీనాలో ననేకులు శిష్యులైరి. తర్వాత మక్కాలో నుండిన అతనిశిష్యబృందము వచ్చి ఆశ్రయించి యుండిరి.

మహమ్మదు మదీనాలో మసీదుకట్టించి ప్రసంగములు చేయుచు, అప్పుడప్పుడు దేవదూతలు చెప్పెడుసంగతులను చెప్పుచు నుండెను. ఖోరైష్ గోత్రపువారి పోరు మాత్రము మానకయుండెను. తర్వాత మహమ్మదుకును ఖోరైష్‌గోత్రస్థులకును యుద్ధములు జరుగుచుండెను గాని తుదకు మహమ్మదే జయము నొంది మక్కా మొదలగు గొప్పపట్టణములను స్వాధీనము చేసికొనెను. ఆ తర్వాత మహమ్మదు మక్కాసమీపమున నుండు కాబచుట్టుయేడుమార్లు ప్రదక్షిణముచేసి, యచ్చోట దేవలోకమునందుండి పడినట్టి నల్లరాతిని ముద్దుపెట్టుకొని, తర్వాత అరఫాత్ కొండను ప్రదక్షిణము చేసి, అచ్చట అదివఱకును పూజించు చుండిన 360 విగ్రహములను పాడుచేసి క్రీస్తుపుట్టిన 632 సం. జూన్ 8 వ తేది మృతినొందెను. ఒక యూదస్త్రీ మహమ్మదుకు విషమిచ్చినందున మృతి జెందె ననియుఁ జెప్పుటకలదు.

మహమ్మదు చనిపోయినతర్వాత మహమ్మదుకుమార్తె యగు ఫాతిమ అనుదాని భర్తయైన ఆలి యనునతఁడు మహమ్మదుపీఠము నధిష్ఠించి ఖలీఫుఅయెను. మహమ్మదు ప్రియభార్యయైన అయేషా తనతండ్రియైన అబుబకర్ అను నతనిని ఖలీఫు చేసెను. ఇట్లు ఖలీఫులు వేర్వేరైనను మతముమాత్రము శీఘ్రకాలమున పారసీకము, అరేబియా, ఈజిప్టు మొదలగుదేశములయందు వ్యాపించెను.

మహమ్మదుమతసిద్ధాంతము:—ఈమతమును ఇస్లాంమతే మనియుం చెప్పట కలదు. ఇస్లామ్ అనఁగా భక్తి అని యర్థము. వీరివేదమునకు ఖోరాణ్ అని పేరు. ఇది జిబ్రాయేల్ వలన మహమ్మదుకు లభించెను గాన దేవవాక్య మనఁబడును. ఖోరానును శ్రేష్ఠమైన పుస్తకము (అలికితాబ్) అని చెప్పఁబడయును కలదు.

ఈ ఇస్లామ్‌మార్గమునందు రెండువిధము లయిన ప్రధానభాగములు కలవు. అనఁగా విశ్వసింపఁదగిన "ఇమాం" అనునదియును, ఆచరణక్రమమైన "దీక్ష" అనునదియు నని తెలియఁదగినది.

ఇమాం ఆఱువిధములు:— 1 అల్లాయొక్కఁడున్నాఁడు. 2 దూత లున్నారు. 3 వేదము గలదు. 4 నబిపురుషులుగలరు. 5 మృతశరీరము జీవించి న్యాయతీర్పు బడయును. 6 నజీబ్ అను విధిప్రకారము నడుచుకొనవలయును.

1. నిజమైన అల్లా అను దేవుఁడుతప్ప మఱియొక్కఁడును లేఁడు అల్లాహురాబ్ అనియు పేరు గలదు.

2. జిబ్రాయేల్, మిగాయేల్, అస్రాయేల్, ఇస్రఫేల్ అను దేవదూతలు కలరు. ఇబిలీస్ అను సైతాను (పిశాచి) యున్నది. ప్రతిమనుష్యునితోడ రెండుదూత లుండి పుణ్యపాపములను ప్రతిదినమును వ్రాయుచుందురు.

3. తౌరాతు, జబూరు, ఇంజీల్, ఖోరాన్ అనునివి వేదపుస్తకములు.

4. 224100 నబీలున్నారు. వారిలో ఆదాం, నోవా, అబ్రహామ్, మోసే, ఈసా, మహమ్మదు అను వీరు శ్రేష్ఠులు.

5. ఏడు మోక్షలోకములును, ఏడు నరకలోకములును గలవు. పుణ్యాపాపములు త్రాసులో నుంచి తూఁచఁబడును.

6. లోకమాద్యంతమును నజీబ్ అను విధిప్రకారము జరుగుచున్నది.

ఆచరణక్రమమైన దీక్ష నాలుగువిధములై యున్నవి. 1 నమాజు చేయుట. 2 భిక్షాక్రమము. 3 ఉపవాసము. 4 మక్కాయాత్ర.

1. ప్రతిమనుజుఁడును స్నానముచేసి దినమొక్కటికి 5 మార్లు మక్కావైపున ముఖమునుంచి కిబ్లానుచూచి నమాజుచేయవలయును. ముసల్మానులు కొందఱు 99 పూసలు గల జపమాలను చేతనుంచుకొని మహమ్మదుయొక్క విశేషనామములైన 99 నామములను జపము చేయుదురు

2 తన ఆస్తియందు సగము దేవునికర్పించుట, తక్కినదానిని ఉత్సాహములోఁ దగినవారికి దానము చేయుట.

3. రంజాన్ నెలలో ఖోరాను వచ్చినది గాన ఆనెలయందు పగలంతయు ఉమ్మి నీరైనను మ్రింగక నుపవాసము చేయవలయును.

4. ఇస్లాముమతస్థుఁడు తన జీవితకాలములోపల మక్కాయాత్రను తప్పక చేయవలయును.

మహమ్మదునబి మక్కాకు శుక్రవారము పోయినందుచే శుక్రవారమునాఁడు మిసల భక్తితో విశేషముగ దేవునిధ్యానింతురు. పిల్లవాండ్రకు సున్నతి చేయుదురు. వ్రతములు చేయుదురు. వీరికి నమాజు చేయవలసినది ముఖ్యవిధియై యున్నది. నమాజు చేయునపుడు మక్కాలోని కిబ్లావైపును (అనఁగా పడమటిదిక్కును) జూచి నమాజు (ప్రార్థన) చేయుదురు. ఈ నమాజులో ఫాతిహా అను దేవునిస్తోత్రము విశేషమైనది. మత్తుద్రవ్యములు సేవింప రాదు. భగవంతుని కర్పితము చేయని మాంసమును దినరాదు. వీరిలో 73 భేదములు గల జాతులలో నొకరికొకరు నడ్డి పుచ్చుకొనగూడదు. మత కలహములు చేయుటవలన మోక్షము కలుగును.

మహమ్మదు మతస్థులకుతప్ప తదితరులకు మోక్షము లేనేలేదు. మహమ్మదీయులలోను పాపకార్యములు చేసినవారికి నరకలోకవాసమును, పుణ్యకార్యములు చేసినవారికి స్వర్గలోకవాసమును గల్గును. మఱియు హిందువులశాస్త్రములలోఁ జెప్పఁబడినవానికంటె నెన్నియోరెట్లు పుణ్యపాపలోకములు వారిశాస్త్రమునఁ గలవు.

ఈ మతస్థులలో అలిని చేరినవారు షీయావా రనియు, అబుబకరును చేరినవారు సున్నీవా రనియు చెప్పఁబడుదురు. షీయామతస్థులు ఖోరానునుమాత్రము నమ్ముదురు. వీరిలోని జ్ఞానులకు సొఫీ లని పేరు. సున్నీలు ఖోరానునుమాత్రమేగాక మహమ్మదు నబి చెప్పినవానినంతయు న్యాయ్యమని గ్రహించి యాపద్ధతిచొప్పున వర్తింతురు. వహాబీ లనువారు ఖోరానులో చెప్పినట్లు నడువవలయు నని చెప్పుదురు. మహమ్మదు మతస్థులు చేయు మొహరంపండుగను ముఖ్యముగా షీయావారే జరుపుచుందురు. మహమ్మదుమతసిద్ధాంతప్రవర్తకులకు మౌల్వీ లని పేరు.

ఖోరానులో మహమ్మదీయుఁడు నల్వురికంటె నెక్కువమందిని వరించకూడ దని చెప్పఁబడి యున్నది. అయినను మహమ్మదుకుమాత్రము యెక్కువమందిని వరించుటకు దేవుఁడు సమ్మతించినాఁ డని ఖోరానులో 33 వ సురలో 37-38 ఆయతుల యందు వ్రాయఁబడి యున్నవి. తక్కిన నీతి, న్యాయము, ధర్మము, దానము మొదలగు పద్ధతు లన్నియును, ఇంచుమించుగా హిందూమతగ్రంథముల ననుసరించియే యున్నవి.

## యూథమతము.

యూథదేశములోని మతమునకు యూథమత మని పేరు. ఆదియందీదేశమునుండి యే బైబిలు, ఖోరాన్ మొదలగు మతగ్రంథములు కలిగెను. కాఁబట్టి క్రీస్తుమతమున కును మహమ్మద్ మతమునకును యూథదేశము మాతృస్థానమై యున్నది. ఈ దేశము నందు వాడఁబడు హిబ్రూభాష సంస్కృతమునకు సామీప్యముగ నుండును ఈభాష క్రీస్తుపుట్టుటకుముందు అయిదవశకాబ్దమున గల్గినట్లు తలంచెదరు.

ఆదియందు యూథులు లూ, బెల్, సెట్ అను మూఁడు దేవతలను విగ్రహములుగఁ జేసి పూజించుచుండిరి. మఱియు వ్యభిచారాది అకృత్యములను జరుపుచుండిరి గాని క్రమక్రమముగా నాగరికత గలవారైరి. ఈమతముయొక్క ముఖ్యతాత్పర్యము లన్నియును బైబిలుమొదటిపుస్తకమునఁ గనందగును. యూథులు, క్రీస్తువులు, మహమ్మదీయులు, అను నీత్రిమతస్థులకు బైబిలుమొదటిపుస్తకము కొంచెము భేదములో సిద్ధాంతమై యుండును.

ఎట్లనఁగా:—నోవహు, అబ్రహామ్, మోసే, దావీద్ మొదలగువారిని యీ త్రిమతస్థులును ఒప్పుకొనుచున్నారు. యూథులు మతవేదమునకు పలువిధములైన అర్థములను జేయుదురు. పారంపర్యన్యాయములు గల మిసినాగ్రంథమును, దీనికి టీకయైన జమ్రాసును, దీనికి వ్యాఖ్యానమైన తాల్మద్ అను గ్రంథమును కల్పితకథలైన కబాలాగ్రంథమును యూథమతసిద్ధాంతములను వివరించును. అయినను, పంద్రెండవ శకాబ్దమునందు మెయ్మానిడ్సు అను పేరుతో కొన్నిప్రమాణముల నేర్పఱుచుకొనిరి. ఆ ప్రమాణప్రకారము అశరీరియైన దేవుఁడొక్కఁడుగలఁడు దీర్ఘదర్శకులవార్తలు సత్యములు, మోసే ప్రధానగురువు, మోసేవత్తురు; చచ్చినవారు మరల బ్రతుకుదురు, అనునీ మొదలగునవి చెప్పఁబడి యున్నవి. మఱియు మనస్తాపమువలనను, మోసేయొక్క న్యాయప్రమాణముల ననుష్ఠించుటవలనను, పాపపరిహార మగు ననియును చెప్పెదరు. పూర్వము ఈ మతస్థులలో దేవుని న్యాయముతో స్తుతించునట్టి తెగవారొకరును, బలులచేతను, జ్ఞానస్నానముచేతను ధ్యానించునట్టి తెగవా రొకరును గలరు. ప్రస్తుతకాలమున అయిదుతెగలుగ నున్నారు.

## క్రీస్తుమతము.

ప్రస్తుతకాలమునందు సకలదేశములయందును వ్యాపించియుండు మతము క్రీస్తుమతము. ఈ మతస్థుల వేదమైనట్టి బైబిలుప్రకారము లోకమంతయు ఆఱుదినములలో సృష్టి చేయఁబడినది. మొదటిదినమున ప్రకాశమును, 2వ దినమున గాలిని,

మేఘములను; 3 వ దినమున భూమిని, సముద్రమును, మొలచునట్టి పదార్థములను; 4వ మున సూర్యచంద్రనక్షత్రములను; 5 వ దినమున చేపలను, పక్షులను; 6 వ దినమున మృగములను, సరీసృపములను, మనుష్యులను ఆదిదేవుఁడు కలుగఁజేసినాఁడు. 7-వ దిన మైన/ఆదివారమునాఁడు దేవుఁడు విశ్రాంతి నొందెను. ఈ దినమును సబ్బాతుదిన మని చెప్పుదురు. ఇదే దేవుని స్తుతించు దినము. దేవుఁడు మనుష్యులను సృష్టించుటకు పూర్వము ఆదిమనుష్యునిగా ఆదామును సృష్టించి ఆదాముయొక్క యెడమభాగము లోని కొంచెము మజ్జాస్థిని గ్రహించి హవ్వను సృష్టించెను ఆ యిర్వురును ఏదెను తోటలో నుండఁగా సైతానువలన దేవునియాజ్ఞను అతిక్రమించి తినవలదనిన పండును తిని పాపమును బొందిరి.

తర్వాత ఆ యిర్వురకు కాయీను, ఏబేలు అను ఇర్వురు కొడుకులు పుట్టిరి. కాయీను దుర్మార్గుఁడై యుండెను. ఏబేలు తన అన్నను చంపెను అప్పుడు దేవుఁడు ఏబేలును జూచి నీ యన్న యెక్కడ యున్నాఁ డనఁగా నేనెఱుఁగను పోపొమ్మని చెప్పెను. ఆ తర్వాత దేవుఁడు ఆదాము హవ్వలను కనికరించి షేతు అను కుమారుని నిచ్చెను. ఈ షేతును అనేకులు పుట్టిరి. అందఱు దుర్మార్గులై యుండిరి అందు నోవహు అనువాఁడు మంచివాఁడై యుండెను. తరువాత ఆదాము హవ్వ షేతు అను వీరంద ఱును గతించిరి అపుడు దేవుఁడు నోవహును ఓడ నిర్మించుకొని యందు సమస్త పదార్థములను, క్రిమికీటకాదులను, ఓడయందెక్కించుకొను మన నతఁడు తనభార్య తోడను, ముగురుసమాళ్ళతోడను, ముగ్గురు కోడండ్రతోడను ఓడ నెక్కెను. అంత 40 దినములు రేయింబవళ్ళు వర్షము కురిసినందున జలప్రళయమై యా యోడలోనివారు తప్ప మిగిలినవంతయు నాశ మాయెను. ఆతర్వాత జలము ఇంకెను. తర్వాత ఓడలోని వస్తువులను లోకమున వ్యాపింపఁజేసెను. తనసంతతి వారివలన లోకము వృద్ధినొం దెను ఇది క్రీస్తుమతసృష్టిక్రమమై యున్నది. ఇంతేగాక లోకసృష్టియై 6000 సంవ త్సరము లైనట్లుగా జెప్పెదరు.

ఈ మతమున కాదిపురుషుఁడు అబ్రహాము. అతని సంతతితోఁ జేరిన యోసే పునకు మరియు యను భార్యయందు పరిశుద్ధాత్మవలన సంగమము లేక బెత్లహేము దేశమున క్రీస్తువు జన్మించెను. ఆయనకు ఏసు అనియు పేరు కలదు. ఇట్లు పుట్టిన దేవునికుమారుఁ డైన ఏసును సైతాను అనేకహింసలపాలు చేసెను. తర్వాత దేవుని యాజ్ఞాప్రకారము క్రీస్తువు తన్ను గొల్వవలసినదిగా జెప్పుకొనెను. క్రీస్తుమాటలను యూదులు నమ్మక పోయిరి క్రీస్తు ముసలివారిని పడుచువారినిగాను, చచ్చినవారిని బ్రతికించియును, రోగములను నివర్తించియును, మఱియు నీరీతి అద్భుతకార్యము లను చేసెను. అయినను ఎరుసలేములోని యూదులు క్రీస్తువు దేవునికొమారుఁడు

కాఁడని చెప్పి, ఆయేసును 34వ యేఁట సిలువలో వేసి చంపి పాతించిరి. మరణసమయమునను పరులను వారు నిందించ లేదు. తర్వాత మూఁడవదినము క్రీస్తు మరల సమాధియందుండి లేవఁగా నతనిశిష్యులు మిగుల విశ్వాసముతో ప్రబన్ధరించిరి. మఱియు యూధులలో ననేకులు క్రీస్తుభక్తులైరి క్రీస్తువునుగుఱించి మతపరీక్షయం దీలాగు చెప్పఁబడి యున్నది

శ్లో. మృతో ऽయఃపశ్చాత్తృతీయేహ్ని పునర్జీవన్ బభౌ భువి,
ఖృష్టే చ స్వర్గ మారూఢే సత్య స్త చ్చరితానివై,
లోకే ప్రాచరయన్ గత్వా తస్య శిష్యా ఇత స్తతః.
శ్రీ ఖృష్టో నృమహత్రాతా వవతా రేశ్వరాత్మజః,
కుమార్యాశ్చ సుతో జాతో యేషూ ఖృష్టాభిధోపి చ.

క్రీస్తుమతసిద్ధాంతము:—ఈ మతస్థులజను లందఱును చచ్చినమీఁద న్యాయవిచారణ జరుగును. అప్పుడు క్రీస్తువును నమ్మినవారికి మోక్షలోకమును, తక్కినవారికి నరకలోకమును సిద్ధించును. అంతవఱకును చచ్చినవారిఆత్మలు సమాధియందు (పాతిపెట్టిన చోటునందు) ఉండును. మఱియుక్రీస్తువు కాలమునందు సున్నతి మిగుల ప్రబలమై యుండెను. క్రీస్తువు దానిని నిరసించి జ్ఞానస్నానమును స్థాపించెను. ఏసు పరలోకమునకుఁ బోవుటకు ముందు శిష్యులకు బోధించినచొప్పున నడుచుకొందురు. పూర్వకాలంబున జ్ఞానస్నానము బొందఁగోరినవారిని నదీసరోవరాదులకుంగొనిపోయి మునుఁగునట్లుచేసి ఆ తర్వాత ప్రాతగుడ్డలనుతీసివైచి తెల్లనిగుడ్డల నిచ్చి గుడికి బిలిచికొని పోవుచుండిరి. యిరోపాలో చలి యధికము గాన ఆపద్ధతిని విడిచిపెట్టి తలమీఁద మాత్రము నీళ్లను ప్రోక్షించువాడుక ప్రబల మైనది ఈలాగు స్నానము చేయించుటకు పాదిరీలును, వారియధికారమును బొందినవారును అర్హులు. క్రీస్తుమార్గము నవలంబించువారు మొదట జ్ఞానస్నానదీక్షను బొందవలయును.

మఱియు క్రీస్తువు పరలోకమునకు బోవుటకుముందు తనశిష్యుల (అపోస్తలుల)తోఁ గూడి రాత్రిలో జ్ఞానభోజనము చేయుచుండిరి. తర్వాత క్రీస్తువు పరమండలమునకుం బోవునప్పుడు తమయొక్క మాంసమును అప్పముగాను, తమరక్తమును రసముగాను భుజింతురు గాక యని చెప్పిరి. కాఁబట్టి యిప్పుడు క్రీస్తువు చెప్పినచొప్పున వారి దేవాలయములయందు ఆ దినమున (రొట్టె) అప్పమును, (ద్రాక్షసారాయి) రసమును స్వీకరించెదరు. మిగతను తమ గృహములలోని వ్యాధిగ్రస్తులకు దీసికొనిపోయి యిత్తురు. ఈ అప్పమును, రసమును, క్రీస్తువుయొక్క మాంసమును రక్తమునై యుండుటచేత దీనిని స్వీకరించువారు పరిశుద్ధు లగుదురు.

వర్తమానకాలమునందలి క్రీస్తుమత భేదములు:—17 వ శతాబ్దమునఱకు క్రీస్తుమతస్థులకలహములు జరుగుచుండెను ఆదియందు రోమన్ క్యాథలిక్ వారనియు, తర్వాత ప్రొటెస్టాంటువారనియును ఇరుతెగలుగనుండి పోరాడుచుండిరి. ఆ తర్వాత మఱియు ననేక భేదములతో క్రీస్తుమతము వ్యాపించినది ప్రకృతమున 25; క్రీస్తుమత సంఘములు కలవు. వానిలో ముఖ్యమైనవాని నిట చెప్పఁబడుచున్నది.

గ్రీక్ సంఘము:—ప్రధానాచార్యుఁడను పోపు క్రీస్తుసభకు అధ్యక్షుఁడు కాఁడు, అప్పమును ద్రాక్షరసమును క్రీస్తువుయొక్క మాంసమును రక్తము కాదు, వేద పుస్తకమును తమతమభాషలలో వ్రాసి పఠింపవచ్చును, పాపనివారణమును విక్రయింపఁదగదు, పరిశుద్ధాత్మ పుత్రునియందు లేదు, అతనితండ్రియం దున్నది, ఉద్ధరించుస్థలము లేదు, గురువులు చేసికొను వివాహమునకు భంగము చేయరాదు.

రోమాసంఘము:—ఈ సంఘమునకు ప్రధానగురువు పోపు. ఈ పోపుయొక్క ఉత్తరవు చొప్పున సకలకార్యములు జరుపవలయును రోమన్ మతస్థులకును, తక్కిన మతస్థులకును గల ముఖ్యభేదములు ఆఱు. (1) అన్యభాషలలోని బైబిలు చదువఁగూడదు, గురువుల యనుమతి యైనచో అన్యభాషలలోని వేదపుస్తకములను జదువవచ్చును. (2) అన్యభాషతో దేవారాధన జరుపవచ్చును. (3) చచ్చినవారిని గుఱించి విజ్ఞాపనము చేయవలయును. (4) గురువుయొద్ద పాపసంకీర్తనము చేయవలయును. (5) గురువులు వివాహము చేసికొనరాదు. (6) లౌకికవిషయములలో గురువులు ప్రవేశింపనగును. మఱియు పోపువాక్యము దేవవాక్యముతో తుల్యముగ నెంచవలయును. మరియ మొదలగు సకలభక్తులును పూజనీయులు. మేనెలలో ఉపవాసము చేయవలయును

లూథర్ సంఘము:—వేదము ప్రమాణగ్రంథము. విశ్వాసముచే మనుష్యులు నీతిమంతులగుదురు. రోమన్ సభవారితప్పులను తొలఁగింపవలయును. పెద్దల యనుమతిచొప్పున కార్యములను జరుపవలయును.

ఈ లూథరు 1533 సం. నవంబరు 1) తేది జర్మనితోఁ జేరిన నొకపల్లెటూరియందు పుట్టి శిశుకాలమున గొప్ప విద్వాంసుఁడై గొప్ప యుద్యోగములను బడసియుండఁగా, 1517 సంవత్సరమున, పోపులు జనులపాపములను క్రయమునకు గొనుచున్నారని విని, దానిని ఖండించి, అదివఱకు ప్రకటింపని బైబిలును ప్రకటించెను. అప్పుడు లూథరును దండించుటకు పోపు జర్మనిచక్రవర్తిని పురికొల్పెనుగాని, ఇతఁడు అన్నిటికిని తప్పించుకొని 1525 సంవత్సరమున పెండ్లిచేసికొని మతవ్యాప్తము చేయుచు 1546 వ సంవత్సరమున గతించెను.

ప్రోటస్టాంటుసంఘము:—క్రీస్తుపుట్టిన 1529 సం. నందు లూథరు చెప్పిన పద్ధతి ననుసరించి వర్తించువారు ఆదియందు ఆర్మీనియావారీమతము ననుసరించియుండిరి ఇప్పుడు రోమన్ క్యాథలిక్ మతస్థులుతప్ప, తక్కినవా రందఱును చాలవఱకు లూథరుయొక్క పద్ధతినే యనుసరించి యున్నారు.

మొరేనియన్సులు:— వీరు లూథరు అభిప్రాయముల ననుసరించి యించుమించుగా నడుచుకొనువారు. పూర్వమున వీరు ఒకరికాళ్లనొకరు కడుగు చుండిరి. కాళ్లకేమియుఁ దొడుగక నడుచు చుండిరి అన్యమతస్థులను క్రీస్తువులుగ చేయుటయే శ్రేష్ఠమని తలంచి వర్తించు చున్నారు.

బాప్టిస్టుసంఘము:—దేవునియందు మిగుల విశ్వాసము గలవారికిమాత్రము జ్ఞానస్నానము కలదు. పిన్నవాండ్రకు లేదు. తక్కిన విషయములు స్వేచ్ఛాసంఘముల చొప్పున నుండును. మఱియు దీనియందు అనాబాప్టిస్టు, సెవన్తుడే (7 దినముల) బాప్టిస్టు, పర్టిక్యులర్ అండ్ జనరల్ (విశేషసాధారణ) బాప్టిస్టు, పిడోబాప్టిస్టు అను నిత్యాదిభేదములు గలవు.

వెస్లియన్ సంఘము:—వెస్లియన్ అను నొక జ్ఞానియొక్క బోధనలచొప్పున ప్రవర్తింతురు. మఱియు ఆర్మినియన్ గారి బోధన నొప్పుకొందురు. జాన్ వెస్లి, చార్లెస్ వెస్లి అను నిద్ద రన్నదమ్ములు. అమెరికాలో మతవిషయముగ ప్రసంగము చేసి, తర్వాత యిరోపాలోను ప్రసంగము చేసి యనేకశిష్యులను జేర్చుకొని ఈ సంఘమును స్థాపించిరి.

ఒయిట్ పీటిస్టుసంఘము:—ఈ సభలో జేరినవారు ఏసుక్రీస్తువువలె పరిశుద్ధమైన విశ్వాసమును సత్యమును గలవారై యుందురు. వీరు చాలవఱకు ఆర్మినియన్ వారిపద్ధతి ననుసరించి యున్నారు.

కాల్వెనిస్టుసంఘము:—వీరు 16 వ శతాబ్దమున సంఘసంస్కరణదక్షుఁడై యుండిన జాన్ కాల్వెన్ అనువారిపద్ధతి ననుసరించి యుందురు. ఆదియందు దేవుఁడు లోకమును సృజించినప్పుడే మనుష్యులందఱు నడుచుకొనవలసినవానిని నియమించి యున్నాఁ డని చెప్పుదురు. వీరు రోమన్ మతస్థులను ఖండించు చుందురు.

అంటినోమియన్ సంఘము:—వీరిసిద్ధాంతప్రకారము విశ్వాసమువలన మోక్షము లభించును. సత్కార్యములచేతను, దుష్కార్యములచేతను, సాధకబాధకములు లే వనియును చెప్పుదురు.

ప్రిస్బిటేరియన్ సంఘము:—వీరు సభ మొదలగుకార్యములను పెద్దలవలన జరిపింపవలయు నని చెప్పుచున్నారు.

యూనిటేరియన్‌సంఘము:—ఇది నాలుగసశతాబ్దమున అరీస్ అను వారిచే స్థాపిత మైనది. దైవికస్వభావమున మూఁడువిధము లైన పురుషులు లేరు. ఏసుక్రీస్తు యొక్క ఆత్మ ఆదియం నుండినది కావున, ఏసును పూజింప రాదు. ఆతనిపాపమే ఆతనిమరణమునకు దంషనము. ప్రతివాఁడును తన పుణ్యపాపములకుఁ దగినఫలము ననుభవించును.

సొసినియన్‌యూనిటేరియన్ సంఘము:—ఏసుక్రీస్తు జోసప్ మేరీలకు న్యాయముగాఁ బుట్టినవాఁడు. పరిశుద్ధాత్మ యనునది దేవుఁడు కాదు. పూర్వపాపము లేదు. వారివారినడతకుఁ దగిన ఫలమును బొందుదురు. ఆఫ్రికాలో నుండు మఱియొక యూనిటేరియన్సుసంఘమువారు దేవుఁ డొక్కడే యనియును, ఆతఁడు పురుషరూపముగా నున్నాఁ డనియును జెప్పుచున్నారు.

లండన్‌సంఘము:—ఈ సంఘము 1795 సంవత్సరమునందు స్థాపింపఁబడినది. 18 4 సంవత్సరమునందు చీనాదేశములోను వ్యాపింపఁజేసిరి. వీరు హిందూదేశమున ననేకస్థలములలో నీ సంఘమును స్థాపించిరి. ఇది యించుమించుగా యింగ్లండులోని రోమన్‌సంఘపద్ధతి ననుసరించి యుండును.

స్కాట్సుసంఘము:—వీరి యనుష్ఠానము ప్రొటస్టాంటుపద్ధతి ననుసరించి యుండును విద్యాదానమునందు వీరి కాసక్తి మెండు.

ఇంగ్లీష్ ఇపిస్కోపల్‌సంఘము:—ఈ సంఘమున ఉపదేశము చేయు డీకన్సు అను సహాయబోధకులును, ప్రీస్టు అను గురువులును, బిషప్పు లను మతాచార్యులును గలరు. మఱియు విచారణకర్త లనేకు లున్నారు. ఇతరసంఘము లన్నిటికంటె నీ సంఘమున ఆడంబర మధికము.

క్వాకర్ సంఘము:—బోధన చేయువారు మోకా లూని ధ్యానింపఁగా తక్కిన వారు నిలువంబడి ధ్యానించు చుందురు. వీరిలో జలముచేత చేయు జ్ఞానస్నానము ప్రయోజనము కాదు. అబద్ధము మొదలగు దుర్గుణములను విడువవలయును. సువిశేష గ్రంథములను అమ్ముట తగదు. తీయుటయు తగదు. ఉపదేశము చేయుటకు స్త్రీలును పురుషులును తగియుందురు.

స్వీడన్ బర్గీన్‌సంఘము:—12౬౯-వ సంవత్సరమునందుఁ బుట్టిన యిమ్మానుయెల్ అనువారిపద్ధతి ననుసరించినవారు. వీరు త్రియేకత్వ మను పితా పుత్రాత్మలను పురుషాకారముగఁ జేసి ధ్యానింతురు. విశ్వాసము గలిగి సన్మార్గులై యుండవలయును. ప్రతివాఁడును పాపమునుండి వీడుటకు స్వతంత్రము గలిగి యున్నాఁడు స్థూలదేహము గతించినమీఁద సూక్ష్మదేహము దేవునియొద్దకుపోయి చేరును. ఈ సంఘముతోఁ జేరి నట్టి కొంచెము భేదము గల సంఘము లనేకములు గలవు.

ఫ్రీమేసన్ సంఘము:— ఈ సభ ప్రపంచము పుట్టినది మొద లున్నదని చెప్పుదురు. నోవా మనువ డైన మిత్సారియిం అనువానిచే ఐగుప్తుదేశములో స్థాపింపఁబడినట్లు కొందఱు చెప్పెదరు. ఇట్లే పలువురు పలువిధములుగాఁ జెప్పుచున్నారు. ఈ సంఘము పోపులవలన కొంతకాలమువఱకు వృద్ధి యాయెను. తుదకు పోపులే దీనిని చెడఁగొట్ట ప్రయత్నించిరి. అదిమొదలు యింగ్లండుచక్రవర్తియే యీ సభకు అగ్రాసనాధిపతి యాయెను. ఈ మతస్థులకు బైబిలుతో పనిలేదు. ఒకదైవమును నమ్మి యున్నారు. వీరు సహోదరవాంఛను వృద్ధిచేసి పరిశుద్ధులై యీ లోకమును స్వర్గలోకముగఁ జేయుటకుఁ బ్రయత్నించెదరు. ఇం దనేకరహస్యములు గలవు. చిహ్నములును గలవు. అవియెల్లను తెలియచేయుగ్రంథములు లేవు. అందు చేరనివారికి తెలియఁజేయరు. ఇక్కాలమునందలి యింగ్లీషువారిలోని గొప్పవారంద ఱీ మతస్థులై యున్నారు. పెద్ద పట్టణములయందెల్ల నీ సభలు కలవు. ఇండియాలోను గలవు. హిందువులును అనేకులు చేరి యున్నారు. జాతివ్యత్యాసము లేదు. ఈ సంఘములోఁ జేరినవారికి ఆపత్కాలమున రక్షకము గలదు. స్కాటిష్ ఫ్రీమేసన్ సంఘములో నందఱును కలిసి భుజింతురు.

## యాదవమతము.

ఈ మతమును స్థాపించిన యాదవప్రకాశులు కలియుగము 4110 కి సరియగు క్రీస్తుశకము 1010 యం దవతరించిరి. వీరు బ్రహ్మసూత్రములకు అద్వైతపరముగా వ్యాఖ్యానము వ్రాసి యున్నారు.

యాదవమతసిద్ధాంతము:— సన్మాత్రస్వరూపం బగు పరబ్రహ్మము చిత్తు, అచిత్తు, ఈశ్వరుఁడు అను మూఁడువిధములుగ పరిణమించును. చిత్తనఁగా జీవుఁడు, అచిత్తనఁగా అచేతన మగు శరీరేంద్రియాదికము, ఈశ్వరుఁ డనఁగా సర్వనియామకుఁ డగు పరమచేతనుఁడు. జీవునకు అభేద మెఱుంగనందున కల్గు భేదజ్ఞానమే సంసార మనంబడును. సత్కర్మాచరణమువలన భేదజ్ఞానము నశించి సంసారమునుండి విముక్తుఁ డగును. ఈ సంసారమే జననమరణాత్మక మైనది. భేదజ్ఞాననివృత్తివలన జ్ఞానము కల్గి తద్ద్వారా బ్రహ్మప్రాప్తి కల్గును. భేదజ్ఞాననివృత్తివలన కల్గు జ్ఞానమును, బ్రహ్మప్రాప్తియును, ఈ రెండును మోక్ష మనంబడును. (వీరి చరిత్రమును రామానుజాచార్యులవారి చరిత్రమునందు జూడఁదగును.)

## భాగవతమతము.

ఈ మతమునకు శుకమహర్షి కర్త. శుకులవారు రచియించిన బ్రహ్మసూత్రభాష్యగ్రంథము యీ మతస్థులకు ప్రమాణగ్రంథము. ఇదిగాక శుకభాగవతమును వేదతుల్యముగాఁ గణించి, దానికి సర్వవేదాంతసార మని పేరిడఁబడి యున్నది.

ఈ మతమున ప్రకృతి, పురుషుఁడు, నారాయణుఁడు; అని తత్త్వములు మూఁడు. నారాయణుఁడే పరబ్రహ్మము. సర్వపాలకుఁడు. ప్రకృతివలన సంసారము కలిగియున్నది. పురుషులు జీవులు. ఈ జీవులు నారాయణభక్తిచేత తరింపవచ్చును. పురుషులు కర్మ భక్తి జ్ఞానములవలనను ముక్తిని బొంధనగును. నిషిద్ధకర్మలవలన నరకమును, ప్రవృత్తికర్మలవలన స్వర్గమును, నివృత్తికర్మవలన భక్తినిగాని జ్ఞానమునుగాని పొందనగును. జ్ఞానమువలన అనేకజన్మములకు అష్టాంగయోగసిద్ధి కలుగును. యోగసిద్ధివలన తత్క్షణమునగాని, ప్రారబ్ధాంతమునగాని, వైకుంఠమును జేరి బ్రహ్మానంద మనుభవింపనగును. మఱియు పురుషుఁడు అర్చిరాదిమార్గముగానైనను లేక యేలోకమునకుఁ బోక భూమినుండియే వైకుంఠమునకైనను వాని యిష్టానుసారముగాఁ బోనగును. రామకృష్ణాద్యవతారములు నారాయణతాదాత్మ్యసంబంధములే గావున, పురుషుఁడు వారిని ఆరాధించి ముక్తినిఁ బడయ నగును.

## మనస్సాక్షిమతము.

ఈ మతమును నెల్లూరుమండలములోఁ జేరిన శ్రీ వేంకటగిరి మహారాజులైన శ్రీవెలుగోటి సర్వజ్ఞకుమారయాచేంద్రభూపాలబహద్దరువారు క్రీస్తుశకము 1886-వ సంవత్సరమున స్థాపించిరి. ఇయ్యది అద్వైతమతమును విశిష్టాద్వైతమతమును బోలియున్నది. కనుకనే యీ మతమునందు భగవంతుఁడు నిరాకారిరై యుండినను వాసుదేవశబ్దముచే సాకారిరై యున్నాఁడు. "మనస్సాక్షి" అనఁగా, మనస్సునకు సత్యమని తోఁచినవి తప్ప, తక్కిన వన్నియును అసత్య మగుటచేత, వానిని నమ్మఁగూడదని ముఖ్యాభిప్రాయము.

మనస్సాక్షిమత ప్రధానసిద్ధాంతషట్కము:— 1 భగవంతుఁడు కలఁడు, 2 నిర్గుణుఁడైన భగవంతుని మనంబుచే ధ్యానము చేయవలయును; అనఁగా సర్వవ్యాపియైన భగవంతుని విగ్రహరూపముగాఁ జేయుటకు సాధ్యము కాదు కనుక ఆ భగవంతుని స్మరించుచుండవలయును. 3 పరోపకారము చేయవలయును. 4 స్వధర్మమును (జాత్యాచారధర్మములను) అనుష్ఠింపవలయును. 5 ప్రాణమునకంటె మానము ప్రధానము గనుక మానసంరక్షణమునందు దృష్టిని యుంచవలయును. 6 నాస్తికుఁడుగా నుండఁజనదు. ఏలన, నాస్తికునకు భగవంతుఁ డుండునేని దండనము కలుగును గాన, ఆస్తికత్వమే శ్రేయము నొసంగునట్టిదై యున్నది. ఈ విషయమునంతయును స్పష్టముగాఁ దెలియఁగోరువారు మనస్సాక్ష్యము మొదలగు గ్రంథములవలనఁ దెలియఁదగును. ఈమతమును ప్రకృతమున కొందఱుమాత్రము అవలంబించియున్నా రని తెలిసెడిని.

1. ఖాకీలు:—రామానందులవారి శిష్యులలో నొకరగు కిల్ అనువారు ఈ మతకర్త.

2. దాదాపంతులు:—దాదాపంత్ అనువారు యీ మతమునకు కర్త. ఈ మతస్థు లందఱును రామోపాసకులు.

3. రాందాసులు:—ఈ మతమునకు రాందాస్ అనువారు కర్త.

4. సనకాదిసంప్రదాయస్థులు:—వీరు రాధాకృష్ణోపాసనము చేయుదురు.

5. శక్తిభావులు:—వీరు రాధను పూజింతురు.

6. చరందాసులు:—వీరు రాధాకృష్ణుల నారాధింతురు.

7. మాధవులు, 8 వైష్ణవనాగులు, 9 హరిశ్చంద్రులు. అను నీ మతస్థు లందఱును వైష్ణవు లనఁబడుదురు. వీరికి శ్రీసంప్రదాయస్థు లనియు పేరు కలదు.

## అద్వైతమతము.

ఈ మతమును స్థాపించినవారు శ్రీ శంకరాచార్యులవారు. ఈ మతము శ్రీమన్నారాయణమూర్త్యాదులవలన కల్గినది.

### శ్లోకమ్.

నారాయణం పద్మభువం వసిష్ఠం శక్తించ తత్పుత్రపరాశరంచ
వ్యాసంశుకంగౌడపదంమహాంతం గోవిందయోగీంద్రమథాస్యశిష్యం।
శ్రీశంకరాచార్య మథాస్య పద్మపాదంచ హస్తామలకంచ శిష్యం
తం తోటకం వార్తికకార మన్యా నస్మద్గురూ౯ సంతత మానతోస్మి.

అనఁగా:—నారాయణుఁడు, బ్రహ్మ, వసిష్ఠులు, శక్తి, పరాశరులు, వ్యాసులు, శుకులు, గౌడపాదులు, గోవిందయోగి, శంకరాచార్యులు, పద్మపాదులు, హస్తామలకులు, తోటకులు, వార్తికకారులు. ఇట్లు అద్వైతగురుపరంపరలో జెప్పంబడియున్నది.

## శ్రీ శంకరాచార్యచరిత్రము.

భూలోకంబున సన్మతములడఁగి దుర్మతములు వ్యాపించియుండఁగా, దేవతలు కైలాసంబునకుం బోయి పరమశివుని ప్రార్థించిరి. అంత యీశ్వరుఁడు ప్రసన్నుండై కుమారస్వామినిం జూచి యిట్లనియె. భూలోకమున విష్ణువు సంకర్షణమూర్తియై యవతరించి దేవతాకాండమును వృద్ధి చేయుచున్నారు ఆదిశేషుఁడు పతంజలియై యవతరించి యోగకాండమును వృద్ధి చేయుచున్నారు. ఇప్పుడు నీవు భూలోకమున కుమారిలభట్టువై యవతరించి జైమినిసూత్రమును వృద్ధి నొందింపుచుండు మని చెప్పినదే

గాక, ఇంద్రుని సుధన్వుఁ డను రాజై యవతరించునట్లును, బ్రహ్మదేవుని మండనమిశ్రుఁడై యవతరించునట్లును అనుజ్ఞ చేసెను. అట్లే ఇంద్రుఁడు సుధన్వుఁడై పుట్టి భూలోకమేలుచుండెను. బ్రహ్మదేవుఁడు మండనమిశ్రుఁడై యవతరించి భట్టపాదులకు (కుమారిలభట్టులకు) శిష్యుం డాయెను. భట్టపాదులు నాస్తికులను జయించుచు సుధన్వుని యుద్దకుం బోయి యచ్చట గల బౌద్ధము మొదలగు నాస్తికమతములను జయించి కర్మకాండమును లోకమున స్థాపించుచుండిరి.

ఇట్లుండఁగా, కేరళ మను మలయాళదేశమున వృషభాచలమునందు పూర్వవాహినీతీరమున శశల మనెడి కాలటియగ్రహారంబున విద్యాధినాథుల కొక పురుషసంతతి కలిగెను. ఆ బిడ్డకు శివగురుస్వామి యని నామకరణము చేసిరి. ఆ శివగురువు క్రమక్రమముగా వృద్ధినొంది సకలకలాప్రవీణుఁడై మహీపండితునికుమార్తె యైన ఆర్యాంబను పెండ్లాడెను. తర్వాత శివగురుస్వామి సంతానము లేక మిగుల పరితపించుచు పరమేశ్వరునిఁగూర్చి తపము చేయుచుండఁగా వారికోర్కె దీర్చుటకును కైలాసవాసుఁడు లోకోద్ధారణ మొనర్ప నవతరించుటకును దగిన తలిదండ్రులు శివగురుస్వామి ఆర్యాంబలని యెంచి వారికి క్రీస్తుశకము 677, అనఁగా కలియుగము మూడువేలయేబది యెనిమిదవ సంవత్సరమునకు సరియగు ఈశ్వరసంవత్సరము వైశాఖమాసము శుక్లపక్షపంచమి భానువారము ఆర్ద్రానక్షత్రమునయం దవతరించిరి. ఇట్లవతరించిన నాశిశువును నొకనాఁ డొకగొప్పసర్పమువచ్చి చుట్టుకొనెను. మఱియొకనాఁడు శిశువు కనఁబడకుండఁగా తలిదండ్రులు చింతాక్రాంతులై యుండ నొక వృద్ధబ్రాహ్మణుఁడు వచ్చి ఆర్యాంబను వారింటనుండు గుమ్మడికాయ నిమ్మనఁగా నాయమ యీయఁగా వాఁడా గుమ్మడికాయను నేలం బడవైచెను. అందుండి యాశిశువు బయట వచ్చెను. మఱియు నా శిశువుయొక్క హస్తములయందు త్రిశూలాదిచిహ్నములు మెఱయుచు నుండెను. శిరమునందు జల మూరుచుండెను. ఇట్టి శిశువును సాక్షాచ్ఛంకరుఁ డని యందఱు నెంచుచుండిరి. ఇవ్విధముగా శంకరులు భూలోకమున అవతరించినందుచే వారిని సేవించునిమిత్తమై మహావిష్ణువు మొదలగు దేవతలు భూలోకమున నవతరించిరి. ఎట్లన, విష్ణువు పద్మపాదాచార్యులుగాను, వాయువు హస్తామలకాచార్యులుగాను, అగ్ని తోటకాచార్యులుగాను, బ్రహ్మదేవుఁడు సురేశ్వరాచార్యులుగాను అవతరించిరి. సురేశ్వరాచార్యులకు విశ్వరూపాచార్యు లనియును మండనమిశ్రు లనియును వివరణాచార్యు లనియును పేరులు గలవు. ఇట్లే దేవతలందఱును భూలోకమున నవతరించిరి. సరస్వతీదేవి విష్ణుమిశ్రభట్టాచార్యులకు పుత్త్రియై జన్మించి మండనమిశ్రులను వరించెను. మండనమిశ్రుల యొద్ద భూలోకమున జన్మించిన దేవతలు విద్యాభ్యాసము చేయుచు నుండిరి.

ఇట్లుండఁగా కాలటియందు శిశు వైన శంకరులవారితండ్రి యైన శివగురువులు లింగమునకు సమర్పించిన బిల్వమాలిక శంకరులకంఠమునందుండుటగని లింగమూర్త్యాంతర్గతు లగు శంకరస్వామియే వీ రని తెలిసికొనిరి. ఇట్లు అనేకము లగు అద్భుతములను గనపఱచిరి. రెండవసంవత్సరమునఁనే ఆకారాద్యక్షరముల నుచ్చరించుచు నెవ రేది యడిగినను స్వయముగా జెప్పు చుండిరి మఱియు లౌకిక వైదికవిద్యల నన్నింటిని మూఁడవయేట నేర్చిరి ఆ మూఁడవయేట శివగురువులు శంకరులకు ఉపనయనము కావించి పరలోకమున కేగిరి. అది మొదలు 'భవతి భిక్షాం దేహి' యను వాక్యము చొప్పున భిక్షాన్నమును భుజించుచు నిత్యకర్మానుష్ఠానములను నెఱవేర్చుకొనుచుండఁగా నొక్కనాఁడు అయాచితదీక్షితులగృహమునకుఁ బోఁగా, వారు ద్రవ్యహీనములో దుఃఖించుచుండ, శంకరులుకరుణించి లక్ష్మీదేవినిందలచి అయాచితదీక్షితులకు ధనము ననుగ్రహించిరి. శంకరులు ఏడవసంవత్సరమునందు పరబ్రహ్మోపాసనము చేయుటయందత్యంతాసక్తి గలవారై యుండఁగా దూర్వాసమహర్షి చనుదెంచి అష్టాంగయోగముల నుపదేశించిరి. ఇట్లుండ మలనాటియందు రాజ్యము చేయు సత్యవర్మరాజు తనకు పుత్రలాభమును కృప చేయువలయునని శంకరులను ప్రార్థింపఁగా నట్లే యగు నని దీవించిరి. తర్వాత ఉపమన్యు, దధీచి, గౌతములు, అగస్త్యులు వచ్చి శంకరులకు సకలవిద్యలను బోధించిరి. ఆర్యాంబ శంకరులకు వివాహము కావింపఁదలఁచి అగస్త్యాదిమహర్షులనుగూర్చి నాకుమారుఁడు వివాహంబై సత్పుత్రునిం బడయఁగలఁడా యనఁగా నప్పుడగస్త్యమహర్షి ఆర్యాంబను జూచి నీ కుమారరత్నము లోకాచార్యు లై వెలయఁగలరు గాని సంసారబంధమునం దగులుకొన రనఁగా ఆర్యాంబ చింతాక్రాంతురాలై యుండెను.

అంత గొన్ని దినంబులకు శంకరులు సన్న్యాసమును స్వీకరింపందలంచి తల్లికి విన్నవింప నామె యసమాధానము నొందఁగా, శంకరులు సంసారతాపత్రయముల నన్నియు విశదీకరించిరి. ఇట్లుండఁగా నొకనాఁడు నారదులును దత్తాత్రేయులును శంకరులకు విష్ణుతత్త్వోపదేశము గావించి చనిరి. ఆ దినముననే ధర్మరాజు వచ్చి శంకరులను స్తుతించెను. మఱునాఁ డుదయమున తల్లితోడ శంకరులు నదికిం బోయి స్నానము చేయు చుండఁగా శంకరులపాదమును మొసలి పట్టుకొనెను. అప్పుడు శంకరులు తల్లినిం జూచి యిప్పుడు నేను మొసలినోటంజిక్కి చావఁబోయెదను గాన నీ సమయమున నైన నాకు సన్న్యసించుట కనుమతి యొసంగు మనఁగా ఆర్యాంబ యేమియుదోఁచక యట్లే సన్న్యసించి యైనను బ్రతుకు మని దీవించెను. తర్వాత శంకరులు విధ్యుక్తప్రకారముగా వైశాఖశుద్ధద్వాదశిదినమునందు సన్న్యసించిరి. మొసలి

పాదములను విడిచి దివ్యదేహము ధరించి శంకరాచార్యులను స్తుతించి యిట్లనియె. స్వామీ! నేను సురగ్రాహి యను పేరు గల గంధర్వుడను. నారదుశాపమువలన మొసలినైతిని. ఇప్పుడు నా శాపవిమోచనం బయ్యె నని వచించి గంధర్వలోకంబు చనెను అనంతరము శంకరులు తల్లినిం జూచి నేను సన్న్యాసిని గాన సంచారము చేయుటకుం బోయెదను. నీవు గృహమునకుం జను మన నామె పుత్త్రవాంఛచే మిగుల దుఃఖింపఁగా శంకరాచార్యు లి ట్లనిరి తల్లీ! గృహంబున వలయు ధనం బున్నది. నీకు అవసానకాలము సంప్రాప్తించె నేని నాకుఁ దెలియఁజేసినచో నేను చేయవలసిన కార్యములను జేసెద నని వచించి తల్లిచే ననుమతింబడసి, యచ్చోటఁగల కృష్ణస్వామి యాలయమున నివసించిరి. ఆ రాత్రియందు స్వామి సాక్షాత్కరించి నన్ను వే ఱొక్కచోట ప్రతిష్ఠ చేయు మనఁగా నట్లే ఆ స్వామిని తులసీవనంబున స్థాపించి యచ్చట భూమియం దున్న ధనముచే నాలయమును నిర్మించున ట్లచ్చటివారల కనుజ్ఞ యొసంగి, కృష్ణస్వామియనుగ్రహముం బడసి, ఆచార్యులనిమిత్తము వెదకుచు ప్రయాణంబై పోవుచుండ, నర్మదానదీతీరంబున తపంబు సేయు చుండు శ్రీగోవిందయోగీంద్రులవలన దత్త్వోపదేశమును బడసినదేగాక వేదవేదాంతయోగాదివిద్య లన్నియు గ్రహించి యోగము మొదలగునవి యభ్యసించుచుండఁగా, చాతుర్మాస్యముసమీపించి నంత నావ్రతమును నర్మదాతీరమునందే ముగింప నెంచి యచ్చటం గల పెద్దలతోడ నావ్రత మనుష్ఠించుచు వేదతత్త్వార్థవిచారము చేయు చుండ నొక్కనాడు అమిత వర్షము కురిసి ప్రవాహము అధికముగ రాగ అచ్చటంగల పెద్దలందఱును భయకంపితులు కాఁగా, శంకరులు తమకమండలమును భూమియం దుంచినంత ప్రవాహజలమంతయు నాకమండలములోనే యిమిడి యుండెను. అప్పు డచ్చటగల యోగీశ్వరులాదిగాఁగలవా రందఱును శంకరాచార్యులను వినుతించిరి. ఆతర్వాత కాశీక్షేత్రమునకు వచ్చి 1200వేల పండితులచే నుతింపఁబడుచు నుండఁగా బిందుమాధవస్వామి స్వప్నమున సాక్షాత్కరించి రేపు నీకు శిష్యుం డొక్కండు రాగలం డని యానతిచ్చి యంతర్ధానము నొందెను. ఆ మఱునాఁడే అహోబిలమునుండి యొక బ్రాహ్మణుఁడు శంకరాచార్యులను సేవించి, శంకరులవలన పద్మపాదాచార్యు లని పేర్వడసిరి. కాశీక్షేత్రమున శంకరాచార్యులు అద్వైతమును బోధించుచుండఁగా ఆరువేలద్వైతులు అద్వైతమతమునం బ్రవేశించిరి. గోవిందపాదులు శంకరాచార్యుల కొసంగిన శ్రీకైలాస చంద్రమౌళీశ్వరలింగము, గణపతి, శ్రీచక్రము, నవగ్రహయంత్రము, నృసింహసాలగ్రామము, వీనిని పద్మపాదాచార్యుల కొసంగిరి ఇట్లుండ నొక్కనాడు విశ్వనాథస్వామి చండాలవేషము దాల్చి శంకరాచార్యులసమీపమునకు రాఁగా ఆచార్యులు వానింజూచి దూరముగాఁ బొమ్మన నా చండాలుఁడు ఆత్మవిషయమై సమాధానము

సహింపనలయు నని చెప్పఁగా, ఆచార్యులు వానిమాటలకు సంతోషించి వానిని ప్రశం సించి, 'మనీషాపంచకము' అను గ్రంథమును రచింప, చండాలుఁడు నిజరూపమును ధరించి నంత, ఆచార్యుల కానంద ముప్పొంగి 'శివాత్మపూర్ణానుభవస్తోత్రమంజరి' అను గ్రంథమును రచియించి వినుతించిరి అప్పుడు విశ్వనాథస్వామి నాయంశమే నీ వని పచించి యద్వైతము నుపదేశించిరి. ఆమీఁద శంకరులు సనందాది శిష్యుల తోడ బదరికాశ్రమమునకుఁ బోయి నరనారాయణాశ్రమము చేరి నారాయణమునిని జూచి బ్రహ్మసూత్రములకు వ్యాసమహామునియభిప్రాయము నెఱుఁగఁగోరి వచ్చితి ననఁగా, నారాయణముని శంకరులం గని మీరురచియించుభాష్యము వారికి సమ్మ తముగనుండుననిరి అట్లే శంకరులు తమ 16-వ యేఁట బ్రహ్మసూత్రభాష్యము మొద లగు అనేకగ్రంథములను రచియించి శిష్యులకు బోధించిరి. ఇట్లు శంకరభగవత్పాదులు తమ 16-వ సంవత్సరములోనే అనేకగ్రంథములను రచియించిరి. బదరికాశ్రమము నం గల యనేకమునులు శిష్యులై వేదాంతార్థములను తెలిసికొను చుండిరి. వారందఱి లోను పద్మపాదాచార్యులు శంకరులకు ముఖ్యశిష్యులైయుండిరి.

అనంతరము పద్మపాదాది శిష్యులతోడ బదరికాశ్రమమునుండి కాశికి రాఁగ అఘోర, రనేశ్వర, మృగేంద్రనాథ, భైరవ, అర్హతాది 27 గురు మతస్థులు అద్వై తమునుగూర్చి శంకరులతో వాదించి తుదకు పరాజితులై, అందఱును అద్వైతమత ము నవలంబించిరి. ఆమీఁద శంకరులు శైవ, వైష్ణవ, శాక్త, గాణపత్య, సౌర, కాపాలమతస్థులకు గల భేదవాదములను బోఁగొట్టి పంచాయతన అభేద సగుణ నిర్గుణోపాసనమును బోధించిరి. మఱియు కాశియందు 24000 జనులు సూత్రభాష్య మును శంకరాచార్యులయొద్దను, పద్మపాదాదిశిష్యులయొద్దను పఠించిరి.

ఇట్లుండ నొక్కనాఁడు శారీరకమీమాంసాభాష్యమును శంకరులు శిష్యులకు బోధించి శాంతిచేసినయనంతరము సిద్ధబ్రాహ్మణరూపములో వ్యాసులవారు చనుదెంచి బ్రహ్మసూత్రములలోఁ గొన్నిటికి తాత్పర్యమును జెప్పుఁ డన, శంకరులు చెప్పఁగా వ్యాసులు సంతోషించి, నిజస్వరూపమును ధరించినంత శంకరులు స్తుతించిరి. అప్పుడు వ్యాసులు వ్యాఖ్యానసింహాసనాచార్యా ద్యనేకబిరుదము లొసంగి దీవించి చనిరి.

తర్వాత శంకరులు శిష్యులతోడ ప్రయాగకు పోయి త్రివేణీసంగమమున స్నాన ముచేసి భట్టపాదులను పోయిచూచినపుడు, భట్టపాదులు బౌద్ధగురువుయొద్ద విద్యాభ్యాస ముచేసి ఆతనితో, అద్వైతమే సత్యమని వాదించి అట్టి గురునిందాపహారణార్థమై తుషాగ్ని యందు దహింపఁబడుచుండఁగా, శంకరులు,— విప్రశ్రేష్ఠా! ఆత్మహత్య చేసికొన

వలదు, నాకమండలు జలములవలన అగ్నిని చల్లార్పెదను, నాయొక్క భాష్యమునకు వివరణమును కావింపు డనఁగా, భట్టపాదులు వీరు శంకరు లని తెలిసి వినుతించి, స్వామీ! తమభాష్యమును నా శిష్యుఁడైన ప్రభాకరునిచేతి కిచ్చి చదివింపుడన నట్లే పద్మపాదులు ప్రభాకరులచేతి కిచ్చి చదివింపఁగా, భట్టపాదులు విని సంతోషించి యిట్టి భాష్యమునకు వివరణము అనావశ్యకము గాన నిదియే అర్యానర్తమున శ్రేష్ఠమై వెలయఁగల దని వచించిరి. అనంతరము శంకరులు అగ్నియందు జొచ్చి అభయహస్త ముచే మైచఱచి తారకమంత్రము నుపదేశించిరి. భట్టపాదుల శరీరమాద్యంతమును శీతల మయ్యెను. అప్పుడు భట్టపాదులు తమశిష్యులను జూచి మీరందఱును అద్వైతమత మవలంబించి శ్రీశంకరాచార్యులయభిమతము చొప్పున ప్రవర్తింపుఁడని యనుజ్ఞచేసి తారకమంత్రమును జపించుచు షణ్ముఖిముద్రను బూని బ్రహ్మరంధ్రనాడిచే అర్చిరాది మార్గముగ దేహమును విడిచిపెట్టిరి.

అనంతరము శంకరులు భాగీరథియందు స్నానముచేసి అక్షయవటముక్రింద వసించి శిష్యులకు వేదాంతమును బోధించుచుండి, యచ్చోటు బాసి నర్మదాతీరము నందలి మాహిష్మతీనగరమున కేగి, శిష్యుల నొకచోటనుండునట్లు నియమించి, శంక రులుమాత్రము మండనమిశ్రునియింటికిం జనఁగా తలుపుమూసియుండెను. అంత శంక రులు యోగాభ్యాసబలముచేత ఆకాశమార్గముగ లోపలికిఁ బోయిరి. అప్పుడు మండన మిశ్రునియింటికి వేదవ్యాసులును, జైమినిమునియును పితృకర్మమునకు నిమంత్రితులై వచ్చి యుండుటం గని, శంకరులు యిదేసమయమని సమీపమునకుం బోఁగా, మండన మిశ్రులకును శంకరాచార్యులకును ఆగమనప్రశ్నములయందే వివాదములు జరిగెను. అట్టిసమయమున మండనమిశ్రులు నేఁడు పితృకర్మము నెఱవేఱున ట్లనుగ్రహింపుఁడు, రేపు వాదింపవచ్చు ననఁగా నట్లే కాని మ్మనిరి. మఱునాఁడు మండనమిశ్రులతో వాదించి వారిని జయించిరి. అప్పుడు సరస్వతి వీణాదిసాధనములతో ఆకాశమార్గమున సత్యలోకమునకుఁ బోవుచుండఁగా, శంకరులు దుర్గామంత్రమును పఠించి యాయమను పోనీయక బంధించి వాగీశ్వరీస్తవము చేయఁగా, సరస్వతి శంకరుల స్తవమునకుం గట్టు వడి సత్యలోకమునకుం బోక వారిచెంత నిలిచెను.

ఆమీఁద మండనమిశ్రులు శంకరులబోధవలన తాము అదివఱకు వాదించు చుండిన కర్మకాండమునందు సంశయము కలిగినవా రయ్యెను. తమకు కర్మకాండ మును బోధించిన జైమినిమునియాజ్ఞలేనిదే దానిని వదలుటకుం గాదని యెంచి జైమిని మునిని స్మరింపఁగా వారు ప్రత్యక్షమై, శంకరులయభిమతమే నాకును వ్యాసులకును సమ్మత మైన దని చెప్పినదే గాక, కృతయుగమునందు కపిలాచార్యులుగను, త్రేతా

 

యుగమునందు దత్తాత్రేయులుగను, ద్వాపరయుగమునందు వ్యాసులుగను, కలియుగము నందు శంకరాచార్యులుగను అవతరించిన పరమేశ్వరులును వీరే యని బోధించిరి. ఆ సమయమున శంకరులు సరస్వతిని ధ్యానింపఁగా, సరస్వతి ప్రత్యక్షమైనంత, శంకరులు సరస్వతినిం జూచి మా వాదమునందు తమయొక్క సమ్మతమేమని యడుగఁగా సరస్వతి యిట్లనియె. స్వామీ! మండనమిశ్రులకు నేనర్ధాంగిని యగుటం బట్టి నాతోడను వాదించి జయించినమీఁదనే నాయొక్క సమ్మతమును దెల్పుదు నన, శంకరాచార్యులు వాదింపఁగా, సరస్వతీదేవి యోడిపోయెను. అయినను సన్న్యాసి యగు శంకరులను మదనశాస్త్రమున నోడింప నగు నని నిశ్చయించి, మదనకలాప్రసంగము చేయఁగా, శంకరు లొక నెలకుమీఁద బదులుచెప్పెద నని చెప్పి, శిష్యులతోడ యోగాభ్యాసబలముచేత నాకాశమార్గముగ బయలుదేరిపోవుచుండఁగా, నొకచెట్టుక్రింద నొక పీనుఁగు నుంచి యనేకస్త్రీలును పరివారమును దహనము చేయుచుండిరి. అంత శంకరులు శిష్యులతోడ నచ్చట నొకపర్వతముపై దిగి యొకగుహయందు తమ శరీరమును దాఁచి యుంచి పద్మపాదాదిశిష్యులను రక్షించుచుండునట్లు చెప్పిరి

కామశాస్త్రము మొదలగువానియం దతిసమర్థుఁడైన అమరకుఁడనువాఁడు వేటకు బోయి నూర్గురుభార్యలను విడిచి చెట్టుక్రింద మృతినొందెను. శంకరుల ఆత్మ అమరకుని శరీరమునం జొచ్చినంత, వాఁడు నిద్రనుండి లేచినట్లు లేవఁగా, నూర్గురు పత్నులును సంతోషించి మహావైభవముతో నగరమునకుం బోయిరి. శంకరు లానూరుగురుస్త్రీలతో రమించుచుండి, అమరుకమను గ్రంథమును రచియించిరి. ఇట్లుండఁగా మంత్రులాదిగాఁగలవారు అమరకుని శరీరమున నెవరో పెద్దలు ప్రవేశించియున్నారని తెలిసికొని యిఁక వీరిని విడిచిపెట్టఁగూడదని నిశ్చయించి చారులతో నెచ్చట మృతకళేబరముండినను దహించుట కనుజ్ఞ యొసంగిరి. అట్లే చారు లచ్చటచ్చట వెదకుచుఁ బోయి శంకరులదేహమును దహింపఁగా శంకరులు శిష్యులవలన జరిగినవృత్తాంతము నెఱింగి అమరకునిశరీరమును విడిచి తమశరీరములోఁ జొచ్చి 'కరావలంబస్తోత్రము' చేయఁగా నృసింహస్వామి ప్రత్యక్షమై శంకరులను బయిటికి లేవదీసిరి. తరువాత ఆకాశమార్గముగ మండనమిశ్రులయింటికిఁ బోయి సరస్వతిని కలాశాస్త్రమునందు జయించిరి. ఆమీఁద మండనమిశ్రులు శంకరాచార్యుల శరణమును బొంది సన్న్యాసమును గైకొనఁగా, శంకరులు సురేశ్వరాచార్యు లని నామ మొసంగిరి. అనంతరము శంకరులు శిష్యులతోఁగూడ శ్రీశైలమునకు వచ్చి శిఖరకలాయంత్రమును ప్రతిష్ఠింపఁజేసి ద్వైతవాదులను జయించి, ఉగ్రభైరవుని దండించి, యచ్చోటు బాసి మహాబలేశ్వర మను గోకర్ణము, హరిహరము మొదలగు స్థలములను దర్శించుకొని మూకాంబ

క్షేత్ర మను కొల్లూరికి వచ్చి యచ్చోట నొక బ్రాహ్మణపుత్రుని బ్రతికించి మూకాంబను కలారోహణముచే వినుతించి యాదేవియనుగ్రహమును బొంది యచ్చటికి సమీపమున నుండు శ్రీవల్లీపురమున భిక్షు చేసికొని యుండిరి.

ఆ యగ్రహారమున ప్రభాకరభట్టులును వారిశిష్యు లనేకులును శాస్త్రవేత్తలై యుండిరి. ఆ ప్రదేశమునందలివా రెల్లను ప్రభాకరులమతమునే యనుష్ఠించు చుండిరి. ఆ ప్రభాకరులకుమారుఁడు మాటలాడకయు వినకయు నుండెను. ప్రభాకరులు ఆ చిన్నవానిని బిలిచికొని శంకరులకడకుం జని నమస్కరించి, స్వామీ! వీనికి 5-వ యేఁట విద్యాభ్యాసము చేసితిని; చదువలేనివాఁ డైనాఁడు. ఇప్పు డెనిమిదవయేఁడు గాన ఉపనయనము గావించితిని. అధ్యయనము చెప్పిన వినఁడు. వీని చిత్తవృత్తి తెలియకున్నది యని విన్నవింపఁగా, శంకరు లా చిన్నవానిం జూచి నీ వేల యిట్లు జడునివలె నున్నాఁడ వనఁగా, ఆ చిన్నవాఁడు, స్వామీ! తమదర్శనమునకై వేచియుంటినని వచించినదే గాక అద్వైతమును బోధించు పండ్రెండువాక్యములను అఱచేతియుసిరికాయవలె అందఱు నెఱింగి యుజ్జీవించునట్లు వచింపఁగా, శంకరులు వానికి హస్తామలకు లని నామకరణము గావించిరి. ఆతర్వాత శంకరులు హస్తామలకులు మొదలగువారితోడ శృంగగిరికి వచ్చి యచ్చోట శారదాపీఠము, వ్యాఖ్యానసింహాసనము, భారతీసంప్రదాయము అను వీనిని స్థాపించి శిష్యులకు సూత్రభాష్యము నుపదేశించుచు, సురేశ్వరాచార్యులకు లోకాచార్యాభిషేకము గావించిరి.

అనంతరము శంకరాచార్యులకు అత్యంతప్రీతిపాత్రులై సేవచేయుచుండిన శిష్యులొకరికి ఆనందగిరి యని నామ మొసంగిరి. ఒకనాఁడు శిష్యులు వేదశాంతిపాఠమునుపక్రమించునప్పుడు ఆనందగిరి శంకరాచార్యులకాషాయవస్త్రము నుదుకుటకై నదికి పోయినందుచే, శిష్యులు కొందఱు ఆనందగిరి వచ్చినమీఁద నుపక్రమింపవచ్చునినరి. అప్పుడు పద్మపాదులుచెప్పిన దేమనఁగా, వారెప్పుడును యితరకార్యములయందేయున్నారు గాన వారు వచ్చునంతదాఁక పాఠము నుపక్రమింపరాదా యన, శంకరాచార్యులు ఆనందగిరికి భక్తియందును, పద్మపాదులకు విద్యయందును గల ఆసక్తినిం దలంచి పాఠము నుపక్రమించిరి. భక్తియుక్తుఁ డైన ఆనందగిరికి సర్వవిద్యలు వచ్చునట్లనుగ్రహించిరి. తర్వాత ఆనందగిరి వచ్చినమీఁద నాతనిని కొన్నిప్రశ్నము లడుగఁగా, పద్మపాదాదులకంటెను బాగుగ వివరించి, ఆచార్యులను తోటకవృత్తములతో వినుతించిరి కావున ఆనందగిరికి తోటకాచార్యు లని మఱియొక నామము గలిగెను. మఱియొకనాఁడు సురేశ్వరాచార్యులు ఆచార్యులనుం జూచి, స్వామీ! నేను చేయవలసిన కార్య మేది యనఁగా, శంకరులు నాచే రచియింపంబడిన భాష్యమునకు

వార్తికము చేయున ట్లనుగ్రహించిరిగాని నాఁడు రచియింప లేదు. తర్వాత పద్మపాదాచార్యులు బ్రహ్మసూత్రములు అయిదుపాదములకు పంచపాదికయను వ్యాఖ్యానమును, తక్కిన పదునొకండుపాదములకు వివరణమను పేరుతో వ్యాఖ్యానమును రచియించిరి. అనంతరము సురేశ్వరాచార్యులు తమకు సూత్రభాష్యమునకు వ్యాఖ్యానము చేయు ప్రాప్తము లేకపోయెనే యని శంకరులయొద్ద విన్నపింపఁగా, అప్పుడు శంకరులు సురేశ్వరాచార్యులనుం జూచి, మీ రింక భూమియందు తొమ్మిదినూర్లసంవత్సరములు జీవించి తపముచేయుచుండి మఱుజన్మమున వాచస్పతియను పేరుతో భూమియం దవతరించి, యావజ్జీవమును వ్యాఖ్యానములు రచియించుటయందే కాలము గడపువారై, ఆస్తికభాష్యము లారింటికిని వ్యాఖ్యానములు వ్రాసి, వాని కన్నింటికిని సిద్ధాంతముగా నా భాష్యమునకు వ్యాఖ్యానమును వ్రాయుఁడని యనుగ్రహించిరి. ఆమీఁద పద్మపాదాచార్యులు తీర్థయాత్రార్థమై గుర్వాజ్ఞం గైకొని బయలుదేఱిపోయిరి కొన్ని దినములకుమీఁద శంకరులు యోగదృష్టిచే తమ తల్లిగారి మరణావసానము నెఱింగి యా సమయమున నెదురుగఁబోయి నిలువంబడఁగా తల్లి శంకరులను జూచి, నీవే నాకర్మక్రియలను జరుపవలయు నని చెప్పఁగా నట్లే శంకరాచార్యులు నెఱవేర్చిరి.

తరువాత శంకరాచార్యులు దిగ్విజయార్థమై బయలుదేరి యచ్చటచ్చటం గల అన్యమతస్థులను జయించుచు శుద్ధాద్వైతమతమును స్థాపించుచు రామేశ్వరము మొదలగు స్థలములను దర్శించుకొని చిదంబరమునకు వచ్చి శివగంగను నిర్మించి, కాంచీపురికి వచ్చి కామకోటియంత్రమును ప్రతిష్ఠ చేసి, తిరుమలకు వచ్చి ధనకలాయంత్రమును స్థాపించి, మఱియుం గల నసేకదేశములకుంబోయి యచ్చటచ్చట స్వమతస్థాపనము జేయుచు, గంగాతీరమున నివసించియుండిరి. అచ్చట చిరంజీవులైన గౌడపాదులను సిద్ధులొకరు దర్శనమిచ్చి నాయొక్క కారికలకు నీవు భాష్యముచేసి కృతార్థుండవైతివని చెప్పి ఆకాశమార్గముగఁ బోయిరి. అనంతరము శంకరాచార్యులు కాశ్మీరమండలమునం గల శ్రీనగరమునకుం జని యచ్చట దేవర్షులచే నిర్మింపంబడియుండు సర్వజ్ఞపీఠము నధిష్ఠించి, గురుభూమండలాచార్యపట్టాభిషిక్తులై, యచ్చోటుబాసి కేదారక్షేత్రమునకుం బోయి యచ్చట నుండు మునుల కెల్లరకును వేదాంతమును బోధించి తమయొక్క ముప్పదిరెండవసంవత్సరమున దేవతలందఱు పరివేష్టించి వెంటనంటిరాఁగ హిమనద్గిరికిం జని సమాధిస్థితులైరి.

అద్వైతసిద్ధాంతము:—సత్యమైన పదార్థం బొక్కటి. అది బ్రహ్మము. మిగిలిన పదార్థము మిథ్యాభూతము. మాయ బ్రహ్మకల్పితము. బ్రహ్మము మాయలోఁ

గలిసి యొకప్రధానపురుషుఁ డగును. అగ్నినుండి నిప్పురవలు బైలుదేరుచందంబున బ్రహ్మనుండి వివిధమైన చేతనాచేతనపదార్థములు పుట్టినవి. వస్త్రమునందలి దార ములు వస్త్రమునకు ముఖ్యకారణమై దానియందుండుమాడ్కి బాహ్యమైన అబ్రహ్మము సమస్తమునకు ముఖ్యకారణంబై సమస్తమునం దున్నది. అటులనే ప్రతివానిహృదయ మునందును ప్రకాశించు చున్నది. మానవహృదయమునందును మాయ నివసించి యు న్నది. పరమపురుషునియం దుండు మాయ సత్త్వగుణమునే కలిగి యుండి "మాయ= అవిద్య" అనఁబడుచున్నది. జీవుఁడు అవిద్యతో గలిసి యుండువఱకు సత్త్వపదార్థ మునకును, తాను చూచునట్టి యితర మైన సకలపదార్థములకును తాను భిన్న మని భావించును, అవిద్య జ్ఞానముచే నశించును. జ్ఞానమువలన పాపకృత్యములు చేయ కుండుట, సంధ్యావందనాది కర్మలను చేయుట మొదలుగాఁగల కృత్యములు లభిం చును. అవిద్య నశించినచో జీవమునకు బ్రహ్మైక్యము కలుగును. ఇదియే మోక్షము. మాయ ననుసరించి యుండువఱకు తనకు దృశ్యమగు పదార్థము సత్యమని తలంచియుం డును. ఇట్లు అవిద్యచేత భ్రమింపుచుండుటయే సంసార మనంబడును. తత్త్వమ సీత్యాది వాక్యజన్యజ్ఞానంబువలన అవిద్య నివర్తించును. ఇదియే మోక్షము.

మఱియు నీయద్వైతమతమునందు ప్రతిబింబవాద మనియు, అవచ్ఛేద వాద మనియు రెండువిధము లగు వాదములు గలవు.

ప్రతిబింబవాద మనఁగా:—పరబ్రహ్మము అంతఃకరణమున ప్రతిఫలించును. అనఁగా, అద్దములో మనముఖము ప్రతిఫలించు నట్లే ఇట్టి ప్రతిబింబములే జీవులు.

అవచ్ఛేదవాద మనఁగా:—ఆకాశము సర్వత్ర ఏకరీతియే యైనను యింటియం దున్న ఆకాశమును అపవరకాకాశ మనియును, కుండయందు నిండి యున్న ఆకాశ మును ఘటాకాశ మనియు వ్యవహరించునట్లు, అంతఃకరణములో నిమిడి యుండు బ్రహ్మము జీవుఁ డనఁబడును.

ఇంతేగాక; ఏకజీవవాద మనియు, అనేకజీవవాద మనియు, మఱియు రెండు వాదములు కలవు.

ఏకజీవవాద మనఁగా:—ఇప్పుడు గోచర మగు సాంసారికశరీరములో నంతట జీవులు లేరు. ఒకానొకశరీరములో జీవుఁ డున్నాఁడు. ఆజీవునకు స్వప్నమువలె కల్గిన భ్రమయే యీ సంసార మంతటయునై యున్నది ఆజీవునకు ముక్తిగల్గినప్పుడు సృష్టి సమాప్తి యగును. ఇప్పటికి యెవరును ముక్తులై యుండ లేదు.

అనేకజీవవాద మనఁగా:—ఒక్కొక్కశరీరమున కొక్కొకజీవుఁడు కలఁడు, ఇప్పటికి కొందఱు ముక్తులైరి. ఇఁకను కొందఱు ముక్తులగుదురు. ఈఅద్వైతసిద్ధాంత మును సక్రమముగను విశేషముగను "విచారసాగరము" అను గ్రంథమువలనఁ దెలి యఁదగును.

## విశిష్టాద్వైతమతము.

ఈ మతమును స్థాపించినవారు శ్రీరామానుజాచార్యులవారు. ఈ మతమునకు శ్రీసంప్రదాయ మనియును, అధ్యాత్మసంప్రదాయ మనియును పేర్లు కలవు. ఈ సంప్రదాయము ఆదియందు శ్రీమన్నారాయణమూర్తివలన నియమింపఁబడి శిష్యపరంపరఁగా వ్యాప్త మయ్యెను. ఎట్లనఁగా:—

శ్లో. అస్మద్దేశిక మస్మదీయపరమాచార్యా నశేషాన్ గురూన్
శ్రీమల్లక్ష్మణయోగిపుంగవమహాపూర్ణౌమునిం యామునం
రామం పద్మవిలోచనం మునివరం నాథం శఠద్వేషిణం
సేనేశం శ్రియ మిందిరాసహచరం నారాయణం సంశ్రయే.

ఈ శ్లోకార్థమున అస్మదాచార్యులనుండి నారాయణమూర్తివఱకు పరంపర ననుసంధింపంబడినను, సంప్రదాయము నారాయణమూర్తినుండి అస్మద్గురుపర్యంతము వ్యాప్త మయినది.

విశిష్టాద్వైతమతమును శ్రీమన్నారాయణమూర్తి, శ్రీదేవి, విష్వక్సేనులు, శఠకోపమునులు, నాథమునులు, పుండరీకాక్షులు, రామమిశ్రులు, యామునాచార్యులు, మహాపూర్ణులు, శ్రీరామానుజాచార్యులు నుద్ధరించినవారైరి.

ఈ విశిష్టాద్వైతసంప్రదాయకర్తలనేకులు రామానుజులకు పూర్వ మవతరించినను సంప్రదాయస్థాపనాచార్యు లని జగత్ప్రసిద్ధి నొందినవారు శ్రీరామానుజాచార్యులవారు.

## శ్రీరామానుజాచార్యచరిత్రము.

శ్రీవైకుంఠమునందు నారాయణమూర్తి చింతతో నుండఁగా ఆదిశేషులు స్వామిని జూచి, దేవరవారిట్లుండుటకుం గారణం బేమన, నారాయణమూర్తి యిట్లనియె. "నేను లోకోద్ధారణమునిమిత్తము భూలోకమునం దవతరించియు నన్ను అప్రాకృతునిగ నెఱుంగక ప్రాకృతపురుషునిగ నెంచిరి." అనంతరము విష్వక్సేనాదులను భూలోకమునం దవతరించి చేతనోద్ధారణంబు చేయుట కనుజ్ఞ యొసంగఁగా, వారు మదాజ్ఞాప్రకార మవతరించిరియు పాపులసంభాషణముచేత, వైకుంఠవాసమునకు ప్రతిబంధకమగు నని తలంచి వారు స్వస్థానముఁ జేరిరి. ఇప్పుడు నీవవతరించి లోకము నుజ్జీవింపఁజేయవలయు ననఁగా, ఆదిశేషులు స్వామివారియాజ్ఞాప్రకారము అవతరించెద నని విన్నపించి మాతాపిత లెవరు తగినవా రని యాలోచించు చుండిరి.

ఇట్లుండఁగా శ్రీభూతపుర మనెడు శ్రీపెరుంబూదూరియందు హారీతగోత్ర ఆపస్తంబసూత్ర యజుశ్శాఖాధ్యాయియు, యజుర్వేదశిక్షా శ్రౌతాది వివరణ గ్రంథకర్తయు నగు సర్వక్రతు సోమయాజులను కేశవాచార్యులు తమధర్మపత్నియైన కాంతిమతితోడ పుత్రప్రాప్తికై తిరువల్లిక్కేణికిం జని సోమోపరాగమున కైరవిణీతీరంబున స్నానంబుజేసి పుత్రకామేష్టి చేయఁగా, పార్థసారథిస్వామి ప్రత్యక్షమై పుత్రప్రాప్తి యగునని వరమిచ్చి యేగినంత నా దంపతులు భూతపురంబుచేరిరి. అనంతరము కాంతిమతీదేవిగర్భంబున ఆదిశేషులు శాలివాహనశకము తొమ్మన్నూటముప్పదితొమ్మిది, కలియుగము నాలుగువేలనూటపదునెనిమిది, హూణశకము వెయ్యిన్నిపదునేడింటికి సరియైన పింగళసంవత్సరము చైత్రశుక్లపంచమియందు అవతరించిరి.

శ్లో. కల్యబ్దే దివ్యకుంభే బుధజనవిదితే వత్సరే పింగళాఖ్యే
చైత్రేమాసేగతేషు ద్వియుతదశదినే ష్వేదమానేహిమాంశౌ
పంచమ్యార్ద్రాసమేతే సురగురుదివసే కర్కటాఖ్యేచ లగ్నే
శ్రీమద్రామానుజార్య స్సమజని నిగమాన్తార్థసంరక్షణార్థమ్.

ఇట్లు ఆదిశేషులు అవతరించఁగా భూలోకమునఁ గల సమస్తప్రాణులకును మహదానందము కలిగెను. కాంతిమతి భ్రాత యైన శ్రీశైలపూర్ణులు భూతపురికి వచ్చి వారికి రామానుజాచార్యు లని నామమిడిరి ద్వాత్రింశల్లక్షణములతోఁ గూడిన రామానుజులకు కేశవాచార్యులు అన్నప్రాశనాది కర్మలు జరిపించి ఉపనయనము గావించి ఎనిమిదవయేఁట వేదవేదాంగముల నుపదేశించి పదునారవయేఁట వివాహము గావించిరి. తరువాత కొంతకాలమునకు కేశవాచార్యులు పరమపదించఁగా, రామానుజాచార్యులు విధ్యుక్తప్రకారము సకలకర్మములు నెఱవేర్చి భార్యతోఁగూడి మాతృశుశ్రూష చేయుచుండి, పూర్వపక్షాది గ్రంథపరిశోధనము చేయందలంచి కాంచీపురియం దుండు అద్వైతి యగు యాదవప్రకాశులయొద్ద చదువు చుండఁగా, నచ్చటికి రామానుజాచార్యులవారి పినతల్లికుమారు లైన గోవిందభట్టరును వచ్చి చదువుచుండిరి. ఒకనాఁడు రామానుజాచార్యులకు యాదవప్రకాశులు చెప్పిన శ్రుత్యర్థవిరోధవాక్యములను రామానుజాచార్యులు సహింపక దుఃఖింపు చుండఁగా, నది మొదలు రామానుజాచార్యులను మడియించుటకు సమయము జూచుచు, గంగాయాత్రావ్యాజముచే శిష్యులనందఱిని వెంటబెట్టుకొని పయనంబై వింధ్యారణ్యము చేరిరి. అప్పుడు యాదవప్రకాశుల యొక్క దురుద్దేశ్యమును గోవిందభట్టరు రామానుజాచార్యుల కెఱింగింపఁగా, వారు ఆదినమురాత్రి యరణ్యములోఁ జొచ్చి వేఱొకమార్గముగ పోవుచుండఁగా వరదరాజస్వామియు పెరుందేవియు బోయవేషము దాల్చి ఆచార్యుల కగపడి, స్వామీ!

మీరెక్కడికిం బోయెదరన, ఆచార్యులు నేను కాంచీపురి కేగెదనని చెప్పఁగా, మేము నచ్చటికే బోయెదము, మాతోడ రండు, అని యాచార్యులవారినిం బిలిచికొని కొంత దూరము వచ్చి, యొకవ్రుమ్రానిక్రింద శయనించియుండఁగా, బోయవాని నాయకునింజూచి దాహంబునకు జలంబు కావలయుననన, నాబోయవాఁడు రామానుజులకు బావియుండు చోటు గనఁబఱచి జలంబులు దెమ్మనఁగా, రామానుజులు పోయి జలంబు తీసికొని వచ్చునంతలోఁ దెల్లవారెను. అప్పుడు వారినిఁగానక వెదకుచు గోపురాదులను గని, ఇది యేయూరన నచ్చటివారు కాంచీపురం బని చెప్పఁగా, రామానుజు లాశ్చర్య మొంది, ఇది వరదరాజస్వామిమాయయే యని తెలిసికొని, జరిగిన వృత్తాంతమును కాంచీపూర్ణులకుం జెప్పఁగా, వారు ప్రతిదినమును మీరుతెచ్చిన బావిలోనిజలములను స్వామి తిరుమంజనమునకై తెచ్చి యిచ్చుచుండుఁ డని నియమించిరి. అట్లే రామానుజులు చేయు చుండిరి. అచ్చట యాదవప్రకాశులు రామానుజులను గానక విలపించి కాశికి పోయి గంగలో మునింగి, గోవిందభట్టరుచేతికి లింగము వచ్చునట్లుగా మాయ చేసి, గోవిందభట్టరువారికి ఉళ్ళంగైకొండనాయనా రని శైవనామ మిడిరి. తర్వాత అందఱును కాశినుండివచ్చునపుడు, ఉళ్ళంగైకొండనాయనారు కాళహస్తిలోనిలిచిరి. యాదవప్రకాశులు కంచికి వచ్చి రామానుజులవృత్తాంతమంతయు విని భయ మొంది, వారిని మరల బుజ్జగించి, శిష్యులతోఁగూడ నుండునట్లు చేసి శాస్త్రార్థములు చెప్పు చుండిరి.

ఈ వృత్తాంతములెల్లను శ్రీరంగమునందుండు యామునాచార్యులు విని, కంచికి వచ్చి తమశిష్యులైన కాంచీపూర్ణులనుం గని రామానుజు లెక్కడ యనఁగా, వారు శిష్యులతోఁగూడి పాఠము చదువుచున్నా రనిరి. అపుడు రామానుజులవారితో మాటలాడుటకు వలనుపడక, వారు కోవెలకు శిష్యులతో వచ్చునప్పుడు నక్షత్రములమధ్య చంద్రునివలె ప్రకాశించు వీరే రామానుజు లని కాంచీపూర్ణులు యామునాచార్యులకుం దెల్పిరి. అప్పుడు యామునాచార్యులు వీరు దర్శనస్థాపనాచార్యు లగుదు రని మంగళాశాసనము చేసి మరల శ్రీరంగమున కరుగుదెంచిరి.

అనంతరము కాంచీపురము నేలు చోళరాజు తనకుమార్తెకు పట్టిన బ్రహ్మరక్షస్సును పోఁదోలుటకు మంత్రవేత్తలైన యాదవప్రకాశులను పిలువనంపఁగా, వారు రాకయే నేను పొమ్మనిచెప్పితి నని చెప్పిపంపఁగా, నాబ్రహ్మరక్షస్సు, యాదవప్రకాశులను పొమ్మనిచెప్పినదేగాక, నీపుట్టుకయు నీపూర్వజన్మమును నే నెఱుంగుదు నని చెప్పిపంపఁగా, యాదవప్రకాశులు బ్రహ్మరక్షస్సుయొద్దకు పోయి నా పూర్వజన్మము చెప్పు మన, ఓ యాదవప్రకాశా! నీవు పూర్వజన్మమున మధురాంతకముచెఱువు

గట్టున ఉడుమైయుంటివి. అచట శ్రీవైష్ణవప్రసాదోచ్ఛిష్టమును నీవు భుజించినందుచే ఈ జన్మమునందు బ్రాహ్మణజన్మము నీకు గలిగెను. ఇట్టి నీవు నన్ను పొమ్మన్న నేను పోదునా? మా రామానుజాచార్యుల యానతి యైనచో పోయెద ననఁగా, చోళరాజు రామానుజులనుం బిలిచి పొమ్మనునట్లు కృప చేయు డనఁగా, నట్లే రామానుజులు వచింప నా బ్రహ్మరక్షస్సు తొలఁగిపోయెను.

ఇట్లుండ నొక్కనాఁడు యాదవప్రకాశులకును రామానుజులకును జరిగిన వాక్యార్థమునందు యాదవప్రకాశులు ఆచార్యులమహత్త్వగుణమును జూచి యోర్వక యిఁక ముందు నాయొద్ద చదువవద్దనఁగా, వారు చదువుమాని తిరుమంజనకైంకర్యమాత్రము చేయు చుండిరి. ఇట్లు రామానుజాచార్యులు యాదవప్రకాశులతో వాదించి చదువు మానిన వృత్తాంతమును యామునాచార్యులవారు దెలిసి, తాము రచియించిన స్తోత్రరత్నమును మహాపూర్ణులచేతి కిచ్చి దీనిం జూపి ఆచార్యులనుబిలిచికొనిరమ్మని పంపఁగా, మహాపూర్ణులు కంచికింబోయి వరదరాజునుదర్శించి యాస్తోత్రరత్నము ననుసంధింపఁగా రామానుజులు విని యాశ్చర్యంబు నొంది మహాపూర్ణులతో నీస్తోత్రరత్న మెవరివిరచిత మని యడుగ, వారు యామునాచార్యవిరత మని యెఱింగింపఁగా తోడనే వారిదర్శనార్థమై మహాపూర్ణులతోడ శ్రీరంగమునకు వేంచేయఁగా నక్కడ కావేరీతటంబున వైష్ణవులు వ్యసనాక్రాంతులై యుండం గని కారణం బడుగ యామునాచార్యులు పరమపద మొందిరని చెప్పి నంత, రామానుజులు దుఃఖాగ్నియందు మున్నులై కొంతనడిచి వారిచరమవిగ్రహము నైన దర్శింపవలయు నని యెంచి ఆచరమవిగ్రహమును సేవింపఁగా, వారిచేతివ్రేళ్లు మూఁడుమాత్రము ముడుఁగుకొని యుండం గని యచ్చటివారినిం జూచి, యిట్లెప్పుడు నుండుటకలదా యనఁగా, వారు ఇప్పుడే యిట్లున్నది యనిరి. అప్పు డాచార్యులు యామునాచార్యులకు కోరిక లేమైనంగలవా యని యడిగిరి. అంత వైష్ణవులు యామునాచార్యులకు పరాశరులప్రభావమును వెలిపుచ్చవలయుననియును, బ్రహ్మసూత్రములకు భాష్యము చేయవలయు ననియును, తిరువాయిమొళికి వ్యాఖ్యానము వ్రాయవలయు ననియును తలంచియుండి రనిరి. ఆమీఁద రామానుజులు ఈమూఁడుకార్యములను ఆచార్యకటాక్షముచే నేను నెఱవేర్చెద ననిరి.. అంత నా వ్రేళ్లు ఎప్పటియట్ల సాగియుండెను. అప్పు డావైష్ణవులందఱును దేవరవారే దర్శనోద్ధారకు లగుదురుగాక యని మంగళాశాసనము చేసిరి.

ఆతర్వాత రామానుజులు యామునాచార్యులవియోగమునకుం జింతించి రంగనాథుని సేవింపక కాంచీపురింజేరి, కాంచీపూర్ణులకు శ్రీరంగంబున జరిగిన వర్తమానం బంతయు వినుపింప, వారును స్వాచార్యవియోగమునకు మిగుల చింతించుచుండిరి.

ఇట్లుండ నొకనాఁడు రామానుజులు కాంచీపూర్ణులం జూచి దేవరవారు దాసుని గృహంబున భుజించి, శేషమును గృప చేయవలయు నని ప్రార్థింపఁగా, కాంచీపూర్ణులు సమ్మతించి, యట్లే రామానుజులవారి గృహంబునకుం జని భుజించిరి. ఇంతలో రామానుజులవారిపత్ని గృహంబంతయు శుద్ధిచేసి స్నానంబు గావించుచుండఁగా భార్యనుం జూచి యిట్లేల చేయుచున్నావనన అన్యజాతివాఁడైన కాంచీపూర్ణుఁడు భుజించిన కారణంబున నిట్లు చేయుచున్నానన, రామానుజులు భార్యపై కోపించి తమయిష్టసిద్ధి కాకపోయినందులకై చింత నొంది, కాంచీపూర్ణులకడకుం జని నేను సంకల్పించుకొని యుండు సిద్ధాంతములు వరదరాజస్వామికి సమ్మతమా, కాదా! దానిని స్వామిని యడిగి తెలియఁజేయు డనఁగా, నట్లే కాంచీపూర్ణులు వరదరాజస్వామిని యడుగఁగా, మేమే పరతత్త్వము, భేదమే దర్శనము, ప్రపత్తియే ఉపాసనము, అంత్యకాలమునందే మమ్ము ధ్యానింపనలయు నను నియమము లేదు, దేహావసానమున మోక్షము సిద్ధము, మహాపూర్ణుల నాశ్రయించి ప్రపత్తి చేయుము అని రామానుజుల కెఱింగింపు మని వరదరాజు తెల్పఁగా, నట్లే కాంచీపూర్ణులు రామానుజుల కెఱింగించిరి.

ఇట్లుండఁగా శ్రీరంగంబునందు మహాపూర్ణులు దర్శనోద్ధారకులగు రామానుజాచార్యులను సేవింప నెంచి వైష్ణవబృందముతో ప్రయాణమై వచ్చుచు మధురాంతకము చేరిరి. రామానుజులును మహాపూర్ణులకడకు బోవుటకు పోవుచు మధురాంతకమున సంధించి, మహాపూర్ణులచే సమాశ్రయణమును బొందిరి. తర్వాత అందఱును కాంచీపురి జేరిరి. రామానుజులు మహాపూర్ణులయొద్ద దర్శనగ్రంథములను పఠించిరి. మఱి కొన్నాళ్ళకు రామానుజులవారింటికి వైష్ణవుఁ డొక్కఁడు వచ్చి ప్రసాద మిప్పింపు డని యడుగ, వారిపత్ని ప్రసాద ముండియు పెట్టక పోయెను. అపుడు రామానుజులు ఇట్టి పత్నివలన మహాపాతకము కలుగు నని తలంచి యుండిరి. ఇంతలో మహాపూర్ణుల పత్నితో రామానుజులపత్ని కలహించినందుచే, మహాపూర్ణులు యిఁక కాంచీపురియం దుండినచో మానహాని యగు నని తలంచి బయలుదేరి శ్రీరంగమునకుఁ బోయిరి అనంతరము రామానుజులు తమభార్యను పుట్టినింటికిం బంపివేసి, వరదరాజస్వామిని యాచార్యులనుగాఁ బడసి త్రిదండసన్న్యాసమును స్వీకరించి యతిరాజాభిధానమును బొందియుండఁగా, గోవిందభట్టరును స్వమతమునం బ్రవర్తింపఁజేయఁదలంచి శ్రీశైలపూర్ణుల కెఱింగించిరి.

ఇవ్విధముగా రామానుజులు యత్యాశ్రమస్వీకారమును బొందిన మీఁద దాశరథులును, కూరేశులును రామానుజులవారి సన్నిధియందు పంచసంస్కారమును

బొంది సేవించుచుండిరి. అనంతరము యాదవప్రకాశులును రామానుజుల వైభవమును మహిమను దెలిసి రామానుజులచరణముల నాశ్రయించి త్రిదండసన్న్యాసమునను స్వీకరించి, గోవిందజీయ రను నామమును బొంది, పంచసంస్కారాదులచే పరిశుద్ధు లైరి.

అమీఁద శ్రీరంగనాయకులు యతిరాజులవారు తమ సన్నిధియం దుండవలయునని యెంచి, వరదరాజస్వామిసన్నిధికి గానవిద్యావిశారదు లైన తిరువరంగప్పెరుమాళరయను బంపఁగా వారు వరదరాజానుమతంబున యతిరాజులను పరిజనులతో శ్రీరంగంబునకుం దోడ్కొనిపోయిరి, ఇట్లుండఁగా గోవిందభట్టరు శ్రీశైలపూర్ణులవలన రామానుజులయిష్టముచొప్పున శైవమతమును విడిచి విశిష్టాద్వైతమతమును గైకొని భగవద్గుణానుభవము నేయుచుండిరి. యతిరాజులవారు మహాపూర్ణులతో రహస్యార్థముల నుపదేశింపుఁ డని ప్రార్థింపఁగా వారు కొన్నింటిని యుపదేశించి, మిగిలినవి యుపదేశించుటకు తిరుక్కోట్టియూరు గోష్ఠీపూర్ణు లధికారులని తెలియఁజేయఁగా రామానుజులు తిరుక్కోట్టియూరికిం బోయి గోష్ఠీపూర్ణులకు దండములు సమర్పించి తమ యభీష్టమును విన్నపించిరి. గోష్ఠీపూర్ణులు రామానుజుల యధ్యవసాయమును పరీక్ష చేయనెంచి మొగమిచ్చి మాటలాడకుండిరి. ఆకారణ మెఱుంగకయే రామానుజులు మరలి శ్రీరంగమునకు విచ్చేసిరి. గోష్ఠీపూర్ణులు శ్రీరంగమునకు వచ్చినప్పుడు, రంగనాథులు గోష్ఠీపూర్ణులతో యతిరాజులకు మంత్రార్థ ము లుపదేశింపుమని నియమించిరిగాని, యతిరాజులు పదునేడుమాఱులు తిరుక్కోట్టియూరికిఁ బోయి తిరుమంత్రార్థోపదేశమును బొందకయే వచ్చు చుండిరి. అయినను తదితరరహస్యములనుమాత్రము బొంది వచ్చి రని అష్టాదశరహస్యములవలన తెలియుచున్నది.

మతి యొకమాఱు రామానుజులు గోష్ఠీపూర్ణుల శిష్యులను జూచి, తమ యభీష్టము నెఱవేర్చి రక్షింపవలసినట్లు గోష్ఠీపూర్ణుల కెఱింగింపుఁడని వేఁడిరి. అమీఁద గోష్ఠీపూర్ణులు హర్షమొంది త్రిదండపవిత్రములతో రావలసిన దని యతిరాజులవారికిఁ దెలియఁజేయఁగా, రామానుజులవారు త్రిదండతుల్యు లగు దాశరథులతోడను, పవిత్రతుల్యులగు కూరేశులతోడను జనఁగా గోష్ఠీపూర్ణులు చరమార్థరహస్యోపదేశ మొనర్చి, దీనిని యితరుల కెఱుక జేసినచో దుర్గతి కలుగు నని చెప్పిరి. అప్పుడు రామానుజులు మహాగుప్త మైన యీ చరమార్థమునవలన లోకు లెల్లరును ఉజ్జీవింపవలసియుండఁగా, దీనిని యితరుల కెఱింగింపకపోయినచో లోకోపకారము కానేర దనియు, దాసుఁ డొక్కఁడు దుర్గతిపా లైనను లోకులందఱును ఉజ్జీవించుటయే యిష్ట మనియు, గోష్ఠీపూర్ణులతో విన్నపింపఁగా, అప్పుడు గోష్ఠీపూర్ణులు యతిరాజులవారిగుణమునకు మెచ్చి మన్నాథా యని పిలిచి తక్కిన రహస్యార్థములను మరల నుపదేశించెద నని

చెప్పి పొం డనిరి. మఱియ కొన్నాళ్ళకు యతిరాజులు గోష్ఠీపూర్ణులయొద్ద తక్కిన రహస్యములను గ్రహించిరి. దాశరథులును కూరేశులును యతిరాజుల నాశ్రయించి రహస్యార్థములను గ్రహించిరి.

అనంతరము గోష్ఠీపూర్ణుల యనుమతిప్రకారము శ్రీ మాలాధరులయొద్ద తిరువాయ్ మొళి కాలక్షేపము లభించుచుండినను, శ్రీ మాలాధరులకు రహస్యార్థము లనేకములను రామానుజు లెఱింగించుచుండిరి. అప్పుడు గురువునకుమించిన శిష్యుఁడురామానుజులే యని శ్రీమాలాధరులు కాలక్షేపమును చెప్పకపోయిరి. తర్వాత గోష్ఠీపూర్ణులు రామానుజులు చెప్పిన యర్థవిశేషములను విని సంతసించినవారై క్రమముగా కాలక్షేపము జరుపు మని మాలాధరులకు నియమించి, శ్రీరంగనాయకులవలన నొక రహస్యమును తెలిసికొనుఁడనఁగా, నట్లే ఆఱు నెలలుకాచియుండి శ్రీరంగనాథునివలన దెలిసికొనిరి. మఱికొన్నిదినంబులకు రంగనాథస్వామి సన్నిధియందలి పరిచారకులు చేసిన తప్పులను పెద్దలు తెలిసి దండించినందులకై యందొకఁడీ కార్యము రామానుజులవలన జరిగిన దని యెంచి, యతిరాజులవారు మాధూకరము చేయునప్పుడు విషమిశ్రమ మైన యన్నమును వడ్డించుటకు భార్యకు నియమింపఁగా నా వృత్తాంతమును తెలిసికొని పస్తుగానుండిరి. ఇట్లు యతిరాజులు పస్తుండుటను గోష్ఠీపూర్ణులు తెలిసికొని శ్రీరంగంబునకు వచ్చుచు కావేరిమధ్య నిలువంబడిన గోష్ఠీపూర్ణులను, రామానుజులు శిష్యసంఘములో ఆచార్యులవారిని సేవింపముందుజని, వారిపాదకమలములపై శిరమిడి సాష్టాంగప్రణామంబాచరించిరి. మిడిమిడియెండలో నిసుకపైఁ బడి యున్న యతిరాజులవారిని లేచునట్లనుజ్ఞచేయ రైరి. అప్పుడు కిడాంబియాచ్చాన్ గోష్ఠీపూర్ణులంజూచి, స్వామీ! వికసించినపుష్పమును నిప్పులలో పొరలింతురా యనఁగా, గోష్ఠీపూర్ణులు యతిరాజులను గ్రుచ్చియెత్తి నిలువంబెట్టి నేఁడుమొదలు మీరే ప్రసాదమును చేసి యతిరాజుల కిడుడని యనుజ్ఞ చేసిరి.

ఇట్లుండఁగా యజ్ఞమూర్తి యను ఏకదండసన్న్యాసి యనేకదేశములలోని విద్వాంసులను జయించి శ్రీరంగమునకు వచ్చి యతిరాజులతో వాదించుటకు నిశ్చయించి యొకరికొకరు తమ తమ మతమునుండి జయమొందిన వారిమతమును స్వీకరించుట యను పందెమువేసికొని వాదించిరి. తుదకు యజ్ఞమూర్తి యోడిపోయి యతిరాజులవారిచరణముల నాశ్రయించి, పేరిరుళాళ్పెరుమాళెంబెరుమానా రను నామమును బొందిరి ఆ తర్వాత యతిరాజులు పేరరుళాళ్పెరుమాళెంబెరుమానారులకు మఠమును గట్టించి వారిని యందుండ నియమించి తిరుక్కోవలూరు మొదలగు క్షేత్రములను సేవించికొని తిరుపతికిఁ బోయి సన్నిధిని జీర్ణోద్ధారణము గావించి, శ్రీశైల

పూర్ణులయొద్ద రామాయణకాలక్షేపము లభించుచు కొన్నాళ్లుండి, నారియొద్ద కైంకర్యము చేయుచుండిన గోవిందభట్టరును వెంటఁబెట్టుకొని కాంచీపుర్యాది స్థలములను సేవించికొని శ్రీరంగముచేరి, గోవిందభట్టరునకు యెంబారు అని నామకరణము జేసిరి. ఇట్లుండ దేశాంతర లగు వైష్ణవులు యెంబెరుమానారుమతమునకు మార్గమెక్కడ యని శ్రీరంగస్థలవాసుల నడుగఁగా, ఏ యెంబెరుమానారుమతమని యడిగిరి. అప్పుడు వారు యెంబెరుమానారు లెందఱు నఁగా, పేరరుళాళప్పెరుమాళెంబెరుమానా రని మఱియొక రున్నారనిరి. ఆ మాటను పేరరుళాళప్పెరుమాళెంబెరుమానారు విని యీ స్థలమునందు రెండుమతములుండిన హేతువుచేతకదా ఆచార్యులమతమును నిర్దేశించుటకు వీలుపడక పోయె నని యెంచి, తమ మతమును పగులఁగొట్టి నేలమట్టముగావించిరి. అనంతరము యతిరాజులు శ్రీభాష్యమును రచియించుటకై బోధాయనవృత్తి కావలసియుండినందుచే నాగ్రంథమునకై కూరేశులతోడ కాశ్మీరదేశపు శ్రీనగరములోని సరస్వతీభండారమునకుఁ బోయి దానిని యొకమాఱు ఉభయులును జదివిచూచి, యాగ్రంథమును దీసికొనిరాఁగా నచ్చటి మాయావాదు లాగ్రంథమును సంగ్రహించుకొని పాఱిపోయిరి. అప్పుడు వ్యసనాక్రాంతు లైన యతిపతులకు కూరేశు లా బోధాయనవృత్తిని యొప్పజెప్పిరి. తర్వాత శ్రీరంగమునకు వేంచేసి శ్రీభాష్యమును రచియించిరి.

ఆ తర్వాత యతిరాజులు దిగ్విజయార్థమై శిష్యులతోడ బయలుదేరి చోళమండలములోని కుమతులను ఖండించి తిరుక్కురుంగుడికివచ్చి నంబిగారికి మంత్రోపదేశము చేసి వారివలన వుడయవరులను పేరను వడసి యచ్చోటుబాసి తిరువనంతపురము మొదలగు స్థలములలోఁగల శంకర జైన బౌద్ధాదిమతములను జయించి, ఉత్తరమథుర, సాలగ్రామము మొదలైన క్షేత్రములను సేవించుకొని, సరస్వతీపీఠమునకు రాఁగ సరస్వతీదేవి ప్రత్యక్షస్త్రీరూపముదాల్చి యెదుర్కొనిచని తనకుఁగల సంశయార్థములను దెలిసికొని, రామానుజాచార్యులకు శ్రీభాష్యకారు లని నామ మొసంగెను. ఆ తర్వాత జగన్నాథము మొదలుగాఁగల క్షేత్రములను సేవించికొని తిరుపతికివచ్చి పాషండులు వేంకటేశ్వరునకు విభూతి రుద్రాక్షములు ధరించియుండుటనుదెలిసి వారితోఁబోరాడి విష్ణుచిహ్నములతోఁ బ్రకాశించుస్వామిని పాషండుల కగపఱచి పాషండులను బాఱఁదోలి శ్రీరంగమునకు వేంచేసి యచట నుండిరి. అప్పుడు శ్రీరంగనాథస్వామియొక్క ప్రసాదమహిమచే కూరేశులకుం గలిగిన కుమారులను గటాక్షించి పెద్దశిశువునకు శ్రీపరాశరభట్ట రనియును, చిన్నశిశువునకు శ్రీవ్యాసభట్ట రనియును నామకరణ మొనర్చిరి. ఆతర్వాత చోళదేశపురాజు శివుఁడే పరదైవ మని వాదించుచు యతిరాజులను సమ్మతమని చెప్పవలయు నని నిర్బంధించఁగా నప్పుడు శ్రీరంగమును విడిచి చోళరాజును క్రిమికంఠుఁ డగునట్లు శపించి తొండనూరికిం బోయి, యచ్చటి రాజకుమార్తెకుం గల

బ్రహ్మరక్షస్సును బారఁదోలి, జైనులను జయించి, ఆంధ్రపూర్ణులను కటాక్షించి యచ్చటనుండి తిరునారాయణపురమునకేగి సన్నిధికైంకర్యము నెఱవేర్చి వసించి యుండఁగా, తిరునారాయణస్వామి స్వప్నమున సాక్షాత్కరించి, రామప్రియు లనెడి ఉత్సవమూర్తి, ఢిల్లీనగరమున వేంచేసియున్నారని యానతీయఁగా, రామానుజులు ఢిల్లీకిఁ బోయి, రామప్రియులను "మత్సంపత్పుత్రా" యని పిలువఁగా, నాడుచు వచ్చిన స్వామిని తిరునారాయణపురమునకు వేంచేపు చేసుకొని వచ్చిరి. ఇంతలో పండ్రెండేండ్లు గడచెను. శ్రీరంగమున చోళుఁడు శివుఁడే పరదైవ మని కూరేశులు వొప్పుకొననియెడల కన్నులు తీయించెద ననఁగా; అపుడు కూరేశులు, దుర్మార్గుని చూచినకన్నులను నేనే తీసివేసెద నని చెప్పి తమనేత్రములను తామే వుత్పాటించు కొని రనియు, క్రిమికంఠుఁ డైన చోళుఁడు మృతినొందె ననియు యతిరాజులు విని, మేలుకోటనుండి శ్రీరంగమునకుం బోయి వరదరాజ స్తవముచే కూరేశులకు నేత్రముల ననుగ్రహించి, యచ్చటనుండి కూరేశులు దాశరథులు మొదలగువారితోడ కాంచీపురికి వేంచేసి, యచ్చోటుబాసి, తిరుమలకుం బోయి గోవిందరాజస్వామిని ప్రతిష్ఠచేసి, మరల శ్రీరంగమునకు వేంచేసి, నాచ్చియార్ తిరుమొళిలో సుందరభుజులు తిరుమలను వేంచేయువేడుక జనింపఁగా నచ్చటికింబోయి దివ్యాన్నము నారగింపుచేసి, యచ్చట నుండి శ్రీవిల్లిపుత్తూరికిం బోయి గోదాదేవివలన "గోదాగ్రజుఁడు" అను నామ మును బొంది, యటనుండి తిరునగరికిం బోయి శేషాంశసంభూత మైన తింత్రిణీవృక్ష మును సేవించి, కురుకేశులను స్వీకారము చేసికొని, యచ్చటనుండి మరలి శ్రీరంగ మునకు వేంచేసిరి.

ఇట్లు యతిరాజులు దిగ్విజయముచేసి శ్రీవైష్ణవమతమును స్థాపించి తమకు వెనుక సంప్రదాయమును విచ్ఛిత్తిలేక జరుపుటకై డెబ్బదినల్వురు సింహాసనాధిపతులను నియ మించి, వారిలో నల్వురకు భాష్యసింహాసనాధిపత్యమును బిరుదులతోడ నొసంగిరి. మఱియు యతిరాజులవారి శిష్యకోటియందుఁ జేరిన యేన్నూర్గురు జియ్యంగార్లును, పండ్రెండువేల పరమైకాంతులును, వేనవేలు చాత్తినచాతనివైష్ణవులును, అనేకులు అమ్మంగార్లును, మఱికొందఱు భగవత్కైంకర్యపరులును, యతిరాజులచే నియమింపం బడిన కైంకర్యములు చేయుచుండిరి.

అనంతరము శిష్యజనప్రేరితముచేత యతిరాజులగారు కురుకేశులను తిరువాయ్ మొళికి ఆరాయిరప్పడి యను వ్యాఖ్యానమును రచియించుట కనుజ్ఞయొసంగి, వారట్లు కావించినమీఁద, దానికి భగవద్విషయ మని నామ మొసర్చి, కురుకేశులకు ఉభయ వేదాంతప్రవచన, సింహాసనాధిపత్యము ననుగ్రహించిరి. తర్వాత కూరేశులు పరమ పదించఁగా వారికి భట్టరువలన చరమకైంకర్యము లన్నియు నెఱవేర్చిరి.

అమీఁద తమ శిష్యకోటికి ఆళ్వారాచార్యులను ప్రతిష్ఠ చేయుటకు నియమింపఁగా, శిష్యులు యతిరాజులవారి దివ్యవిగ్రహమును కూడా ప్రతిష్ఠ చేయుటకు అనుజ్ఞ కోరఁగా, వారియిష్టము నెఱవేఱునట్లు తమనంటి దివ్యవిగ్రహము నొకటిని నిర్మించి కొనుఁడని చెప్పినదేగాక, శఠకోపులు తమజీవితకాలమునందు భవిష్యత్కాలమున నవతరింపఁబోవు శ్రీరామానుజులవిగ్రహమును నిర్మించి శిష్యపరంపరఁగా తిరువారాధన మగుచుండు విగ్రహమునుకూ ప్రతిష్ఠచేయుట కనుజ్ఞయొసంగి; శ్రీరంగనాథుని సేవించి స్వామి యనుమతినిబొంది మఠమునకు వేంచేసి యామునాచార్యులశ్రీపాదతీర్థమును స్వీకరించి తమ నూటయిరువదియవ సంవత్సరమగు దుర్మతిసంవత్సర మాఘశుద్ధదశమి యందు బ్రహ్మరంధ్రమును భేదించికొని అర్చిరాదిమార్గముగ పరమపద మలంకరించిరి.

శ్రీరామానుజాచార్యులవారిచే రచియింపఁబడిన గ్రంథములు:—శ్రీభాష్యము, వేదాంతదీపము, వేదాంతసారము, వేదార్థసంగ్రహము, గీతాభాష్యము, గద్యత్రయము, భగవదారాధనక్రమము మొదలగునవి. రామానుజాచార్యులకు తర్వాత ఈ సంప్రదాయమును రామానుజాచార్యులవలె వ్యాపింపఁజేసినవారు యతీంద్రప్రవణు లను మణవాళ మహామును లని తెలియఁదగినది. ఈ విశిష్టాద్వైతసిద్ధాంతము ననుసరించినవారు ఇరు తెఱఁగులవారై యున్నారు. రామానుజులవారి సిద్ధాంతమును తెంగల యనియు, వేదాంతదేశికులవారి సిద్ధాంతమును వడకల యనియు చెప్పంబడును.

## శ్రీ వేదాంతదేశికాచార్యచరిత్రము.

శ్లో. నభస్యమాసి శ్రోణాయా మనంతార్యగురూద్భవమ్
శ్రీవేంకటేశఘంటాంశం వేదాంతగురు మాశ్రయే॥

కలియుగము 4371 శుక్లసంవత్సరము కన్యామాసము శుద్ధదశమీ బుధవారము శ్రవణనక్షత్రమున, యజుశ్శాఖాధ్యాయులును, ఆపస్తంబసూత్రులును, విశ్వామిత్ర గోత్రస్థులు నగు అనంతసూరికి తోతారమ్మగర్భమునందు పండ్రెండుసంవత్సరములు నివసించి, తిరుమల వేంకటేశస్వామియొక్క ఘంటాంశముగ వేదాంతదేశికులవారు కాంచీపురమున (తిరుత్తణ్కా) హిమోపవనమున (క్రీస్తుపుట్టిన 1271-వ సంవత్సరము నందు) అవతరించిరి. ఇట్లవతరించిన శిశువునకు అనంతాచార్యులు వేంకటనాథు లని నామకరణము చేసిరి. వేదాంతదేశికులవారి మేనమామగారు దేశికులకు (తూప్పుల్ పిళ్లై) విశ్వామిత్రసుతులు అని పేరిడిరి. మఱియు దేశికులవారి ద్వాదశవర్ష గర్భధారణాశ్చరాభ్యాసపాటవాదులను వైష్ణవగోష్ఠికి విన్నవించిరి. ఒకనాఁడు భగవత్కాలక్షేపము

నందు ప్రస్తావనస్థానము తెలియక విచారించుచుండఁగా, బాలుఁడైన వేదాంతదేశికులు ఆ యుపన్యాసభాగమును తెలియఁజెప్పిరి. అప్పు డందఱును ఆశ్చర్యమగ్నులై వీరు రామానుజాచార్యులవలె మతస్థాపనాచార్యు లగుదు రనిరి. దేశికులవారిబాల్యంబునవే తల్లి గతించెను. అప్పిళ్ళార్ అనువారియొద్ద దేశికులు వైష్ణవసంప్రదాయగ్రంథములను, వేదవేదాంతాది శాస్త్రములను అభ్యసించిరి వీరు ఆత్మగుణపరిపూర్తి గలవారుగ నుండినందున ఆచార్యు లగుదు రని వీరిగురువులైన కిండాంబి అప్పిళ్ళార్ వారెంచిరి. దేశికులు సమావర్తనాదు లన్నియు తీర్చికొని, ఇరువదియవసంవత్సరమున తిరుమంగై యను కన్యను పెండ్లాడిరి.

వీరికి విద్యాగురువులవారు వైనతేయమంత్రము నుపదేశించి, రామానుజ సిద్ధాంతస్థాపకు లగుదురుగాకయని మంగళాశాసనము చేసిరి. మఱికొన్నాళ్లకు వీరిగురువులు పరమపదమున కేగుసమయమున దేశికులవారిని ఆచార్యత్వమును వహించి సిద్ధాంతప్రవచనము చేయునట్లాజ్ఞాపించిరి. అట్లే మతస్థాపనోద్ధారణముకొఱకై కాశ్యాది దివ్యస్థలములకెల్ల నేగి సిద్ధాంతస్థాపనము చేయుచుండఁగా శిష్యు లనేకులు వీరిచరణముల నాశ్రయించిరి. దేశికులు శిష్యులతోడం గూడి దివ్యదేశయాత్రలు చేయుచు, తిరువహీంద్రపురమున కేగి ఔషధాద్రిమీద నొక అశ్వత్థవృక్షముక్రింద వసించి వైనతేయమంత్రమును ఆవృత్తి చేయుచుండఁగా, వైనతేయులు దర్శనమిచ్చి హయగ్రీవమంత్రము నుపదేశించి, యీమంత్రబలమువలన శ్రీమద్భగవద్రామానుజసిద్ధాంతము సమృద్ధియగుగాకయని మంగళాశాసనముచేసిరి. అంత దేశికులు వైనతేయులపాదకమలములకు పునః పునః ప్రణామంబు లాచరించినంత, వైనతేయులు దేశికులవారినిం జూచి, ఫలాభిలాషను వదలి హయగ్రీవమంత్రమును ఆవృత్తి చేసికొని యుండు మని మంగళాశాసనము చేసి యంతర్ధాన మైరి.

అనంతరము దేశికులవారికి హయగ్రీవమంత్రమహిమవలన సర్వవిద్యలును ఏకాకృతిదాల్చి పురుషస్వరూపముతో దేశికులవారిముందునిల్చి వేదాంతస్థాపనము చేయుఁడని నియమించెను. ఇట్లు సర్వవిద్యలను వశీకరణము చేసికొని, తిరువహీంద్రపురంబునందే భగవత్ స్తోత్రగ్రంథము లనేకములను సంస్కృత ప్రాకృత ద్రావిడభాషలలో రచియించి, భగవత్కటాక్షమును బొంది, అచ్చోటనుండి తిరుక్కోవిలూరికిఁ బోయి భగవత్కటాక్షమును బొంది, తమ స్వస్థానమైన హిమోపవనంబునకు వచ్చి శిష్యులతోఁగూడ మతస్థాపనము చేయుచు, కాంచీవరదరాజస్వామివిషయముగాఁ గొన్ని దివ్యగ్రంథములను సంస్కృతమునను ద్రవిడమునను రచియించిరి. ఇట్లుండఁగా, దేశికులకు మాతులులును ఆచార్యులు నైన కిండాంబి అప్పిళ్ళార్ళామాశ్రీయు, అనే

గొంది కృష్ణదేవరాయలవారి గురువు లైన పుండరీకాక్షులవారిభార్యయు నగు సాధ్వీమణి, కలి 44 5-వ సంవత్సరమున నొకకుమారునిం గనెను. ఆ శిశువునకు దేశికులు శ్రీనివాసుఁ డని నామకరణమును గావించి, యీ వృత్తాంతమును ఆనెగొందియం దున్న పుండరీకాక్షులకుఁ దెలియఁజేసిరి. పుండరీకాక్షులవారు రామానుజులవారి శిష్యపరంపరగా ఆరాధించు చుండిన హయగ్రీవస్వామిని ఆరాధించు చుండిరి. ఆ హయగ్రీవస్వామి స్వప్నమున నీ కుమారునకు శ్రీనివాసుఁ డని నామకరణము చేయు మనియెను. తర్వాత పుండరీకులు కాంచీపురమునకు వచ్చి, దేశికులను జూచి, మీరు పెట్టినపేరు నాకును సమ్మత మైన దని తమ స్వప్నవృత్తాంతమును నెఱింగించి, దేశికులవారిమహిమను గొనియాడిరి. అవల దేశికులు ఘటికాచలము, తిరుచ్చానూరు, దిగువతిరుపతి మొదలగు స్థలములను సేవించుకొని, తిరుమలకుంబోయి స్వామిని సేవించు చుండఁగా, వేంకటేశ్వరస్వామి తమవిషయమై యొకస్తోత్రమును చేయు.మని అర్చకముఖముగా ననుజ్ఞ చేయ నట్లే కావించి, భగవత్కటాక్షమునకుఁ బాత్రులైరి. తర్వాత ద్వారక, మథుర, మొదలగు దివ్యస్థలముల కేగుటకు నిశ్చయించి బయలుదేరి పోవుచుండఁగా, మార్గవశంబున తుంగభద్రాతీరంబునందలి ఆనెగొందియొద్ద నొక కోవెలయందు నివసించి యుండఁగా, వైరాగ్యముతో సన్న్యసించి గంగాయాత్ర చేయుటకొఱ కచ్చోటికి వచ్చిన దేశికులను, విద్యారణ్యులు జూచి, బాల్యస్నేహితమును బట్టి మాటలాడు చుండిరి. అప్పు డానగరపురాజకుమారునకు బ్రహ్మరక్షస్సు పట్టియుండినందున విద్యారణ్యులు ఆ బ్రహ్మరక్షస్సును పోఁగొట్టవలయునని వేఁడఁగా, దేశికులు అనభిముఖులై యచ్చోటుబాసి బృందావనము, అయోధ్య, కాశి, శ్రీకూర్మము, అహోబిలము, తిరువళ్లూరు మొదలగు దివ్యస్థలములకుంబోయి భగవత్సేవచేసికొని శ్రీపెరుంబూదూరికి వచ్చి రామానుజులవారిని సేవింపఁగా, వారు అర్చకముఖముగా మత్సిద్ధాంతమును సంపూర్ణముచేయు మని చెప్పినంత, దేశికులు సంతోషించి యచ్చోటనుండి కాంచీపురముజేరి మతోద్ధారణము చేయు చుండిరి.

ఇట్లుండఁగా, మాయావాదసన్న్యాసి యొకఁడు వాదము చేయఁగా వానిని దేశికులు జయించిరి. వాఁడు క్షుద్రమంత్రవాదియై నందున దేశికులకు ఉదరవేదనను కల్గించెను. దేశికు లాసంగతి నెఱింగి యొక స్తంభమును గీయఁగా మాయావాది కడుపు విచ్చెను. వాఁడు భయ మొంది శరణు పొందెను.

మఱికొన్నాళ్లకు విద్యారణ్యులు ఆనెగొంది రాజపుత్త్రి బ్రహ్మరక్షస్సును నివర్తింపజేసి విజయనగరమును నిర్మించి, రాజునకు మంత్రియైయుండిరి. దేశికులుఉపాదానవృత్తి చేయు చున్నారని తెలిసి, మీరు కష్టపడ నక్కఱలేదు, ఇవటికి రావలసినది యని యొకపత్త్రిక వ్రాసి పంపఁగా దానిని దేశికులు చూచి;

శ్లో॥ క్షోణీకోణశతాంశపాలనకలా దుర్వారగర్వానల
క్షుభ్యత్క్షుద్రనరేంద్రచాటురచనా ధన్యాన్న మన్యామహే
దేవం సేవితు మేవ నిశ్చిత మహే యో౽సౌ దయాళుః పురా
ధానా ముష్టి ముచే కుచేలమునయే దత్తే స్మ విత్తేశ తామ్॥

అను శ్లోకమును వ్రాసి యంపిరి. విద్యారణ్యులు దీనిం జూచి దేశికులవారి వైరాగ్యమును పోఁగొట్టవలయు నని యెంచి మఱిఁ గొంతకాలమునకుమీఁద మునుపటి వలె నొకపత్త్రికను వ్రాసి పంపిరి. అందుల కుత్తరముగా వైరాగ్యపంచకమును వ్రాసి పంపఁగా, విద్యారణ్యులు మెచ్చి దేశికులయందు ప్రవణులై యుండిరి. ఇట్లుండఁగా, అసూయాపరులచే ప్రేరితుఁడైన నొక బ్రహ్మచారి వివాహమునకు ధనమునొసంగవలసిన దని దేశికులవారిసన్నిధిని విన్నవింపఁగా, దేశికులు శ్రీస్తుతిచేసి అపారధనమును బ్రహ్మచారి కొసంగిరి. మఱిఁ గొంతకాలమునకు శ్రీరంగమున పరమతస్థులు విశిష్టాద్వైతమతమును ఖండించు చున్నారని విని యచ్చోటికేగి శ్రీరంగనాథస్వామిని, రంగనాయికను, శ్రీయతిరాజులను సేవించి, వారి యనుమతిచొప్పున ఏడుదినములు వాదించి పరమతస్థులను గుర్వనుగ్రహమువలన ఖండించిరి. ఆ ఖండనగ్రంథమునకు 'శతదూషణి' యని పేరు. తర్వాత రామానుజులవారు దేశికులకు స్వప్నమున మంత్రమంత్రార్థాదుల నుపదేశించి మతోద్ధారకు లగుదురు గాక యని దీవించిరి. శ్రీరంగనాథస్వామి దేశికులవారికి వేదాంతదేశికు లని అర్చకముఖముగా నామ మొసంగిరి. అచ్చట వేదాంతదేశికులవారు శ్రీరంగనాథస్వామివిషయముగాను, యతిరాజులవిషయముగాను కొన్నిస్తోత్రగ్రంథములను, పరమతనిరసనమైన గ్రంథము లనేకములను రచియించిరి. వీరి మహిమనుం జూచి, సుదర్శనభట్టు మొదలగువారు వీరికి కవితార్కికసింహు లని నామ మిడిరి.

ఇట్లుండ విజయనగరమున అక్షోభ్యముని యైన తత్త్వవాదికిని మాయావాది యైన విద్యారణ్యులకును వాదము జరుగుచుండఁగా వీరివాదమునందలి సత్యమును తెలియఁజేయుటకై రాజు దేశికులవారిని కోరి విజ్ఞాపన పంపిరి. దేశికులు;

శ్లో॥ అసినా తత్త్వ మసినా పరజీవప్రభేదినా ।
విద్యారణ్యమహారణ్యం అక్షోభ్య ముని రచ్ఛినత్॥

అను నీ శ్లోకమును వ్రాసి పంపిరి. ఈ శ్లోకమును జూచి విద్యారణ్యులు కోపముతో మీ 'శతదూషణి' యనుగ్రంథమును బంపవలయు నని తెలియఁజేయఁగా, ఆలాగున దేశికులు బంపఁగా, నాగ్రంథములో నొక చకారముమాత్రము అతిక్రమణ మని తెల్పిరి. దేశికులు ఆ చకారము సరియే యని "చకారసమర్థనమ్" అను గ్రంథమును వ్రాసి పంపఁగా విద్యారణ్యులు జూచి మిగులఁ బాగడిరి.

ఇట్టి సర్వతంత్ర స్వతంత్రు లైన వేదాంతాచార్యులమహిమను విని కృష్ణమిశ్రుఁడనువారు వాదము చేసి జయమొందక ఓడిపోయినాఁడు. మఱియు వాఁడు రచియించిన ప్రబోధచంద్రోదయమునకు విరోధముగా సంకల్పసూర్యోదయమును ఒక్కరాత్రియందే రచియించి కృష్ణమిశ్రునకుం జూపఁగా, నతఁడు అధోముఖుఁడాయెను. మఱియొకమాఱు డిండిమకవి యనునతఁడు రామాభ్యుదయమును రచియించి దేశికులవారిచేతి కీయఁగా, దేశికులవారు యాదవాభ్యుదయమును, హంససందేశమును రచియించి వానిచేతి కిచ్చినంత నతఁడాశ్చర్యమొంది కవితార్కికసింహమను బిరుదు మీకే చెల్లునని చెప్పెను. తర్వాత దేశికులు కుంభఘోణము, శ్రీవిల్లిపుత్తూరు, శ్రీముష్ణము మొదలగు దివ్యస్థలముల కేగి భగవత్ప్రసాదమును బొంది కాంచీపురి జేరి యం దుండఁగా, మఱియొకపరి కొందఱి దుర్బోధనవలన నొక పాములవాఁడు దేశికుల ముందునచ్చి నిలిచి తమరు మంత్రవాదమువలన నన్ను జయింపకగాని మీకు సర్వతంత్రస్వతంత్ర బిరుదు చెల్లదని వాదించెను. గరుడదండకము నుచ్చరించినమాత్రమున, గరుత్మంతుఁడు వానియొక్క మహానాగములనంతయు నెత్తుకొనిపోఁగా, పాములవాఁడు మన్నింపవలయు నని వేఁడుకొనియెను.

మఱి కొంతకాలమునకుమీఁద తిరువహీంద్రపురమునం దుండఁగా, నొక బేలుదారివాఁడు వచ్చి, మీరొక బావిని కట్టకగాని మీకు సర్వతంత్రస్వతంత్రబిరుదు చెల్లదనఁగా, ఆ బేలుదారివాఁడిచ్చిన రాళ్లచేతనే యొకబావిని దేశికులవారుకట్టిరి. తర్వాత వీరనారాయణపురమునకుం బోయి స్వామిని సేవింపఁగా, నాథయామునులు తిరుమంత్రార్థాది రహస్యప్రవచనములను ప్రకాశింపఁజేయుఁ డని అర్చకముఖముగా నాజ్ఞాపించిరి. మఱియు దేశికులవారియొద్ద అనేకులు భగవద్విషయ శ్రీభాష్యాదిగ్రంథములను అధికరించు చుండిరి.

ఇట్లుండ అసూయాపరులు వేదాంతదేశికులవారి తండ్రి తిరువధ్యయనమును భంగముచేయ నెంచి నిమంత్రిత శ్రీవైష్ణవులకు మత్తుపదార్థములొసంగి మైమఱచిపోవునట్లు కావించిరి. శ్రాద్ధసమయమున సకలభక్ష్యభోజ్యములను కూర్చొనహితు లైన దేవ పితృ విష్ణువులకు పరిమారి దేవ పితృ వైష్ణవసూక్తములను జపించు చుండి కొంతసేపునకు కనులు దెఱచి చూడఁగా నంతయు భుజింపఁబడి యుండెను. ఇట్లు భుజించి వీథియందు ముగ్గురు శ్రీవైష్ణవులు పోవుటను గనిన కొందఱు దేశికులను జూచి, మీయింట భోజనము చేసిన ఆముగ్గు రెవ రనఁగా, వారు కోవెల, తిరుమల, పెరుమాళ్ కోవెల యెంబెరుమానారు లని విన్నవించిరి. ఈ విషయమై దేశికులును ఆశ్చర్యమున్నులైరి. కొన్నాళ్లమీఁద దేశికులవారివిరోధు లొకనాఁడు ఈరాత్రియందు వేయిశ్లోక

ములు రచియించినవారే కవితార్కికసింహు లనంబడుదు రని చెప్పఁగా, దేశికులవా రాలాగున నే పాదుకాసహస్ర మను నొకగ్రంథమును రచియించి ప్రతిపక్షులకు కనఁబఱిచిరి. ఇట్లు దేశికులు సర్వతంత్రస్వతంత్రులై వైష్ణవమతప్రవర్తకాచార్యులై యుండుటను గని వేంకటగిరి సర్వజ్ఞసింగమనాయఁడు శిష్యుఁ డాయెను.

ఇవ్విధముగ 32 సంవత్సరములు గతించినమీఁద వేదాంతదేశికులవారికి పేరరుళాళర్ స్వప్నమునవచ్చి మీకు మాయంశమున నొకపుత్త్రుఁడు కల్గును; వానికి మన్నారు మను నుంచుఁ డని చెప్పఁగా, పేరరుళాళర్ ఆజ్ఞాప్రకారము శుభదినమున నిషేకము చేసికొని కలి 4418-వ సంవత్సరము సింహమాసము రోహిణీనక్షత్రమున కుమారునిం గనిరి. అతనికి జాతకర్మ నామకరణాదులం గావించి యుక్తకాలమున సకలవిద్యలను బోధించిరి. కొంతకాలమునకు దేశికులవారు కుటుంబసమేతముగా తిరునారాయణపురమునకుం బోయి అనేకశిష్యులతో శాస్త్రార్థప్రవచనములు చేయుచుండఁగా నచ్చోట నొక మాయావాది వాదమునకు రాఁగా, వానితో తమకుమారు లైన పేరరుళాళర్ జియ్యరును వాదించుట కనుజ్ఞ యొసంగ, వారు శతదూషణి మొదలగు గ్రంథములవలన వానిం జయించిరి. దేశికులు తిరునారాయణపురంబున నుండఁగా, శ్రీరంగంబున తురుష్కులు కొల్లగొట్టిరని విని మిగుల చింతాక్రాంతులై ప్రతినిత్యమును సకుటుంబముగా శిష్యులతోఁ గూడి, కల్యాణతీర్థమున స్నానము చేసి యతీంద్రులసన్నిధికిం జని;

శ్లో. కపర్దిమతకర్దమం కపిలకల్పనా వాగురా
దురత్యయ మతీత్యత ద్రుహిణతంత్రయంత్రోదరమ్ ।
కుదృష్టి కుహనాముఖే నిపతితః పరబ్రహ్మణః
కరగ్రహవిచక్షణో జయతి లక్ష్మణోఽయం మునిః.

అని అనుసంధించుచు, స్వామిసన్నిధికిని దేవిసన్నిధికినిఁ బోయి ప్రసాదములను స్వీకరించుచు, మూలబేరమును ఉత్సవబేరమును సేవించుచు, శిష్యులకు భగవద్విషయమును ప్రసాదించుచు నుండి, ఆతర్వాత సత్యమంగలంబునకుం బోయిరి. అచ్చోట తిరుమలలోనుండి గోపణరాయ డను నొకప్రభువు రంగనాథస్వామిని తాయార్లను గైకొనిపోయి చెంజియందు కొన్నాళ్లును, సింగపురంబున కొన్నాళ్లును ఆరాధించుచుండి, కలి 4451 సర్వధారిసంవత్సరమున తురకలను జయించి శ్రీరంగమున్నిధియందు ప్రతిష్ఠించి ఉత్సవాదులనంతయు క్రమముగా జరిపించుచున్నాఁ డని విని, దేశికులు సకుటుంబముగా శ్రీరంగమునకుం బోయి స్వామిని సేవించి ఆనందముతో రంగనాథునిఁ బ్రతిష్ఠించిన గోపణరాయనివిషయమై;

శ్లో॥ ఆనీలానీలశృంగద్యుతిరచితదగద్రంజనాదంజనాద్రే [స్ఫాక్
శ్ఛుంజ్యామారాధ్యకం చిత్సమయమథ నిహత్యోద్ధనుష్కాతురు
లక్ష్మీక్ష్మాభ్యా ముభాభ్యాం సహనిజనిలయే స్థాపయన్ రంగనాథం
సమ్యక్చర్యాం సపర్యా మకృతభువి యశః ప్రాపణో గోపణార్యః.

అను శ్లోకమును రచియించిరి. మఱియు చిత్రకూటంబున (చిదంబరమున) గోవిందరాజప్రతిష్ఠావిషయమై, వివాదములు జరుగఁగా దానిని గోపణరాయనిం గొని సమర్థించిరి. మఱియు కోవెలలో దేశికులవారికి మర్యాదలు కావుటకు వలనుపడ దని కుమతులబోధనవలన అర్చకులు దేశికులతో మీరు దివ్యప్రబంధప్రామాణ్యములను స్వసిద్ధాంతమును నిర్వహింపక గాని మర్యాదలుచేయుట లేదనఁగా, దేశికులు సిద్ధాంత ములను నిర్వహించి కుమతులను జయించిరి. అంత రంగనాథస్వామి అర్చకముఖ ముగా మతోద్ధారణము కావించినందుచే నిదిమొదలు మీవిషయ మైన;

శ్లో॥ రామానుజదయాపాత్రం జ్ఞానవైరాగ్యభూషణమ్
శ్రీమద్వేంకట నాథార్యం వందే వేదాంత దేశికం,

అను శ్లోకమును మొదట అనుసంధింపవలసిన దని తెలియఁజేసిరి. కుమతులు తమయుద్యోగము నెఱవేరలే దని చింతించి కాశీదేశమునుండి యొకపండితుని రప్పిం పఁగా నాతనితో దేశికులవారు 7 దినములు వాదించి జయించిరి. ఆ పండితుఁడు సంతోష మొంది బ్రహ్మతంత్రస్వతంత్రు లని బిరు దొసంగెను.

ఇట్లు కొంతకాలము చనిన, నొకశిల్పివచ్చి నన్నుజయింపకగాని మీకు సర్వతంత్ర బిరుదము చెల్లదనఁగా, దేశికులు కానిమ్మనిచెప్పెను. ఆరాత్రి శయనించియుండఁగా, శ్రీరంగనాథస్వామి స్వప్నమునవచ్చి నీవలెనే యొక విగ్రహమును నిర్మింపు మన, దేశి కులు ఉదయమున లేచి సైనముతో తమవంటి విగ్రహమును చేసి శిల్పికి యిచ్చినంతే, ఆ శిల్పి సంతోషించి పంచలోహములతో విగ్రహమును నిర్మించి కపోలమును చెక్కు నపుడు, దేశికులవారికపోలమున రక్తధార స్రవించెను. ఈ యద్భుతమును గనిన శిల్పి తన అపరాధమును క్షమింపవలసిన దని ప్రార్థించెను. అప్పుడు శిల్పార్థసార మను గ్రంథమును రచియించి వాని కిచ్చిరి. ఇట్లు రామానుజసిద్ధాంతమును స్థాపించిన వేదాంతదేశికులవారు నూఱుసంవత్సరములు పూర్తియైనమీఁద సౌమ్యానామసంవ త్సరము వృశ్చికమాస శుద్ధపూర్ణిమయందు పరమపద మలంకరించిరి.

వేదాంతదేశికులవారిచే రచియింపఁబడిన గ్రంథములు 121, అందు స్తోత్ర ములు 32, కావ్యగ్రంథములు 8, అనుష్ఠానశాస్త్రములు 24, రహస్యములు 32, సంప్ర దాయప్రబంధములు 24, భగవద్విషయము 1.

## తెంకలవడకల సంప్రదాయభేదములు.

### తెంకలసంప్రదాయము.

1. ఈశ్వరకటాక్షము యెవనియందైనను నిర్హేతుకముగా కలుగును.

2. మోక్షలాభము యీశ్వరునికొఱకే గాని జీవునికొఱకుగాదు. ఇది అధికారి భేదము ననుసరించియుండును.

3. కర్మజ్ఞానభక్తియోగములు మూఁడును, ఆచార్యనిష్ఠయు మోక్షమునకు స్వతంత్రోపాయములు.

4. లక్ష్మీదేవి జీవకోటివలె అణుస్వరూపురాలేగాని సర్వవ్యాపకురాలుఁగాదు.

5. మోక్షము నొసంగు శక్తి లక్ష్మీదేవికి లేదు.

6. ఈశ్వరుఁడు ఆశ్రితుల దోషములను భోగ్యముగా దలంచునట్టి వాత్సల్య గుణములు కలవాఁడు.

7. భగవంతుఁడు పరులదుఃఖములను జూచి దుఃఖించునట్టి దయగలవాఁడు.

8. ప్రపత్తి భక్తివలె మోక్షమునకు సాధనము కాదు.

9. ప్రపత్తికి స్వరూప యాథాత్మ్యజ్ఞానము కలవాఁడే యధికారి యగును.

10. ప్రపత్తికి సర్వధర్మపరిత్యాగము ఆవశ్యకము.

11. చేతనులందఱును పరతంత్రులుగాన భక్త్యాద్యుపాయములు పారతంత్ర్యస్వరూపవిరుద్ధములై యున్నవి.

### వడకలసంప్రదాయము.

1. ఈశ్వరునకు కల్గెడు కటాక్షము సహేతుకముగా నుండును.

2. మోక్షలాభము జీవునికే గాని యీశ్వరునకు గాదు. అధికారిభేదము లేదు.

3. కర్మజ్ఞానాదులు భక్తికి అంగములే గాని స్వతంత్రోపాయములు కావు.

4. లక్ష్మీదేవికిగూడ యీశ్వరునివలె సర్వవ్యాపకత్వము కలదు.

5. మోక్షము నొసంగు శక్తి లక్ష్మీదేవికిఁ గలదు.

6. భక్తులయొక్క దోషములయందు లక్ష్యముంచక పోవుటయే వాత్సల్య మనఁబడును.

7. పరులదుఃఖములనుజూచి సహింపకుండుటయే దయ యనఁబడును.

8. ప్రపత్తియు భక్తివలె మోక్షమునకు సాధనమే.

9. ప్రపత్తికి అకించనుఁడే యధికారి యగును.

10. ప్రపన్నుఁడు అశక్తిచేత స్వధర్మపరిత్యాగములను స్వాభావికముగనే విడువఁగలఁడు.

11. ప్రపత్తికాక తక్కిన భక్త్యాద్యుపాయములు అధికారులభేదము ననుసరించి యుండును.

12. ప్రపన్నుఁడు శాస్త్రవిహితకర్మములాచరించుట యితరు లట్లాచరించుటకొఱకు.

13. ప్రపన్నుఁడు ప్రపత్తికి పూర్వధర్మములైనవానిని ఆచరింప నక్కఱలేదు.

14. ప్రపన్నులకందఱకును భగవదనుగ్రహము కలుగదు.

15. ప్రపన్నుఁడు పాతకములు చేసినను పూర్వప్రపత్తిని యనుసంధించిన౦తనే నిష్కృతి యగును.

16. ప్రపన్నుఁడు హీనకులస్థుఁడైనను శ్రేష్ఠకులస్థునివలె గౌరవింపఁబడదగినవాఁడు.

17. ఈశ్వరుఁడు అణుస్వరూపులైన జీవులయందు అంతర్యామియై యున్నాఁడు.

18 విరజానదికి ఆవల నుండు నిత్యమైన కైవల్యమును బొందినవాఁడు మఱల జన్మము నొందఁడు. కైవల్యము నొందినవానికి పరమపదము కలుగదు.

12. ప్రపన్నుఁడు శాస్త్రవిహితకర్మముల నాచరించుట భగవదాజ్ఞ ననుసరించి భగవత్ప్రీతికొఱకు.

13. ప్రపన్నునకు ప్రపత్తికి పూర్వధర్మములు ప్రపత్తికి అంగమైయుండుటంబట్టి ఆచరింపవలయును.

14. ప్రపన్నులకందఱకును భగవదనుగ్రహము కలుగును.

15. ప్రపన్నుఁడు పాతకములు చేసినయెడల మఱల ప్రపత్తిని సక్రమముగాఁ జేయవలయును.

16. హీనకులస్థుఁడైన ప్రపన్నుఁడు వర్ణాశ్రమధర్మవిరోధము లేక మాటలచేతమాత్రమే గౌరవింపందగినవాఁడు.

17. ఈశ్వరుఁడు అణుస్వరూపులైన జీవులయొక్క వెలుపలనంతయు వ్యాపించియుండును గాని అణువులలో వ్యాపించుట అసంగతము.

18. విరజానదికి ఈవలనుండు అనిత్యమైన కైవల్యము ననుభవించినతర్వాత పరమపదమునుగూడ పొందనగును.

ఈపైన చెప్పంబడినవి ముఖ్యమైన ధర్మములు. ఇట్లే వడకలవారును, తెంకలవారును ధరించు తిరుమణియందును వ్యత్యాసము కలదు. వడకలవితంతువులు ముండనము చేసికొందురు. తెంకలవితంతువులు ముండనము చేసికొనరు. వడకలవారు స్త్రీశూద్రులకు ప్రణవోక్తముగ తిరుమంత్రము నుపదేశింపరు. తెంకలవారు స్త్రీశూద్రులకుకూడ ప్రణవసహితముగ మంత్రము నుపదేశింతురు.



విశిష్టాద్వైత సిద్ధాంతము:—ఆత్మ, ప్రకృతి, భగవంతుఁడు అని మూఁడు పదార్థములు గలవు. ఆత్మయందును ప్రకృతియందును నివసించి యుండెడి పరమాత్మ భగవంతుఁడు. సృష్టికి పూర్వము అనంతము లైన ఆత్మలును, ప్రకృతియును, నామము చేత గాని రూపముచేత గాని విభజింప శక్యములు గానివై అగోచరములై యుండినవి. ఆత్మనుక్ ప్రకృతినిక్ గోచరముగాఁ జేయుటయే సృష్టి యనఁబడును ఈ సృష్ట్యంత మున అవి తమ పూర్వస్థితిని బొందును. ఆత్మ పరమాత్మకంటె భిన్నమైనది. దానికి పుట్టుక లేదు. పుట్టుక లేనందున చావును లేదు. శరీరము నశించినపు డది నశింపదు. అది అణుప్రాయమై నప్పటికిని, అనంతముగా నుండఁగలదు ఆత్మ అంతము లేని నిర్మలజ్ఞానమును కలిగి యున్నను, అనాదిగా మాయచేత కప్పఁబడి యున్నది. కర్మ ముల తారతమ్యమును బట్టి, ఆ జ్ఞానము వృద్ధి యైనను క్షీణ మైనను పొందు చుండును. ఈ లోకమునందును, పరలోకమునందును తన పుణ్యపాపకర్మములకుఁ దగినట్టి సుఖ దుఃఖముల ననుభవించిన పిమ్మట, దానికి భగవద్ జ్ఞానము గాని, లేక వైకుంఠప్రాప్తి గాని కలుగును. వైకుంఠమునకుఁబోయిన ఆత్మ యెన్నటికిని తిరిగిరాదు; అచ్చటనే ఈశ్వరునివంటి శరీరమును కలిగి యుండి భగవత్సేవ చేయుటచే కలుగు సుఖము నను భవించు చుండును.

ఇట్టి ఈశ్వరునికి పర వ్యూహ విభవాంతర్యా మ్యర్చ లను అయిదురూపములు గలవు.

పర మనఁగా:—కాలకృత పరిణామము లేని నిత్యవిభూతియందు నిత్యా సంకుచితజ్ఞాను లైన అనంత గరుడ విష్వక్సేనాదుల కనుభవవిషయభూతుండై యుండు రూపము.

వ్యూహ మనఁగా:—లీలావిభూతియొక్క సృష్టిస్థితిసంహారములను నిర్వహిం చుటకును, బుభుక్షువు లగు సంసారుల రక్షించుటకును, ముముక్షువు లగు ఉపాసకుల ననుగ్రహించుటకును పరిగ్రహించిన సంకర్షణ ప్రద్యుమ్న అనిరుద్ధరూపములు.

విభవ మనఁగా:—రామ కృష్ణా ద్యవతారములు.

అంతర్యామి యనఁగా:— "పద్మకోశ ప్రతీకాశగ్ హృదయం చా ప్యధో ముఖమ్" అనునట్లు శుభాశ్రయ మైన విగ్రహముతోడ బాహ్యవిషయప్రవణు లైన చేతనులకు ధ్యానరుచి గలిగినపుడు ధ్యేయుఁడై, బుద్ధ్యాదులకు నియామకుండైన హృదయకమలమునందు వాసము చేయు రూపము.

అర్చ యనఁగా:— ఆశ్రితుల కభిమతములైన ద్రవ్యములయందు ఆవిర్భవించి యుండునట్టి స్థితి, ఇట్టి అర్చారూప మయిన ప్రతిమాదిపూజచేత పురుషార్థమునకు

ప్రతిబంధక మయిన దురితము నివర్తించును: ఆ తర్వాత విశ్వాది పూజ చేయుటకు అధికారము కలుగును. ఇందులకు ప్రమాణము:—

శ్లో. వాసుదేవః స్వభక్తేషు వాత్సల్యా త్తత్తదీ హితమ్
అధికార్యానుగుణ్యేన ప్రయచ్ఛతి ఫలం బహుః.

ప్రతిమాదిక మర్చాస్యా దవతారాస్తు వైభవః
సంకర్షణో వాసుదేవః ప్రద్యుమ్న శ్చానిరుద్ధకః.

వ్యూహ శ్చతుర్విధో జ్ఞేయః సూక్ష్మ సంపూర్ణషడ్గుణమ్
త దేవ వాసుదేవాఖ్యం పరంబ్రహ్మ నిగద్యతే.

అంతర్యామీ జీవసంస్థో జీవప్రేరక ఈరితః
య ఆత్మ నీతి వేదాంత వాక్యజాలై ర్నిరూపితః.

అర్చోపాసనయా క్షీణే కల్మ షేధికృతో భవేత్
విభ వోపాసనే పశ్చా ద్వ్యూహోపాస్తౌ తతః పరమ్.
సూక్ష్మే త దనుశక్తస్యా దంతర్యామిణ మాక్షితమ్.

ఈప్రకార మైన ఉపాసన చేయునట్టివిధములు ఏవి యనఁగా:— అభిగమన మని, ఉపాదాన మని, ఇజ్య యని, స్వాధ్యాయ మని, యోగ మని ఐదువిధములు. అభిగమన మనఁగా:— దేవతాస్థానమార్గములలో సమ్మార్జనము మొదలయిన కైంకర్యము చేయుట. ఉపాదాన మనఁగా:—చందన మాల్యములు మొదలగు పూజాద్రవ్యములను సంపాదించుకొనుట. ఇజ్యయనఁగా:—దేవపూజ. స్వాధ్యాయ మనఁగా:—అర్థానుసంధానపూర్వక మయిన మంత్రజపమును, తత్త్వప్రతిపాదక మయిన శాస్త్రమును అభ్యసించుట. యోగ మనఁగా:—దేవతానుసంధానము. ఈప్రకారముగా ఉపాసనాకర్మసహితజ్ఞానముచేత ద్రష్టృదర్శనములు రెండును నశింపఁగా నా భగవద్భక్తునికి భక్తవత్సలుఁ డయిన పురుషోత్తముఁడు నిరవధికానందరూప మయినట్టియు, పునరావృత్తి లేనట్టియు, స్వపద మయిన వైకుంఠమును యిచ్చుచున్నాఁ డని సిద్ధాంతము.

విశిష్టాద్వైత సంస్కారపంచకము:— శ్లో. "తాపః పుండ్ర స్తథా నామ మంత్రో యాగశ్చ పంచమః" అనఁగా శంఖచక్రములను తప్తము జేసి భుజములందు ధరించుట తాపము. శ్వేతమృత్తికతోను శ్రీచూర్ణముతోను ద్వాదశోర్ధ్వపుండ్ర

 

ములు ధరించుట పుండ్రము. విష్ణుసంబంధము గల రామ కృష్ణాది నామములను ధరించుట నామము. అష్టాక్షరమంత్రమును స్మరించుట మంత్రము. భగవదారాధన మనెడి తిరువారాధనమే యాగము. అను నీ యైదును ముఖ్యముగా శ్రీవైష్ణవులను కలిగి యుండవలయును.

## ద్వైతమతము.

ఈ మతమును స్థాపించినవారు మధ్వాచార్యులు. వీరికి పూర్ణప్రజ్ఞు లని యొక పేరు కలదు గాన, ఈ మతమును పూర్ణప్రజ్ఞమత మనియును, మధ్వమత మనియును, తత్త్వవాదిమత మనియును, బ్రహ్మవాదిమత మనియును జెప్పుదురు.

## శ్రీమధ్వాచార్యచరిత్రము.

భూలోకమునందు బుద్ధమతము అద్వైతమతము మొదలుగాఁ గల మతములు ప్రబలి వేదవేదాంతములకు అపార్థములను కల్పించి, లోకమును నాశము చేయునట్టి కాలంబున బ్రహ్మాదిదేవతలు శ్రీహరితో మొఱపెట్టఁగా శ్రీహరి లోకోద్ధారపురుషుఁ డెవఁడని విచారించి త్రేతాయుగమునందు హనుమంతుఁడుగను, ద్వాపరయుగమునందు భీమసేనుఁడుగను అవతరించి దుష్టులను ఖండించిన వాయుదేవుఁడే సమర్థుఁడని తెలిసి, వాయుదేవునిం బిలిచి, భూమియం దవతరించి వేదవేదాంతముల నిజార్థములను బోధించి లోకులను తరింపంజేయవలసిన దని యనుజ్ఞ నొసంగెను.

ఇట్లుండఁగా, శంకరమతాది దుర్మతములచే దుఃఖమునొందిన జనులు రజతపీఠ మనెడు ఉడుపియందు అనంతేశ్వరస్వామియుత్సవమును దర్శించుటకు వచ్చి యుండఁగా, నడుచుటయును చెప్పుటయును చేతగాని యొకనిమీఁద అనంతేశ్వరస్వామి ఆవేశమైనందున, వాఁడు ధ్వజస్తంభముమీఁద నెక్కి శీఘ్రకాలమున మీ మనోవ్యాకులమును దీర్చునట్టి సర్వజ్ఞపురుషుం డవతరించి దుర్మతములను ఖండించు నని చెప్పఁగా, జను లందఱును సంతోషించి స్వామిని వినుతించి అశక్తుఁ డగువాఁ డిట్లు ధ్వజస్తంభ మెక్కి పల్కినందుచే భగవంతుఁ డావేశమై పల్కినాఁ డనియును యివ్విధముగనే జరుగఁగల దనియును నిశ్చయించిరి.

ఇట్లుండ రజతపీఠపురముతోఁ జేరిన శివళ్యి మనెడు పాజకగ్రామంబునందు వసించు మధ్యగేహభట్టు అను బ్రాహ్మణుఁడు సకలవిద్యాపారంగతుఁడై వేదవతి యను కన్యకను వివాహముచేసికొని ధర్మము తప్పక కర్మములుజేయుచు, అద్వైతులను ఖండించుట కెవ్వ రవతరింతురో యని చింతించుచు, భార్యాసహితముగ ఉడిపికిపోయి అనంతేశ్వరస్వామిసన్నిధియందు పండ్రెండేండులు నివసించి పాలనుమాత్రము స్వీకరిం

ఘును సత్పుత్త్రుని కృపచేయుటకు ప్రార్థించుచుండఁగా వేదవతి గర్భముదాల్చినమీఁద, స్వామియానతిం బడసి స్వగృహంబునకుఁబోయెను. అనంతరము క్రీస్తుశకము 1199-8 సరియగు శాలీవాహనశకము 1141 విళంబినామసంవత్సరము ఆషాఢబహుళచతుర్థి యందు వాయుమూర్తి వేదవతిగర్భమునుండి జనించిరి. ఇట్లవతరించిన వాయుమూర్తికి మధ్యగేహభట్లు వాసుదేవాచార్య్య లని నామకరణము గావించి, అనంతేశ్వరస్వామి సన్నిధికిం జని పుత్రరత్నముతో నారాత్రి అరణ్యమార్గమున వచ్చుచుండఁగా పిశాచములు వాయుమూర్తియైన వాసుదేవాచార్య్యులను వినుతించెను. తర్వాత వేదవతి 5-6 నెలల వయస్సు గల తనబిడ్డను బంధురాలగు నొక కన్యయొద్ద నిచ్చి యింటిపనులు చేయుచుండెను. ఆ బిడ్డయేడ్చుచుండెను. ఎంతయోదార్చినను ఏడ్పు నిలువనందుచే పశువుల నిమిత్తమై పక్వముచేసియుంచిన ఉలవలగుగ్గిళ్లను ఆకన్య శిశువునకియ్యఁగా నాశిశువు కొంచెము కొంచెముగా నలుబదిసేర్ల గుగ్గిళ్లను తినెను. అది చూచి యందఱు నాశ్చర్య మొంది యీతఁడు మహాత్ముఁడని పొగడిరి. మఱియొకనాఁడు ఏఁడాదివయస్సు గల ఈ శిశువు ఎద్దుతోఁకను బట్టుకొని అడవికిఁ బోఁగా, తలిదండ్రాదులు తెలియక వెదకుచు వ్యసన మొందుచుండ నా దినముసాయంకాలము గోపాలకునివలనఁ దెలిసి యడవియందున్న శిశువును జూచి సంతోషించి, మఱి కొంతకాలమునకు వాసుదేవాచార్య్యులు తులసీవనమునందు ఆటలాడుచుండి యింటికి వచ్చినప్పుడు మధ్యగేహభట్లను అప్పులవాఁడు అడ్డగించి భోజనమునకుఁ బోఁగూడ దని నిర్బంధపెట్టఁగా వాసుదేవాచార్య్యులు ఆటకై యుంచుకొనియుండిన బీజములను అప్పులవానికిచ్చి సమాధానముచేసి పంపించిరి. తర్వాత అప్పులవానికి ఆ బీజములమహిమవలన సంపదలు కలిగెను. మఱి కొన్నిదినంబులకు మధ్యగేహభట్లు ధనమును దీసికొని యప్పులవాని కీయఁబోఁగా, వాఁడు తమకుమారు లిచ్చిన బీజములవలన నాకు సకలసంపదలు గలిగెఁగాన, ఋణము తమ కీయవలసినది లే దనియెను. అనంతరము మధ్యగేహభట్లు మొదలగువారు తమ బంధుజనులవివాహార్థమై బయలుదేరిపోయి యుండఁగా వాసుదేవాచార్య్యులు యెవరికిం దెలియక ఒంటరిగా బయలుదేరి నారికేలికి వచ్చి శ్రీహరిదర్శనము చేసికొని యచ్చట నుండి ఉడిపికివచ్చి స్వామికి నమస్కారముచేసి యచ్చోట నివసించియుండిరి. అప్పుడు వాసుదేవాచార్య్యులు పోయినమార్గ మెఱుంగక మధ్యగేహభట్లు విలపించుచు ఉడిపిఁజేరి కుమారునింజూచి నీకు మార్గమున రక్షకు లెవరని యడుగఁగా ఉడుపియందుండు అనంతేశ్వరుఁడును, విమానగిరియందుండు చండికాదేవియు నన్ను రక్షించి రనిరి. తర్వాత వాసుదేవాచార్య్యు లచ్చటనే వసించుచుండిరి ఒకానొకప్పుడు ఒకగ్రామమున జరిగిన

స్వజనవివాహమునందు వాసుదేవాచార్యులు పుస్తకము చదివినందున వారిహర్షైవ్ఖరికి మెచ్చి ఘృతపల్లి యను గ్రామమును వాసుదేవాచార్యులకు దానముచేసిరి. ఆఘృతపల్లి యందు శివభట్టు అను బ్రాహ్మణుఁడు పురాణకథను చెప్పు చుండఁగా వాసుదేవాచార్యులు నీవు చెప్పునట్టిది సిద్ధాంతవిరోధముగ నున్నదనిచెప్పి, వీరుచెప్పుట కారం భింపఁగా, సకలజనులును మహదానందము నొందిరి. ఒకప్పుడు మధ్యగేహభట్లకుఁగూడ తెలియనివిషయములను వాసుదేవాచార్యులు బోధించిరి. అనంతరము మధ్యగేహభట్లు కుమారునికి ఉపనయనము గావించిరి. ఆచార్యులు క్రమముగా బ్రహ్మచర్యాది నియమములను నెఱవేర్చు చుండిరి. ఇట్లుండఁగా నొకసర్పము వాసుదేవాచార్యులను కఱచి మృతి నొందెను. ఆ విషయమును జూచి అందఱు నాశ్చర్యమగ్నులైరి. వాసుదేవాచార్యులు శిష్యులతోఁ గూడి వేదాధ్యయనము చేయుచునుండఁగా ఉపాధ్యాయులు ఆచార్యులను జూచి నీవు చదువక కాలము గడపుచున్నాఁడ వని నిందింపఁగా ఉపాధ్యాయులమనస్సు రంజిల్లునట్లు అనేక వేదాంతరహస్యవిషయములను చెప్పఁగా ఉపాధ్యాయులు మొదలగువారు సంతోషించిరి. ఆ తర్వాత వాసుదేవాచార్యులు తమ అవతారవిషయమును తలంచినవారై సన్న్యాసాశ్రమము నవలంబించుటకు నిశ్చయించి అధికారిని వెదకుటకై బయలుదేరిరి. ఇట్లుండ అతివైరాగ్యశీలురగు అచ్యుతప్రేక్షు లను యతీశ్వరు లొకరు హస్తినావతియందు వసించు చుండి యచ్చోటుబాసి ఉడిపికి వచ్చి స్వామిని సేవించు చుండిరి. అప్పు డొకరిపై అనంతేశ్వరస్వామి ఆవేశమై, అచ్యుతప్రేక్షాచార్యులను జూచి కాలాంతరమున నీయొద్దకు వచ్చునట్టి శిష్యుని వలన నా నిజస్వరూపము నెఱుంగు మని చెప్పినమాటను విని సంతోషించుచుండఁగా వాసుదేవాచార్యులు అచ్యుతప్రేక్షాచార్యులకడకుం జని సన్న్యాసము నొసంగునట్లు ప్రార్థించిరి. అప్పుడు మధ్యగేహభట్లును వేదవతియును పుత్రశోకమునకు చింతింపఁగా వాసుదేవాచార్యులయొక్క తలిదండ్రుల వ్యసనమునుజూచి, అచ్యుతప్రేక్షాచార్యులు వాసుదేవాచార్యులతో నీ విప్పుడు సన్న్యాసమును గైకొనవల దని చెప్పి. వేత్రవతీ నదీతీరమునం దుండు మఠమునకుం బోయిరి. అంత ఆచార్యులును ఆ మఠమునకుం బోయి యచ్చోటఁ గల యతులకు నమస్కరించుటను గాంచిన అచ్యుతప్రేక్షాచార్యులు ఆ నమస్కారలక్షణములను దెలిసికొనిరి. అప్పు డొకరిపై స్వామి ఆవేశమై అచ్యుతప్రేక్షాచార్యులను జూచి "నీకుఁ దగినశిష్యుఁ డైన పూర్ణప్రజ్ఞుని యిచ్చితిని" కైకొను మని చెప్పెను.

అనంతరము వాసుదేవాచార్యులు అచ్యుతప్రేక్షాచార్యులయొద్ద వేదాంతాభ్యాసము చేయుచుండఁగా నొకప్పుడు భాగీరథికిం బోవుటకు అనుజ్ఞ యొసంగవలయు

నని అచ్యుతప్రేక్షాచార్యులను వేఁడఁగా, స్వామి ఆవేశరూపముగ వాసుదేవాచార్యులతో నీవు దూరదేశము పోవలదు. ఇచ్చట నుండు సరోవరమున భాగీరథి కలదు; స్నానము చేయుమనఁగా నట్లే భాగీరథియు నచ్చటికి వచ్చెను. ఇంతేగాక యెప్పటికిని మధ్యసరోవరమునందు ప్రతి పండ్రెండేఁడుల కొకనాఁడు మధ్వాచార్యులు స్నానముచేసిన జ్ఞాపకార్థమై వచ్చెదనని గంగాదేవి యనుగ్రహించెను. ఆతర్వాత వాసుదేవాచార్యులు తలిదండ్రాదులను వూరడించి మీకు నేటికి ౩౬-వ దినము వుదయమున సింహలగ్నమునందు దీర్ఘాయుష్మంతుఁ డగు మగశిశువు కలుగఁబోవుచున్నాఁడు, వాఁడు కలిగిన తర్వాత నేను సన్న్యాసమును స్వీకరించెద నని చెప్పిరి. ఆలాగే వారికి మఱియొక కుమారుఁడు పుట్టఁగా నతనికి విష్ణుతీర్థు లని నామకరణము గావించిరి.

ఆ తర్వాత వాసుదేవాచార్యులు యత్యాశ్రమమును స్వీకరించి వేదాంతోపదేశము చేయుచుండఁగా, అద్వైతులు మొదలగువారును వచ్చి వినుచుండిరి. మఱియొకప్పుడు తమగురువు చెప్పుచుండు భాగవతపాఠభేదమును తొలఁగించి, వారికి యుక్తియుక్తముగా వేదవ్యాసహృదయమును బోధించిరి. ఆ తర్వాత బ్రహ్మమీమాంసాశాస్త్రమును శిష్యులకు బోధించునట్లు అచ్యుతప్రేక్షాచార్యులు వాసుదేవాచార్యులకు నియమించిరి ఇట్లుండఁగా అచ్యుతప్రేక్షాచార్యులస్నేహితుఁడైన యొక అద్వైతసన్న్యాసి శిష్యులతోడ ఉడుపికి వచ్చి మధ్వాచార్యులతో "లోకము అసత్యము" అనునట్టి మాయావాదమును వాదింపఁగా, వానికి నిజమును దెలియఁజేసి ఆ సన్న్యాసిని వానిశిష్యులను జయించిరి. మఱియొకమాఱు బౌద్ధమతస్థుం డగు బుద్ధిసాగరుఁ డను వానిని ఖండించిరి. మఱియు ననేకదుర్మతవాదులను జయించిరి. తర్వాత వయోవృద్ధులైన లికుచాన్వయబ్రాహ్మణయతిశ్రేష్ఠు లొకరు మధ్వాచార్యులనుజూచి శంకరులు చేసిన అపార్థమును తొలగించి నిజార్థమును బోధింపుఁడనఁగా, వారి యనుమతి చొప్పున బ్రహ్మసూత్రములకు వ్యాఖ్యానమును రచించిరి.

ఆ తర్వాత. అచ్యుతప్రేక్షాచార్యులతోడ దిగ్విజయార్థమై బయలుదేరి విష్ణుమంగళదేశమునకుంబోయి. యొక బ్రాహ్మణునింట భిక్షచేసి యున్నాటికంటె నెక్కుడగు అరటిపండ్లను మధ్వాచార్యులు భక్షింపఁగా నందఱు నాశ్చర్య మొందిరి. అనంతర మచ్చోటఁ గల మాయావాదమతస్థుల నందఱిని జయించి, క్షీరనదిని దాఁటి అనంతశయనమునకుం బోయి స్వామిని దర్శించి యచ్చోట పండితసభయందు బ్రహ్మసూత్రప్రవచనమును చేయుచుండఁగా, అద్వైతులు వాదింపఁగా వారిని జయించి, యచటనుండి కన్యాకుమారి మొదలుగాఁ గల తీర్థములయందు స్నానము చేసికొని, రామేశ్వరమునకుం బోయి, రామలింగేశ్వరునియం దంతర్గతుఁ డగు విష్ణువును నుతించి

వచ్చుచు మార్గమధ్యమునందు అద్వైతాది దుర్మతవాదులను జయించి, సేతువందు చాతుర్మాస్యవ్రతా ద్యనుష్ఠానములను నెఱవేర్చికొని, యామీఁద శ్రీరంగమునకు వచ్చి స్వామిని దర్శించుకొని, యచ్చోటనుండి క్షీరనదియం దుండు పల్లికొండదేవస్థానమునకు వచ్చి, యచ్చటఁ గూడిన పండితసభయందు కసుతు లైన పండితులను జయించి, విష్ణుసహస్రనామములకు అర్థశతకమును చెప్పిరి. అపుడా బ్రాహ్మణులు సంతోషించి మీరు సర్వజ్ఞులని ప్రశంసించిరి. ఇట్లు దక్షిణదేశమును జయించుకొని ఉడిపి చేరిరి.

ఆమీఁద మధ్వాచార్యులు వేదముయొక్క వ్యాకులత్వమునకు సహింపనివారై శిష్యులతోఁడ తమ 17.వ యేఁట బదరికాశ్రమమునకుం బోవ నిశ్చయించి, గీతాభాష్యమును రచియించి ప్రయాణమై బయలుదేరి యవనదేశమునకుం బోయి యా దేశపు రాజుచే సమ్మానము బొంది బదరికాశ్రమమునందలి నారాయణాశ్రమమునకుఁ బోయి, గీతాభాష్యమును సమర్పించి నమస్కరించి పఠించఁగా నారాయణస్వామి సంతోషించెను. అనంతరము మధ్వాచార్యులు బదరికాశ్రమమునం దుండు అనంతమఠమున నివసించి అనశనవ్రతమును కాష్ఠమౌనముతో నిర్వర్తించిరి. తర్వాత వ్యాసులు మధ్వాచార్యులను బదరికాశ్రమములో నుండు తమ మఠమునకు వచ్చున ట్లనుజ్ఞ చేయఁగా నట్టే వ్యాసాశ్రమమునకుం బోవుటకు నిశ్చయించిరి. ఆ శిష్యులలో సత్యతీర్థులనువారుమాత్రము ఆచార్యవిశ్లేషమునకు సహింపక వెంబడించిరి. మధ్వాచార్యులు వాయుస్వరూపులుగాన నొకగుట్టపై అడుగునుంచి మఱియొకగుట్టకు వేఱొక యడుగు నుంచుచు పోవు చుండిరి. సత్యతీర్థులకు గురువులవెంట నంటిపోవుటకు శక్యము కాక మఱలి అనంతమఠము వచ్చి చేరిరి.

మధ్వాచార్యులు వ్యాసాశ్రమమునకుంబోఁగా నచ్చటనుండు ఋషులెల్ల నెదుర్కొని సమ్మానించిరి. మధ్వాచార్యులు వ్యాసులవారికి నమస్కృతు లొనర్పఁగా వ్యాసులు తమ రెండుచేతులతో నెత్తి యాలింగనము చేసికొని యుక్తాసనమునఁ గూర్చుండఁజేసిరి. ఆ తర్వాత మధ్వాచార్యులు తాము రచించిన బ్రహ్మసూత్రభాష్యమును సమర్పించఁగా వ్యాసులు చూచి సంతోషించిరి అనంతరము మధ్వాచార్యులు ఋగ్వేదభాష్యము, ఉపాధిఖండనము, ప్రపంచమిథ్యాత్వానుమానఖండనము, తత్త్వవివేకము మొదలగు ముప్పదియేడుగ్రంథములను రచియించి వ్యాసులకు వినిపించి వా రొసంగిన 8 సాలగ్రామములలో 6 సుబ్రహ్మణ్యమునందును, 1 ఉడిపియందును, 1 మధ్యతాలమునందును ప్రతిష్ఠ చేసినదే గాక, ద్వారకానగరమునం దుండి వచ్చిన యోడయందు లభించిన శ్రీకృష్ణవిగ్రహమును గ్రహించి, ఆ విగ్రహమున కంటియున్న గోపీచందనమును గైకొని, ఆ కృష్ణవిగ్రహమును ఉడిపియందు ప్రతిష్ఠ చేసి,

తమ గ్రంథములకు వ్యాఖ్యానము చేయునట్లు జయతీర్థులనెడి తమశిష్యుల కనుజ్ఞ నొసంగి, పద్మనాభతీర్థులు, నరహరితీర్థులు, మాధవతీర్థులు, అక్షోభ్యతీర్థులు అను నల్వురుశిష్యులను ద్వైతసంప్రదాయ ప్రవర్తకులుగ నియమించి, డెబ్బదియేడు సంవత్సరములు ఆఱునెలలు ఇరువదిదినములు స్వసంప్రదాయస్థానము నధిరోహించి తర్వాత పద్మనాభతీర్థులకు తమస్థానమును పట్టాభిషేకము చేసి మఱల బదరికాశ్రమము నకుం బోయి వ్యాసాదిమహర్షులతోడ సద్గ్రంథకాలక్షేపము చేయుచు మధ్వసిద్ధాంతము భూలోకమున వృద్ధి యగునట్లు భగవంతుని ప్రార్థించు చున్నారు.

ద్వైతసిద్ధాంతము:—శ్రీహరియే సర్వోత్తముఁడైన దేవుఁడు. జగము సత్యము. జీవపరమాత్మలకు భేదము కలదు. ప్రాణిసమూహమంతయు తారతమ్యానుగుణముగా విష్ణువుయొక్క కింకరులు. స్వాత్మసుఖానుభవమే మోక్షము. నిర్మలమైన భగవద్భక్తియే మోక్షమార్గోపాయము. ప్రత్యక్షాదిప్రమాణత్రయము ప్రమాణము. సమస్త వేదశాస్త్రైకసమధిగమ్యుఁడైనవాఁడు శ్రీహరియొక్కఁడే పరతత్వము అని ముఖ్య సిద్ధాంతము. దీనికిం బ్రమాణము:—

శ్లో॥ శ్రీమన్మధ్వమతే హరిః పరతర స్సత్యం జగత్తత్త్వతో
భేదో జీవగణా హరే రనుచరా నీచోచ్చభావం గతాః।
ముక్తి ర్నైజ సుఖానుభూతి రమలా భక్తిశ్చ తత్సాధనం
హ్యక్షాదిత్రితయంప్రమాణమఖిలామ్నాయైక వేద్యోహరిః.అని.

ద్వైతమతమునందు సమ్మతములయిన తత్త్వంబులు స్వతంత్రమని, అస్వతంత్ర మని యిరుదెఱంగులు. స్వతంత్రుఁ డెవఁ డనఁగా, షడ్గుణైశ్వర్యసంపన్నుఁడయి నట్టియు, అశేషసద్గుణముల కాటపట్టయి నట్టియు విష్ణుమూర్తి. అస్వతంత్రులు జీవులు, దీనికి ప్రమాణము:—

శ్లో॥ "స్వతంత్ర మస్వతంత్రంచ ద్వివిధం తత్త్వ మిష్యతే
స్వతంత్రో భగవా న్విష్ణుః నిర్దోషో ఽశేషసద్గుణః" అని.

ఈ జీవులు రాజునకు భృత్యులవలె ఈశపరతంత్రులై, విష్ణుమూర్తికి దాసులై విష్ణులోకమందు నివసించి యుందురు. కాఁబట్టి జీవేశ్వరులు పరస్పరభిన్నులేకాని అభిన్నులు కారు. ఈ యర్థమందు ఈశ్వరజీవభేదమును సాధించునట్టి ప్రమాణము:—

శ్రు. పరమేశ్వరః జీవా ద్భిన్నః తం ప్రతి సేవ్యత్వాత్
యోయం ప్రతిసేవ్యః స తస్మాద్భిన్నః యథా భృత్యాద్రాజా.

అనఁగా పరమేశ్వరుఁడు జీవునికంటె భిన్నుఁడు ఎట్లన. పరమేశ్వరునికి జీవుఁడు సేవకుఁడగుటవలననే. ఇందుకు దృష్టాంతము:—భృత్యునికి రాజు సేవ్యుఁడగుటవలన రాజు భృత్యునికంటె భిన్నుఁడు అని లోకప్రసిద్ధమైన దృష్టాంతము. లోకములో సుఖమును గోరి దుఃఖము వల దనువారును, గొప్పవారికి సమానస్కంధుల మని విఱ్ఱవీగుచుండువారును, గొప్పవారిచేత రక్షింపంబడరు కదా.

కాఁబట్టి త్రిందితరగతిలో నుండునట్టిజీవులు పరమేశ్వరునితో సమానులమనియు, స్వతంత్రుల మనియు భావించి యా పరమేశ్వరునిచేత రాజాస్థానమునందు కూర్చుండఁబోవు దౌవారికులు, రాజుచే శిక్షింపఁబడురీతిగా ఘోరనరకంబులలో త్రోయఁబడి శిక్షింపఁబదుదురే కాని, మోక్షసుఖములను జెందరు. ఎవరు తమకు హీనత్వమును పరునికి ఉత్కృష్టత్వమును చెప్పుదురో అట్టివారికి పరమాత్మ తుష్టుఁడై ఇష్టార్థముల నిచ్చుచున్నాఁడు. ఎట్లన;

శ్లో. ఘాతయంతి హి రాజానో రా జాహ మితి వాదినః ।
దద త్యఖిల మిష్టంచ స్వత స్యోత్కర్ష వారిణమ్.

అనఁగా, రాజులు, నేను రాజు ననువానిని దండింతురు. నేను సేవకుఁడననునట్టివానికి యిష్టార్థముల నిత్తురు. కనుక జీవులు భగవంతుని సేవచేతనే కడతేరుచున్నారు.

భగవత్సేవ యెట్టి దనఁగా:---అంకన మనియు. నామకరణమనియు, భజన మనియు మూఁడులెక్కంగులుగా నుండును.

అంకన మనఁగా:—శ్రీమన్నారాయణమూర్తియొక్క ఆయుధము లయిన సుదర్శనాదులచే అంకమును ధరించుట. దీనికి ప్రమాణము శాకల్యసంహితయందుఁ జెప్పఁబడినది.

శ్రు. చక్రం బిభర్తి పురుషోభితప్తం బలో దేవానా మమృతస్య విష్ణోః
సయాతి నాకం దురితం విధూయ విశంతియద్యతయో వీతరాగాః
దేవాసోయేన విధృతేన బాహునా సుదర్శనేన ప్రతితాస్తమాయుః
యేనాంకితా మనవోలోకసృష్టిం వితన్వంతి బ్రాహ్మణాస్తద్వహంతి
తద్విష్ణోః పరమంపదం యేన గచ్ఛంతి లాంఛితాః
ఉరుక్రమస్య చిహ్నై రంకితా లోకే సుభగా భవామ ఇతి.

భగవదాయుధములను యెక్కడ ధరింపవలసిన దని యనఁగా:—

శ్లో. దక్షిణేతుకరే విప్రో బిభృయా ద్వై సుదర్శనమ్ ।
సవ్యేనశంఖం బిభృయా దితి వేదవిదో విదుః.

అని ఆగ్నేయపురాణవచనము. అగ్నితప్తము లయిన సుదర్శనాదులను అంగము లందు ధరించునట్టివారు విశేషము లయిన పాపపుంజములను భస్మము చేసి విష్ణులోకము నొందుచున్నారు. దేవతలు మనువులు మొదలగువా రందఱును కుడిభుజమందు భగవచ్చక్రమును, ఎడమభుజమునందు భగవచ్ఛంఖమును ధరించి లోకములను సృజించి పాలించినారు.

నామకరణ మనఁగా:—పుత్రాదులకు భగవంతుని నామము నుంచుట.

భజన మనఁగా:—విష్ణునామధ్యానము మొదలగునవి.

ఈ మతమందు జీవునికిని యీశ్వరునికి పరస్పరభేద మనియు, మోక్షానందము తారతమ్య మనియు, జీవులు పరతంత్రులై యీశ్వరానుగ్రహమువలన యీశ్వరసామీప్యాదిస్థితులను నొందుదు రనియును దేటపడు చున్నది.

మఱియు ద్వైతమతమునందును విశిష్టాద్వైతమతమువలె ఆత్మలు అణుప్రాయములు సంఖ్యయం దమితముగా నున్నవి. ఒక మహాప్రళయము పోయి మఱియొక మహాప్రళయమువచ్చువఱకు ప్రపంచములు పుట్టు చున్నవి. ఇంకను అనేకస్వల్పప్రళయములును గలవు. ఒక మహాప్రళయమునకును మఱియొక మహాప్రళయమునకును గల మధ్యకాలమునందు ప్రపంచములోఁ గాపుర ముండుటకు అనంతము లైన ఆత్మలలో నుండి కొన్నియాత్మలను భగవంతుఁడు లోకమునకు బంపు చుండును. ఆత్మలు తమ పుణ్యపాపకర్మములనుబట్టి ఒకశరీరమునుండి మఱియొకశరీరమునకును, ఒకప్రపంచమునుండి మఱియొకప్రపంచమునకును బోయి సుఖదుఃఖముల ననుభవించు చుండును. తుదకు శాశ్వతస్వర్గమునకు గాని, లేక శాశ్వతనరకమునకు గాని పోవును. కొన్ని యాత్మలకు సదా జననమరణములు గలవు.

భగవత్కృపవలన ఆత్మకు మోక్షము కలుగుచున్నది. ఆయనయొక్క సర్వోత్కృష్టతను గుఱు తెఱిఁగినవానికి భగవత్కృప కలుగును. భగవద్జ్ఞానముద్వారా ఆత్మలు ఆయనకృపను పొందును. ఆత్మలలోఁ గొన్ని మంచిస్వభావమును, కొన్ని మిశ్రస్వభావమును గలవిగా నుండుటచేత, భగవద్జ్ఞానమును పొందుటకు అన్నియాత్మలకును సాధ్యము కాదు. మంచియాత్మలు జ్ఞానమును పొంది భగవత్కృపను సంపాదించుకొనును. చెడుఆత్మలు చెడుకార్యములను చేసి నరకమునకుఁ బోవును. మిశ్రస్వభావము గల యాత్మలు పుట్టుచు చచ్చుచు నుండును. ఈ ఆత్మలస్వభావమును మార్చుటకు భగవంతునికి శక్తి గలదు. అయిన నట్లు చేయుట కాయన కిష్టము లేదు. సర్వశక్తి గల భగవంతుఁ డైన విష్ణువును సేవించుటవలన ఆత్మలు భగవద్జ్ఞానమును పొందును ఆ సేవ మూఁడువిధములుగా నున్నవి.

1. జ్ఞాపకార్థముగా విష్ణువుయొక్క ఆయుధము లగు శంఖచక్రాంకితములను జేసికొనుట.

2. పరమప్రభువుయొక్క నామమును సదా జ్ఞాపకమున నుంచుటకై తన పుత్రులు మొదలగువారిని కేశవాదినామములతోఁ బిలుచుట.

3. జిహ్వయొక్క కృత్యము లను సత్యవాదిత్వము, దయాసహిత మైనమాటలు, ప్రయోజనకర మగు విద్య, పవిత్ర మైన చదువును శరీరకృత్యములగు భిక్షము పెట్టుట, దుర్బలులను గాపాడుట, నిరుపేదలను రక్షించుటయును; మానసకృత్యములగు దయ, ప్రేమ, సత్కృత్యములను చేయుటయం దాతురతయును; అనునివి.

మఱియు క్రమప్రకారము దేవతారాధనము చేయవలయును. ఎట్లన; మొదట సర్వాధికారి యగు విష్ణువు, తరువాత లక్ష్మి, తరువాత బ్రహ్మ, తరువాత వాయువు, తరువాత బ్రహ్మభార్య, తరువాత వాయుభార్య, తదనంతరము గరుడుఁడు, తరువాత ఆదిశేషుఁడు, తరువాత రుద్రుఁడు, పిమ్మట యీమువ్గురిభార్యలు, తరువాత యింద్రుఁడు మొదలగువారిని పూజింపవలయును. భగవంతునికిని ఆత్మకును; ఆత్మకును ప్రకృతికిని; ఇట్లుగా పంచభేదములు కల వనియును, విష్ణుదేవునికి గుణములు లే వనియును, విష్ణువు సంపూర్ణుఁడు కాఁ డనియును, విష్ణువునకు సమానులు కల రనియును, విష్ణువున కంటె గొప్పవాఁ డున్నాఁ డనియును, ఒక యవతారము మఱియొక యవతారమున కంటె గుణభేదము గల దనియును, విష్ణువునకు జననమరణములు కల వనియును నమ్మినను, విష్ణుభక్తులను దూషించినను, పవిత్ర మైన గ్రంథములను నిందించినను శాశ్వత నరకము సిద్ధించును. ఈ ప్రపంచమునందు భేదము కలిగినట్లే సుగుణములకుఁ దగిన సుఖములు స్వర్గమునందును, దుర్గుణములకుఁ దగినబాధలు నరకమునందును తారతమ్యము కలవై యుండును.

---

శ్రీ ర స్తు.

# సకలార్థ సాగరము

## ప్ర మా ణ త రం గ ము.

---

### వే దాం త ప రి భా ష.

#### ఏకము.

పరబ్రహ్మము. ఏకాక్షరము. ఏకోనారాయణః. ఏకఏవరుద్రః. పరబ్రహ్మ మనఁగా, సజాతీయ విజాతీయ స్వగతభేదములు లేనిది. ఏకాక్షర మనఁగా, ఓంకారము. ఏకోనారాయణః అనఁగా, నారాయణమూర్తియే పరబ్రహ్మ మని నారాయణోపనిషత్తు. ఏకఏవరుద్రః. అనఁగా, రుద్రుఁడే పరబ్రహ్మ మని రుద్రోపనిషత్తు.

#### ద్వి వి ధా వి ద్య లు.

మూలావిద్య, తూలావిద్య. మూలావిద్య యనఁగా:—ఈశ్వరునియందు కలిగినది. తూలావిద్యయనఁగా:—జీవునియందుండెడి యవిద్య.

#### ద్వి వి ధ మా ర్గ ము లు.

ధూమాది, అర్చిరాది మార్గములని రెండువిధములు. ధూమాదిమార్గ మనఁగా:—ఇష్టాపూర్తకర్మములు చేయువారు ధూమాదిమార్గముచేత స్వర్గలోకమును బొందుదురు. అర్చిరాదిమార్గ మనఁగా:—వైరాగ్యోపశాంతివృత్తులు గలవారు అర్చిరాదిమార్గముచేత సూర్యలోకమును బొందుదురు. ఈ మార్గము వైకుంఠ కైలాసాదులకుం బోవును.

#### ద్వి వి ధా త్మ లు.

జీవాత్మ, పరమాత్మ. జీవాత్మ యనఁగా:—అంతఃకరణము, ప్రతిబింబము, అధిష్ఠానము, దేహత్రయము, అజ్ఞానము, అధ్యాసము అనెడి ఆఱింటితోఁ గూడినది పరమాత్మ యనఁగా:—సర్వాధిష్ఠానపరబ్రహ్మము.

#### ద్వి వి ధ వృ త్తులు.

సంకల్పము, వికల్పము. సంకల్ప మనఁగా:—మనస్సునందు తొలుతఁ దోఁచినది వికల్ప మనఁగా:—పిమ్మట దానికి వ్యతిరేకముగాఁ దోఁచినది.

#### ద్వి వి ధ జ్ఞా న ము లు.

పరోక్షము, అపరోక్షము. పరోక్ష మనఁగా:—తనకు భగవంతుఁడు అన్యుఁడుగాఁ దోఁచి ఉపాసించుట. అపరోక్ష మనఁగా:—దానే పరమాత్మగా నుండుట,

## ద్వివిధయోగములు.

సగుణయోగము నిర్గుణయోగము. సగుణయోగమనఁగా:—భగవంతునిపాదము మొదలుకొని శిరస్సుపర్యంతము సకలావయవములు గలవాఁడనియు కిరీటకుండల కేయూరాది దివ్యాభరణసహితుఁడనియు ధ్యానించుట. నిర్గుణయోగ మనఁగా:—భగవంతుఁడు నామరూపరహితుఁడని ధ్యానించుట.

## ద్వివిధసృష్టులు.

యుగపత్సృష్టి, క్రమసృష్టి. యుగపత్సృష్టి యనఁగా:—ఆకాశాది పంచభూతములను, బ్రహ్మ విష్ణు రుద్రాదిదేవతలను, సూర్యాదిగ్రహములను ఏకకాలమందు సృష్టించుట. క్రమసృష్టి యనఁగా:—బ్రహ్మాదులవలన క్రమముగా సృష్టించుట.

## త్రికర్మములు.

పుణ్యకర్మము, పాపకర్మము, మిశ్రకర్మము, పుణ్యకర్మ మనఁగా:—వేదోక్త విధిచేత చేయఁబడునది. పాపకర్మ మనఁగా:—విధిని తప్పి నడిచెడువారిచేత చేయఁబడునది. మిశ్రకర్మ మనఁగా:—విద్యావిదులచేత చేయఁబడునది.

## త్రివిధతాపములు.

ఆధ్యాత్మికము, ఆధిభౌతికము, ఆధిదైవికము. ఆధ్యాత్మిక మనఁగా:—తన దేహేంద్రియాదులకు కలిగిన ఆధివ్యాధులచేత దుఃఖించుట. ఆధిభౌతిక మనఁగా:—తనకు అన్యులైన దారాపుత్రాదులకు కలిగిన ఆధివ్యాధులకును, సర్పవృశ్చికాది బాధలకును దుఃఖించుట. ఆధిదైవిక మనఁగా:—లోకమంతయు కలిగిన అత్యాతపఅనావృష్టి అతివృష్టి అనావృష్టి అతివాయువు మొదలయినవానివలన కలిగిన దుఃఖములను తనవై వేసికొని దుఃఖించుట.

## త్రివిధేషణములు.

దారేషణ, పుత్రేషణ, ధనేషణములు. దారేషణ మనఁగా:—భార్య మొదలయిన స్త్రీలయందలి ఆశ. పుత్రేషణ మనఁగా:—కుమారులయందలి ఆశ. ధనేషణ మనఁగా:—ద్రవ్యమందలి ఆశ.

## త్రివిధజ్ఞానములు.

సంజ్ఞానము, విజ్ఞానము, ప్రజ్ఞానములు. సంజ్ఞాన మనఁగా:—పదపదార్థజ్ఞానము. విజ్ఞాన మనఁగా:—పదపదార్థములు చేరిన అభిప్రాయము. ప్రజ్ఞాన మనఁగా:—బ్రహ్మ సాక్షాత్కారజ్ఞానము.

## త్రివిధదీక్షలు.

దృగ్దీక్ష, స్పర్శదీక్ష, వాగ్దీక్ష. దృగ్దీక్ష యనఁగా:—మీనము గ్రుడ్డులను పెట్టి తాను ఆగ్రుడ్డులను తిరిగిచూచిన బిడ్డలవును. ఆప్రకారము శిష్యుని ఉపదేశకాలమందు వీఁడు అపరోక్షసాక్షాత్కారబ్రహ్మభావము కలవాఁడగునాయని వీక్షించుట. స్పర్శదీక్ష యనఁగా:—పక్షులు గ్రుడ్డులను పెట్టి వానిని అెక్కలచేత కప్పుకొనియుండిన నవి పిల్ల లవును. ఆప్రకారము ఆచార్యుఁడు తన్నాశ్రయించిన శిష్యుని శరీరమును తనహస్తముచేత స్పృశించుట. వాగ్దీక్ష యనఁగా:—భ్రమరము మంటిలోనుండెడి పురుగును తీసికొనిపోయి దానిచెవిలో కూసికూసి తనరూపమువలె చేసికొనునట్లు ఆచార్యుఁడు శిష్యునికి బోధించి తనవలెఁ జేసికొనుట.

## మానత్రయము.

వాఙ్మానము, అక్షమానము, కాష్ఠమానము. వాఙ్మాన మనఁగా:—వాక్కును నియతిగా నుంచుకొనుట. అక్షమాన మనఁగా:—చతుర్దశేంద్రియములను స్వేచ్ఛగా విషయాదులయందు పోనీయక పరబ్రహ్మమందే లయపఱచుట కాష్ఠమానమనఁగా:—శరీరమును మూలబంధోడ్యాణజాలంధరబంధములచేతను, పద్మాసనాద్యాసనములచేతను శరీరమును క్రమముగా నిల్పుకొనుట

## చర్యాపాదచతుష్టయము.

చర్య, క్రియ, యోగ, జ్ఞానములు. చర్యాపాద మనఁగా:—భూలోకమందుండిన దేవాలయముల నన్నిఁటినిఁజూర్చి దర్శనార్థముగా సంచరించుట క్రియాపాద మనఁగా:–తన కిష్టదేవతల నారాధించుట. యోగపాద మనఁగా:—తన కిష్టదేవతలను ధ్యానించుట. జ్ఞానపాద మనఁగా:—సర్వము తనయిష్టదేవతాస్వరూపము గాన అది వినా అన్యపదార్థము లే దని నిశ్చయించుకొనుట. ఈ నాల్గింటివలన సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్యపదవులు ప్రాప్తించును.

## పంచముద్రలు.

భూచరీ, ఖేచరీ, మధ్యమ, శాంభవీ, షణ్ముఖీ, అనునివి తారకయోగ లక్ష్యసిద్ధిఁదగినవి. భూచరి యనఁగా:—ముక్కుకొనయందు లక్ష్యము నుంచునది; దీనినే ధ్యానముద్ర యని చెప్పుదురు. ఖేచరీ యనఁగా:—ముక్కుయొక్కపైని భ్రూమధ్యమందు దృష్టి నిలుపుట. మధ్యమ యనఁగా:—భూచరీ ఖేచరీ అను రెంటికినడుమ దృష్టి నిలుపుట. శాంభవి యనఁగా:—రెండుచెవులను రెండుబొటనవ్రేళ్లచేతను, రెండు ముక్కులను రెండుఅనామికలచేతను, రెండుకన్నులను రెండుమధ్యమవ్రేళ్ల

చేతను మూసి నాదములను వినుచు చిత్కళలను సందర్శించుట షణ్ముఖియనఁగా:— రెండుబొటనవ్రేళ్లచేత చెవులరంధ్రములను మూసికొని నాదమును వినుట. (ఈ విషయము హఠయోగప్రదీపికయందు స్పష్టముగా గనందగును).

## పంచమార్గములు.

కపి విహంగ, మార్జాల, మీన, కూర్మము లని ఐదువిధములు. అందు కపిమార్గ మనఁగా:—కోఁతిని తనపిల్లలు పట్టుకొని అది యెక్కడెక్కడ దుమికినను వదలకుండు నటుల ఆచార్యునిసన్నిధానమును శిష్యుఁడు వదల కుండుట. విహంగమార్గ మనఁగా:—పక్షి గ్రుడ్లనుబెట్టి వానిని ఱెక్కలచేత మూసికొని యుండుటవలన అవి పిల్లలై వృద్ధిబొందునట్లు ఆచార్యుఁడు శిష్యుని సమీపమున నుంచుకొని వృద్ధికిఁ దెచ్చుట. మార్జాలమార్గ మనఁగా:—పిల్లి తనకూనను నోటకఱచుకొని తాఁబోవు స్థలములకెల్లను యెత్తుకొనిపోఁగా అవి వృద్ధికి వచ్చినట్లు, ఆచార్యుఁడు శిష్యులను విడువక వృద్ధికి తీసికొనివచ్చుట. మీనమార్గ మనఁగా:—మీనము గ్రుడ్లనుబెట్టి వానిని తిరిగిచూడ చూడ అవి వృద్ధికి వచ్చినట్లు ఆచార్యుఁడు శిష్యులను అప్పుడప్పుడు వచ్చి వృద్ధికి రావలయు నని కటాక్షించుట. కూర్మమార్గ మనఁగా:—తాఁబేలు యెచ్చటనో గ్రుడ్లనుబెట్టి తా నెచ్చటనో పోయి ఆగ్రుడ్లను తలఁపను తలఁ ను అవి వృద్ధినొందునట్లు ఆచార్యుఁడు శిష్యులను అప్పుడప్పుడు తలఁచు చుండుట.

## షడ్విధవాదములు.

సత్ఖ్యాతివాదము, అసత్ఖ్యాతివాదము, అనిర్వచనీయఖ్యాతివాదము, అన్యథాఖ్యాతివాదము, ఆత్మఖ్యాతివాదము, అఖ్యాతివాదము అని ఆఱువిధములు సత్ఖ్యాతివాద మనఁగా:— యథార్థము లైన అల్పాధికావయవములచేత నారంభింపఁబడిన అతద్వ్యాత్మకద్రవ్యములలో కాస కామిలాదిదోషములచేత అధికావయవపదార్థద్రవ్య తిరోధానపూర్వకముగా అల్పావయవపదార్థద్రవ్యవిషయిక ప్రత్యక్షము. అసత్ఖ్యాతివాద మనఁగా:—లేనిపదార్థము దోఁచుట. అనిర్వచనీయఖ్యాతివాద మనఁగా:—కాస కామిలాది దోషసహిత చక్షురాదీంద్రియ విషయ సంయోగముచేత చలించు శుక్తికా ద్యవచ్ఛిన్నచైతన్యమునం దుండెడి అజ్ఞానముయొక్క రజితాద్యాకారము, రజితాజ్ఞానాభాసముగా పరిణమించుట. అన్యథాఖ్యాతివాద మనఁగా:— దేశాంతరస్థరజితమందు పురోవృత్తిపదార్థము లైన శుక్తికాదులయందు విశేషముగాఁ దోఁచుట. ఆత్మఖ్యాతివాద మనఁగా:—ఆంతరము లైన విజ్ఞానపరంపరాది పదార్థములు బాహ్యపదార్థములుగాఁ దోఁచుట. అఖ్యాతివాద మనఁగా:—గ్రహణాస్మరణాత్మక జ్ఞానద్వయముకంటె విశిష్టజ్ఞానాభావము.

## సప్తవిధచైతన్యములు.

శుద్ధ చైతన్యము, ఈశ్వర చైతన్యము, జీవ చైతన్యము, ప్రమాతృ చైతన్యము, ప్రమాణ చైతన్యము, ప్రమేయ చైతన్యము, ఫల చైతన్యము శుద్ధ చైతన్య మనఁగా:— పరబ్రహ్మము. ఈశ్వరచైతన్య మనఁగా:—పరమాత్మ. జీవచైతన్య మనఁగా:—జీవ సాక్షి యైన ప్రత్యగాత్మ. ప్రమాతృ చైతన్య మనఁగా:—అంతఃకరణవృత్తితోఁ గూడినది. ప్రమాణచైతన్యమనఁగా:—ప్రతివస్తువును ఇది యది యను లోకవ్యవహారజ్ఞానము చేత నిర్ణయించుట. ప్రమేయచైతన్య మనఁగా:—ప్రమేయవస్తువులను తెలిసి వానివాని యందుఁ గల నామరూపములను నిరసింపఁగా శేషించినది. ఫలచైతన్య మనఁగా:— ఎఱుఁగ బడిన వస్తువు లభించుట.

## అష్టపాశములు.

పశుపాశము, భవపాశము, బంధపాశము, మోహపాశము, ఆశాపాశము, కర్మపాశము, దుఃఖపాశము, కేశపాశములు పశుపాశ మనఁగా:— తాను మకారార్థమైన పశువుగా నుండి ఆకారార్థమైన పతిచెంగట చేరకుండు నటుల ఉకారార్థమైన పాశము నడుమనుండి యీ రెంటిని చేరనీయక చేయు చున్నది; దానికి పశు పతి పాశ విచారణ చేయవలయును. ఒక ఆడుబిడ్డను బాల్యమందు దాని అవయవముల నందఱు నెఱుంగుదురు. వయసు రానురాను తన అవయవములను తండ్రి మొదలగువా రెవ్వరికినిఁ జూపక మఱుఁగు పఱచుకొని యుండి పిమ్మట దానిని వివాహము జేసికొన్న పురుషునితోఁ జేరునప్పుడు సర్వమును జూపించునట్లు పతిదగ్గిర పశువుచేరును. భవపాశ మనఁగా:—తాను పరబ్రహ్మమై యుండి అవ్యక్తనామక మూలప్రకృతిలోనికి వచ్చి తనపోటు మఱచిపోయి యిక్కడనే పుట్టుచు గిట్టుచు నుండును. బంధపాశ మనఁగా:— జాతిబంధము ఆశ్రమబంధము మతబంధము మొదలైన సకలబంధములలో దగులుకొని కారాగృహములో బడినవాఁడు వెలుపలికి రాకుండునటుల దుఃఖించువానివలె దుఃఖ పడుట. మోహపాశ మనఁగా:— తన కుండినవి చాలక వైపైన దృశ్యవస్తువులయందు మితిమీఱిన ఆశ కల్గియుండుట. ఆశాపాశ మనఁగా:— కాషాయ కౌపీనాదులయందు దృష్టిని యుంచుట. కర్మపాశ మనఁగా:—తాను జన్మాంతరకర్మములచేత పట్టుబడుటను నెఱిఁగి యుండి తిరుగా కర్మములను జేయవలయు నని యుండుట. దుఃఖపాశ మనఁగా:— సర్వకాల సర్వావస్థలయందు దుఃఖములలో మునిఁగియుండుట. కేశపాశ మనఁగా:— జడలను పెంచుకొని దానియందు ఆశ గలిగి యుండుట. (ఇది శైవ సిద్ధాంతభేదము).

## నవవిధభక్తి.

శ్రవణము, కీర్తనము, స్మరణము, పాదసేవనము, అర్చనము, వందనము, దాస్యము, సఖ్యము, ఆత్మనివేదనము అని భక్తికి తొమ్మిది అంగములు కలిగి యున్నవి. ఇది శైవ శాక్త గాణాపత్య సౌర కాపాలిక వైష్ణవ సకల మతవాదులును, వారివారి దేవతల నుద్దేశించి చేయు భక్తి. శ్రవణ మనఁగా:— ఆయాసమయముల నుద్దేశించి చెప్పెడి పురాణోపదేశములను వినుట. కీర్తన మనఁగా:—అప్పుడప్పుడు ఆయా దేవతా నామములను విశ్వాసపూర్వకముగా నుచ్చరించుట స్మరణ మనఁగా:— భగవన్నామమును ఉచ్చరించు చుండుట. పాదసేవన మనఁగా:— ఆయా దేవతానివాసములకు నడుచుట అర్చన మనఁగా:— పూజించుట. వందన మనఁగా:— నమస్కరించుట. దాస్య మనఁగా:— తాను జేసిన సకలకార్యములను ఆయాదేవతలకు సమర్పించి తాను ప్రభువునకు భృత్యునివలె దొలఁగి యుండుట. సఖ్య మనఁగా:— భగవంతునియెడల చంద్రికోమాపులవలెను, గురుశిష్యులవలెను, ప్రభుభృత్యులవలెను, భర్తృభార్యలవలెను అనుసరించుట ఆత్మనివేదన మనఁగా:—తాను తన ఉపాసనామూర్తియందు తన్ను జేర్చి తాను స్వతంత్రము లేనివాఁడై యుండుట.

## దశవిధసద్గుణములు.

నిజము చెప్పుట, మంచి మాటలాడుట, హితములను వాక్రుచ్చుట, ప్రయోజనముగాఁ బలుకుట, ఈ నాలుగును వాక్సద్గుణములు. తీర్థయాత్రలు సలుపుట, తపస్సు చేయుట, దానము నిచ్చుట, ఈ మూఁడును శరీరముచేత సలుపఁబడు సద్గుణములు సద్భక్తి, నిరాశ, తపోచింత, ఈ మూఁడును మనస్సుయొక్క సద్గుణములు.

## ఏకాదశేంద్రియములు.

జ్ఞానేంద్రియములు 5, కర్మేంద్రియములు 5, మనస్సు 1.

## త్రయోదశగుణములు.

రాగము, ద్వేషము, కామము, క్రోధము, లోభము, మోహము, మదము మాత్సర్యము, ఈర్ష్య, అసూయ, దర్పము, డంభము, అహంకారము.

## చతుర్దశవిద్యలు.

ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వణవేదము, శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము, మీమాంసము, న్యాయశాస్త్రము, పురాణము, ధర్మశాస్త్రము.

# తర్కశాస్త్రము.

## పదార్థసప్తకవివేచనము.

అనఁగా ద్రవ్య, గుణ, కర్మ, సామాన్య, విశేష, సమవాయ, అభావములు. అందు ద్రవ్యములు 9.

## విషయాదివిభాగము.

1. పృథివి. గంధవతి. అనఁగా గంధగుణము గలది. పృథివి యని లక్ష్యనిర్దేశము; గంధవతి యనునది లక్షణము.

అది నిత్యము, అనిత్యము అని రెండువిధములు.

అందు నిత్యపృథ్వి పరమాణురూపము. అనిత్యపృథ్వి కార్యరూపము.

ఇదియు శరీరము, ఇంద్రియము, విషయము, అని మఱియు మూఁడు విధములు.

1 అస్మదాదులయందలిది పార్థివశరీరములు.

2 పార్థివేంద్రియము గంధగ్రాహక మగు ఘ్రాణము. అది నాసాగ్రవర్తి యగును.

3 పార్థివవిషయములు మృత్పాషాణాదు లగును.

2 జలము. శీతస్పర్శవంతము. అనఁగా చల్లనిస్పర్శగుణములు గలది. జలము లక్ష్య నిర్దేశము. తక్కినది లక్షణము.

అదియు నిత్యము, అనిత్యము అని రెండు తెఱఁగులు.

నిత్యము పరమాణురూపము. అనిత్యము కార్యరూపము.

ఇదియు శరీరము, ఇంద్రియము, విషయము, అని మఱియును మూఁడు విధములు.

1 వరుణలోకమునందు జలశరీరము.

2 జలేంద్రియము రసగ్రాహక మగు రసన. అది జిహ్వాగ్రవర్తి యగును.

3 జలవిషయములు సరిత్ సముద్రాదులు.

3. తేజస్సు. ఉష్ణస్పర్శవంతము. ఉడుకు స్పర్శగుణముకలది. తేజము లక్ష్యనిర్దేశము. తక్కినది లక్షణము.

అదియు నిత్యము, అనిత్యము అని రెండువిధములు.

నిత్యము పరమాణురూపము. అనిత్యము కార్యరూపము.

21

ఇది శరీరము, ఇంద్రియము, విషయము అని మఱియు మూఁడువిధములు.

1 ఆదిత్యలోకమునందు తేజశ్శరీరము.

2 తేజోమయేంద్రియము రూపగ్రాహక మగు చక్షువు, అది కృష్ణతారాగ్రవర్తి యగును.

ఇందు విషయములు నాలుగువిధములు.

1 భౌమము, వహ్న్యాదులు.

2 దివ్యము, అభింధన విద్యుదాదులు.

3 ఔదర్యము, భుక్తముయొక్క పరిమాణహేతుకము. అనఁగా జాతరాగ్ని.

4 ఆకరజము, సువర్ణాదులు.

4. వాయువు. రూపరహిత స్పర్శవంతము. రూపము లేనిది, స్పర్శ కలది. వాయు వని లక్ష్యనిర్దేశము. తక్కినది లక్షణము.

అది నిత్యము అనిత్యము అని రెండువిధములు.

అందు నిత్యము పరమాణురూపము. అనిత్యము కార్యరూపము.

ఇదియు శరీరము, ఇంద్రియము, విషయము, అని ముత్తెఱంగులు.

1 వాయులోకమున శరీరము.

2 వాయుమయేంద్రియము స్పర్శగ్రాహక మగు త్వక్కు; అది సర్వశరీరవర్తిని.

3 వృక్షాదికంపనహేతువు విషయము.

శరీరాంతస్సంచారి యగు వాయువు ప్రాణ మనఁబడును. అది యొకటియే ఉపాధిభేదముచేతను స్థానభేదముచేతను ప్రాణోదానాది సంజ్ఞల నొందును.

5. ఆకాశము. శబ్దగుణకము. శబ్దమే గుణముగాఁ గలది.

6. దిక్కు. ప్రాచ్యాది వ్యవహార హేతుకము. అనఁగా తూర్పు దక్షిణము అని వ్యవహరించుటకు కారణము.

7. కాలము. అతీతాది వ్యవహారహేతుకము. ఇది గడచినది. ఇది ముందు రాఁగల దనెడి వ్యవహారమునకు కారణము.

(6, 7: ఈమూఁడును ఏకములును నిత్యములును విభువులును అగును.)

8. ఆత్మ జ్ఞానాధికరణము జ్ఞానమున కాశ్రయ మయినవాఁడు.

అది పరమాత్మ, జీవాత్మ అని రెండు విధములు.

1 ఈశ్వరుఁడును సర్వజ్ఞుఁడును అగు పరమాత్మ యొకఁడే యగును.

2 ప్రతిశరీరభిన్నుఁడును విభువును నిత్యుఁడును అగువాఁడు జీవాత్మ.

9. మనస్సు సుఖాద్యుపలబ్ధిసాధన మగు ఇంద్రియము. తనయం దుండిన సుఖమును దుఃఖమును కనుఁగొనుటకు కారణ మయినది మనస్సని లక్షణము. అది ప్రత్యాత్మ నియతత్వముచే అనంతమును నిత్యమును అగును.

## గుణవిభాగము.

1. రూపము. చక్షుర్మాత్రగ్రాహ్యగుణము. కన్నులుమాత్రముచేత నే తెలియఁబడునట్టి గుణము.

   అది శుక్ల, నీల, పీత, రక్త, హరిత, కపిశ, చిత్రము లని ఆఱువిధములు.
   ఇది పృథివీ, జల, తేజోవృత్తు లగును.

1 అందు పృథివిలో 6 విధములును,
2 జలమున అభాస్వరశుక్ల మును,
3 తేజస్సున శుక్లభాస్వరమును గలదు.

2. రసము. రసనగ్రాహ్యగుణము. అనఁగా నాలుకచేఁ దెలియఁబడునట్టి గుణము. అది మధుర, ఆమ్ల, లవణ, కటు, కషాయ, తిక్తము లని 6 విధములు.

## పృథివీజలవృత్తులు.

1 పృథ్విలో ఆఱువిధములును,
2 జలములో మధురముమాత్రమును కలదు.

3. గంధము. ఘ్రాణగ్రాహ్యగుణము. అనఁగా ముక్కుచేఁ దెలియఁదగిన గుణము.
   అది సురభి, అసురభి అని 2 విధములు.
   ఇది పృథివీమాత్రవృత్తి యగును.

4. స్పర్శము. త్వగింద్రియమాత్రగ్రాహ్యగుణము. చర్మముచేఁ దెలియఁదగిన గుణము.
   అది శీత ఉష్ణ, అనుష్ణాశీతము లని 3 విధములు.

## పృథివ్యప్తేజోవాయువృత్తులు.

1 జలమునందు శీతమును,
2 తేజస్సునందు ఉష్ణమును,
3 పృథివీ వాయువులలో అనుష్ణాశీతమును గలదు.

కూపాదు లగు నీ నాలుగుగుణములును పృథివియందు పాకజములును అనిత్యములును అగును. అన్యములయందు అపాకజములును నిత్యానిత్యములును అగును.

అందు నిత్యగతము నిత్యము. అనిత్యగతము అనిత్యము.

5. సంఖ్య. ఏకత్వాది వ్యవహారహేతువు, ఒకటి రెండు అను వ్యవహారమునకు కారణ మయినది. అది నవద్రవ్యవృత్తి యగును.

ఆ ఏకత్వము నిత్యము, అనిత్యము అని రెండువిధములు.

ద్విత్వాదికములు సర్వత్రానిత్యములు.

6. పరిమాణము. మానవ్యవహార అసాధారణకరణము. సేరు, పావు అని కొలుచునట్టి వ్యవహారమునకు కారణ మయినది. అది నవద్రవ్యవృత్తి యగును.

అది అణువు, మహత్తు, దీర్ఘము, హ్రస్వము అని 4 విధములు.

7. పృథక్త్వము. పృథగ్వ్యవహారాసాధారణకారణము. వే ఱయిన దనెడి వ్యవహారమునకు కారణ మయినది పృథక్త్వ మనఁబడును. అది నవద్రవ్యవృత్తి యగును

8. సంయోగము. సంయుక్తవ్యవహారహేతువు. ఇవి రెండు కూడుకొనియున్న వని చెప్పుటకు కారణ మయినది సంయోగము. అదియు నవద్రవ్యవృత్తి యగును

9. విభాగము. సంయోగనాశకగుణము. కూడియున్న వానిని విభాగించునది విభాగము. అది సర్వద్రవ్యవృత్తి యగును.

10. పరత్వము. పరవ్యవహారసాధారణకారణము. దీనికంటె ఇది పర మను వ్యవహారమునకు కారణము పరత్వము.

11. అపరత్వము. అపరవ్యవహారసాధారణకారణము. పరత్వమునకంటె అపర మనుటకు కారణ మయినది అపరత్వ మనఁబడును.

పరత్వాపరత్వములు రెండును దిక్కృతము, కాలకృతము అని రెండువిధములు.

1 దూరస్థ మైనపుడు, దిక్కృతపరత్వము.

2 సమీపస్థ మైనపుడు, దిక్కృత మగు అపరత్వము.

1 జ్యేష్ఠ మైనపుడు, కాలకృతపరత్వము.

2 కనిష్ఠ మైనపుడు, కాలకృత మగు అపరత్వము.

12. గురుత్వము. ఆద్యపతనాసమవాయికారణము. (మొట్టమొదట జారుటకు కారణ మయినది.) ఇది పృథివీజలవృత్తి యగును.

13 ద్రవత్వము. ఆద్యస్యందనా సమవాయికారణము (మొదటిచలనము.) ఇది పృథివ్యప్తేజోవృత్తి యగును.

అది సాంసిద్ధికము, నైమిత్తికము అని 2 విధములు.

1 సాంసిద్ధికము జలమునను,

2. నైమిత్తికము పృథ్వీతేజస్సులయందును గలదు.

పృథ్వియందు ఘృతాదులలో నగ్నిసంయోగమున కలుగును.

తేజస్సునందు సువర్ణాదికములలో కలుగును.

14. స్నేహము. చూర్ణాది పిండీభావ హేతుక గుణము. (గోధుమపిండిని చక్కగా ముద్దగా జేర్చుట) ఇది జలమాత్రవృత్తి యగును.

15 శబ్దము. శ్రోత్రగ్రాహ్యగుణము. (చెవులచే దెలియునది.) ఆకాశమాత్రవృత్తి యగును.

అది ధ్వన్యాత్మకము, వర్ణాత్మకము అని 2 విధములు.

1. ధ్వన్యాత్మకము భేర్యాదులయందును,

2. వర్ణాత్మకము గీర్వాణాదిభాషలయందును గలదు.

16. సర్వవ్యవహారహేతుక మగు బుద్ధి జ్ఞానము. అన్ని వ్యవహారములకును కారణ మయిన బుద్ధియే జ్ఞాన మనబడును.

అది స్మృతి, అనుభవము అని 2 విధములు.

1. స్మృతి సంస్కారజన్యజ్ఞానము. (మనస్సంస్కారమున బుట్టిన జ్ఞానము.)

2. అనుభవము తద్భిన్నమగు జ్ఞానము. స్మృతికాని జ్ఞానమే అనుభవ మనబడును. ఇదియును యథార్థము, అయథార్థము అని 2 విధములు.

1. యథార్థము తద్వతితత్ప్రకారకమగు అనుభవము; వెండిఖడ్డియందుబుట్టిన వెండి జ్ఞానము యథార్థ మనబడును. అదియే ప్రమ యనంబడును.

2. అయథార్థము తదభావవతి తత్ప్రకారకానుభవము. అనగా ముత్తెపుచిప్పను వెండిగా నెంచుట.

## యథార్థవివరణము.

ఇది ప్రత్యక్షము, అనుమితి, ఉపమితి, శబ్దము అని 4 విధములు.

అందులకు క్రమంబుగ ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, శబ్దము, అని 4 కరణములు.

కరణము, అసాధారణకరణము (ముఖ్యకారణము).

కారణము, కార్యనియత పూర్వవృత్తి (కారణమునకంటె ముందే యుండునది. ఇప్పుడు లేనిదై ఇఁక ముందు కాఁ దగినది.)

కార్యము, ప్రాగభావ ప్రతియోగి.

## కారణములు.

1. సమవాయికారణము, ఏది సమవేతమై (అనఁగా కారణముతో కలిసినదై ఏకార్యము బుట్టుచున్నదో యది) కార్య ముత్పత్తి యగునో అది సమవాయి కారణము.

ఉదా. తంతువులు పటమునకు సమవాయికారణములు.

2. అసమవాయికారణము, కార్యముచేత నైనను కారణముచేత నైనను కూడా ఒక యర్థమున సమవేత మగు కారణము అసమవాయికారణము.

ఉ. తంతుసంయోగము పటమునకు అసమవాయికారణము; తంతురూపము పటరూపమునకు అసమవాయికారణము.

3. నిమిత్తకారణము, తదుభయభిన్నకారణము. (సమవాయాసమవాయికారణము కానిది నిమిత్తకారణము.)

ఉ. తురీవేమాదికములు పటమునకు నిమిత్తకారణములు

ఈ మూఁడు కారణములలో ఏది యసాధారణమో అదియే కరణము.

## ప్రత్యక్షప్రమాణము.

ప్రత్యక్షప్రమాణకరణము ప్రత్యక్షకరణము.

ఇంద్రియార్థ సన్నికర్ష జన్యజ్ఞానము ప్రత్యక్షము. (ఒకపదార్థమును జూచి పుట్టిన జ్ఞానము ప్రత్యక్ష మనఁబడును.)

అది సవికల్పకము, నిర్వికల్పకము అని రెండువిధములు.

1. నిష్ప్రకారకము నిర్వికల్పకము. అనఁగా ఇంద్రియార్థసన్నికర్షమైన పిదప నామజాత్యాదియోజనము లేక ఇది కించిత్తు అని వస్తుమాత్రావగాహియైన యొదవు జ్ఞానము నిర్వికల్పకము.

2. సప్రకారకము సవికల్పకము. అనఁగా యిది డిత్థము, ఇతఁడు బ్రాహ్మణుఁడు, ఇది శ్యామము, అను ప్రత్యక్షజ్ఞానహేతుకము సవికల్పకము.

అది మఱియును సంయోగము, సంయుక్తసమవాయము, సంయుక్తసమవేత సమవాయము, సమవాయము, సమవేతసమవాయము, విశేషణ విశేష్య భావము అని ఆఱువిధములు.

1. చక్షుస్సులయందు ఘటప్రత్యక్ష జనన మగునపుడు సంయోగసన్నికర్షము. (ఘటమునకు, చక్షురింద్రియమునకు సంయోగ మగుచున్నది)

2. ఘటరూప ప్రత్యక్షమున సంయుక్త సమవాయ సన్నికర్షము. (చక్షుస్సంయుక్త ఘటమునందు రూపముయొక్క సమవాయ మున్నది గనుక.)

3. రూపముయొక్క సామాన్యప్రత్యక్షమున సంయుక్త సమవేత సమవాయ సన్నికర్షము; చక్షుస్సంయుక్తఘటమున రూపము సమవేతము. (అచట రూపత్వ మునకు సమవాయము గనుక.)

4. శ్రోత్రముచే శబ్దసాక్షాత్కార మగునెడల సమవాయ సన్నికర్షము. (కర్ణవివర వృత్తి యగు ఆకాశమునకు శ్రోత్రత్వమును, శబ్ద మాకాశగుణమును గనుక) అనఁగా గుణమునకును గుణికిని సమవాయము గనుక.

5. శబ్దత్వసాక్షాత్కారమున సమవేత సమవాయ సన్నికర్షము. (శ్రోత్రసమవేత శబ్ద మున శబ్దత్వమునకు సమవాయము గనుక.)

6. అభావప్రత్యక్షము విశేషణ విశేష్యభావ సన్నికర్షము; ఘటాభావము కలది. భూతల మనునెడల చక్షుస్సంయుక్తము భూతలము; అందు ఘటాభావము విశేషణము. ఇటువలె సన్నికర్షషట్కముచేఁ బొడము జ్ఞానము ప్రత్యక్ష మగును. తత్కారణమగు యింద్రియమును ప్రత్యక్షమగును. గనుక ప్రత్యక్షము ప్రమాణ మనుట సిద్ధము.

## అనుమానప్రమాణము.

అనుమితికరణము అనుమాన మగును. పరామర్శజన్యజ్ఞానము అనుమితి; వ్యాప్తి విశిష్ట పక్షధర్మతాజ్ఞానము పరామర్శ; అనఁగా వహ్నివ్యాప్య మయిన ధూమము గలది పర్వతమనుజ్ఞానము. తజ్జన్యమగు పర్వతము వహ్నిమంతమను జ్ఞానము అనుమితి యగును ఎచట ధూమమో అచట వహ్ని యను సాహ చర్యనియమము వ్యాప్తి యగును. వ్యాప్తముయొక్క పర్వతాదివృత్తిత్వము పక్షధర్మత యగును. ఇయ్యనుమానము స్వార్థము పరార్థము అని యిరు తెఱంగులు.

1. స్వార్థము స్వానుమితిహేతువు. అనఁగా తానే మహానసాదుల (వంటయిల్లు) యొక్క భూయోదర్శనముచే (పలుమారు జూచుటచేత) యెచట ధూమమో అచట వహ్నియనువ్యాప్తిని గ్రహించి పర్వతసమీపమునుపొంది అచట అగ్నిచే నెగయు పర్వతమును ధూమమును జూచి యెచట ధూమమో అచట అగ్నియను వ్యాప్తిని స్మరించును. అవ్వల వహ్నివ్యాప్యమగు ధూమవంత మీ పర్వతమను జ్ఞానము కలుగును; ఇదియే లింగపరామర్శ యనంబడును; కనుక పర్వతము వహ్నిమంతమను జ్ఞాన ముత్పన్నమగును. ఇది స్వార్థానుమాన మనంబడును.
2. పరార్థము, తానే ధూమమువలన అగ్నిని యనుమానించి మఱియొక్కనికి బోధించు కొఱకు పంచావయవవాక్యమును బ్రయోగించుట.

## పంచావయవవాక్యము.

ధూమ మునికివలన పర్వతము వహ్నిమంతము. మహానసమునవలె యేదియేది ధూమవంతమో అది యది అగ్నివంతము; గనుక యిదియు అటువల నగును, దీనిచే ప్రతిపాదితము లింగమునకన్న పరమైనను అగ్నిని ప్రతిపాదించును. ఆ వాక్యమునందలి అవయవములు ప్రతిజ్ఞ, హేతువు, ఉదాహరణము, ఉపనయము, నిగమనము, అని పేర్కొనఁబడును.

అందు పర్వతము వహ్నివంతము, అనుట ప్రతిజ్ఞ.

ధూమ మునికివలన, అనుట హేతువు.

మహానసమువలె యేదియేది ధూమవంతమో అది యది యగ్నివంతము అనుట ఉదాహరణము.

ఇదియు నటువలె, అనుట ఉపనయము.

కనుక అటువల నగును, అనుట నిగమనము.

స్వార్థానుమితికిని, పరార్థానుమితికిని లింగపరామర్శయే కరణము గనుక లింగ పరామర్శ అనుమాన మగును.

ఆ లింగములు అన్వయవ్యతిరేకి, కేవలాన్వయి, కేవలవ్యతిరేకియని 3 విధములు.

1. అన్వయముచేతను వ్యతిరేకముచేతను వ్యాప్తిమంతము అన్వయవ్యతిరేకి యగును.

ఉ. వహ్నిమాన్ధూమాత్. అనునెడ యెచట ధూమమో అచట అగ్ని కలదను అన్వయవ్యాప్తి వంటయింటిలో నున్నది. ఎచట అగ్నిలేదో అచట ధూమమును లేదను వ్యతిరేకవ్యాప్తి మడుగునందు గలదు.

2. అన్వయవ్యాప్తిమాత్రకము కేవలాన్వయి యగును.

ఉ. ఘటమభిధేయము, ప్రమేయత్వమువలన పటమువలె అను నిచట ప్రమేయత్వాభిధేయత్వములకు వ్యతిరేకవ్యాప్తి లేదు అన్నిటికిని ప్రమేయత్వమును అభిధేయత్వము నున్నది గనుక.

3. వ్యతిరేకమాత్రవ్యాప్తికము కేవలవ్యతిరేకి యగును.

ఉ. పృథివి గంధవత్త్వమువలన ఇతరములకన్న భిన్నము.

జలమువలె ఏది యితరములనుండి భిన్నముకాదో, అది గంధవత్త్వము కానేరదు. ఇది అటుకాదు, కనుక అటుకాదు ఇచట ఏది గంధవంతమో అది ఇతరభిన్నము అని అన్వయదృష్టాంతము లేదు. పృథివిమాత్రము నకు పక్షముగనుక.

ఈ పక్షమును పక్ష సపక్ష విపక్ష అని మూఁడువిధములుగ నుండును.

1 పక్ష మనఁగా సందిగ్ధసాధ్యవంతము. సాధ్య మున్నదో లేదో యను సంశయము గలది పక్షము.

ఉ. ధూమత్వ హేతువున పర్వతము.

2 సపక్ష మనఁగా నిశ్చితసాధ్యమతము. సాధ్య మున్నదనెడి నిశ్చయము.

ఉ. అచటనే మహానసము (వంటయిల్లు.)

3 విపక్ష మనఁగా నిశ్చితసాధ్యాభావవంతము. (సాధ్యము లేనిది.)

ఉ. అచటనే మహాహ్రదము. (మడుగు).

## హేత్వాభాసములు. (దుష్టహేతువులు,

సవ్యభిచార విరుద్ధ సత్ప్రతిపక్ష అసిద్ధ బాధితము లని ఐదువిధములు

1. సవ్యభిచారమను కాంతికము సాధారణాఽసాధారణాఽనుపసంహారు లని ముత్తెఱఁగులు.

1 సాధ్యాభావవద్వృత్తియగు(సాధ్యములేనిస్థలమందుండునట్టిహేతువు) సాధారణ మను కాంతికము.

ఉ ప్రమేయత్వమువలన పర్వతము వహ్నిమంతము అనునెడ ప్రమేయత్వమునకు వహ్న్యభావవత్తయగు హ్రదమునను విద్యమానత కలదు.

2 సర్వ సపక్ష విపక్ష వ్యావృత్తము అసాధారణము.

ఉ. శబ్దత్వమువలన శబ్దము నిత్యము అనునెడ శబ్దత్వము నిత్యమును అనిత్యమునగును. సర్వమునను వ్యావృత్తము శబ్దమాత్రవృత్తి యగును గనుక.

 

3 అన్వయవ్యతిరేకదృష్టాంతరహితము అనుపసంహారి యగును.

ఉ. సర్వమును అనిత్యము, ప్రమేయత్వమువలన; అనుచోట సర్వము నకును పక్షత కలదు; దృష్టాంతము లేదు గనుక.

2. విరుద్ధము సాధ్యాభావవ్యాప్య హేతువు.

ఉ. శబ్దము నిత్యము కృతకమునగును, అనుచోట కృతకత్వము నిత్యత్వాభావమువలనను అనిత్యత్వమువలనను వ్యాప్తము.

3. దేనికి సాధ్యాభావసాధక మగు హేత్వంతరముకలదో అది సత్ప్రతిపక్షము.

ఉ. శబ్దము నిత్యము; శ్రావణత్వమువలన. శబ్దత్వమువలెనే శబ్దము నిత్యము. కార్యత్వముచే ఘటమువలెనే ఇత్యాదులు.

4. అసిద్ధము ముత్తెరంగులు.

ఆశ్రయాసిద్ధము స్వరూపాసిద్ధము వ్యాప్యత్వాసిద్ధము అని.

1 గగనారవిందము సురభి, అరవిందత్వమువలన సరోజారవిందమువలె అనుచోట గగనారవిందమాశ్రయము, అదిలేనేలేదు గనుక। ఇది ఆశ్రయాసిద్ధము.

2 శబ్దము గుణము, చాక్షుషత్వమువలన అనునెడల చాక్షుషత్వము శబ్దమున లేదు గనుకను, శబ్దమునకు శ్రావణత్వము గనుకను, ఇది స్వరూపాసిద్ధమనఁబడును.

3 ఉపాధియుక్తము వ్యాప్యత్వాసిద్ధము; ఉపాధి యనఁగా సాధ్యము వ్యాపకమగుచుండ సాధనము వ్యాపింప కుండుట. అందు సాధ్యసమానాధికరణాత్యంతాభావ అప్రతియోగిత్వము సాధనావ్యాపకత్వము.

ఉ. పర్వతము వహ్నిచే ధూమవంతము, అనుచోట ఆర్ద్రేంధనసంయోగము ఉపాధియగును. ఎచటధూమమో అచటఆర్ద్రేంధనసంయోగమనిసాధ్యవ్యాపకమును, ఎచటవహ్నియో అచటఆర్ద్రేంధనసంయోగముస్త్లేదు అని సాధనావ్యాపకత్వమును అగును. (అయోగోళకమున ఆర్ద్రేంధనసంయోగములేదు గనుక.) ఇటుల సాధ్యము వ్యాపక మగుచుండఁగా సాధనావ్యాపకత్వమగుటచే ఆర్ద్రేంధనసంయోగము ఉపాధి యగును. సోపాధికతవలన వహ్నిమత్వము వ్యాప్యత్వాసిద్ధ మగును.

5 దేనికి బాధ్యాభావము ప్రమాణాంతరముచే నిశ్చితమో అది సాధితము.

ఉ. అగ్ని అనుష్ణము పదార్థత్వమువలన; అనుచోట అనుష్ణత్వము సాధ్యము, తదభావ మగు ఉష్ణత్వము స్పార్శనప్రత్యక్షముచే గృహీతము గనుక బాధిత మగును.

## ఉపమానప్రమాణము.

ఉపమితికరణ ముపమానము.

సంజ్ఞాసంజ్ఞిసంబంధజ్ఞాన ముపజ్ఞాతి యగును. (దీనికి దీనికి సామ్య మున్నది యని తెలియుట)

ఉ. ఒకానొకఁడు గవయపదముయొక్క అర్థము నెఱుంగకుండి యొకానొక ఆరణ్యకపురుషునివలన గోసదృశుఁడు గవయుఁడు అని విని వనమునకుఁబోయి గోసదృశుని జూచి వాక్యార్థమును స్మరించెడిని. ఆపిదప వీఁడు గవయపదవాచ్యుఁడు అను ఉపమితి కలుగుచున్నది.

## శబ్దప్రమాణము.

ఆప్తవాక్యము శబ్దమగును. ఆప్తుఁడు యథార్థవక్తయే యగును వాక్యము బుద్ధ్యాదిగుణములుఁ రెనిమిదియు ఆత్మగుణములు.

బుద్ధీచ్ఛాప్రయత్నములు నిత్యానిత్యము లగును.

అందు నిత్యము యీశ్వరునియందును, అనిత్యము జీవునియందును గలదు. అది సంస్కారము, వేగము, భావన, స్థితిస్థాపకము అని 3 విధములు.

1 వేగము పృథివ్యాదిచతుష్టయ మనోవృత్తి యగును.

2 భావన అనుభవజన్యస్మృతిహేతువు ఆత్మమాత్రవృత్తి యగును.

3 స్థితస్థాపకము అన్యథాకృతముయొక్క పునస్తదవస్థాపాదకము (ఘటాదిపృథివీమాత్రవృత్తి యగును.)

## కర్మలు.

కర్మము చలనాత్మకము.

1 ఉత్క్షేపణము ఊర్ధ్వదేశసంయోగహేతు వగు కర్మము.

2 అవక్షేపణము అధోదేశసంయోగహేతు వగు కర్మము.

3 ఆకుంచనము శరీరసన్నికర్షసంయోగహేతు వగు కర్మము.

4 ప్రసారణము విప్రకృష్టసంయోగహేతు వగు కర్మము.

5 గమనము పైనాలుగుకాని కర్మ లన్నియును

## సామాన్యములు.

నిత్యమును, ఏకమును, అనేకానుగతము నగును. (ఇవి ద్రవ్యగుణకర్మ వృత్తులు.)

1 పరసామాన్యము సత్త యగును.

2 అపరము ద్రవ్యత్వాది యగును.

## విశేషములు.

నిత్యద్రవ్యవృత్తి వ్యావర్తకములు నిత్యములును, అనంతములు నగును.

## సమవాయము.

నిత్యసంబంధము అయుతసిద్ధమాత్ర వృత్తి. ఎవ్వాని మధ్యమున నొండొం టిని సిద్ధమై యాశ్రయించి యుండునో అవి రెండును అయుతసిద్ధ సంబంధము కలవి యగును.

ఉ. అవయవావయవులకు, గుణిగుణులకు, క్రియాక్రియావంతులకు, జాతి వ్యక్తులకు, విశేషనిత్యద్రవ్యములకు సమవాయము కలదు.

## పదసమూహము.

గోవులు తోలుకొనిరమ్ము; ఇత్యాదులు.

ఉ. శక్తమగునది పదము. ఈ పదమువలన యీ యర్థము బోధింపదగినది యని యీశ్వరసంకేత యిచ్ఛకలదు. ఆకాంక్షాయోగ్యతసన్నిధులు.

## వాక్యార్థజ్ఞానహేతువులు.

1 పదముయొక్క పదాంతర వ్యతిరేకప్రయుక్త మగు అన్వయాననుభావకత్వము ఆకాంక్ష యగును.

2 అర్థాబాధ యోగ్యత యగును.

3 పదములయొక్క అవిలంబోచ్చారణ సన్నిధి యగును; గనుక ఆకాంక్ష లేదు. అందువలన, గోవు, అశ్వము, పురుషుఁడు, హస్తి, ఇత్యాదులు ప్రమాణ ములు. యోగ్యత లేనందున అగ్నిచేత తడుపు ఇత్యాదులు అప్రమాణములు. సన్నిధి లేనందున పశువును—తోలుకొనిరా—అని గడియ కొకతూరిగా పల్కిన అదియును అప్రమాణమే.

వాక్యములు లౌకిక వైదికము లని యిరుదెఱఁగులు.

ఆప్తోక్తము లైన లౌకికములు ప్రమాణములు, తక్కినవి అప్రమాణములు. వాక్యార్థజ్ఞానము శబ్దజ్ఞాన మగును, తత్కారణము శబ్ద మగును.

## అయథార్థానుభవములు.

అయథార్థానుభవము సంశయ, విపర్యయ, తర్కము అని ముత్తెఅంగులు.

1. ఒకధర్మియందు విరుద్ధము లగు నానాధర్మముల వైశిష్ట్యములను అవగాహించు నట్టి జ్ఞానము సంశయ మగును.

   ఉ. స్థాణువో పురుషుఁడో అనునది.

2. మిథ్యాజ్ఞానము విపర్యయ మగును.

   ఉ. శుక్తియందే రజతము అని.

3. వ్యాప్యారోపముచే వ్యాపకారోపము తర్క మగును.

   ఉ. వహ్ని లేదేని ధూమమును లేదు అని.

## స్మృతి.

ఇది యథార్థము, అయథార్థము అని యిరుతెఱఁగులు.

1. ప్రమాణజన్యము యథార్థము.
2. అప్రమాణజన్యము అయథార్థము.

సుఖము సర్వానుకూలవేదనీయము. (ఎల్లర కనుకూల మయినది.)

దుఃఖము సర్వప్రతికూలవేదనీయము. (ఎల్లరకు ప్రతికూల మైనది.)

ఇచ్ఛ కామము, ద్వేషము క్రోధము, ప్రయత్నము కృతి, ధర్మము విహిత కర్మజన్యగుణము, అధర్మము నిషిద్ధకర్మజన్యగుణము, సామాన్యము జాతి వ్యక్తివిశేషనిత్యద్రవ్యము.

## అభావములు.

ఇది నాలుగువిధములు.

1. ప్రాగభావము అనాదియు సాంతము నైనది.
2. ప్రధ్వంసాభావము కార్యోత్పత్తి యయిన తర్వాత కార్యముయొక్క నాశమును అదియును అంతమును నైనది.
3. అత్యంతాభావము ఉత్పత్తికి పిదప కార్యముయొక్క త్రైకాలిక సంసర్గావచ్ఛిన్నప్రతియోగితాక మగునది.

   ఉ. భూతలమున ఘటము లేదు అని.

4. అన్యోన్యాభావము తాదాత్మ్యసంబంధావచ్ఛిన్నప్రతియోగితాకము.

   ఉ. ఘటము పటమున గలుగదు అని.

ఈ తెలిపిన వానిలోనే సర్వపదార్థములును అంతర్భావములు గనుక పదార్థములు ఏడనుట సిద్ధము.

## అలంకారశాస్త్రము.

కావ్యమును అలంకరించునవి అలంకారములు. అవి శబ్దాలంకారములు, అర్థాలంకారములు అని రెండువిధములు. అందు శబ్దాలంకారములు అనుప్రాసయమకాదులు. అర్థాలంకారములు ఉపమాన అన్వయాదులు అని యనేకవిధములు.

### శబ్దాలంకారములు.

1. ఛేకానుప్రాసము:—రెండురెండు జంటహల్లులు అచ్చులతోడ కూర్చుట - ఓ కృష్ణా! నీకృపయే నిఖిలార్థములు నిచ్చుటయందు నిందు వేల్పులప్రాకు మాకు.

2. వృత్త్యనుప్రాసము:— రెంటికంటె మించిన జంటహల్లులు అచ్చులతోడ కూర్చుట — ఓ కృష్ణా! నీకృపలేని సమయమందు నేమందుము నీ యందము నేమందుము మందపతుల మగుట.

3. లాటానుప్రాసము:— ఒకపదమునే మఱియొకసారి ఉత్కృష్టముగ చెప్పుట —ఓ కృష్ణా! చేతనసంరక్షణమందు నీకృపయే కృప, మాభాగ్యమే భాగ్యము.

### యమకభేదములు.

4. ఆదియమకము:— వచ్చినయక్షరములే మఱల వరుసగ మొదట నే చెప్పుట- ఓ కృష్ణా! కృష్ణాభయప్రదానమున నీకృప అద్వితీయము.

5. అంత్యయమకము:— వచ్చిన యక్షరములు మఱల కడపటనె వరుసగ చెప్పుట.—ఓ రామా! నీ కృపను అపేక్షించువారు గరుడ గంధర్వ కిన్నర కింపురుష సిద్ధ సాధ్య విద్యాధర సుర లసురు లందఱును.

6. మధ్యయమకము:—పైయవియె నడుమ వచ్చునట్లు చెప్పుట.—ఓ కృష్ణా! నీకుఁ గాక ఏలోకముల్లోఁ గాని, ఇట్టికృప ఏవారి కవారిగ నున్నది?

7. ఆదిమధ్యాంత్య సర్వయమకము:— పైనచెప్పినయట్లే మొదటను నడుమను, కడపటను, సర్వమునఁ జెప్పుట.—ఓ రామా! నీకుగాక యీకృప మఱి యేవారికి నవారిగ నేజగాన గానను అని యొక్కొక్కఁడు నుడువును.

మఱియు నిట్లు రథ సౌధ గోమూత్రికాది బంధంబులును, ఓష్ఠ్య నిరోష్ఠ్యాది భేదంబులు మొదలైనవియును శబ్దాలంకారంబులె యగును.

### అర్థాలంకారములు.

1. ఉపమ —ఉపమానోపమేయములకు సామ్యము స్పష్టముగా జెప్పుట — ఓ కృష్ణా! నీ కీర్తి హంసతో సమముగ ఆకాశగంగయందును విహరించు చున్నది.

2. అనన్వయము.— ఉపమానోపమేయములు ఒక వస్తువుగ జెప్పుట—ఓ రామా! ఆశ్రితసంరక్షణమందు నీకృప నీకృపకే సమము.

3. ఉపమేయోపమ.—ఉపమానోపమేయములను వరుసగ ఒకటితో నొకటి సమముగ చెప్పుట —ఓ కృష్ణా! నీకీర్తి నీకృపవలెను, నీకృప నీకీర్తివలెను అంతట నిండుకొని యున్నది.

4. ప్రతీపము.—ఉపమానమునే ఉపమేయముగ చెప్పుట—ఓ రామా! నీ కనులతో కమలములే సమములు.

5. రూపకము.— ఉపమేయమందు ఉపమానత్వమును ఆరోపించుట— ఓ కృష్ణా: నీకృప మాపాపముల ప్రాణముల నెల్లను పానము చేయుటకు పామే యగును.

6. పరిణామము —ఉపమానమే ఉపమేయముగా మారుట—ఓ రామా! నీ కృపావర్షమే మాతాపములను చల్లార్చునుగాక.

7. ఉల్లేఖము —ఒక ఉపమేయమందే అనేకోపమానగుణములను ఆరోపించుట—ఓ కృష్ణా! నీకృపయే మాపాపములను దాటుటకు తేపగాను, మాతాపములను చల్లార్చుటకు మేఘముగాను నుండునుగాక.

8 స్మృతి —ఉపమానోపమేయములలో ఒకటిచేత రెండవదానిని జ్ఞప్తికి దెచ్చుకొనుట—ఓ రామా! నీకృపను వినఁగనే మాకు అమోఘమైన వర్షము జ్ఞప్తికి వచ్చుచున్నది.

9. భ్రాంతిమంతము — ఉపమేయమే ఉపమానమని భ్రాంతిపడుట—ఓ కృష్ణా ఈ తుమ్మెద నీమోమును తామ రనుకొను చున్నది.

10. సందేహము.—ఓ రామా! ఆమె నీమోమును సోముఁడో, తామరో యని యనుమానించు చున్నది.

11. అపహ్నవము.—ఉపమేయము కా దని, ఉపమానమే యని నిశ్చయించుట—ఓ కృష్ణా! ఇది నీ మోము కాను, అరుణోదయమందె పూచిన యెఱ్ఱదామరపూవు

12. ఉత్ప్రేక్ష.—కారణాంతరము కల్పించి ఉపమేయమునే ఉపమానముగా ఊహించుట—ఓ రామా! నీమోమునకు సమముగాఁ గోరి యీతామర తటాకములోన తపము చేయుచున్నది.

13. అతిశయోక్తి.— ఉపమేయము ఉపమానముచేతనే గ్రహించుట—ఓ కృష్ణా! ఈ మెఱుపుదీఁగె మెఱయుటఁబట్టికదా? ఈ కార్మేఘము వర్షించుచున్నది. (భక్తవాత్సల్యముచేతఁగదా నీవు కృప చేయుచున్నావు. అనుట ఉపమేయము).

14 తుల్యయోగిత.—ఉపమేయమునకు ఉత్కృష్టోపమానములతో సమత్వము చెప్పుట—ఓ రామా! నీ బొమ్మన ఈ వనమాల కమలాకౌస్తుభములతో ఆటలాడుచున్నది

15. దీపకము —ఉపమానోపమేయములకు ఏకధర్మమునే చెప్పుట—ఓకృష్ణా! నీహృదయము కృపారసముచేత నిండియుండును, ఆవార్షుకఘనము ఘనరసముచేత నిండియుండును.

16 ఆవృత్తిదీపకము.—పదపదార్థతదుభయములలో ఒకటినే మఱల చెప్పుట ఓరామా! నీకృప కల్గినా వర్షమగును, అది లేనిది నిమిషమైన వర్షమగును.

17. ప్రతివస్తూపమ.—ఉపమానోపమేయవాక్యములలో ఒకధర్మమునే వేఱు పదములుగా జెప్పుట—ఓ కృష్ణా! నీకృప వెల్లువగా పాఱును, వార్షుకమేఘము నిఱదగా కురియును.

18 దృష్టాంతము —ఉపమానోపమేయములు బింబప్రతిబింబములవలె వేఱు వాక్యములతో జెప్పుట—ఓ రామా! నీకృపయే చల్లన గలది, పున్నమరాత్రియే వెన్నెల గలది.

19 నిదర్శనము —ఉపమానోపమేయవాక్యములకు అర్థమునందు ఐక్యమును చెప్పుట—ఓకృష్ణా! నీకృపకు నిర్మలభావము కలదనునది యేదో, అది చంద్రకళకు శీతలభావము కల దనునదియే.

20. వ్యతిరేకము —ఉపమానమునకు విరుద్ధముగా ఉపమేయమునకే విశేషమును చెప్పుట—ఓ రామా! నీకృప చంద్రకళవలె చల్లనిదే యైనను, ఎప్పటికిని కొఱవడునది కాదు.

21. సహోక్తి.—ఒకానొకవిషయముతోఁ గూడికి జనరంజనముగా జెప్పుట. ఓ కృష్ణా! నీకృప నీయాశ్రితులతోఁగూడ నాపర్యంతమును సాగి వచ్చెను.

22. వినోక్తి —ఒకవిషయమును ఏదేని కొంచెము లేకపోవుటను చెప్పుట—ఓ రామా! నీకృప మాకర్మములను కొంత పాటింపక పోయినయెడల అది యనద్యమగును.

23. సమాసోక్తి.—ప్రకృతవిషయముచేత మఱియొక ప్రకృతము గాని, యప్రకృతము గాని స్పష్టమగునట్లు చెప్పుట—ఓకృష్ణా! నీకృపనుబట్టియే మే మాముక్తిముఖమును ముద్దుపెట్టుకొందుము.

24.. పరికరము.—విశేషణమును సాభిప్రాయముగా జెప్పుట—ఓ రామా! సకలఫలప్రద యైన నీకృపయే మా లేమిని పోనడఁచును గాక.

25. పరికరాంకురము.—విశేష్యమును సాభిప్రాయముగా చెప్పుట షడ్గుణైశ్వర్యము గల ఓ కృష్ణభగవానుఁడా! నీవే మా యరిషడ్వర్గమును పోఁగొట్టఁ జాలినవాఁడవు.

26. శ్లేష:—అనేకార్థములను ఇచ్చు పదములను ప్రకృతాప్రకృతములలోఁ జేర్చి చెప్పుట. ఓకృష్ణా! నీధర్మమే సగుణమై మాయధర్మముల నెగురగొట్టుచున్నది.

27. అప్రస్తుతప్రశంస:—ప్రస్తుతము తోఁచుటకై అప్రస్తుతమును చెప్పుట. ఓకృష్ణా! పక్షియైనను, వానబొట్టులకై మేఘునెగాక, యన్యునిగోరని యీవానగోయిలయే ఉత్తమ మైనపక్షి.

28. ప్రస్తుతాంకురము:—ప్రస్తుతము తోఁచుటకై ప్రస్తుతమునే చెప్పుట. ఓ కృష్ణా! ఈ భ్రమరమునకు మంచిజాతి యుండఁగా, ముండ్లజాతి యైన మొగిలి మొగ్గయేల.

29. పర్యాయోక్తము:—కొంచెమును గొప్పగాఁ జెప్పుట. ఓ కృష్ణా! ఏ కృప కుచేలుని అటుకులను అఖిలసంపదాస్పదములనుగా చేసెనో, అట్టి నీ కృపయే అపేక్షణీయము.

30. వ్యాజస్తుతి:—స్తుతినిందలవలెనే నిందాస్తుతులలో నొకటిని చెప్పుట—ఓకృష్ణా! నీకృపయేమో, పాపుల మైన మమ్మునుకూడ పావనులను జేయుచున్నది.

31. వ్యాజనింద:— ఒకని నిందించుటనే మఱియొకని నిందించుటగా జెప్పుట—ఓకృష్ణా! ఈ బ్రహ్మ ఈ లోకములో విమర్శింపక సృష్టించుటచేతనే యతనిని లోకులు పూజింప రైరి.

32. ఆక్షేపము:—ముందు చెప్పినదానినే పక్షాంతరముచెప్పి నిషేధించుట—ఓ కృష్ణా! నీకృప నాయందు వెలయనిమ్ము, లేదా నీపాదచ్ఛాయయే యున్నది.

33. విరోధాభాసము:—విరోధమునకు మఱియొక యర్థముచేత పరిహారము చెప్పుట—ఓ కృష్ణా! నీకృప ఒకరి యుపహారమున నుండనిదయ్యును, సకల మనోహారిణియే అయ్యెను.

34. విభావన:—కారణము లేకయే కార్యము కలుగఁ జెప్పుట—ఓకృష్ణా! నీ కృప ఒక ప్రార్థన లేకయు ప్రసవించునదియే.

35. విశేషోక్తి:—కారణము పుష్కలముగ నున్నను, కార్యము కలుగక పోవుటను చెప్పుట—ఓ కృష్ణా! నీకృపను నేనెంత ప్రార్థించినను నామీఁదపోలయ దేల?

36. అసంభవము.—కార్యము శక్యము కాదనుట—ఓకృష్ణా! ఒక గొల్లపిల్లకాయ ఒక కొండయెత్తుట యెట్లు?

37. అసంగతి:—కార్యకారణములు వేఱువేఱుస్థలములందు చెప్పుట—ఓ కృష్ణా! నీవు ఈ లోకమున తలఁచినది ఏలోకమునను జరిగెనుగా?

38. విషమము:—ఒకదానికి తగనిదానితోడి కూడిక చెప్పుట—ఓ కృష్ణా! మాహృదయమందు అతిమృదువు లయిన నీపదపల్లము లుండుటెక్కడ? మాతాప త్రయములచేత తప్తమగుట యెక్కడ?

39. సమము:—సమములయిన రెండువస్తువులకును కూడిక చెప్పుట—ఓ కృష్ణా! నీ మృదువు లయిన పదపల్లవములకు ఆ కమలాదేవి కరపల్లవములే తగినవని యొత్తించు కొనెదవేమొ?

40. చిత్రము:—కోరినదానికి విరుద్ధముగా యత్నము చేయుట—ఓ కృష్ణా! అలోకాతీతమైన మహోన్నతానందమును పొందుటకే నీయడుగుల నీడల అణఁగి యణఁగి అణఁకువను పొందుచున్నాము.

41. అధికము:—ఆధారమునకంటె ఆధేయమో అధికముగ చెప్పుట—ఓ కృష్ణా! బ్రహ్మాండకోటులే వెలితిగనున్న యీ మహాసముద్రములో నీగుణము లిముడక యె వెలుపడుచున్నవి.

42. అల్పము:—ఆధేయమునకంటె ఆధారము అల్పముగ చెప్పుట—ఓకృష్ణా! నీవిరహముచేతనే కదా, నాయుంగరముసైతము నా కిన్నాళ్లు జపమాలిక యైనది.

43. అన్యోన్యము:—ఒకటొకటికి ఉపకారమును చెప్పుట—ఓకృష్ణా! నా వలన నీవును, నీవలన నేనును ప్రకాశించితిమి.

44. విశేషము:—ఆధారము లేకున్నను ఆధేయ ముండుటను చెప్పుట—ఓ కృష్ణా! నీవు కనఁబడ కున్నను, నీ కృపాకార్యముమాత్రము సర్వత్ర కనఁబడు చున్నది.

45. వ్యాఘాతము:— ఒకదానిసాధనము విరుద్ధ మైన మఱియొకదానికిని సాధనముగ చెప్పుట.—ఓ కృష్ణా! ఏపువ్వులు నీకు సంతోషకరములో మన్మథుఁడు ఆ పువ్వులచేతనే నిన్నును భయపెట్టఁగలఁడుగదా.

46. కారణమాల:—కారణములను ఒకదానికొకటి వరుసగాజెప్పుట.—ఓ కృష్ణా! నీ కృపచేత సకలార్థములును, వానిచేత సకలధర్మములును, వానిచేతనే పరమ పురుషార్థమును కలుగును.

47. ఏకావళి:—వరుసగా ఒకదానినొకటి విశేషణములుగ చెప్పుట.—ఓ కృష్ణా! నీ నేత్రములు నీ కర్ణాంతములుగను, నీ కర్ణములు నీ భుజాగ్రములుగను, నీ భుజ ములు నీ జానుపర్యంతములుగను నున్నది.

48. మాలాదీపకము:—ఏకావళినె దీపకముగ చెప్పుట.—ఓ కృష్ణా ! నీ పదములు నా మనఃపదమందును, నా మనసు నీయందును స్థిరమై యున్నది.

49. సారము:—ఒకదానికంటె నొకటి యుత్కర్షముగ చెప్పుట—ఓ కృష్ణా! మకరందమాధుర్యమే మేలు; దానికంటె సుధామాధుర్యము మఱిమేలు, దానికంటె నీవాఙ్మాధుర్యమే మిక్కిలి మేలు.

50. యథాసంఖ్యము:—అనేకములతో ఒక్కొక్కటియు సంఖ్యాక్రమముగ చెప్పుట—ఓ కృష్ణా ! నీ కృప మా సుఖములను దుఃఖములను పెనుచును గాక అణంచునుగాక.

51. పర్యాయము:—ఒక్కటినే పెక్కుచోటుల చెప్పుట ఓ కృష్ణా ! నీకృప నీయాశ్రితులయందుండియే నాయందును ప్రసరించుచున్నది.

52. పరివృత్తి:—అల్పాధికములలో నొకటిచ్చి అధికాల్పములలో నొకటి గొనుట. ఓ కృష్ణా ! నీ యాశ్రితులు నీకొక్క ప్రణామమే చేసి సకలవైభవములను పొందుచున్నారు గదా.

53. పరిసంఖ్య:—ఒక్కటినే ఒకచోట నిషేధించి, ఒకచోట విధించుట.—ఓ కృష్ణా ! ఈ స్నేహము ఏ ప్రమిదయందైనను తగ్గునుగాని, మా ప్రపదనమందు తగ్గనే తగ్గదు.

54. వికల్పము:—సమబలములే రైనను భిన్నకాలికములకు సమకాలమునే చెప్పుట. ఓ కృష్ణా! నీ పాదములె గాని, పర్వతపాదములె గాని నాకిప్పుడే ఆశ్రయణీయము లగును గాక.

55. సముచ్చయము:—అనేకవిషయములను ఒకచోటనే అవిరోధముగ చెప్పుట. ఓ కృష్ణా ! నీ యాశ్రితులు నిన్ను ఒక్కసారిగనె సేవించువారును, ప్రణమించువారును, అనుసంధించువారును, ఆనందించువారునై యున్నవారు.

56. కారకదీపకము:—ఒక కర్తకే అనేకక్రియలు వరుసగ చెప్పుట. ఓ కృష్ణా! నీ భక్తులు నిన్ను విడిచి పోఁజాలక పోవుదురు, వత్తురు, చూతురు, అడుగుచునుందురు.

57. సమాధి:—వేర్వేఱు కారణములచేత కార్యము సుకరముగ చెప్పుట. ఓ కృష్ణా ! నీ కృపను నేను అనన్యార్హుఁడనై ప్రార్థించుచుండఁగా, నావ నీ యాశ్రితుల యభిమానమును పోఁగయ్యెను.

58. ప్రత్యనీకము:—తన్ను మించినవానిని తాను మించఁజాలక వానిని అనుసరించువానిని తిరస్కరించుటను చెప్పుట:—ఓ కృష్ణా! ఈ కలువలు తమ్ములను గెలుచునవియైన నీ కనులను తాకఁజాలక, వానిని అనుసరించియున్నవైన నీ చెవులమీఁద నెక్కొనెను.

59. కావ్యార్థాపత్తి:—అసాధ్యమే సిద్ధింపఁగా ఇఁక సాధ్య మెంతమాత్ర మని చెప్పుట. ఓకృష్ణా! నీ మోము ఆ సోమునే గెలుచుచుండఁగా వానిచే గెలువఁబడిన యీ తామరయెంత?

6). కావ్యలింగము:—సమర్థమైన కారణమువలన అనివార్యమైన కార్యమును చెప్పుట. ఓకృష్ణా! నన్ను విడచి నీవు పోఁగలుగుదువా? ఏలనెదవో, నీ పాదములు నా హృదయములో పట్టి పెట్టికొని యున్నవాఁడను సుమా?

61. అర్థాంతరన్యాసము:—సామాన్య విశేషములలో ఒకదానిలో ఒకటికి సమర్థనము చెప్పుట. ఓకృష్ణా! నీ కృప సకలాఘసముద్రమునుండి మమ్ము దాఁటించును, మహిమ గలవానికి చేయరానిది యేది.

62. వికస్వరము:—సామాన్యవిశేషములలో ఒకదానిలో ఒకటికి మఱియొక సామాన్యవిశేషములతో సమర్థనము చెప్పుట. ఓ కృష్ణా! నీ కృప సకలాఘసముద్రము నుండి యొక మహానావికవలె మమ్ము దాఁటించును.

63. ప్రౌఢోక్తి:—అకారణమును అతిశయకారణముగ చెప్పుట. ఓ కృష్ణా! నీకృప ఆ పాలకడలితీరమునందలి కల్పలతికవలెనే అతిధవళమై పరమపవిత్రమై యున్నది.

64. సంభావనము:—కార్యము సిద్ధించుటకై కారణమును ఊహించుట. ఓ కృష్ణా! నీ గుణములు గణింపఁగోరువాఁడు శేషుఁడే కావలయును.

65. మిథ్యాధ్యవసితి:—ఒకటిని అసత్యమనుటకై మఱియొక అప్రకృతమైన యసత్యమును చెప్పుట. ఓ కృష్ణా! ఆకాశపుష్పములను ఔఁదలఁ దాల్చువాఁడే నీకు సర్వవిధముల విముఖు లయినవారిని సుముఖులనుగఁ జేయఁగలఁడు.

66. లలితము:—ప్రకృతమునకు ప్రతిబింబముగ అప్రకృతమును చెప్పుట. ఓ కృష్ణా! ఇతఁడు నీళ్ళుపోయిన పిమ్మట కట్టను కట్టఁ గోరుచున్నాఁడు.

67. ప్రహర్షణము:—ప్రయత్నపడకయే కార్యము కలుగఁజెప్పుట. ఓ కృష్ణా! నిన్నే ప్రార్థించుచుండు నీ యాశ్రితులకు నీవు నీపనిగనె వచ్చి యగపడితివి.

68. విషాదనము:—కోరినదానికి ప్రయత్నపడియు విరుద్ధకార్యము కలుగఁ జెప్పుట. ఓ కృష్ణా! నేను నీ పాదములు అందుకొను నంతలోనె ఆ గరుత్మంతుఁడు నిన్నెత్తుకొనియెు పరువిడియెను.

69. ఉల్లాసము:—ఒకని గుణదోషములు మఱియొకనికి గలుగ జెప్పుట. ఓ కృష్ణా! నీ కృప ప్రసహించి నన్ను పవిత్ర పఱిచెదును.

70. అనజ్ఞ.—ఒకనిగుణదోషములు మఱియొకనికి గలుగకుండ చెప్పుట. ఓ కృష్ణా! నీకృప సకలాభీష్టఫలప్రదాయిని యైనను, వారివారి ప్రాప్తమాత్రఫలప్రదాత్రియే యగునందురు.

71. అనుజ్ఞ.—దోషమునైన గుణముగ చెప్పుట. ఓ కృష్ణా! నీకృప నిఖిలాపన్నివారణమందె విజృంభించునది కాఁబట్టి, అట్టి యాపదలును మాకపేక్షణీయములె.

72. లేశము.—గుణదోషములను దోషగుణములనుఁ చెప్పుట. ఓ కృష్ణా! నీ వీ నిర్హేతుక కృపకలవాఁడ వగుటవలన నేకదా? ఈమహాపాపులమైన మా హృదయబంధమందునుం దగుల్కొనుట.

73. ముద్ర.—సూచ్యార్థములనె ప్రకృతపరముగ సూచించుట. ఓ కృష్ణా! కృపాళువునకే గదా? పక్షులు సహితము పక్షపాతమునకు పాలుపడును.

74. రత్నావళి.—అప్రకృతార్థములను క్రమముఁ బట్టి చెప్పుట. ఓ కృష్ణా! నీవు లక్ష్మీసంపన్నుఁడవే కావు, చతురాస్యుఁడవు, సర్వజ్ఞుఁడవు నగుదువు.

75. తద్గుణము.—స్వగుణమును విడిచి అన్యగుణమును పొందుట. ఓ కృష్ణా! నీ దేహమునందలి నీలకాంతులు నీ పీతాంబరకాంతులు కలిసి పచ్చలకాంతు లయ్యెను.

76. పూర్వరూపము.—స్వగుణమును విడిచియు మఱల పొందుట. ఓ కృష్ణా! నీ వక్షఃస్థలమందలి శ్రీవత్సలాంఛనము నీమేనికాంతులచే నీలపునీడలు పాఱుచును మఱలమఱల నీ పీతాంబరపుఁగాంతులు తగిలి పూర్వమునలెనే ప్రకాశించుచున్నది.

77. అనుగుణము.—మునుపటిగుణమునకే మఱియొక వస్తుగుణముచేత అధికగుణమును చెప్పుట. ఓ కృష్ణా! నీ కౌస్తుభము నీ నీలదేహచ్ఛాయలచేత మఱింత నీలచ్ఛాయలు తేఱుచున్నది.

78. మీలితము.—సమానగుణముచేత భేదము తెలియమిని చెప్పుట. ఓ కృష్ణా! స్వతః యెఱ్ఱనైన నీ బింబోష్ఠమందు తమ్ములపువర్ణము కనఁబడదు.

79. అతద్గుణము.—స్వగుణమందు అన్యగుణము నంగీకరింపమిని చెప్పుట. ఓ కృష్ణా! నీకీర్తిచేత యేదితెల్లనైనను, నీకు విముఖులైనవారి యపకీర్తిమాత్రము తెల్లన కాఁబోదు.

80. సామాన్యము.—ఉపమేయమునకు ఉపమానముతో భేదములేమినిచెప్పుట. ఓ కృష్ణా! జలక్రీడయపుడు నీమోము ఆ తామరతటాకములో కనఁబడదయ్యెనఁట.

81. ఉన్మీలితము.—ఉపమానోపమేయములకు వేఱుకారణముచేత భేదమును చెప్పుట. ఓ కృష్ణా! నీకీర్తిచేత కప్పఁబడిన హిమాలయమును చలిచేతఁగాక తెలిసికొన నయితి గాదయ్యెనఁట.

82. విశేషకము.—ఉపమానోపమేయములకు దైవికమైన కారణముచేత భేదమును చెప్పుట. ఓ కృష్ణా! ఇపుడు చంద్రోదయ మగుటచేతగదా? నీమోమునకును ఈ తామరకును భేదము తెలిసెను.

83. గూఢోత్తరము.—అడిగినప్రశ్నకు గూఢముగ ఉత్తరముచెప్పుట. ఓ కృష్ణా! నీవు చేతనసంరక్షణకొఱకై యిందు అవతరింపఁదలంచఁగనే, దేవఋషులెల్లరును ఇందు గొల్లలేగాని పెఱవారు లే రని చెప్పుదు రఁట.

84. సూక్ష్మము.—ఇతరులు తెలిపిన యభిప్రాయమును తానుగా తెలిసికొన్నది చేష్టతో దెలుపుట. ఓకృష్ణా! నేను నా రక్షణనిమిత్తమై నిన్ను చూడవచ్చినపుడే, నీవు కుడిచే యెత్తినది పలుకుము.

85. పిహితము.—ఇతరులు తెలుపని యభిప్రాయమును తానుగా తెలిసికొన్నది చేష్టతో తెలుపుట. ఓ కృష్ణా! నీవు వచ్చినదే, అపుడు నేను పలుకకున్నది మఱచితివా యేమి?

86. వ్యాజోక్తి.—తనరహస్యమును మఱియొక కారణము చెప్పి మఱుగు పఱచుట. ఓ కృష్ణా! నీవు ఆ యమునానది యలల తుంపఱలు నామేనఁబడినవి యని యొకతెనుమార్చి యొకతెకు చెప్పుదు వఁట.

87. గూఢోక్తి.—ఒకనిరహస్యమును మఱొకనితో చెప్పనియట్లే చెప్పుట. ఓ కృష్ణా! నీ వపుడు అన్యాపేక్ష యెవ్వరికిని కూడదంటివి కదా?

88. వివృతోక్తి.—శ్లేషచేత గూఢమైనయర్థమును విశదపఱచుట. ఓ కృష్ణా! ఎవరుగాని నిన్ను పరుఁడనియే చెప్పుచున్నారు.

89. యుక్తి.—తనరహస్యము తెలియకుండుటకై యితరులను వచించుటను చెప్పుట. ఓ కృష్ణా! నీ ప్రియురాలిని యెవతెనో తలంచుకొని వ్రాయుచును, మఱొకతెను చూచి చేత తంబురను వ్రాసితివఁట.

90. లోకోక్తి.—తనయభిప్రాయమును లోకునవాడుకమాటలచేతనే చెప్పుట. ఓ కృష్ణా! కొంతకాలమే మనసుపట్టుకొని యుండుమంటివే? అది మఱచినావో?

91. ఛేకోక్తి.—లోకోక్తినే వేఱు అర్థమున యిముడునట్లు చెప్పుట. ఓ కృష్ణా! పాముకాళ్లు పామునకే తెలియును, (నీమర్మము తెలియుట కష్ట మనుట.)

92. వక్రోక్తి.—శ్లేషాదులచేత వేఱుఅర్థము కలుగ చెప్పుట. ఓ కృష్ణా! జాతిభేద మేల చూచెదవు? నీ కృపచే యేజాతియైనను తలకెక్కకపోదు.

93. స్వభావోక్తి:—ఆయాజాతికృత్యములను వదలక చెప్పుట.—ఓ కృష్ణా! నీవేణునాదమునకు ఆవులుఁగూడ దూడలతోడ చెవులు నిక్కించుకొని మూతులెత్తుకొని యొడళ్లు మఱచి చొక్కుచున్నవి.

94. భావికము:—భూతభవిష్యత్తుల వృత్తాంతమును వర్తమానకాలికముగ చెప్పుట.—ఓ కృష్ణా! నీదు పూర్వావతారవృత్తాంతము లన్నియును ఇప్పు డిప్పుడె కనుచున్నాను.

95. ఉదాత్తము:—శ్లాఘ్యమైన భూతభవిష్యద్వృత్తాంతమును గల వస్తువును చెప్పుట.—ఓ కృష్ణా! ఈ చోటు నీవు ఆగజేంద్రుని సంరక్షించిన చోటట.

96. అత్యుక్తి:—శౌర్యాది గుణములు అబద్ధమైనను ఆశ్చర్యముగ చెప్పుట.—ఓ కృష్ణా! నీ కృపచేత అల్పులును ఆచార్యు లయిరి కదా?

97. నిరుక్తి:—అవయవార్థమునకు అర్థాంతరమును చెప్పుట.—ఓ కృష్ణా! నీ చరణములను కోరనివారికి చూపవు, కావున నీవు చక్రివే యవుదువు?

98. ప్రతిషేధము:— పూర్వము చేసిన ప్రసిద్ధకార్యమునకు వ్యతిరిక్తమును చెప్పుట.—ఓ కృష్ణా! నీవు నన్ను నుద్ధరించుట నీ గోవర్ధనోద్ధరణము కాదు, మహా దుర్ఘము సుమా?

99. విధి:— ప్రసిద్ధమైనదానికి అక్కఱ లేని విధి కల్పించుట.—ఓకృష్ణా! దయనీయుం డయిన నన్ను రక్షించు రక్షకుఁడే రక్షకుఁడు.

100. హేతువు:—కార్య కారణములకు ఐక్యమును చెప్పుట.—ఓ కృష్ణా! నీ కృపాకటాక్షముచేతనే మా కెప్పుడును లక్ష్మీవిలాసము కలుగు చుండును.

## ప్రబంధలక్షణము.

ప్రబంధములు రెండువిధములు:—అవి మహాకావ్య మనియు, చాటుకావ్య మనియు; లేక మహాప్రబంధ మనియు, క్షుద్రప్రబంధ మనియుఁ పేరు గాంచును.

మహాప్రబంధమును 27 వర్ణనలతో చెప్పవలసినది.

I. పురములోని వర్ణనలు; పరిఘా, సాల, గృహ, సౌధోపవన, కృతకాచల, పౌర, చతుర్వర్ణ, చతురంగ, స్త్రీ, వేశ్యా, పుష్పలావికా, మందానిల, నదీ, సరోవరాదులు. (1)

II. ఋతుషట్కము; వసంతర్తు, సంధి, ఆగమ, లతావన, పల్లవ, పత్త్రి, కుసుమ, వసంతోత్సవ, మదనోత్సవాయణ, వాయు, విటవిటీవిహార, గ్రీష్మాదికాల విశదవర్ణనలు. (1)

III ప్రయాణము; వనవిహారము, వారికేళి, కన్యాంగసౌందర్యకథనము. (4)
IV. చంద్రోదయము; సంధ్యా, సూర్యాస్తమయ, తారా, ధ్వాంత, చంద్రోదయ, చంద్రికాదులు. (1)

V. విప్రలంభము; ద్యూతము, అద్భుతరణము, మద్యపానజవికారము, సూర్యోదయము, వివాహము, గృహప్రవేశము, కుమారోదయము, సాగరము, శైలము, మృగయా, వనము, అరణ్యము, మంత్రము, విజయము, మున్యాశ్రమము, దండయాత్ర, జారసంవాదము, నాయకగుణవర్ణనము, వంశావతారము. (20) మొత్తము 27.

అనఁగా I 1+, II 1+, III 4+, IV 1+, V 20+, = 27.

## క్షుద్ర ప్రబంధము.

ఇది సంఖ్యాబద్ధము లనియు, సంఖ్యారహితము లనియు 2 విధములు.

సంఖ్యాబద్ధచాటువులు 14:— 1 పద్యము ముక్తకము, 3 పద్యములు లోక్యము, 4 పద్యములు వారధిమాల, 5 పద్యములు పంచరత్నములు, 8 పద్యములు వారణమాల, 9 పద్యములు నవరత్నములు, 10 పద్యములు అవతారమాల, 12 పద్యములు భాస్కరమాల, 16 పద్యములు శశికళ, 27 పద్యములు నక్షత్రమాల, లేక తారావళి, 32 పద్యములు రాగమాల, 64 పద్యములు విద్యామాల, 96 పద్యములు తత్త్వమాల, 100 పద్యములు శతకము.

సంఖ్యారహిత చాటువులు:— రగడ, ద్విపద, దండకములు. ఇవి ఎన్నియు నన్ని చెప్పనగును. కలికోత్కలిక లని యొకరగడ 4 చరణములును, ఒక వృత్తము నాల్గు చరణములును కలిపి యేకసమాసముగాఁ జెప్పుటయును, సింహావలోకన మని సభయందు పఠించు పద్యమును, బిరుదగద్య మని పఠించునన్నియును ఆశువు లగును. మఱియు తెలుఁగుకవిత్వమునందు, ఇతరదేశభాషలనుగూర్చి చెప్పవచ్చు నని పురాతన కవుల సమ్మతి గలదు.

## ఛందశ్శాస్త్రము.

గురులఘునిర్ణయము:—పూర్ణబిందువు విసర్గము పొల్లుహల్లు సంయుక్తాక్షరము వీనికి ముందున్న హ్రస్వాక్షరములును, దీర్ఘాక్షరములును గురువు లనంబడు. తక్కిన యక్షరములు లఘువు లనంబడును.

గురువులకు నుదాహరణము:—పూర్ణబిందువునకు ముందున్న యక్షరములు అంబ-దండు-నింగి-గంగ; విసర్గమునకు ముందున్న యక్షరములు దుఃఖము, సద్యఃఫలము; పొల్లుహల్లునకు ముందున్న యక్షరములు దిక్-దృక్-మరుత్-కన్; సంయుక్తమునకు ముందున్న యక్షరములు విద్వద్వర్య్యుఁడు-హల్యార్ణ్రవము; దీర్ఘాక్షరములు కా-కీ-కూ-కృా-కే-కై-కో-కౌ.

లఘువుల కుదాహరణము:—ప్ర-కృ-త-ము-క-లి-యు-గ-ము.

## గణములు.

| | | | |
|---|---|---|---|
| రెండుగురువులు | గగము | రామా | UU |
| వగణము | లగము | హరా | IU |
| హగణము | గలము | దేవ | UI |
| రెండులఘువులు | లలము | జయ | II |
| మూఁడుగురువులు | మగణము | శ్రీరామా | UUU |
| మూఁడులఘువులు | నగణము | సరద | III |
| ఆదిగురువు | భగణము | ధీరుఁడు | UII |
| మధ్యగురువు | జగణము | మురారి | IUI |
| అంత్యగురువు | సగణము | అనఘా | IIU |
| ఆదిలఘువు | యగణము | ఉపేంద్రా | IUU |
| మధ్యలఘువు | రగణము | వల్లభా | UIU |
| అంత్యలఘువు | తగణము | గోవింద | UUI |
| నగణముమీఁదలఘువు | నలము | నరసఖ | IIII |
| సగణముమీఁదలఘువు | సలము | నరకారి | IIUI |
| నగణముమీఁదగురువు | నగము | నరమృగా | IIIU |

సూర్యగణములు:—హగణము లేక గలము, నగణము.

ఇంద్రగణములు:—భ-ర-త-సల-నల-నగ.

## చంద్రగణములు.

| | | | |
|---|---|---|---|
| భగణముమీఁద | లఘువు | భలము | భారతము |
| భగణముమీఁద | గురువు | భగురువు | భద్రవరా |
| తగణముమీఁద | లఘువు | తలము | గోదాపతి |
| తగణముమీఁద | గురువు | తగము | నాగేశ్వరున్ |
| మగణముమీఁద | లఘువు | మగణలఘువు | శ్రీరాముండు |
| రగణముమీఁద | లఘువు | రలము | రావణుండు |
| రగణముమీఁద | గురువు | రగము | రంగనాథా |
| నగణముమీఁద | వగణము | నవము | వగదుఁడురా |

| | | | |
|---|---|---|---|
| నగణముమీఁద | హగణము | నహము | గరుడవాహ |
| నగణముమీఁద | లలము | నలలము | కరిసరద |
| నగణముమీఁద | గగము | నగగము | కరిగిరీంద్రా |
| సగణముమీఁద | లలము | సలలము | కరిరాజును |
| సగణముమీఁద | నగణము | సనము | మునిపోషకా |
| సగణముమీఁద | హగణము | సహము | ధరణీనాథ |

చంద్రగణములు:—యక్షగానాదుల నుపయుక్త మగును.

## యతిప్రాసవిషయము.

యతి:—పద్యము మొదటివర్ణము. ప్రాసము:—దాని రెండవవర్ణము.

## యతులు.

1. అ ఆ ఐ ఔలును, ఇ ఈ ఋ ౠ ఎ ఏలును, ఉ ఊ ఒ ఓలుఁనుతమలోఁ దాము మిత్రములు. హయలు స్వరసామ్యమును బొంది పై యచ్చుల కన్నిటికి మిత్రము లగుట గాక యన్యోన్యమును మిత్రము లగును.

2. రేఫము స్వరసామ్యము గలిగి ఋ ౠలతోడను వానితోడి రెల్లహల్లుల తోడను మిత్రము నగును.

3. ఋ ౠలతోఁ గూడిన రెల్లహల్లులు దమలోఁ దాము మిత్రము లగుట కాక ఋకార ౠకారములతోడను వాని మిత్రములతోడను మైత్రిగలిగి యుండును.

4. సంస్కృతసంధిలో ఆదేశముగా వచ్చెడి ఐకారమునకు ఏకారాదులును మిత్రము లగును. అట్టి ఔకారమునకు ఓకారాదులును మిత్రము లగును.

5. క ఖ గ ఘ లును, చ ఛ జ ఝ శ ష సలును, ట ఠ డ ఢ లును, త థ ద ధ లును, ప ఫ బ భ మ లును పరస్పరము మిత్రము లగును.

6 పూర్ణబిందుపూర్వకము లైన ట ఠ డ ఢ ణ త థ ద ధ లును, న ణ లును మిత్రములు. క ఖ గ ఘ లు, చ ఛ జ ఝ లు, ప ఫ బ భ లు, య ర ల వ శ ష స హలు; పూర్ణబిందుపూర్వకములై క్రమముగా ఙ ఞ మ ములతో మిత్రము లగును.

7. జ్ఞ న ణ లును, ల ళ డలును, హ య లును పరస్పరము మిత్రములు.

8. ఉకారోకారయుక్తము లయిన ప ఫ బ భ మ లు మిత్రములు.

9. సంయుక్తవర్ణమున నేదేని యొకటి దానికి మిత్ర మగును. అనేక యతులు గల పాదమునందు సంయుక్తవర్ణము యతిస్థానమం దుండినయెడల దానియం దొకవర్ణమునే యన్ని యతిస్థానములయందు నుంచవలయు.

10. సంస్కృతమందు అనునాసికములుతప్ప కవర్గాదుల యక్షరములకంటెఁ బరమైన హకారమునకు సాయావర్గమున నాలవయక్షర మాదేశముగా వచ్చును. అట్టి హకారమునకు ఆయావర్గమును హకారమును మిత్రము లగును.

11. సంస్కృతమందు వర్గాక్షరములకు అనునాసికములు పర మగునపుడు పూర్వ వర్గంబుల యనునాసికము వికల్పముగ వచ్చును; అట్టి యనునాసికములకు నాయా యనునాసికము లైనను నా యావర్గాక్షరము లైనను మిత్రము లగును.

12. యుష్మదస్మచ్ఛబ్దంబులయు ఉపసర్గములయు కవర్గములు పై యచ్చుతో సంధించి యచ్చునకును హల్లునకును మిత్రము లగును.

31. శకంధ్వాది శబ్దములయందును కర్ణాటాది శబ్దములయందును సంధిగతవర్ణ మచ్చునకు హల్లునకును మిత్ర మగును.

14. అయ్యా మొదలగు శబ్దములయందును ఆలు ఏని ఏసి శబ్దములయందును మొదట నుండు స్వరము పూర్వపదముతోఁ గూడి యచ్చునకును హల్లునకును మిత్ర మగును.

15. ఆలుశబ్దమున మొదట నుండుస్వరము సంధివేళ రేఫాగమములోఁ గూడి యచ్చునకును హల్లునకును మిత్ర మగును.

16. కాకుస్వరమును ప్లుతమును నుండు వర్ణముతోఁ జేరి యచ్చునకును హల్లునకును మిత్రము లగును (స్వాతిరేకాదులను తెలియఁజేయు స్వరము కాకు వనంబడును. ఉదా. సామాన్యుఁడె యితఁడు.)

17. గీతసీసాదులయందుఁ బ్రాసమును యతిగా నుంచఁబడును, ఇది ప్రాసయతి యనంబడును.

## ప్రాసములు.

1. ప్రాసవర్ణము పూర్ణబిందుపూర్వకమై యుండెనేని యెల్ల పాదములయందు నట్లే యుండవలయు. అర్ధబిందుపూర్వక మయ్యెనేని యేదే నొక్కపాదమున బిందుపూర్వకము కాకయు నుండవచ్చును.

2. మొదటిపాదమునఁ బ్రాసముగా నుంచఁబడు సంయుక్తవర్ణమే యెల్లపాదములయందు నుంచవలయు.

3. ప్రాసాక్షరము రేఫసంయోగము గలిగి యుండెనే నొకచరణమునం దట్లు కాకయు నుండవచ్చును.

4. సంస్కృతమునందుఁ గొన్నియెడల నకారమునకు ణకారమును సకారమునకు షకారము నాదేశముగఁ గలుగుచున్నవి. ఆ ణకార షకారములు క్రమముగా నకార సకారములతోడను బ్రాస మగును.

5. ద్విత్వయుక్త మువర్ణమును బిందుపూర్వక బువర్ణమును బ్రాసములై చెల్లును.

6. దథ కారములును, బుకార రేఫములును, లళడ లును, లర లును, బ్రాసములయందు మిత్రము లగును. తక్కిన వృత్తలక్షణములను ఆనందరంగఛందమునఁ గనందగును.

## ఉపమేయోపమానములు.

| ఉపమేయములు. | ఉపమానములు. |
|---|---|
| ముంగురులు, కొప్పు, జడ. | తుమ్మెదలు, చీఁకటి, పాఁచితీఁగె, నీలమేఘము, ఇంద్రనీలమణులు, చమరీమృగము, సర్పము, గండు తుమ్మెదలు, మన్మథునివల. |
| ముఖము. | చంద్రుఁడు, తామరసము, మెఱుపు, అద్దము. |
| నుదురు. | అర్ధచంద్రుఁడు. |
| కనుబొమలు. | విండ్లు, బాలచంద్రుఁడు. |
| కన్నులు. | కలువలు, చేఁపలు, తామరలు, జింకలు, మన్మథబాణములు, చకోరములు. |
| నాసికము. | తిలపుష్పము, సంపెగపుష్పము. |
| అధరము. | దొండపండు, చిగురు, లత్తుక, కావి, మంకెనపుష్పము, మావిచిగురు, కెంపు, పగడము. |
| గడ్డము. | మల్లిపండు. |
| చెవులు. | శ్రీకారములు, తొమ్మదులు, చక్కిలములు. |
| చెక్కిళ్లు. | అద్దములు, అర్ధచంద్రుఁడు. |
| చెక్కులకాంతి. | బంగారము. |
| పలుకులు. | కోకిలలు, చిలుకలు, పావురములు, వీణె. |
| అధరరసము. | తేనియ, అమృతము. |
| దంతములు. | మొల్లమొగ్గలు, వజ్రములు, ముత్యములు, దాడిమబీజములు, కేసరములు. |
| గళము. | శంఖము, సరము. |
| వక్షఃస్థలము. | కవాటము. |
| కుచములు. | జక్కవలు, పూలచెండ్లు, జంబూఫలములు, గజనిమ్మపండ్లు, పూలగుత్తులు, మారేడుపండ్లు, పొన్నకాయలు, బొంగరములు, గజకుంభములు, పర్వతములు, బంగరుకలశములు, గిన్నెలు, తమ్మిమొగ్గలు, శ్రీశైలము. |
| కుచాగ్రములు. | మొగ్గలు, శిఖరములు. |

| | |
|---|---|
| వళులు. | తరంగములు, నిచ్చెన, బ్రహ్మాంగుళిరేఖలు. |
| నాభి. | పొన్నపువ్వు, సుడి, చెంగల్వబావి, కొలను, సస్యపు మడి, చక్రము. |
| నూగారు. | చీమలబారు, సలాకు, నల్లతెల్లు, నల్లత్రాచు, వంక కత్తి, తుమ్మెదలచాలు, బ్రహ్మచే లిఖింపబడినరేఖ. |
| భుజములు. | తామరతూండ్లు, దిరిసినము, సాలవృక్షము. |
| కరములు. | ఏనుఁగుతొండములు. |
| కరతలములు. | పద్మములు, చిగుళ్ళు, మంకెనపువ్వులు, చెంగల్వలు, పుష్పములు. |
| నఖములు. | నక్షత్రములు, ముత్యములు, మొగలిరేకులు. |
| నడుము. | ఆకాశము, కంచి, సింహము, పిడికిలి, శకారము. |
| నితంబములు. | భూపాళము, భూమి, ఇసుకతిన్నెలు, గిన్నెలు, చక్రములు, తిన్నెలు. |
| తొడలు. | అంటులు, ఏనుఁగుతొండములు. |
| పిక్కలు. | కాహళములు, వరిపొట్టలు, మకరములు, పగడములు, చిగుళ్లు, ద్రోనలు. |
| మీఁగాళ్ళు. | తాఁబేళ్ళు. |
| పాదతలము. | మిట్టదామరలు, చెంగల్వలు, కెంపులు, క్రొత్తచిగుళ్లు, పవడములు, లత్తుకలు, చెందామరలు. |
| దేహకాంతి. | మెఱుముతీఁగె, కుందనము, బంగారు, సిందూరము, జాంబూనదకర్దమము, క్రొత్తపసుపుకొమ్మ. |
| దేహగంధము. | కర్పూరము, ఉత్పలము, పద్మము, పాటలపుష్పము, చందనము, మొగిలిపువ్వు. |
| దేహము. | తీఁగె, మెఱుముతీఁగె, కుందనము. |
| స్త్రీ. | వెన్నెల, నక్షత్రము, బంగరుతీఁగె, మెఱుపుతీఁగె, రత్నపుసలాకు, బంగరుబొమ్మ, రతీదేవి, చిత్రరేఖ, లక్ష్మి. |
| నగవు, లేనగవు. | చంద్రుఁడు, పాలు, చంద్రకాంతమణులు, ముఱుఁగు, మల్లెపువ్వులు, వజ్రములు. |
| నడక. | హంస, ఏనుఁగు. |

శ్రీ ర స్తు.

# సకలార్థసాగరము

## అదృష్టతరంగము.

---

### స్వప్నశాస్త్రము.

ప్రపంచమందు అందఱికిని స్వప్నములు గలుగుచున్నవి. వీనిలో రోగులును, మనోవ్యాకులము గలవారును, అజీర్ణవ్యాధి గలవారును, ఉష్ణపిత్తాధిక దేహులును గాంచెడు స్వప్నములకు శుభాశుభంబు లేవియు లేవు. సామాన్యవ్యాధిరహితులు గాంచెడి కలలకు ఫలము కలదు. అందు పగటిస్వప్నమును, దీర్ఘస్వప్నమును నిష్ఫలము. మొదటి జాములో కన్న కల నొకసంవత్సరములోను, రెండవజామునఁ గాంచుకల యెనిమిది నెలలలోను, మూఁడవజామున కన్న కల నాలుగు నెలలలోను, నాలుగవజామున కన్న కల నొక్కనెలలోను ఫలితం బగును. మఱియు పూర్వరాత్రంబున కన్న కల బహుకాలముమీఁద ఫలించుననియును, అపరరాత్రిస్వప్నము తుచ్ఛమనియును, ఉషఃకాల స్వప్నము దుష్టఫలము గాని తుచ్ఛఫలము గాని అరగడియలో కలుగఁజేయుననియును తెలియునది. శుభస్వప్నము నిదురచేగాని, లేక ప్రతికూలవాక్యములచేఁగాని కొట్టుపడినయెడల అల్పఫలమును కలుగఁజేయును. అశుభస్వప్నములు గాంచినయెడల జప, హోమ, దానాదులచే శాంతి జేసికొనవలయును.

మృత్యుస్వప్నములు:—ఉగ్రపురుషులు తన్ను బెదరించినట్లును, కత్తిచే బూనిన వారు ఱాళ్ళతోఁ గొట్టినట్లును స్వప్నమైననాఁడే మృతి గలుగును. గాడిద, పంది, పిల్లి, నక్క, పులి, ప్రేతములు, కోఁతి వీనిని వాహనముగాఁ జేసికొన్నట్లును; కోఁతి, ఎలుఁగుగొడ్డు, వీనిపై నెక్కి దక్షిణపుదిక్కుగాఁ బాడుచు బోవునట్లును; నల్లబట్టలేక ఎఱ్ఱగుడ్డగట్టుకొని పాడుచు నవ్వుచు తన్ను దక్షిణదిక్కున కీడ్చుకొనిపోవునట్లును; దిగంబరుఁడు, సన్న్యాసి, మహాబలుఁడు వీరు ధ్వని చేయునట్లును; పూర్తిగాఁ బట్ట లేక అడుసులో మునిఁగినవానివలెను; పిండివంటలు, చక్కిలములు స్వప్నములో తిని మేల్కాంచి వమనము చేసినట్లును స్వప్నమైనచో త్వరలో మృత్యువు సిద్ధించును.

తనసామర్థ్యమును తెలియఁజేయుచు కోఁతి నెక్కుకొని దక్షిణముదిక్కున కేగి నట్లును; లేక దిగంబరుని, క్షపణశ్రేష్ఠుని, బలిష్ఠుని చూచినట్లును స్వప్నము గలిగిన

ఒకటి లేక రెండుదినములలో మృతిగలుగును. నల్లనిస్త్రీ వీడినతలతో వచ్చి గ్రుద్దినట్లు స్వప్నమైన రెండుదినములలోను; పక్షులు ముఖమందు పొడిచినట్టు స్వప్నమైన అయిదుదినములలోను; దీపప్రకాశము సగముగా ఖండింపఁబడినట్లు స్వప్నమైన ఎనిమిది దినములలోను; బొగ్గును, భస్మమును, వెండ్రుకలను, నీళ్లులేని యేరును, సర్పములను వీనిని కలలోఁ జూచినయెడల పదిదినములలోను మరణము కలుగును. నూనెతలతో సిగనిండ యెఱ్ఱనిపూలు పెట్టుకొని దక్షిణదిక్కునకు పోవునట్లు స్వప్నమైన పదియేను దినములలోను; నల్లనిస్త్రీని అనేకదారములతో బంధించునట్లు స్వప్నమైన నొక నెలలోను; గూబలు, నక్కలు, ఇవి ముఖమందు వచ్చి అఱచినట్లు స్వప్నమైన రెండునెలలలోను; నిర్నిమిత్తమున భూమి రెండుగ విచ్చినట్లును, తనశరీరము రెండుగా ఖండింపఁబడినట్లును; కాళ్లు ఖండాకృతిగా నంజినట్లును స్వప్నమయిన అయిదునెలలోను; గాడిదెను కోఁతిని చూచినట్టును, లేక గాడిద నెక్కినట్టును, నూనె యంటుకొన్నట్టును, అంగము ఛేదనమైనట్టును, నియమములో స్వాక్రమమున నుండినట్టును, పూర్వము చచ్చినవారిని చూచినట్టును, ఎండుకట్టెలను, యముని, యమభటులను చూచినట్టును, ఇనుపగుదియను చేతఁబట్టుకొని వివర్ణపురుషుఁడు తన కెదురుగా వచ్చినట్టును, వేగముగల బండి నెక్కినట్టును, తనతల ఆడుదానిరీతిగా నుండినట్టును స్వప్నంబు గాంచిన ఆఱు నెలలలోను మృతి కల్గును. తన దేహము గంధపుష్ప వస్త్ర మాంసాదులతో నలంకరించినట్లు స్వప్నము గాంచినయెడల యెనిమిదవనెలలో మరణంబు సంభవించును. వృక్ష మెక్కినట్లును, అన్నము భుజించినట్లును, భూత ప్రేత పిశాచములను, శరభ సింహ వరాహ శ్వాన జక గృధ్ర ఖర జంబుకాదులచే జీవము పోఁగొట్టుకొన్నట్టును స్వప్నమయిన నొక సంవత్సరములోను మృత్యువు సిద్ధించును. వ్యాధిగ్రస్తుఁడు తనతల పెద్దదిగా నైనను, లేక పొడుగుగా నైనను చూచిన వ్యాధి బల మగును. దోమలను ఈఁగలను జూచిన వ్యాధి నివృత్తి యగును. చీమలబారును చూచిన మరణపర్యంతము వ్యాధి స్వస్థము కానేరదు. నిమ్మపండు తిన్నట్టు స్వప్నమైన నొకానొకసమయమున మరణము సంభవించును. లేక కలహము సంభవించును. గాడిదెను కట్టిన బండి నెక్కినట్టుగాని, ఎనుబోతు ఎనుము వీనిపై నెక్కినట్టుగాని స్వప్నమైన మరణము సమీపించిన దని యెఱుఁగవలయును.

**వ్యాధిజనకస్వప్నములు:**—అవుపాలు తాను పిండినట్టును, లేక చూచినట్టును స్వప్నమైన కుష్ఠరోగము సంభవించును. ఈ స్వప్నము గర్భిణీస్త్రీ గాంచిన వ్యాధిగల్గి నివృత్తించును. సర్పములు వృశ్చికములు జలగలు ఇవి చుట్టుపడి యున్నట్లును, తాను బలవంతుఁడైనట్టును, తాను తిరుగా వివాహము చేసికొన్నట్టును, వాంతిభేది

అయినట్లును, మరికినీళ్లు త్రాగినట్లును, ఆకుకూరలు తిన్నట్లును, అకాలమందు వృక్షములు ఫలించినట్లును, గూబలు గబ్బిలములు వీనిని చూచినట్లును, బోడితలవాని చూచినట్లును, నక్షత్రములు యింటిపై రాలినట్లును, తనపై సూర్యకిరణములు పడినట్లును, ఆకాశము కృష్ణవర్ణముగాఁ గాని లేక మబ్బుతో గూడినదిగాఁ గాని చూచినట్లును; తాళ్లవాన, లేక గాలివాన వచ్చినదానిని చూచినట్లును, తనదేహము కాలినట్లును, స్నానము చేసినట్లును, దీపము, దీవిటి యివి మందముగా వెలిగినట్లును స్వప్నముగాంచిన వ్యాధులు సంభవించును. చిన్నబిడ్డలను పురుషులు చూచిన మేలుగలుగును. స్త్రీలు గాంచిన వ్యాధి గలుగును. చేతులు కాలినట్లుగాఁ గాని, విరిగినట్లుగాఁ గాని, వ్యాధి పీడిత మైనట్లుగాఁ గాని స్త్రీలు స్వప్నమయిన భర్తయో లేక బిడ్డయో మృత్యువుపాలగుదురు. ఈకల పురుషులు గాంచిన దరిద్రము సంభవించును. మెత్త కాలినట్లు స్వప్నమైన మేలు కలుగును బావినీళ్లు నిండి పైకి వచ్చినట్లు పురుషునకు స్వప్నమైన స్త్రీకి మరణము. స్త్రీ గాంచిన పురుషునకు మరణము. సూర్యునిచుట్టు రక్తవర్ణము గప్పబడినట్లు స్వప్నమైన నేత్రము మంద మగును. సూర్యచంద్రగ్రహణములం జూచినట్లు స్వప్నమైన తత్క్షణంబున నేత్రరోగపీడితుం డగును. సత్రమున నుండినట్లు స్వప్నమైన తీరనిరోగము ప్రాప్తించును. ప్రేతలతో సారాయి త్రాగినట్లును, కుక్కలచే నీడువఁబడినట్లును స్వప్నమైన జ్వరరోగముచే పీడింపఁబడి త్వరలో మృతినొందును. శిరమున తీఁగెలు మొలిచినట్లును, పక్షులు గ్రుడ్లు పెట్టినట్లును, గ్రద్దలు మొదలగు పక్షులు తన్ను చుట్టుకొనియున్నట్లును, పీనుఁగలు పిశాచములు వీనితోఁ జేరియున్నట్లును, అడవులలోను ఇరుకుస్థలమందును వున్నట్లును, శ్మశానము పల్లము ప్రవాహము ధూళి ఉదకము అడుసు వీనిలో బడినట్లును, నృత్యవాద్యములు నేయుచున్నట్లును, లేక పాడుచున్నట్లును, రక్తగంధలేపనము, రక్తమాల్యధారణము, రక్తవస్త్రధారణము చేసికొన్నట్లును, వార్ధిక్యముపోయి వయోవంతుఁడైనట్లును, శరీరము స్థూలమైనట్లును, చమురంటుకొన్నట్లును, పెండ్లిచేసికొన్నట్లును, మీసము గడ్డము మొదలైనవానిని గొరిగించుకొన్నట్లును, వాంతిబేది అయినట్లును, స్వర్ణాదిధాతువులు దొరికినట్లును, పాదరక్షలు పోయినట్లును, లేక పైన బడినట్లును, కలిపురుషుని దర్శించినట్లును, నక్షత్రములు గ్రహములు దేవతలు దీపములునఖములు ఇవిభూమిపైఁబడినట్లును, పర్వతములు భేదింపఁబడినట్లును, రక్తపుష్పములు లభించినట్లును, అరణ్యములో కిరాతకాదుల గృహమందును, అంధకారమందును, కృష్ణస్థలమందు నున్నట్లును, చింతచే నున్నట్లును, మాతృగర్భములో బ్రవేశించినట్లును, కొండ మేడ మొదలైన స్థలములనుండి క్రింద పడినట్లును, రక్తవేత్తలును కృష్ణదేహులును వికటాకారులను దిగంబరులను చూచి

నట్లును మత్స్యములచే మ్రింగఁబడినట్లును స్వప్నముఁ గాంచిన జ్వరాదిరోగములు సంభవించి మరణము కలుగును. రక్తపుష్పమాల్యధారియై నవ్వుచుండునపుడు స్త్రీచే నీడువఁబడినట్లుగాని కౌఁగిలింపఁబడినగాని స్వప్నమైన రక్తపిత్తరోగియై మృతి జెందును. ఎనుబోతు కుక్క పంది ఒంటె గాడిదె వీనిలోఁ దేనినైన నెక్కి దక్షిణదిశ కేగి నట్లు స్వప్నమైన క్షయరోగము కలిగి మరణము నొందును. ఱొమ్మునందు తీఁగెలు వెదురు తాటిచెట్లు మొలిచినట్లు స్వప్నమైన గుల్మరోగము సంభవించి త్వరగా మృత్యువుపాలగును. జ్వాలలేని అగ్నిని చూచినను హోమము చేసెడివాని ఱొమ్మునందును దిగంబరుని ఱొమ్మునందును నేతిచే తలంటుకొన్నవాని ఱొమ్మునందును పద్మము జనించినట్లు స్వప్నమైన కుష్ఠరోగము సంభవించి మరణము కల్గును. చండాలురతోడ స్నేహమును ఔషధమును పానము జేసినట్లును స్వప్నమైన ప్రమేహరోగము కలిగి మృతి సంభవించును రాక్షసులతోఁగలిసి నృత్యము సేయుచు నీళ్లలోమునుఁగ చుండు నట్లు స్వప్నము గాంచిన అపస్మారరోగముకలిగి మృతిసంభవించును ప్రేతలతోఁగలిసి నృత్యముచేసినట్లు స్వప్నమైన ఉన్మాదరోగము సంభవించి మృత్యువుకలుగును. నూనె నేయి ఆముదము మొదలగు తైలవర్గములను పూసికొనిన వ్యాధి కల్గును.

దుఃఖజనిత స్వప్నములు:—నూనె ప్రత్తివృక్షము మొదలగువానిని జూచిన ఆపదలుకల్గును విహారము, రక్తవస్త్రధారణము, సూర్యచంద్రమండలముల కాంతితగ్గి నట్లు కనఁబడుట, నక్షత్రము వ్రాలుట, అశోకము పలాశము యివి పుష్పించినప్పుడు జూచుటయు దుఃఖము కల్గును.

శుభస్వప్నములు:—స్వర్ణము, ఏనుఁగు, వృషభము, సింహము, పశువు, పర్వతము వీనింజూచినను, లేక ఎక్కినను శుభము. రాజును చూచుట, దేవాలయమును రాజగృహమును జూచుట, లేక వీని నెక్కుట, శ్వేతవస్త్రధారణము, రక్తస్నానము, పురీషలేపనము, రత్నాభరణదర్శనము, ఆకాశగమనము, నదీసముద్రతరణము, సూర్యోదయము, జ్వాలాగ్ని, సూర్యచంద్రమండలములు, నక్షత్రములు వీనిని దర్శించుట, క్షీరయుక్తవృక్షారోహణము అను నీ స్వప్నములు శుభమును కలుగఁజేయును. దేవతలను, విప్రులను, పద్మములను, పొట్టును, అద్దమును, మాంసమును, పుష్పమును దర్శించుట ధనలాభము కలుగును. తెల్లని పాముచే కఱువఁబడిన పదిదినములలో లాభము కలుగును. నీటియందు సర్పవృశ్చికములు కరచిన అర్థలాభమును; లేక సంతానప్రాప్తియు కల్గును. తటాకమున తామరాకున పాయసము నేయి వీనితో భుజించిన భూపతి యగును. గోధుమలను జూచిన ధనలాభము కలుగును. నిప్పులో తేనుఁగులుఁ కొనిన మండలాధిపతి యగును పక్వమైన మనుష్యశిరోమాంసమును భక్షించిన రాజగును. లేక లక్షాధికారి యగును. కల్లుత్రాగినను నెత్తురుత్రాగినను బంధింపంబడినట్లును స్వప్నమైన ధనలాభము కలుగును. శ్రీగంధలేపనము, రోదనము, మరణము ఇవి శుభమును దెల్పును. తెల్లనివస్త్రము ధరించి చందనాదులు పూసికొనిన స్త్రీ కౌఁగిలించికొనిన సంపద గల్గును. పాదుకలు, ఛత్రము, ఖడ్గము, పాదరక్షలు, ఇవిలభించె

నేని మృష్టాన్నభోజనము సంభవించును. యవలనుజూచిన యజ్ఞప్రాప్తి కల్గును. నురుగు పాలను ద్రాగిన సోమపానప్రాప్తి యగును. తమలపాకులు, కప్పురము, చందనము, తెల్లనిపుష్పము వీనిం జూచిన సంపద కల్గును. ఆఁడుకోడి, తెల్లకొక్కెర, ఆఁడుకొంగ వీనిం గాంచిన స్వకులస్త్రీపరిణయప్రాప్తి యగును.

## శుభాశుభశకునలక్షణములు.

శుభశకునములు.—తన కెదురుగా మంగళవాద్యములగు భేరి శంఖము వీణె మొదలైన వాద్యములు వచ్చినను, లేక వాద్యధ్వని విన్నను, వేదఘోషము విన్నను, నవరత్నములు, అద్దము, బంగారు, వెండి, తామ్రము, బింబములు, అక్షతలు, ఛత్రము, చామరము, రథము, గుఱ్ఱము, ఏనుఁగు, ఎద్దు, దూడతోఁగూడిన ఆవు, బిడ్డనెత్తుకొని వచ్చెడు ముత్తైదువ, కన్యక, వేశ్య, పాలు, పెరుగుతోఁగూడిన కుండలు, నీళ్లనిండిన రెండుకుండలు, పతివ్రత, మత్స్యములు, మాంసము, కల్లు, సారాయి, పశువులు, తన చెలికాఁడు, పీనుగ, మంటనిప్పు, ఫలములు, కాయలు, పువ్వులు, గోరోచనము, తెలుపన్నము, పరమాన్నము, సుగంధద్రవ్యములు, శ్వాన ఖర గజాశ్వ గరుడఘోషము, ఇద్దరు విప్రులు, ఒకక్షత్రియుఁడు, నలుగురువైశ్యులు, కోలచేకొన్న శూద్రుఁడు, శుభ్రవస్త్రయుక్తరజకుఁడు, పసుపు, గాజులు, వక్కలాకులు, చెఱకు, తెల్లబట్టలు ఇవి యెదురుగ వచ్చినను; పాలపిట్ట, గరుడపక్షి, భరద్వాజము, కుక్క ఇవి కుడిప్రక్క నుండి ఎడమప్రక్కకు పోవుటయును; జముడుకాకి కాకి, నక్క, పాము ఇవియెడమ ప్రక్కనుండి కుడిప్రక్కకు పోవుటయును; ఎడమప్రక్కగాని తలవుపాడుగుగాఁగాని గాలిపల్కుటయును; రెండుతుమ్ములు యెవరైన తుమ్మి శేచిపోయినను, పుట్టపైగాని, చెట్టుపైగాని పాము యెక్కుటయును చూచిన శుభము కల్గును.

అశుభశకునములు.—తన కెదురుగ పొగనిప్పు, ఊక, తృణములు, కట్టెలు, పిడకలు, క్రొత్తకుండ, ప్రత్తి, తైలము, మలము, నల్లుధాన్యములు, నువ్వులు, ఉప్పు, ఔషధము, అడుసు, చర్మము, సర్పము, పిల్లి ముంగిస, ఎలుక, గూబ, పంది, తాఁబేలు, తొండ, కుందేలు, ఉడుము, క్రోవ్వు, ఎముకలు, బూడిదె, బెల్లము, మజ్జిగ, వీనిని; బోడితలవాఁడు, నంబివాఁడు, సన్న్యాసి, ఒక్కవిప్రుఁడు, వెట్టివాఁడు, రోదనముచేయువాఁడు, పతితుఁడు, అంధుఁడు, దిగంబరుఁడు. పాపకర్ముఁడు, చండాలుఁడు, హాస్యకాఁడు, రోగి, జడలుగలవాఁడు, తైలస్నిగ్ధుఁడు, తలవిరియఁబోసికొన్నవాఁడు, గర్భిణిస్త్రీలు, రజస్వలులు, విధవస్త్రీ, వాహనాదులనుండి విడిబడివచ్చు గుఱ్ఱము వీనిని చూచిన అశుభము కల్గును.

మఱియు నేను వచ్చెదను, ఇప్పుడు పోవద్దు, భోజనము చేయుము, నిలువుము, ఎచ్చటికి పోయెదవు అని చెప్పినను; కాలిలో ముల్లునాఁటినను, తలకు దెబ్బతగిలినను, తుమ్మి చీదినను, ఏదైనజంతువులు విఘ్నించినను, లేక దేహమువె విఘ్నించినను, నాలుగు కాళ్లజంతువులు తుమ్మినను అశుభము కల్గును. గాలివానలోను, మనుష్యులు పలు

పుడు వివాదమాడుటయును చూచి పోవం జనదు. ఎముకనుగాని, కట్టెనుగాని కుక్క యెత్తుకొని యెదురుగా వచ్చుట, లేక అడ్డగించుట, ఎడమప్రక్క పామును చూచుట, ఉత్తరమున పాలపిట్టను చూచుట, లేక దానికూత వినుట, వాయసము తీర్చికట్టుట, వీనిని చూచి పోయినను అశుభము కలుగును.

## పురుషసాముద్రికము.

లలాటము:—వెడలుపు నిడుపును గలిగి క్రిందిభాగము యెత్తుగనుండిన తెలివి గలవాఁడును, చైతన్యశక్తి గలవాఁడును, విమర్శశక్తియుక్తుఁడు నగును. పైభాగ మెత్తయిన తార్కికశక్తియుక్తుఁడు నగును. ఈ రెండుభాగములు సరిగా నుండిన సర్వ గుణోపేతుఁడు అగును.

కన్నులు:—దీర్ఘములయిన ధనము, కమలాకారమైన రాజత్వము, గుండ్రమైన వీరత్వము, చిన్న వయిన జ్ఞానరాహిత్యము.

ముక్కు:—దీర్ఘము లయిన ధనము, ఎత్తయిన బలవీర్యభాగ్యములు, పొడ వయిన శూరత్వము, సన్ననిరంధ్రములు గలిగిన శుభము.

చెవులు:—పొడవయిన శూరత్వము, వెండ్రుకలున్న దీర్ఘాయుష్యము, చిక్కి చేటలవలె నున్న దరిద్రము, వ్రేలాడు చున్న ఐశ్వర్యము.

కంఠము:—పొట్టిగా నున్న పూజ్యత, శంఖాకృతిగా నున్న రాజత్వము, పొడ వయిన తిండిపోతుతనము, కృశించిన రోగము.

పండ్లు:—పలచనగానున్న దీర్ఘాయుష్యము, ముప్పదిరెండున్నభోగము, మొదట పైపండ్లు బుట్టిన బంధునాశనము, ఎడముగ నున్నను తక్కువయినను దరిద్రము.

వెండ్రుకలు:—పలచ నయిన దీర్ఘాయుష్యము. విస్తారముగా నున్న జ్ఞానము, లేకున్న కపటము.

దవడ:—దీర్ఘముగాను రొమ్ములపుగానున్న ధనము, ఎత్తుగ నున్న ఆత్మలాభమం దిచ్ఛ, సన్నమై కృశించిన రోగము.

వక్షము:—దీర్ఘమైన ధనము, విశాలముగా నున్న పూజ్యత, ఉబ్బయిన బల శౌర్యభాగ్యములు, వెండ్రుక లున్న భూతదయ.

కడుపు:—ఒకమడతయున్న శస్త్రగాయమును, రెండుమడతలున్నను మూఁడు మడత లున్నను భోగము, నాలుగుమడత లున్న పరాక్రమము, ఉబ్బుగా నున్న భాగ్య ముగలవాఁడగును.

బొడ్డు:—కుడివైపున గుండ్రముగా నున్న భాగ్యము, ఎడమచుట్టు గలిగి మడ తలమధ్యనున్న దరిద్రము, వెండ్రుక లున్న సంతానవృద్ధి.

చర్మము:—కాంతి గలిగిన పూజ్యత, నల్లగా నున్న సామాన్యము, తెల్లగా నున్న ఆరోగ్యము లే కుండును.

చేతులు:-—దీర్ఘముగానున్న పరాక్రమము ధనము, ఏనుఁగుతొండమువలెనున్న రాజత్వము, కృశించిన ధనరహితము.

పాదములు:—మృదువయిన వాహనారూఢత్వము, పొడవైన దరిద్రము, అంబులపొదివలె కాళ్లున్న రాజత్వము, పొట్టికాళ్లున్న కార్యసమర్థత.

గోళ్లు:—పొట్టివై వెడల్పయిన తన కక్కఱలేనిపనియందు ప్రవేశించుచు అందఱిని యాక్షేపించుగుణము, తెలుపుగలిగి సన్నగానున్న మంచిగుణమును కార్యనిర్వాహకశక్తియును, పెద్దవయి తెలుపుగానున్న న్యాయబుద్ధియును, గుండ్రనైన భోగేచ్ఛయును, పలుచనైన దుర్బలమును, ఎఱుపుగానున్న ధనము భూస్థితియును, నలుపుగాను సన్నముగాను వంకరగాను వుండిన మోసము పెంకెతనమును, బొటనవ్రేలిగోరుమీద తెల్లనిమచ్చయున్న దయయును, తెల్లనిగీట్లున్న జారత్వమును, తర్జనిగోరునందు తెల్లనిమచ్చయున్న లాభమును, నల్లనిమచ్చయున్న నష్టమును. నడిమివ్రేలిగోరునందు తెలుపు నలుపు మచ్చలున్న సముద్రప్రయాణమును హానియును, అనామికవ్రేలి గోరునందు తెలుపు నలుపు మచ్చలున్న గౌరవాగౌరవములును, చిటికెనవ్రేలిగోరునందు తెలుపు మచ్చ యున్న వర్తకమందు లాభమును కల్గును.

## స్త్రీసాముద్రికము.

లలాటము:—వెడల్పై వెండ్రుకలు లేకుండిన శుభము, వెండ్రుకలున్న మూర్ఖురాలై యుండును, చిన్నదై యుండిన దరిద్రము.

ముక్కు:-—చిన్నదై సమమైన సద్వృత్తి, లావై యెత్తయిన దుర్గుణము.

కన్నులు:—ఎఱ్ఱనికొలుకులు నల్లనిపాపలు గలిగిన భూతదయయు, గుండ్రమై పసుపువర్ణముగ నున్న నింద.

చెవులు:—దీర్ఘమై విశాలముగ నున్న భాగ్యము, వక్రమై సన్నముగ నున్న దరిద్రము.

పలువరుస:-—సన్నముగను సమముగను తెల్లగను వుండిన సంపద, గొగ్గిపల్లులు గలిగి హెచ్చుతక్కువ లున్న ఆపదలు.

దవడలు:—మెత్తగను నునుపుగను వుండిన ప్రీతి, పీతముగను లావుగ నున్న క్రూరత్వము.

వెండ్రుకలు:—నలుపుగను పొడవుగను మెత్తగను వుండిన జనరంజనము, ఎఱుపు కుఱుచ పలచనగ నుండిన దరిద్రము.

కంఠము:—గుండ్రముగను నునుపుగను మూఁడుముడతలు గలిగియు నుండిన సంపద, విస్తారముపొడవును మిగుల కుఱుచయును గలిగి యుండిన దరిద్రము.

నడుము:—పదునెనిమిదిఅంగుళములప్రమాణము గలిగి సన్నమై రోమరహితముగనున్న సౌభాగ్యము, విశాలముగను రోమసహితముగ నుండిన పతికి కీడు.

కడుపు:—మృదువై విశాలము గలిగిన సంతానము. మూఁడుముడతలు గలిగియున్న భోగము.

బొడ్డు:—లోతై కుడిచుట్లు గలిగిన ఆయుర్వృద్ధి, ఎత్తుగలిగి యెడమచుట్టు గల్గియున్న ఆయుఃక్షీణము.

దేహము:—నునుపు సమము రోమరహితము మృదువుగ నుండిన శుభము, కఠినము స్థూలము దీర్ఘముగ నుండిన అశుభము.

చేతులు:—సమమై మృదువయిన సద్వృత్తి, వంకర గలిగి గట్టిగానున్న దురాచారము.

గోళ్లు:— ఎఱుపుగానున్న సుశీలత, తెలుపుగాను పసుపుగా నుండిన దుశ్శీలత. (ఈవిషయమై తక్కినది పురుషసాముద్రికమందు జెప్పినదానిని జూచుకొనవలయును)

## సర్వకాల శుభాశుభ పంచాంగము.

ఈ పంచాంగము సిద్ధాదులచేఁ గనిపెట్టఁబడినది. వివాహాది శుభముహూర్తములకును, ఇతరకార్యములకును, తిథివారనక్షత్రాదులను లగ్నములను, గణింపకయే ఏయేనెలలకు, ఏయేవారములయందు, ఏయేగడియలలో, ఏయేఫలము చెప్పఁబడియున్నదో; దానిని గమనించి తెలిసికొనినయెడల తత్కాలఫలము స్ఫురించును.

ప్రతిదినమును పగలు 3, రాత్రి 3 గడియలవఱకు ఫలము వ్రాయంబడియున్నది. అనఁగా, సూర్యోదయము మొదలు చెప్పఁబడిన గడియలవఱకు ఆ ఫలము చెల్లు నని తెలియఁదగ్గది. ఇట్లే తక్కినవానిని యూహింపవలసినది.

సంకేతము:—జ = జయము; సా = సాధనము; ఆ = ఆలస్యము; మ = మరణము.

జయము ఉత్తమోత్తమము; సాధనము ఉత్తమము; ఆలస్యము మధ్యమము; మరణము నిష్ఫలము.

ఈ పంచాంగచక్రముయొక్క 12 నెలలను 3 భాగములుగా విభజింపఁబడియున్నవి. మొదటిభాగము నెలలు—చిత్రి, వైయాశి, ఆవణి, పెరటాశి, మాశి, పంగుని; అనఁగా మేష, వృషభ, సింహ, కన్యా, కుంభ, మీనమాసములు.

రెండవభాగము నెలలు—ఆని, ఆడి; అనఁగా మిథున, కర్కాటకమాసములు.

మూఁడవభాగము నెలలు—అల్పిశి, కార్తికై, మార్గళి, తై; అనఁగా తుల, వృశ్చిక, ధను మకరమాసములు

మొదటిభాగము.—చిత్రి, వైయ్యాశి, ఆవణి, పెరటాశి, మాశి, పంగుని నెలలు.

| ఆది. | | సోమ. | | మంగళ. | | బుధ. | | గురు. | | శుక్ర. | | శని. | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| పగలు. | రాత్రి. | పగలు. | రాత్రి. | పగలు. | రాత్రి. | పగలు. | రాత్రి. | పగలు. | రాత్రి. | పగలు. | రాత్రి. | పగలు. | రాత్రి. |
| జ 2 | మ 4 | సా 4 | ఆ 2 | ఆ 4 | సా 4 | ఆ 4 | మ 2 | సా 6 | ఆ 4 | మ 2 | మ 2 | మ 4 | మ 2 |
| ఆ 2 | జ 4 | ఆ 8 | సా 6 | మ 2 | మ 2 | సా 4 | సా 6 | మ 2 | జ 4 | సా 16 | ఆ 4 | ఆ 4 | ఆ 4 |
| సా 8 | మ 2 | సా 6 | ఆ 6 | సా 6 | సా 2 | మ 2 | మ 4 | ఆ 4 | సా 2 | ఆ 8 | సా 6 | మ 4 | సా 4 |
| ఆ 6 | సా 4 | ఆ 6 | సా 8 | ఆ 4 | ఆ 4 | ఆ 4 | ఆ 6 | సా 6 | ఆ 8 | సా 2 | మ 4 | సా 4 | ఆ 4 |
| మ 10 | మ 2 | సా 4 | ఆ 8 | మ 2 | మ 6 | జ 2 | మ 4 | ఆ 8 | సా 8 | మ 2 | సా 6 | మ 4 | సా 12 |
| జ 2 | ఆ 6 | మ 2 | | సా 2 | సా 4 | సా 4 | సా 8 | మ 4 | మ 4 | | జ 2 | ఆ 6 | మ 4 |
| | మ 6 | | | మ 4 | ఆ 2 | ఆ 4 | | | | | మ 6 | మ 4 | |
| | జ 2 | | | సా 6 | సా 2 | సా 4 | | | | | | | |
| | | | | | మ 4 | మ 2 | | | | | | | |
| 30 | 30 | 30 | 30 | 30 | 30 | 30 | 30 | 30 | 30 | 30 | 30 | 30 | 30 |

రెండవభాగము.—ఆని, ఆడి నెలలు.

| ఆది. | | సోమ. | | మంగళ. | | బుధ. | | గురు. | | శుక్ర. | | శని. | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| పగలు. | రాత్రి. | పగలు. | రాత్రి. | పగలు. | రాత్రి. | పగలు. | రాత్రి. | పగలు. | రాత్రి. | పగలు. | రాత్రి. | పగలు. | రాత్రి. |
| మ 4 | సా 4 | ఆ 8 | మ 4 | సా 4 | అ 6 | మ 2 | సా 10 | సా 2 | జ 4 | మ 2 | మ 2 | మ 4 | మ 2 |
| సా 8 | మ 4 | సా 4 | ఆ 8 | ఆ 4 | సా 6 | ఆ 4 | ఆ 2 | మ 4 | సా 4 | సా 16 | ఆ 4 | ఆ 4 | ఆ 4 |
| ఆ 6 | ఆ 4 | మ 2 | సా 4 | మ 2 | ఆ 4 | సా 8 | మ 4 | ఆ 6 | మ 2 | ఆ 8 | సా 6 | మ 4 | సా 4 |
| సా 6 | సా 6 | ఆ 4 | ఆ 4 | సా 6 | సా 2 | ఆ 6 | సా 4 | నా 6 | సా 6 | సా 2 | మ 4 | సా 4 | ఆ 4 |
| ఆ 4 | ఆ 8 | సా 6 | మ 2 | ఆ 6 | మ 2 | సా 8 | మ 6 | మ 2 | మ 2 | మ 2 | సా 6 | మ 4 | సా 6 |
| మ 2 | మ 4 | జ 6 | ఆ 4 | జ 2 | ఆ 4 | మ 2 | సా 4 | ఆ 4 | సా 6 | | జ 2 | ఆ 6 | ఆ 4 |
| | | | మ 4 | ఆ 4 | సా 4 | | | సా 6 | ఆ 6 | | మ 6 | మ 4 | సా 6 |
| | | | | మ 2 | ఆ 2 | | | | | | | | |
| 30 | 30 | 30 | 30 | 30 | 30 | 30 | 30 | 30 | 30 | 30 | 30 | 30 | 30 |

మూడవభాగము.—అల్పిశి, కార్తికి, మార్గళి, తైనెలలు.

| ఆది. | | సోమ. | | మంగళ. | | బుధ. | | గురు. | | శుక్ర. | | శని. | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| పగలు. | రాత్రి. | పగలు. | రాత్రి. | పగలు. | రాత్రి. | పగలు. | రాత్రి. | పగలు. | రాత్రి. | పగలు. | రాత్రి. | పగలు. | రాత్రి. |
| సా 6 | మ 2 | సా 4 | ఆ 6 | సా 2 | ఆ 6 | మ 2 | జ 4 | సా 4 | మ 2 | సా 2 | ఆ 4 | మ 4 | ఆ 4 |
| ఆ 8 | ఆ 4 | ఆ 4 | సా 8 | మ 2 | సా 2 | జ 4 | సా 4 | ఆ 6 | సా 8 | ఆ 6 | సా 4 | ఆ 4 | సా 4 |
| సా 8 | సా 6 | సా 6 | ఆ 8 | సా 10 | మ 2 | సా 2 | ఆ 8 | సా 4 | ఆ 6 | సా 6 | మ 4 | సా 4 | ఆ 6 |
| మ 2 | ఆ 6 | ఆ 16 | సా 2 | ఆ 6 | సా 12 | మ 2 | సా 6 | మ 4 | సా 4 | ఆ 6 | జ 2 | మ 8 | సా 4 |
| జ 2 | సా 4 | | ఆ 6 | మ 6 | జ 2 | ఆ 4 | మ 8 | ఆ 6 | ఆ 6 | సా 8 | ఆ 6 | సా 6 | మ 4 |
| మ 2 | ఆ 4 | | | ఆ 4 | సా 4 | మ 2 | | మ 2 | జ 2 | మ 2 | సా 6 | మ 4 | ఆ 4 |
| ఆ 2 | మ 2 | | | | మ 2 | సా 4 | | సా 4 | మ 2 | | మ 4 | | సా 2 |
| | ఆ 2 | | | | | మ 4 | | | | | | | అ 2 |
| | | | | | | సా 6 | | | | | | | |
| 30 | 30 | 30 | 30 | 30 | 30 | 30 | 30 | 30 | 30 | 30 | 30 | 30 | 30 |

## పంచపక్షి శాస్త్రము.

ఈ శాస్త్రము పంచపక్షులను ఆధారముగాఁ జేసికొని ప్రతిదినఫలమును బోధించు చున్నది.

ప్రతిమనుష్యునియొక్క జన్మనక్షత్రమును, లేక నామనక్షత్రమును అనుసరించి పక్షులను తెలిసికొనవలయును. జన్మనక్షత్రము తెలియనివారికి నామనక్షత్రమే ప్రధానము. అనఁగా వానిజన్మనక్షత్రమున కేపక్షి యగుచున్నదో అదే వానిపక్షి యని తెలియవలయును. నామనక్షత్ర మనఁగా వానియొక్క పేరునం దుండు మొదటి అక్షరము యేనక్షత్ర మగునో ఆ నక్షత్రముయొక్క పక్షియే వానిపక్షి యగును. మఱియు ప్రతి మనుష్యునియొక్క నామము (పేరు) నందలి స్వరమునకు యే పక్షి యగునో అదియు వానిపక్షి యగును. ఈ పక్షులను అనుసరించి ఫలము నూహింపఁదగును.

ప్రతిదినమును ఉదయము మొదలు మరునాఁడు వుదయమువఱకు పంచపక్షులు సంచరించును. ప్రతి వేళయందును తనపక్షి యే అవస్థయం దుండునో ఆ యవస్థాఫలమే తనకు జరుగును. ఒక్కొకపక్షియును ప్రతిదినమును పగటియందు 6 గడియలును, రాత్రియందు 6 గడియలును సంచరించును.

ప్రతివారమునందును ప్రతిపక్షమునందును సంచరించు పక్షులయొక్కయు, ఆ పక్షుల కాలముయొక్కయు, ఆ పక్షుల అవస్థలయొక్కయు నిర్దేశ్యమంతయు శుక్ల కృష్ణ పక్ష దివారాత్రిచక్రములను, శుక్ల కృష్ణ పక్ష నిర్జీవచక్రమును జూచినచో స్పష్ట మగును.

నక్షత్రపక్షి.—అశ్విని మొదలు 5 నక్షత్రములు డేగ; ఆర్ద్ర మొదలు 6 నక్షత్రములు గూబ; ఉత్తర మొదలు 5 నక్షత్రములు కాకి; అనూరాధ మొదలు 5 నక్షత్రములు కోడి; శ్రవణము మొదలు 6 నక్షత్రములు నెమలి.

అనఁగా అశ్విని, భరణి, కృత్తిక, రోహిణి, మృగశీర్ష; ఈ 5 డేగ.

ఆర్ద్ర, పునర్వసు, పుష్యమి, ఆశ్రేష, మఖ, పుబ్బ, ఈ 6 గూబ.

ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, విశాఖ; ఈ 5 కాకి.

అనూరాధ, జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ; ఈ 5 కోడి.

శ్రవణము, ధనిష్ఠ, శతభిషము, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి; ఈ 6 నెమలి.

అక్షరపక్షి.—ఈ విషయమును శుక్ల కృష్ణపక్ష నిర్జీవచక్రమునందు జూచినచో తెలియునుగాన నిచట వేఱుగ వ్రాయలేదు.

పక్షి బలాబలములు — కాకికంటె డేగయు, డేగకంటె కోడియు, కోడి కంటె గూబయు, గూబకంటె నెమలియు తక్కువబలము గలది. అనఁగా, నెమలికంటె గూబ బలము గలది; గూబకంటె కోడి బలము గలది; కోడికంటె డేగ బలము గలది; డేగకంటె కాకి బలము గలది యని తెలియునది.

పక్షి అవస్థాబలాబలములు. — రాజ్యావస్థయం దుండు పక్షి గమన, భోజన, నిద్రా, మరణములయం దుండు నాలుగుపక్షులను జయించును.

గమనమందుండు పక్షి భోజన, నిద్రా, మరణములయం దుండు మూఁడుపక్షులను జయించును.

భోజనమం దుండుపక్షి నిద్రా, మరణములయందుండు రెండుపక్షులను జయించును.

నిద్రయం దుండుపక్షి మరణపక్షిని జయించును.

వారపక్షిబలాబలములు. — వారపక్షి మరణావస్థయం దున్నను తక్కిన రాజ్య గమన భోజన నిద్రావస్థలయం దుండు పక్షులను జయించును. ఇట్లే తక్కిన అవస్థలను వూహించుకొనవలసినది.

తిథిపక్షిబలాబలములు — శుక్ల కృష్ణ పక్షములు రెంటియందును 1-6-11 ఈ 3 తిథులు నంద యనియు; 2-7-12 ఈ 3 తిథులు భద్ర యనియు; 3-8-13 ఈ 3 తిథులు జయ యనియు; 4-9-14 ఈ 3 తిథులు రిక్త యనియు; 5-10-15 ఈ 3 తిథులు పూర్ణ యనియు చెప్పఁబడును. నంద, రిక్త ఈ రెండుతిథులయందు మరణపక్షి రాజ్యపక్షిని జయించును. తక్కిన అవస్థలయందు ఆయాపక్షులయొక్క బలాబలముచొప్పున జరుగును.

ప్రశ్నవిషయము:— ప్రశ్న అడుగువానికి, ప్రశ్న చెప్పువాఁడు ఆ సమయమునందు, ప్రశ్న అడుగువానియొక్క పక్షి ఏ అవస్థయందుండునో దానిని తెలిసికొని ఫలము చెప్పవలయును. ఇట్లు చెప్పునపుడు, ఆ ప్రశ్న అడుగువానికిమాత్రమే ఆ ఫలము కలిగినదేగాని, ఇతరునివలన వానికి పని కలిగెనేని అపుడు ఆ యెదుటివానియొక్క జన్మనక్షత్రపక్షి, లేక నామనక్షత్రపక్షి, లేక స్వరపక్షిని తెలిసికొని ఫలము చెప్పఁదగును. అనఁగా, ప్రశ్న అడుగువానియొక్కపక్షి భోజనమునం దుండఁగా నెదుటివానిపక్షి రాజ్యమునం దుండెనేని అడిగినవానికి అపజయమును, ఎదుటివానికి జయమును కల్గును. ప్రశ్న అడుగువానిపక్షి రాజ్యమునందుండి ఎదుటివానిపక్షి భోజనము మొదలగు అవస్థలయందుండెనేని ప్రశ్న అడిగినవానికే జయముగల్గును ఇట్లుగా ప్రశ్న చెప్పువారు పక్షియొక్క బలాబలములను తెలిసికొని, తమబుద్ధినిఁ వినియోగించి ఫలము చెప్పఁదగును.

## శుక్లపక్ష దివాచక్రము.

| వారములు | పంచ పక్షులు. | 1-వ జాము | 2-వ జాము | 3-వ జాము | 4-వ జాము | 5-వ జాము |
|---|---|---|---|---|---|---|
| ఆది, మంగళ. | డేగ | భోజ | గమ | రాజ్య | నిద్ర | మర |
| | గూబ | గమ | రాజ్య | నిద్ర | మర | భోజ |
| | కాకి | రాజ్య | నిద్ర | మర | భోజ | గమ |
| | కోడి | నిద్ర | మర | భోజ | గమ | రాజ్య |
| | నెమలి | మర | భోజ | గమ | రాజ్య | నిద్ర |
| సోమ, బుధ | గూబ | భోజ | గమ | రాజ్య | నిద్ర | మర |
| | కాకి | గమ | రాజ్య | నిద్ర | మర | భోజ |
| | కోడి | రాజ్య | నిద్ర | మర | భోజ | గమ |
| | నెమలి | నిద్ర | మర | భోజ | గమ | రాజ్య |
| | డేగ | మర | భోజ | గమ | రాజ్య | నిద్ర |
| గురు. | కాకి | భోజ | గమ | రాజ్య | నిద్ర | మర |
| | కోడి | గమ | రాజ్య | నిద్ర | మర | భోజ |
| | నెమలి | రాజ్య | నిద్ర | మర | భోజ | గమ |
| | డేగ | నిద్ర | మర | భోజ | గమ | రాజ్య |
| | గూబ | మర | భోజ | గమ | రాజ్య | నిద్ర |
| శుక్ర. | కోడి | భోజ | గమ | రాజ్య | నిద్ర | మర |
| | నెమలి | గమ | రాజ్య | నిద్ర | మర | భోజ |
| | డేగ | రాజ్య | నిద్ర | మర | భోజ | గమ |
| | గూబ | నిద్ర | మర | భోజ | గమ | రాజ్య |
| | కాకి | మర | భోజ | గమ | రాజ్య | నిద్ర |
| శని. | నెమలి | భోజ | గమ | రాజ్య | నిద్ర | మర |
| | డేగ | గమ | రాజ్య | నిద్ర | మర | భోజ |
| | గూబ | రాజ్య | నిద్ర | మర | భోజ | గమ |
| | కాకి | నిద్ర | మర | భోజ | గమ | రాజ్య |
| | కోడి | మర | భోజ | గమ | రాజ్య | నిద్ర |

## శుక్లపక్ష రాత్రిచక్రము.

| వారములు. | పంచ పక్షులు. | 1-వ జాము | 2-వ జాము | 3-వ జాము | 4-వ జాము | 5-వ జాము |
|---|---|---|---|---|---|---|
| ఆది, మంగళ. | డేగ | మర | గమ | నిద్ర | భోజ | రాజ్య |
| | గూబ | రాజ్య | మర | గమ | నిద్ర | భోజ |
| | కాకి | భోజ | రాజ్య | మర | గమ | నిద్ర |
| | కోడి | నిద్ర | భోజ | రాజ్య | మర | గమ |
| | నెమలి | గమ | నిద్ర | భోజ | రాజ్య | మర |
| సోమ, బుధ. | గూబ | మర | గమ | నిద్ర | భోజ | రాజ్య |
| | కాకి | రాజ్య | మర | గమ | నిద్ర | భోజ |
| | కోడి | భోజ | రాజ్య | మర | గమ | నిద్ర |
| | నెమలి | నిద్ర | భోజ | రాజ్య | మర | గమ |
| | డేగ | గమ | నిద్ర | భోజ | రాజ్య | మర |
| గురు | కాకి | మర | గమ | నిద్ర | భోజ | రాజ్య |
| | కోడి | రాజ్య | మర | గమ | నిద్ర | భోజ |
| | నెమలి | భోజ | రాజ్య | మర | గమ | నిద్ర |
| | డేగ | నిద్ర | భోజ | రాజ్య | మర | గమ |
| | గూబ | గమ | నిద్ర | భోజ | రాజ్య | మర |
| శుక్ర. | కోడి | మర | గమ | నిద్ర | భోజ | రాజ్య |
| | నెమలి | రాజ్య | మర | గమ | నిద్ర | భోజ |
| | డేగ | భోజ | రాజ్య | మర | గమ | నిద్ర |
| | గూబ | నిద్ర | భోజ | రాజ్య | మర | గమ |
| | కాకి | గమ | నిద్ర | భోజ | రాజ్య | మర |
| శని. | నెమలి | మర | గమ | నిద్ర | భోజ | రాజ్య |
| | డేగ | రాజ్య | మర | గమ | నిద్ర | భోజ |
| | గూబ | భోజ | రాజ్య | మర | గమ | నిద్ర |
| | కాకి | నిద్ర | భోజ | రాజ్య | మర | గమ |
| | కోడి | గమ | నిద్ర | భోజ | రాజ్య | మర |

## కృష్ణపక్ష దివాచక్రము.

| వారములు. | పంచ పక్షులు. | 1-వ జాము | 2-వ జాము | 3-వ జాము | 4-వ జాము | 5-వ జాము |
|---|---|---|---|---|---|---|
| ఆది, మంగళ. | కోడి | భోజ | మర | నిద్ర | రాజ్య | గమ |
| | కాకి | రాజ్య | గమ | భోజ | మర | నిద్ర |
| | గూబ | మర | నిద్ర | రాజ్య | గమ | భోజ |
| | డేగ | గమ | భోజ | మర | నిద్ర | రాజ్య |
| | నెమలి | నిద్ర | రాజ్య | గమ | భోజ | మర |
| సోమ, శని. | నెమలి | భోజ | మర | నిద్ర | రాజ్య | గమ |
| | కోడి | రాజ్య | గమ | భోజ | మర | నిద్ర |
| | కాకి | మర | నిద్ర | రాజ్య | గమ | భోజ |
| | గూబ | గమ | భోజ | మర | నిద్ర | రాజ్య |
| | డేగ | నిద్ర | రాజ్య | గమ | భోజ | మర |
| బుధ. | కాకి | భోజ | మర | నిద్ర | రాజ్య | గమ |
| | గూబ | రాజ్య | గమ | భోజ | మర | నిద్ర |
| | డేగ | మర | నిద్ర | రాజ్య | గమ | భోజ |
| | నెమలి | గమ | భోజ | మర | నిద్ర | రాజ్య |
| | కోడి | నిద్ర | రాజ్య | గమ | భోజ | మర |
| గురు. | గూబ | భోజ | మర | నిద్ర | రాజ్య | గమ |
| | డేగ | రాజ్య | గమ | భోజ | మర | నిద్ర |
| | నెమలి | మర | నిద్ర | రాజ్య | గమ | భోజ |
| | కోడి | గమ | భోజ | మర | నిద్ర | రాజ్య |
| | కాకి | నిద్ర | రాజ్య | గమ | భోజ | మర |
| శుక్ర. | డేగ | భోజ | మర | నిద్ర | రాజ్య | గమ |
| | నెమలి | రాజ్య | గమ | భోజ | మర | నిద్ర |
| | కోడి | మర | నిద్ర | రాజ్య | గమ | భోజ |
| | కాకి | గమ | భోజ | మర | నిద్ర | రాజ్య |
| | గూబ | నిద్ర | రాజ్య | గమ | భోజ | మర |

## కృష్ణపక్ష రాత్రిచక్రము.

| వారములు. | పంచ పక్షులు. | 1-వ జాము | 2-వ జాము | 3-వ జాము | 4-వ జాము | 5-వ జాము |
|---|---|---|---|---|---|---|
| ఆది, మంగళ. | కోడి | గమ | మర | రాజ్య | భోజ | నిద్ర |
| | కాకి | మర | రాజ్య | భోజ | నిద్ర | గమ |
| | గూబ | రాజ్య | భోజ | నిద్ర | గమ | మర |
| | డేగ | భోజ | నిద్ర | గమ | మర | రాజ్య |
| | నెమలి | నిద్ర | గమ | మర | రాజ్య | భోజ |
| సోమ, శని. | గూబ | గమ | మర | రాజ్య | భోజ | నిద్ర |
| | డేగ | మర | రాజ్య | భోజ | నిద్ర | గమ |
| | నెమలి | రాజ్య | భోజ | నిద్ర | గమ | మర |
| | కోడి | భోజ | నిద్ర | గమ | మర | రాజ్య |
| | కాకి | నిద్ర | గమ | మర | రాజ్య | భోజ |
| బుధ. | నెమలి | గమ | మర | రాజ్య | భోజ | నిద్ర |
| | కోడి | మర | రాజ్య | భోజ | నిద్ర | గమ |
| | కాకి | రాజ్య | భోజ | నిద్ర | గమ | మర |
| | గూబ | భోజ | నిద్ర | గమ | మర | రాజ్య |
| | డేగ | నిద్ర | గమ | మర | రాజ్య | భోజ |
| గురు. | డేగ | గమ | మర | రాజ్య | భోజ | నిద్ర |
| | నెమలి | మర | రాజ్య | భోజ | నిద్ర | గమ |
| | కోడి | రాజ్య | భోజ | నిద్ర | గమ | మర |
| | కాకి | భోజ | నిద్ర | గమ | మర | రాజ్య |
| | గూబ | నిద్ర | గమ | మర | రాజ్య | భోజ |
| శుక్ర. | కాకి | గమ | మర | రాజ్య | భోజ | నిద్ర |
| | గూబ | మర | రాజ్య | భోజ | నిద్ర | గమ |
| | డేగ | రాజ్య | భోజ | నిద్ర | గమ | మర |
| | నెమలి | భోజ | నిద్ర | గమ | మర | రాజ్య |
| | కోడి | నిద్ర | గమ | మర | రాజ్య | భోజ |

ఆరూఢమున కుపయోగ మగు

శుక్లపక్ష పక్షి చక్రము.

| పక్షి పేరు. | కులము. | దిక్కు. | శత్రులు. | మిత్రులు. |
|---|---|---|---|---|
| డేగ. | బ్రహ్మ. | తూర్పు. | కాకి-కోడి. | నెమలి-గూబ. |
| గూబ. | వైశ్య. | దక్షిణము. | నెమలి-కోడి. | డేగ-కాకి. |
| కాకి. | క్షత్రియ | పడమర. | డేగ-నెమలి. | గూబ-కోడి |
| కోడి. | శూద్ర. | ఉత్తరము. | డేగ-గూబ. | కాకి-నెమలి. |
| నెమలి. | చండాల | మధ్య. | కాకి-గూబ. | డేగ-కోడి. |

ఆరూఢమున కుపయోగ మగు

కృష్ణపక్ష పక్షి చక్రము.

| పక్షి పేరు | కులము. | దిక్కు. | శత్రులు. | మిత్రులు. |
|---|---|---|---|---|
| డేగ | బ్రహ్మ. | తూర్పు. | కోడి-గూబ. | కాకి-నెమలి. |
| గూ; | క్షత్రియ | ఉత్తరము | డేగ-నెమలి. | కాకి-కోడి. |
| కాకి. | వైశ్య. | దక్షిణము | నెమలి-కోడి | డేగ-గూబ |
| కోడి.. | శూద్ర. | మధ్య. | కాకి-డేగ. | నెమలి-గూబ. |
| నెమలి | చండాల | పడమర | గూబ-కాకి. | డేగ-కోడి. |

## శుక్ల కృష్ణ పక్ష నిర్జీవపక్షి చక్రము.

| పక్షములు. | వారములు. | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| | ఆది | సోమ | మంగళ | బుధ | గురు | శుక్ర | శని. |
| శుక్ల పక్షము. | ఇ ఈ గూబ | ఉ ఊ కాకి | ఎ ఏ కోడి | ఒ ఓ నెమలి | అ ఆ ఐ ఔ డేగ | ఇ ఈ గూబ | అ ఆ ఐ ఔ డేగ |
| కృష్ణ పక్షము. | ఉ ఊ కాకి | ఒ ఓ నెమలి | అ ఆ ఐ ఔ డేగ | ఒ ఓ నెమలి | ఎ ఏ కోడి | ఒ ఓ నెమలి | ఎ ఏ కోడి |

ఈ చక్రములో కనఁబఱచినప్రకారము శుక్ల కృష్ణ పక్షములలో పక్షులు నిర్జీవముగా నుండును ఆ పక్షి రాజ్య భోజన సమయములో నుండినను బలము లేదు. మరణసమయమునమాత్రము శుభమే యగును.

### జయాపజయప్రశ్న.

తనపక్షి భోజనము లేక రాజ్యమం దుండి ఎదుటివానిపక్షి నిద్రామరణములలో నుండుకాలమున తనకే జయము గల్గును. తనపక్షికిని ఎదుటివానిపక్షికిని శత్రుత్వమై యున్నయెడల జయాపజయములు లేవు. ఎదుటివానిపక్షి గమనమం దుండిన అపజయమే కలుగును.

### కాలనిర్ణయప్రశ్న.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| డేగకు | 2 | జాములు | 2 | దినములు | 2 | నెలలకు | కార్యము అగును. |
| గూబకు | 3 | ,, | 3 | ,, | 3 | ,, | కార్యము అగును. |
| కాకికి | 4 | ,, | 4 | ,, | 4 | ,, | కార్యము అగును. |
| కోడికి | 5 | ,, | 5 | ,, | 5 | ,, | కార్యము అగును. |
| నెమలికి | 6 | ,, | 6 | ,, | 6 | ,, | కార్యము అగును. |

## స్వరశాస్త్రము.

స్వరశాస్త్రము వైద్యులకు నాడీజ్ఞానబోధమునిమిత్తమును, యోగులకు సమాధి సిద్ధికొఱకును, జ్యోతిష్కులకు ఫలాఫలనిరూపణముకొఱకును ఆవశ్యకమై యున్నది. సర్వజనులును సులభముగా నీస్వరశాస్త్రమును అభ్యసింపఁదగినది. దీనిచే ననేకకార్యములను సాధించుకొనఁదగును.

స్వరము అనునది ఉచ్ఛ్వాస నిశ్వాసములతో సంబంధించినది. మానవ శరీరమునం దనేకనాడు లున్నను, ఇడా, పింగళా నాడులమూలముగా నీ స్వరము నెఱుఁగఁదగినది ఇది నాసాగ్రవర్తి యై యున్నది.

ప్రతిదినముచు (పగలు రాత్రియు చేరి) మనుష్యుఁడు శాస్త్రోక్తప్రకారముగా 2.600 శ్వాసములు విడువనలసినది. ఇంతకు తక్కువ యగునేని యది వారివారి జీవ కాలలోపమును బోధించుటను సూచించు చున్న దని తెలియునది.

కుడిముక్కుపుటమునం దుండి వెడలు శ్వాసము సూర్య నాడి ఇది పింగళ యనఁబడును

ఎడమముక్కుపుటమునం దుండి వచ్చు శ్వాసము చంద్ర నాడి ఇది ఇడ యనఁబడును

స్వరగతి భేదములు:---కొన్ని సమయములయందు కాలవ్యత్యాసమును బట్టి సూర్యనాడి చంద్రనాడిగను, చంద్రనాడి సూర్యనాడిగను మాఱిపోవును. అపుడు వేడిగను దీర్ఘముగను వచ్చు శ్వాసము సూర్యనాడి యనియు, చల్లగను హ్రస్వముగను వచ్చు శ్వాసము చంద్రనాడి యనియు గ్రహింపఁదగినది

సూర్యస్వరమునం జేయఁదగు కృత్యములు:—స్త్రీసంభోగము, సకలవిద్యాభ్యాసము,సకల మంత్రములు, తత్సంబంధవిషయములు, చిత్రలేఖనము. ప్రసంగము, దానధర్మాది సకలలోకోపకారకార్యములు, విక్రయవ్యాపారము, శరీరారోగ్య సంబంధ మైన సకలకార్యములు, స్తంభన మోహనాది కార్యములు, ఆముష్మిక సంబంధ మైన కార్యములు, గజతురగాద్యారోహణములు, జంతువులను వెలకు గొనుట నీ మొదలగునవి.

చంద్రస్వరమునందు చేయఁదగిన కృత్యములు:—దక్షిణ పశ్చిమ ప్రయాణము, యుద్ధము, ధనసంగ్రహము, వివాహాది సకలశుభకార్యములు. గృహప్రవేశము దేవాలయము మొదలగు సర్వప్రతిష్ఠలును; వేట, జూదము, వస్త్రధారణము, వైద్యము, రాజదర్శనము, యజ్ఞయాగములు నీ మొదలగునవి.

మఱియు స్వరము శూన్యమగుటయు కలదు. అనఁగా సూర్యచంద్రస్వరములు రెండును ఐక్య మగుట. అట్టి సమయమునం దేకార్యము చేసినను నిష్ఫల మగును.

స్వరగతులు:— 1 ఫలితము, 2 వక్రితము. 3 స్ఫుటితము, 4 స్ఖలితము లేక ఉపఘాతము, 5 జ్వలితము, 6 ధ్వంసమానము, 7 సుషుప్తము, 8 అస్తమయము అని యెనిమిదివిధములుగా నుండును. ప్రశ్న చెప్పునపుడు యీ గతులనుదెలిసి తత్ఫలములను నిశ్చయించి చెప్పవలయును.

1. ఫలితము:— శ్వాసము ముక్కుకొనను అంటి నడుచుట దీనిఫలము కార్యనాశము.

2. వక్రితము:— వాయుతత్త్వమున నడుచునపుడు స్వరము ఆతత్త్వమును దాఁటి భుజమునందు తగులుట. దీనిఫలము కార్యనష్టము. యత్నించినట్లు జరుగదు.

3. స్ఫుటితము:— శుభతత్త్వములలో స్వరము నడుచుచు వేఱు రెండు శుభతత్త్వములలో స్వరము మిశ్రమగుట. దీనిఫలము కార్యసాధకము.

శుభతత్త్వములలో స్వరము నడుచుచు వేఱే రెండు అశుభతత్త్వములలోఁ జేరినను స్ఫుటిత మనఁబడును. దీనిఫలము కార్యహాని.

4. స్ఖలితము:— శ్వాసము కనఁబడి కనఁబడక నడుచుట. దీనిఫలము కార్యనష్టము.

5 జ్వలితము:— తేజస్తత్త్వమునందు స్వరము వేగముగా నడుచుట. దీనిఫలము విశేషనష్టము

ధ్వంసమానము:— ముక్కుమూసికొనిగాని మఱి యేవిధముగాగాని శ్వాసము సరిగ్గావెడల కుండుట. దీనిఫలము కార్యహాని.

7. సుషుప్తము:— నిద్రాసమయమందు స్వరము నడుచుట దీనిఫలము అశుభము.

8. అస్తమయము:— శ్వాసము లేకుండుట. దీనిఫలము సమాధికాలమునందు బ్రహ్మజ్ఞానప్రాప్తియు, ఇతరకాలములందు మరణావస్థను దెలియఁజేయును

ఇదిగాక స్వరము బాల, కుమార, రాజ, వృద్ధ, మృత, సంక్రమము లని ఆఱువిధములుగా విభజింపఁబడును.

1. బాలస్వరము:— శ్వాసము నడిచియు నడువక కనఁబడునది. దీనియందు కార్యాలస్యమును, స్వల్పఫలప్రాప్తియును గల్గును.

2. కుమారస్వరము:— శ్వాసము చక్కఁగా నడుచునది. దీనియందు కార్యసిద్ధి.

3. రాజస్వరము:— శ్వాసము స్ఫుటముగాను చక్కఁగా నడుచునది. దీనియందు రాజ్యప్రాప్తి

4. వృద్ధస్వరము:— శ్వాసము ఖండింపఁబడినట్లు నడుచునది. దీనియందు మిశ్రఫలసిద్ధి.

5. మృతస్వరము:— శ్వాసము చక్కఁగా కనఁబడకుండునది. దీనియందు కార్యనాశము.

6. సంక్రమస్వరము:— ఇడాపింగళానాడులు క్షణక్షణమును మాఱిమాఱి నడుచునది. దీనియందు సర్వకార్యహాని.

మఱియు నీ స్వరము పృథివ్యాది పంచతత్త్వములుగను పరిణమించును. ఎట్లనఁగా:—

1. పృథివీతత్త్వము:— శ్వాసము 12 అంగుళములు చక్కఁగా నడుచునది. దీనియందు గృహారామాది నిర్మాణములు, యుద్ధజయము, శత్రుజయము, పశ్చిమప్రాంతప్రయాణము మొదలగు శాశ్వతకార్యములు చేయనగును.

2. అప్పుతత్త్వము:—శ్వాసము క్రిందివైపుగా 16 అంగుళములు నడుచునది. వివాహము, కృష్యాది కార్యములు, యోగములు, స్త్రీసంగమము, గృహనిర్మాణము, యుద్ధజయము ఈ కార్యములును చేయనగును.

3. తేజస్తత్త్వము:—శ్వాసము మీఁదివైపుగా 8 అంగుళములు నడుచునది. ఇది అశుభము నిచ్చునది గనుక ఏకార్యములు చేయరాదు.

4. వాయుతత్త్వము:— శ్వాసము అడ్డముగా 4 అంగుళములు నడుచునది. వాహనములునెక్కుట మొదలగు చరకార్యములు చేయనగును.

5. ఆకాశతత్త్వము:— శ్వాసము ముక్కునం దంటియు నంటక నడుచునది. దీనియందు సర్వకార్యములును సిద్ధించును.

సూర్య చంద్ర నాడులయందు పృథ్వ్యాది తత్త్వములు జరుగునపుడు కలుగు ఫలములు:— చంద్రస్వరము నడుచునపుడు పృథివి అప్పుతత్త్వములు నడిచెనేని శుభము కలుగును. తేజో వాయు రాకాశములు నడిచినచో ప్రయోజనము లేదు.

సూర్యస్వరము నడుచునపుడు పృథ్వి అప్పు తేజస్సు వాయువు ఆకాశము అను నీయైదుతత్త్వములలో నేది నడిచినను అశుభమే కల్గును.

అనఁగా ఆయా తత్త్వములకుం జెప్పిన అంగుళములకు అధికముగా నైనను, లేక తక్కువగా నైనను శ్వాసము నడుచునేని, అప్పుడు ఏ తత్త్వమును జరుగలే దని తెలిసికొని, ఆస్వర మేదియో దానిఫలమే జరుగు నని తెలిసికొనవలయును. ఇట్లే ప్రశ్న లడుగువారికిని ఆయాస్వరములయొక్క ఫలములను, తత్త్వనిర్దేశముచే కల్గిన ఫలములను జెప్పఁదగును.

గర్భప్రశ్న:— ప్రశ్న అడుగువారు స్వరారంభకాలమునందు అడిగినచో గర్భము కలుగు ననియును; శూన్యస్వరకాలమునందును, శ్వాసము పోవుచుండుకాలమునందును అడిగినచో గర్భము నిలువ దనియును చెప్పవలయును.

గర్భోత్పత్తి కల్గినపిదప యిదే ప్రశ్నను స్వరారంభకాలమునందు అడిగిరేని గర్భము నిల్చు ననియును; స్వరము పోవునపుడును శూన్యమందును అడిగిరేని గర్భము నిలువ దనియును జెప్పవలయును.

స్త్రీపురుషప్రశ్న:—సూర్యస్వరము నడుచునపుడు ప్రశ్నచేయునది ఉండుదిగా నుండి అది యెడమప్రక్కగా నిలిచి అడిగెనేని గుణవంతుఁడగు పురుషశిశువు కలుగుననియును; చంద్రస్వరము నడుచునపుడు ప్రశ్నచేయు స్త్రీ ఎడమప్రక్క నిలిచి అడిగెనేని స్త్రీశిశువు కలుగుననియును; సూర్యస్వరమునందు దక్షిణమున స్త్రీ నిలిచి యడిగినచో పురుషశిశు వనియును; పృథ్వీతత్త్వమునం దడిగిన కుమారుఁ డనియును, అప్తత్త్వమునందడిగినచో కన్యకయనియును, తేజోవాయురాకాశములం దడిగినచో గర్భనష్టమనియును; చంద్రనాడియందు ఆకాశ తేజస్తత్త్వములైనప్పు డడిగిన అల్పాయువుగల శిశువు పుట్టుననియును; పృథ్వీవాయుతత్త్వములం దడిగిన కుమార్తె యనియును; పృథ్వీతేజములం దడిగినచో గర్భపాత మనియును; పృథ్వ్యాకాశములందు అడిగినచో నపుంసకుఁడు కల్గు ననియును; సంక్రమస్వరము నడుచునపుడును, చంద్రస్వరము జలతత్త్వమునం దుండునపుడును, సూర్యస్వరము తేజస్తత్త్వమునం దుండునపుడును అడిగినచో అమడబిడ్డలు పుట్టుదు రనియును చెప్పవలయును.

సంభోగసమయమునందు స్త్రీకి సూర్యస్వరమును, పురుషునకు చంద్రస్వరమును నడుచునపుడు రేతఃస్ఖలన మగునేని పురుషశిశువును, ఏతద్వ్యతిరిక్త మగునేని స్త్రీశిశువును కల్గును.

ఆగమనప్రశ్న:— దూరదేశమునందు పోయినవాఁడు వచ్చునా రాఁడా యని యడుగునపుడు జలతత్త్వముగా నుండెనేని మజిలి రాఁగలఁడనియును; పృథ్వీతత్త్వమైనచో ఉన్నచోటనే యుండుననియును; వాయుతత్త్వమైనచో మఱొకస్థలమునకు బోయినాఁ డనియును, తేజస్తత్త్వ మైనచో రోగముచే బాధపడుచున్నాఁడనియును; ఆకాశతత్త్వ మైనచో మృతి చెందఁగలఁ డనియును జెప్పవలయును.

వర్షప్రశ్న:— సూర్యస్వరమునందు ప్రశ్న యడిగినచో వర్షము లే దనియును, చంద్రస్వరమునందు కల దనియును, చంద్రస్వరమున పృథ్వీతత్త్వ మైన ఆలస్యముమీఁద మంచివర్షము కలుగు ననియును, అప్తత్త్వమున శీఘ్రముగ వర్షము వచ్చుననియును, తేజోవాయురాకాశతత్త్వములందు వర్షము లే దనియును చెప్పవలయును.

ప్రశ్నచెప్పువారికి అనుకూలముగా నుండుటకొఱకు లిఖింపఁబడి యుండు స్వరతత్త్వవిసరణచక్రమును జూచి నిర్ణయించియును చెప్పవలయును.

## స్వరతత్త్వవివరణచక్రము.

| తత్త్వములు | పృథివి | అప్పు | తేజస్సు | వాయువు | ఆకాశము |
|---|---|---|---|---|---|
| వర్ణములు | పసుపు, తెలుపు, మిశ్రము | తెలుపు | ఎఱుపు | నలుపు | లేదు |
| కార్యములు | కృషి, స్థితికార్యములు | శాంత్యాదులు | క్రూరకర్మలు | శీఘ్రకార్యములు | జపతపధ్యానాదులు |
| రుచి | తీపు | ఒగరు | కారము | పులుసు | లేదు |
| స్థానము | ముక్కు | నాలుక | కన్నులు | చర్మము | చెవులు |
| జాతి | శూద్ర | వైశ్య | క్షత్రియ | సంకర | దేవ |
| గ్రహములు | సూర్య, చంద్ర, బుధ | సూర్య, చంద్ర, బుధ | సూర్య, చంద్ర, కుజ, శుక్ర | సూర్య, చంద్ర, గురు, రాహు | కేతు |
| తన్మాత్ర | గంధము | రసము | రూపము | స్పర్శము | శబ్దము |
| దిక్కులు | తూర్పు | పడమర | దక్షిణము | ఉత్తరము | సర్వదిక్కులు |
| ధాత్వాదులు | రోమచర్మాస్థిమాంసములు | శుక్లపురీషమూత్రములు | కాంతిక్షుత్పిపాసలు | ఆకుంచనకంపాదులు | కోప లజ్జామోదములు |
| గుణము | కించిదుష్ణము | అతిశీతలము | అత్యుష్ణము | కించిచ్ఛీతలము | లేదు |
| కాలనిర్ణయము | దినములు | గడియలు | నెలలు | సంవత్సరములు | కాలనియతిలేదు |

## ప్రశ్నసారము. (తెనుఁగు అర్థములు)

### విషయసూచిక.

21. అథ సంధిప్రశ్నః. (సంధిచేయుటవలన లాభము కలుగునా? కలుగదా?)
22. అథ సత్యాసత్యవార్తాప్రశ్నః (మాట నిజమా? అబద్ధమా?)
23 అథ వృష్టిప్రశ్నః. (వర్షము కురియునా?)
24. అథ వృష్టిదినానిప్రశ్నః. (ఎన్నిదినములలో వర్షము కురియును?)
25. అథ నక్షత్రస్య గర్భవిచారః (నక్షత్రములవలన వర్షము వచ్చుటను తెలిసికొనుట.)
26 అథ స్త్రీలాభాలాభప్రశ్నః. (ఇప్పుడు తలంచిన స్త్రీ భార్య యగునా? కాదా?)
27. అథ వ్యవహారప్రశ్నః (వ్యవహారము చేకూడునా? చేకూడదా?)
28. అథ నౌకాప్రశ్న. (ఓడ క్షేమముగా వచ్చునా?)
29. అథ రాజ్యప్రాప్తిరప్రాప్తిప్రశ్నః (రాజ్యము లభించునా? లభింపదా?)
3 . అథ అధికారప్రాప్తిరప్రాప్తిప్రశ్నః (అధికారము కలుగునా? కలుగదా?)
31. అథ గ్రామప్రాప్తిరప్రాప్తిప్రశ్నః. (గ్రామము ప్రాప్తించునా? ప్రాప్తించదా?)
32 అథ కార్యసిద్ధి ర్భవతీచ న భవతీచ ప్రశ్నః (కార్యము సిద్ధించునా? సిద్ధింపదా?)
33. అథ బంధమోక్షప్రశ్నః. (మోక్షము కలుగునా? కలుగదా?)

## గ్రంథప్రయోజనము.

శ్లో॥ భూతం భవిష్యం ప్రశ్నాంచ విజ్ఞాన జ్యోతిషాం మతమ్।
ఆయప్రశ్నాత్మకం గ్రంథం చమత్కృతికరం పరమ్॥

తా. గతకాలముయొక్కయు, రాఁగలకాలముయొక్కయు ప్రశ్నలను చెప్పుటకిది ప్రశస్తమైన గ్రంథము.

## ప్రశ్ననిబంధనము.

వాక్యం. ఉచ్చారితఫలం నామా ద్యక్షరవశతో జ్ఞాతాఽకారాదివర్ణైః, కృతాధ్వజాదయఆద్యాఃకల్పనీయా స్తత స్తేభ్యఃఫలంకల్పనీయం.

అకారాదిషోడశస్వరాః. కవర్గపంచమం,చవర్గపంచమం, టవర్గపంచమం, తవర్గపంచమం, పవర్గపంచమం, యకారాదిచతుష్కం, శవర్ణాదిచతుష్కమ్.

తా. పృచ్ఛకుం డడిగెడు ప్రథమవాక్యముయొక్క ప్రథమాక్షరమును కనిపెట్టి ఆ యక్షరమునకు ఏవర్గ మగునో ఆవర్గముయొక్క ధ్వజధూమ్రాదులను కనుఁగొని ప్రశ్న ఫలమును చెప్పవలసినది.

## వర్గానుక్రమణికాపథకము.

| సంఖ్య. | ధ్వజాదులు | ధ్వజాదులయొక్క వర్ణములు. | వర్ణముల సంఖ్య. | ధ్వజాదులయొక్క అధిదేవతలు. |
|---|---|---|---|---|
| 1. | ధ్వజః | అ-ఆ-ఇ-ఈ-ఉ-ఊ-ఋ ౠ-ఌ-ౡ-ఏ-ఐ-ఓ-ఔ-అం-అః | .6 | సూర్యుఁడు. |
| 2 | ధూమ్రః | క-ఖ-గ-ఘ-ఙ | 5 | కుజుఁడు. |
| 3 | సింహః | చ-ఛ-జ-ఝ-ఞ | 5 | శుక్రుఁడు. |
| 4 | శ్వానః | ట-ఠ-డ-ఢ-ణ | 5 | బుధుఁడు. |
| 5 | వృషః | త-థ-ద-ధ-న | 5 | గురువు |
| 6 | ఖరః | ప-ఫ-బ-భ-మ | 5 | శని. |
| 7 | గజః | య-ర-ల-వ | 4 | చంద్రుఁడు |
| 8 | ధ్వాంక్షః | శ-ష-స-హ | 4 | చంద్రుఁడు. |

## ధ్వజాద్యాదయః.

శ్లో॥ ధ్వజో ధూమ్రశ్చ సింహశ్చ శ్వానో వృష ఖరో గజః,
ధ్వాంక్షశ్చా ద్యాష్టకం జ్ఞేయం శుభాశుభ మిదం స్ఫుటమ్॥

తా. ధ్వజ, ధూమ్ర, సింహ, శ్వాన, వృష, ఖర, గజ, ధ్వాంక్షము లను నీయెనిమిదిని తెలిసికొని శుభాశుభములను చక్కఁగా జెప్పవలసినది.

## ధ్వజాదిస్వామినః కథ్యతే.

శ్లో॥ ధ్వజే సూర్యశ్చ విజ్ఞేయో ధూమ్రే భౌమ స్తథైవచ।
సింహే చాధిపతి శ్శుక్రః శ్వానే చాధిపతి ర్బుధః॥
వృషే గురుశ్చ విజ్ఞేయం ఖరే సూర్యసుత స్తథా।
గజే ధ్వాంక్షశ్చ చంద్రశ్చ ఆద్యాదిపతయః స్మృతః॥

తా. ధ్వజమునకు సూర్యుఁడును, ధూమ్రమునకు కుజుఁడును, సింహమునకు శుక్రుఁడును, శ్వానమునకు బుధుఁడును, వృషమునకు గురువును, ఖరమునకు శనియును, గజధ్వాంక్షములకు చంద్రుఁడును అధిపతులు.

# ప్రశ్నములు.

---

## ౧. అథ అస్తినాస్తి ప్రశ్నః.

శ్లో. ధ్వజే గజే వృషే సింహే శీఘ్రలాభో భవే ధ్రువమ్ ।
ధ్వాంక్షే ధూమ్రే ఖరే శ్వానే నాస్తీతి కుశలం వదేత్.

తా. ప్రశ్నయొక్క ప్రథమాద్యక్షరము ధ్వజ, గజ, వృష, సింహములుగా నుదయమయినచో శీఘ్రమున లాభము కల దనియును, తక్కినట్టి ధ్వాంక్ష, ధూమ్ర, ఖర, శ్వానము లైనచో లాభహాని యగు ననియును తెలియదగ్గది.

## ౨. అథ కాలనిర్ణయప్రశ్నః.

శ్లో. ధ్వజే ప్రశ్నదినం జ్ఞేయం సింహే పక్ష స్తథైవచ ।
వృషే మాసశ్చ విజ్ఞేయో గజే మాసత్రయం తథా ।
శ్వానే ఖరేచ షాణ్మాసం ధూమ్రే ధ్వాంక్షేచ వర్షకమ్.

తా. ధ్వజ ముదయ మైనయెడల ఒకదినములోను, సింహ మయినచో పదు నైదుదినములలోను, వృషభ మైనచో ఒక నెలలోను, గజ మయినయెడల మూఁడు నెలలలోను, శ్వాన, ఖరము లైనచో ఆఱుమాసములలోను, ధూమ్రధ్వాంక్షము లైన చో ఒక సంవత్సరములోను అగు నని తెలియఁదగినది.

## 3. అథ ప్రవాసి కుశలప్రశ్నః.

శ్లో. ధ్వజే సింహే వృషే చైవ కుంజరే కుశలప్రదః ।
ధ్వాంక్షే శ్వానే ఖరే ధూమ్రే నాస్తీతి కుశలం వదేత్.

తా. ధ్వజ, సింహ, వృష, కుంజరము లైనచో క్షేమమనియు, తక్కిన వన్నియు క్షేమహీన మనియు తెలియునది.

## ౪. అథ ప్రవాసి చరాచరప్రశ్నః.

శ్లో. ధ్వజే గజే స్థిరం చైవ శ్వానే సింహేచ చంచలః ।
వృషే ధూమ్రే ప్రవాసస్థో ఖగే ధ్వాంక్షే వినశ్యతి.

తా. ధ్వజ గజము లైన స్థిరముగా నున్నాఁ డనియు, శ్వాన సింహము లైన నడుచుచున్నాఁ డనియు, వృష, ధూమ్రము లైన పోవు చున్నాఁ డనియు, ఖగధ్వాంక్షము లైనచో నష్ట మైనాఁ డనియు తెలియదగది.

## ౫. అథ ఆగమనప్రశ్నః.

శ్లో. ధ్వజే ధూమ్రే సమీపస్థో దూరస్థో గజ సింహయోః ।
వృషే ఖరేచ మార్గస్థో ధ్వాంక్షే శ్వానే పునర్గతః.

తా. ధ్వజ, ధూమ్రము లయినచో సమీపముగా నున్నాఁడనియును, గజసింహములైన దూరముగా నున్నాఁడనియును, వృష ఖరము లయిన మార్గమం దున్నాఁడనియును, ధ్వాంక్ష శ్వానము లైన మజిలి పోవు చున్నాఁడనియు తెలియఁదగినది

## ౬. అథ కాలోవాచ్యప్రశ్నః.

శ్లో. ధ్వజే పక్ష మితి ప్రోక్తం ధూమ్రే సప్తదినం తథా ।
ఏకవింశతి సింహేచ శ్వానే మాసం తథైవచ.
వృషేచ సార్ధమాసంచ ఖరే మాసద్వయం తథా ।
గజే మాసత్రయం ప్రోక్తం ధ్వాంక్షేచ అయనం తథా.

తా. ధ్వజ ముదయ మయినచో 15 దినములలోను, ధూమ్ర మైనచో 7 దినములలోను, సింహ మయిన 12 దినములలోను, శ్వాన మయిన ఒక నెలలోను, వృష మైన ఒకటిన్నర నెలలోను, ఖర మైన 2 నెలలలోను, గజ మైన మూడు నెలలలోను, ధ్వాంక్ష మైన 6 నెలలలోను వత్తురని తెలియునది.

## ౭. అథ నష్టవస్తులాభాలాభప్రశ్నః.

శ్లో. ధ్వజే గజే వృషే. సింహే గతలాభ స్తు నిశ్చయన్ ।
ధ్వాంక్షే ధూమ్రే ఖరే శ్వానే నష్టహానిశ్చ నిశ్చయమ్.

తా ధ్వజ, గజ, వృష, సింహము లుదయ మయినచో పోయినవస్తువు దొరకుననియు, తక్కిన ధ్వాంక్షాదు లుదయ మైనచో దొరక దనియు తెలియునది.

## ౮. అథ నష్టస్థానాంతరగత జ్ఞానప్రశ్నః.

శ్లో. ఉలూఖలే ధ్వజే నష్టం ధూమ్రే అగ్నిగృహే తథా ।
గజే సింహే అరణ్యేచ శ్వానే స్థానాంతరేపిచ ।
వృషే భాండగృహే చైవ కాష్ఠే శిలాతలే ఖరే ।
గజే నష్టం గృహే చైవ ధ్వాంక్షే విభూతికాగృహే.

తా. ధ్వజ ముదయమైన రోటిసిద్దను, ధూమ్రమైన వంటయింటి యందును, గజ సింహము లైన అడవి యందును, శ్వానమయిన యితరస్థలమునందును, వృష మైన భాండ

గృహమందును, ఖరమైన కట్టెలయందును లేక తాళ్ళయందును, గజమయిన యింటి యందును, ధ్వాంక్షమయిన ధనధాన్యము లుండు పురాణమందును నష్టమైన సొమ్ము వున్నదని తెలియవలయును.

౯. అథ నష్టవస్తుదిక్ప్రశ్నః.

శ్లో. ధ్వజే పూర్వగతం చైవ ధూమ్రే ఆగ్నేయనిశ్చితమ్ ।
సింహేచ దక్షిణే చైవ నైఋత్యాం శ్వాన ఏవచ ।
పశ్చిమే వృషభో జ్ఞేయం వాయవ్యే ఖరభే తథా ।
గజే చోత్తరదిగ్జ్ఞేయం ఈశాన్యాం ధ్వాంక్షకే తథా.

తా. ధ్వజ ముదయ మయిన తూర్పు, ధూమ్ర మయిన ఆగ్నేయము, సింహమైన దక్షిణము, శ్వానమైన నైఋతి, వృష మయిన పశ్చిమము, ఖర మయిన వాయుమూల, గజ మయిన ఉత్తరము, ధ్వాంక్ష మైన ఈశాన్యము; ఈదిక్కులలో నష్ట మయిన వస్తువు వున్న దని తెలియఁదగ్గది.

౧౦. అథ చోరజాతిజ్ఞానప్రశ్నః.

శ్లో. ధ్వజేచ బ్రాహ్మణశ్చోరః ధూమ్రే క్షత్రియ ఏవచ ।
సింహే వైశ్యశ్చ విజ్ఞేయః శ్వానే శూద్రస్తథైవచ ।
వృషేచ కర్మకో జ్ఞేయః ఖరే సేవక ఏవచ ।
గజే దాసీచ విజ్ఞేయా ధ్వాంక్షే రజక నాపితౌ.

తా. ధ్వజ ముదయ మయిన బ్రాహ్మణుఁ డనియు, ధూమ్రమైన క్షత్రియుఁ డనియు, సింహ మయిన వైశ్యుఁ డనియు, శ్వాన మయిన శూద్రుఁ డనియు, వృషమైన ప్రాణిహింస చేయువాఁడనియు, ఖరమయిన సేవకుఁ డనియు, గజమైన దాసి యనియు, ధ్వాంక్ష మయిన చాకలి, లేక మంగలి యనియును తెలియునది.

౧౧. అథ దానానిప్రశ్నః.

శ్లో. గోధూమాన్నం ధ్వజే దద్యాత్ ధూమ్రే చైవ తిలాన్నకమ్ ।
పీతవస్త్రంచ సింహేచ శ్వానే పిష్టాన్నవాలుకమ్ ।
వృషేచ తండులం దద్యాత్ ఖరేచ చణకం తథా ।
గజే గుడఘృతం దద్యాత్ ధ్వాంక్షే యావనలం తథా.

తా. ధ్వజ ముదయ మయిన గోధుమలఅన్నమును, ధూమ్ర మైన నువ్వులఅన్నమును, సింహమయిన పసుపువస్త్రమును, శ్వాన మైన [illegible]ండియును వాసనద్రవ్యములును,

వృషమయిన బియ్యమును, ఖరమైన సెనగలును, గజమయిన బెల్లమును నెయ్యియును, ధ్వాంక్షమైన గంజియును దానము చేయవలసినది

## ౧౨. అథ పూజాప్రశ్నః.

శ్లో. ధ్వజే భైరవపూజాస్యాత్ ధూమ్రేచ జగదంబికా ।
తథా సూర్యశ్చ సింహేచ శ్వానే వాయుసుతస్తథా ।
వృషే రుద్రారాధనం స్యాత్ ఖరే వాగీశ్వరీ తథా ।
గజే గణేశపూజా స్యాత్ ధ్వాంక్షేచ పితృపూజనమ్.

తా. ధ్వజముదయమయినచో భైరవుని, ధూమ్రమైనచో లక్ష్మిని పార్వతిని, సింహమయినయెడల సూర్యుని, శ్వానమయిన ఆంజనేయుని, వృషమయినచో సాంబమూర్తిని, ఖరమయిన సరస్వతిని, గజమయిన విఘ్నేశ్వరుని, ధ్వాంక్షమయిన పితృదేవతలను పూజింపవలసినది

## ౧౩. అథ ముష్టివస్తు వర్ణజ్ఞానప్రశ్నః.

శ్లో. కుసుంభంచ ధ్వజే జ్ఞేయం ధూమ్రే శ్వేతం తథైవచ ।
లోహితం స్యాశ్చ సింహేచ శ్వానే పాండురనీలకమ్ ।
పీతవర్ణం వృషే జ్ఞేయం ఖరే ధూమరవర్ణకమ్.

తా. ధ్వజముదయమైన యెఱ్ఱనైనట్టిదియును, ధూమ్రమైన తెలుపును, సింహమైన యెఱుపును, శ్వానమయిన తెలుపుగూడిన నీలమును, వృషమైన పసుపును ఖరమయిన నలుపు యెఱుపు గలిసినదిగను నుండు నని తెలియవలసినది.

## ౧౪. అథ ముష్టివస్తుజ్ఞానప్రశ్నః.

శ్లో. ధ్వజే వస్త్రంచ విజ్ఞేయం ధూమ్రే పుష్పం సమాదిశేత్ ।
సింహే ఫలంచ విజ్ఞేయం శ్వానే కాష్టాదికం తథా ।
వృషే ధాన్యం తథా ప్రోక్తం తృణాని ఖరసంజ్ఞికే ।
గజే బీజంచ విజ్ఞేయం ధ్వాంక్షే శుష్కం తథా స్మృతాః.

తా. ధ్వజముదయమయిన ఆకు అనియును, ధూమ్రమైన పుష్పమనియును, సింహమైన పండనియును, శ్వానమయిన కట్టెలు పిడుకలు మొదలైనవనియును, వృషమైన ధాన్యమనియును, ఖరమయిన తృణమనియును, గజమయిన విత్తనములనియును, ధ్వాంక్షమయిన యెండినవస్తువు అనియును తెలియునది

## ౧౫. అథ ధాతుజ్ఞానప్రశ్నః.

శ్లో. ధ్వజే సువర్ణవిజ్ఞేయం ధూమ్రే రౌప్యం తథైవచ ।
సింహే తామ్రంచ విజ్ఞేయం శ్వానే లోహం తథైవచ ।
వృషే కాంస్యం ఖరే నాగం గజే ధ్వాంక్షేంచ మిశ్రమమ్.

తా. ధ్వజ ముదయ మైన బంగార మనియును, ధూమ్ర మైన వెండియనియును, సింహ మైన తామ్ర మనియును, శ్వాన మయిన ఇను మనియును, వృష మైన కంచు అనియును, ఖర మైన తగరమనియును, గజ ధ్వాంక్షము లైన మిశ్రమధాతువు లనియును తెలియఁదగినది.

## ౧౬. అథ భూషణాది జ్ఞానప్రశ్నః.

శ్లో. ధ్వజేచ భూషణం మూర్ధ్ని ముఖాభరణ ధూమ్రకే ।
కంఠాభరణకం సింహే శ్వానే శ్రోత్రస్యమండనమ్ ।
వృషే హస్తాదికం జ్ఞేయం అంగుళీభూషణం ఖరే ।
గజేచ కటిసూత్రంచ ధ్వాంక్షే పాదాదికం తథా.

తా. ధ్వజ ముదయ మయిన శిరోభూషణ మనియును, ధూమ్ర మైన ముఖమందు ధరించు భూషణ మనియును, సింహ మయిన మెడలో ధరించు భూషణ మనియును, శ్వాన మైన చెవియందు ధరించు భూషణ మనియును, వృష మైన చేతియందు ధరించు భూషణ మనియును, ఖర మైన వ్రేళ్లలో ధరించు భూషణ మనియును, గజ మైన మొలలో ధరించు భూషణ మనియును, ధ్వాంక్ష మైన కాళ్లయందు ధరించు భూషణ మనియును తెలియవలయును.

## ౧౭. అథ ధాతుమూలజీవచింతా జ్ఞానప్రశ్నః.

శ్లో. ధ్వజే ధూమ్రే ధాతుచింతా గజే సింహేచ మూలకమ్ ।
శ్వానే ఖరే వృషే ధ్వాంక్షే జీవచింతావదే త్సుధీః.

తా. ధ్వజ ధూమ్రము లుదయ మైన ధాతు (లోహ) చింత యనియును, గజ సింహము లైన మూల (వృక్ష) చింత యనియును, తక్కినవి యంతయు జీవ (ప్రాణి) చింత యనియును తెలియఁదగ్గది.

## ౧౮. అథ గర్భిణీకన్యాపుత్రజన్మప్రశ్నః.

శ్లో. ధ్వజే గజే వృషే సింహే గుర్వీణీం పుత్త్రమాదిశేత్ ।
ధూమ్రే శ్వానే ఖరే ధ్వాంక్షే కన్యాజన్మం వినిర్దిశేత్.

తా. ధ్వజ, గజ, వృష, సింహము లుదయ మయిన గర్భముగా నుండు స్త్రీ పుత్త్రుని కను ననియు, తక్కిన ధూమ్రాదు లుదయ మైన స్త్రీప్రజ కలుగు ననియు నెఱుంగవలయును.

## ౧౯. అథ ఆయుః ప్రశ్నః.

శ్లో. ధ్వజే సింహే శతం ప్రోక్తం గజే వ్యోమాష్టకం తథా।
వృషేచ షష్టివర్షాణి ఖరే వ్యోమాదిసంజ్ఞికమ్।
శ్వానేచ వింశతిః ప్రోక్తం ధ్వాంక్షే షోడశకం తథా।
ధూమ్రే వర్షమితి జ్ఞేయ మిత్యాయు ర్బల మాదిశేత్.

తా. ధ్వజ సింహము లుదయ మైన 100 సంవత్సరము లాయు వనియును, గజ మైన 8 సంవత్సరము లనియును, వృష మైన 6 సంవత్సరము లనియును, ఖర మైన ఆయువు లే దనియును, శ్వాన మైన 20 సంవత్సరము లనియును, ధ్వాంక్ష మైన 16 సంవత్సరము లనియును, ధూమ్ర మైన 1 సంవత్సరము ఆయు వనియును చెప్పవలయును.

## ౨౦. అథ వాది జయాపజయప్రశ్నః.

శ్లో. ధ్వజే గజే వృషే సింహే స్థాయినాం జయసంభవః।
ధ్వాంక్షే శ్వానే ఖరే ధూమ్రే యాయినాం జయసంభవః.

తా. ధ్వజ, గజ, వృష, సింహము లుదయ మైన వాది జయమును పొందు ననియును, తక్కినవి యుదయ మైన ప్రతివాది జయమును పొందు ననియును తెలియునది.

## ౨౧. అథ సంధిప్రశ్నః.

శ్లో. ధ్వజే గజే వృషే సింహే సంధిలాభం మనీషిభిః।
ధూమ్రే శ్వానే ఖరే ధ్వాంక్షే సంధినష్టం భవే న్నరః.

తా. ధ్వజ, గజ, వృష, సింహము లుదయ మయిన సంధివలన లాభము కల్గు ననియును, తక్కినవి యుదయమున సంధివలన నష్టము కల్గు ననియును తెలియునది.

## ౨౨. అథ సత్యాసత్యవార్తా ప్రశ్నః.

శ్లో. ఉపశ్రుతీ సా భవతీతి సత్యాం ధ్వజే గజే సింహ వృషోదయేచ।
శ్వానేఖరేధ్వాంక్షకధూమ్రసంజ్ఞికేఉపశ్రుతీసాభవతీతిమిథ్యామ్.

తా. ధ్వజ, గజ, వృష, సింహము లుదయ మయినపో విన్నమాట సత్య మనియును, తక్కినవి యుదయ మయినయెడల విన్నమాట అబద్ధమనియును తెలియునది.

## ౨౩. అథ వృష్టిప్రశ్నః.

శ్లో. ధూమ్రే ఖరే వృషే శ్వానే వృష్టి ర్భవతి నిశ్చయమ్ ।
సింహే ధ్వజే మధ్యవృష్టి ఖరే ధ్వాంక్షే న సిద్ధ్యతి.

తా. ధూమ్రము, ఖర, వృష, శ్వానము లుదయ మయిన వర్షము కల దనియును; సింహ, ధ్వజము లైన అల్పవృష్టి యనియును; ఖర, ధ్వాంక్షము లైన వర్షము లే దని యును తెలియునది.

## ౨౪. అథ వృష్టిదినానిప్రశ్నః.

శ్లో. ధ్వజే పంచదినం ప్రోక్తం వృష్టి ర్భవతు నిశ్చయమ్ ।
ధూమ్రే సప్తదినం చైవ వృషే యుగ్మ స్తథైవచ ।
శ్వానేచ వింశతిః జ్ఞేయం గజేతు సప్తవింశతిః ।
సింహే చాష్టకం జ్ఞేయం ఖరే చైవ ఋతు స్తథా ।
ధ్వాంక్షేచ కాలవిజ్ఞేయం కథితం గణకోత్తమైః.

తా. ధ్వజ ముదయ మయినచో 5 దినములలోను, ధూమ్రము మయినచో 7 దినములలోను, వృష మయిన 2 దినములలోను, శ్వాన మైన 20 దినములలోను, గజమైన 27 దినములలోను, సింహమైన 8 దినములలోను, ఖర మైన 6 దినములలోను, ధ్వాంక్షమైనచో 3 దినములలోను వర్షము కురియు నని తెలియవలసినది.

## ౨౫. అథ నక్షత్రస్య గర్భవిచారః.

శ్లో. అశ్వినీచాదిదశకం నక్షత్రం దశసంజ్ఞకమ్ ।
తస్మా త్సప్తమనక్షత్రం గర్భం మధ్యంచ పాతనమ్ ।
గర్భపాతే శూన్యవృష్టి గర్భం భవతు నిశ్చితమ్ ।
గర్భమధ్యే తథా వృష్టి శీఘ్రం భవతి మానవః.

తా. అశ్వన్యాది మఖాంతము గర్భమనియును, పూర్వఫల్గుని మొదలు పూర్వాషాఢాంతము గర్భమధ్య మని యును, ఆవల 7 నక్షత్రములు గర్భపాత మని యును చెప్పఁబడును. గర్భపాతమందు వర్షము లే దని యు, గర్భమందు వర్షము నిశ్చయముగాఁ గల దనియు, గర్భమధ్యమందు శీఘ్రముగా వర్షము గల దనియు తెలియవలయును.

## ౨౬. అథ స్త్రీలాభాలాభప్రశ్నః.

శ్లో. ధ్వజేగజేసింహవృషేచలాభో జాయామహాపాచసుఖార్థధాత్రీ।
శ్వానేఖరేధ్వాంక్షకధూమ్రసంజ్ఞేకార్యస్యహానిఃకలహ స్తథైవ.

తా. ధ్వజ, గజ, సింహ, వృషము లుదయ మయిన స్త్రీ లభించు ననియును, తక్కినవి యుదయమయిన స్త్రీ లభించ దనియును తెలియదగ్గది.

౨౭. అథ వ్యవహారప్రశ్నః.

శ్లో. ధ్వజే గజే వృషే సింహే వ్యవహార స్సుఖావహః ।
ధ్వాంక్షే శ్వానే ఖరే ధూమ్రే వ్యవహారం న సిద్ధ్యతి.

తా. ధ్వజ, గజ, వృష, సింహము లుదయ మయినచో వ్యవహారము చక్కగా కాఁ గలదనియును, తక్కినవి యుదయమయిన వ్యవహారము కానేరదనియును దెలియఁగ వలయును.

౨౮. అథ నౌకాప్రశ్నః.

శ్లో. ధ్వజ కుంజర సింహేషు వృషేచ కుశలప్రదః ।
ధ్వాంక్షే శ్వానే ఖరే ధూమ్రే నౌకాంబుపతితం ధ్రువమ్.

తా. ధ్వజ, గజ, సింహ, వృషము లుదయ మయిన ఓడ క్షేమముగావచ్చి చేరు ననియును, తక్కినవి యుదయమయిన ఓడ మునిగిపోవు ననియును తెలియవలయును.

౨౯. అథ రాజ్యప్రాప్తి రప్రాప్తిప్రశ్నః.

శ్లో. ధ్వజే గజే చిరంప్రాప్తిః వృషే సింహేచ శీఘ్రతా ।
శ్వానే ఖరే దపప్రాప్తిః శత్రుః గృహ్ణాతి సత్వరమ్ ।
ధ్వాంక్షే ధూమ్రే పదంనాస్తి కలహశ్చ భ్రాతరా సదా ।
రాజయోగవిచార్యంచ కథితం గణికోత్తమైః.

తా. ధ్వజ, గజము లుదయ మయిన కొంతకాలమునకుమీద రాజ్యము ప్రాప్తించు ననియును; వృష, సింహము లైన త్వరలో ప్రాప్త మగు ననియును; శ్వాన ఖరము లైన ప్రాప్తించియు త్వరలో శత్రువులు గ్రహించికొందు రనియును; ధ్వాంక్ష ధూమ్రము లైన ప్రాప్తించదనియును, మఱియు భ్రాతృలవలన కలహములు కలుగు ననియును తెలియఁదగినది.

౩౦. అథ గ్రామప్రాప్తి రప్రాప్తిప్రశ్నః.

శ్లో. ధ్వజే వృషే గజే సింహే గ్రామప్రాప్తిస్తు నిశ్చితమ్ ।
శ్వానే ఖరే తథా ధ్వాంక్షే ధూమ్రే నాస్తీతి నిశ్చితమ్.

తా. ధ్వజ, వృష, గజ, సింహము లుదయ మయిన గ్రామము ప్రాప్తించుననియును; తక్కినవి యుదయ మయిన ప్రాప్తించదనియును తెలియఁదగినది.

31. అథ అధికారప్రాప్తి రప్రాప్తి ప్రశ్నః.

శ్లో. ధ్వజే గజే చిరం ప్రాప్తిః వృషే సింహేచ శీఘ్రతా ।
కలహాశ్చ ఖరే శ్వానే నాస్తీతి ధ్వాంక్షే ధూమ్రకే.

తా. ధ్వజ, గజము లుదయ మయిన కొంతకాలమునకుమీఁద అధికారము ప్రాప్తించు ననియును; వృష, సింహము లైన త్వరలో లభించుననియును; ఖర, శ్వానము లైన కలహములు కలుగు ననియును; ధ్వాంక్ష, ధూమ్రము లుదయ మైన ప్రాప్తించదనియును తెలిసికొనవలయును.

32. అథ కార్యసిద్ధి ర్భవతీచ నభవతీచ ప్రశ్నః.

శ్లో. ధ్వజే గజే చిరం కార్యం త్వరితం వృష సింహయోః ।
దీర్ఘకాలం ఖరే శ్వానే ధ్వాంక్షే ధూమ్రే న సిద్ధ్యతి.

తా. ధ్వజ, గజము లుదయమయిన కొంతకాలమునకుమీఁద కార్యము కాఁగలదనియును; వృష, సింహము లైన త్వరలో కాఁగల దనియును; ఖర, శ్వానము లైన బహుకాలమునకుమీఁద కాఁగల దనియును; ధ్వాంక్ష, ధూమ్రము లైన కార్యము కానేర దనియును యెఱుఁగవలయును.

33. అథ బంధ మోక్ష ప్రశ్నః.

శ్లో. ధూమ్రే శ్వానే బంధ మోక్ష ముచ్యతే చ వృషే గజే ।
ధ్వజే సింహే బంధనష్టం ఖరే ధ్వాంక్షే మృతి ర్భవేత్.

తా. ధూమ్ర ముదయ మయిన బంధము కల దనియు; శ్వాన ముదయ మైన మోక్షము కల దనియు; వృష, గజ, ధ్వజ, సింహము లైన బంధనష్ట మనియు; ఖర, ధ్వాంక్షము లైన మృతి కల దనియును తెలిసికొనతగ్గది. ఈ శ్లోకార్థమునే కారాగృహబంధ విముక్తి విషయమునందును గ్రహింపఁదగినది.

శ్లో. ప్రశ్నసార మిదం గ్రంథం విఘ్నరాజేన నిర్మితమ్ ।
అంగదే వోహ మార్షేయర్ష కుర్వే యామళసంగ్రహాత్.

తా. రుద్రయామళతంత్రమందు విఘ్నరాజకృతం బైన వాక్యరూప ప్రశ్నసారమను గ్రంథమును అంగదేవుఁడు ఆర్యసమ్మతంబుగా శ్లోకరూపమున రచించినాఁడు.

ప్రశ్నసారము
సమాప్తము.

---

# సిద్ధజాతకము.

## దశాపద్ధతి.

శ్లో. స్వర్క్షం శివాక్షిభి ర్యోజ్య వసుభి ర్భాగ మాహరేత్ ।
మంగళా పింగళా ధన్యా భ్రామరీ భద్రికా దశా ।
ఉల్కా సిద్ధాచ సంకష్టా దశాయాః పరికీర్తితాః.

తా. అశ్విని మొదలు జన్మనక్షత్రమునఁకు యెంచి ఆ మొత్తముతో మూఁటిని జేర్చి యెనిమిదిచేత భాగింపఁగా మిగిలినసంఖ్య దశ యగును. 1 మంగళా, 2 పింగళా, 3 ధన్యా, 4 భ్రామరీ, 5 భద్రికా, 6 ఉల్కా, 7 సిద్ధా, 8 సంకటా. అని దశలు యెనిమిది యగు చున్నది.

ఈ దశలు ప్రతి 36 సంవత్సరముల కొకమాఱు వచ్చుచుండును. కనుక జన్మాదిగా ప్రతి 36 సంవత్సరములకుమీఁద మఱల మొదటినుండి దశలను లెక్కించుకొనవలసినది.

మఱియు ప్రతిదశయందును విదశలును కలవు దశాసంవత్సరములతో విదశా సంవత్సరములను గుణించి వచ్చిన మొత్తమును దినములు చేసికొన్నయెడల అది విదశా కాల మగును. ఈ విషయము దశవిదశాపథకమును జూచినచో స్పష్ట మగును గాన విస్తరించి వ్రాయ లేదు.

ఈ సిద్ధజాతకమునందు దశలకును, విదశలకునుమాత్రము పథకము వ్రాయఁబడి యున్నది. ఫలమును దశవిదశలకే చెప్పఁబడి యున్నది. అయినను అంతర్దశలను లెక్కించి తెలిసికొని బుద్ధిమంతులు చెప్పనగును. ఏదశయందు ఏవిదశకు ఏ ఫలము చెప్పఁబడి యున్నదో, ఆలాగుననే ఆ విదశయందు ఆ అంతర్భుక్తికి ఆ ఫలము జరుగు నని చెప్పవలయును.

ఈ సిద్ధజాతకమునందు సంవత్సరమునకు 360 దినములును, నెలకు 30 దినములునుగా లెక్కింపఁబడి యున్నది.

అంతర్దశలను కనుఁగొనువిధమును ఉదాహరణమునకై యొక విదశయందుజరుగు అంతర్దశలను సూచింపించి, దానికి ఫలమునుకూ సూచింపఁబడియెడిని.

### మంగళదశయందు మంగళవిదశాదినములు 10.
### మంగళవిదశయందు జరుగు అంతర్దశావివరణము.

| | దినములు. | గడియలు. | | దినములు. | గడియలు. |
|---|---|---|---|---|---|
| మంగళ | 0 | 40 | భద్రికా | 1 | 20 |
| పింగళ | 0 | 50 | ఉల్కా | 1 | 30 |
| ధన్యా | 1 | 0 | సిద్ధా | 1 | 40 |
| భ్రామరీ | 1 | 10 | సంకటా | 1 | 50 |

ఈప్రకారముగనే ప్రతివిదశయందును జరుగు అంతర్దశలను తెలిసికొనఁదగును. అనఁగా విదశయందలి అంతర్దశయందు దినము ఒకటికి 40 గడియలచొప్పున జరుగునని తెలియఁదగినది

అంతర్దశాఫలనిరూపణ మెట్లనఁగా:—మంగళదశయందు మంగళవిదశాఫలమేదియో, మంగళవిదశయందు మంగళ అంతర్దశాఫలమును అదియే యని తెలియఁదగినది. ఇట్లే అన్నిటిని యూహించి తెలిసికొనవలయును.

## దశాధిపతులు.

శ్లో. మంగళాధిపతి శ్చంద్రః పింగళాచ ప్రభాకరః ।
ధన్యాధిప స్సురాచార్యో భ్రామరీ నాయకో కుజః ।
భద్రికాధిపతి స్సౌమ్యః ఉల్కాస్యా దధిపో శనిః ।
సిద్ధస్వామీ దైత్యగురుః సంకటాధిపతి స్తమః.

తా. మంగళదశాధిపతి చంద్రుఁడు, పింగళదశాధిపతి గురువు, భ్రామరీదశాధిపతి కుజుఁడు, భద్రికాదశాధిపతి బుధుఁడు, ఉల్కాదశాధిపతి శని. సిద్ధాదశాధిపతి శుక్రుఁడు, సంకటాదశాధిపతి రాహువు, కొందఱిమతమున రాహుకేతువు లిద్దరును సంకటాదశాధిపతులు.

## దశాసంవత్సరములు.

శ్లో. ఏక ద్విగుణ వేదేషు రస సప్తాష్ట సంజ్ఞయా ।
దశావిపాకసమయే తా సాం జ్ఞేయం శుభాశుభమ్.

తా. మంగళాదిదశలు యెనిమిదియు క్రమముగా ఒకటి మొదలు ఎనిమిదిసంవత్సరము లగును. అనఁగా, మంగళ (చంద్ర) దశాసంవత్సరము 1, పింగళ (సూర్య) దశాసంవత్సరములు 2, ధన్యా (గురు) దశాసంవత్సరములు 3, భ్రామరీ (కుజ) దశాసంవత్సరములు 4, భద్రికా (బుధ) దశాసంవత్సరములు 5, ఉల్కా (శని) దశాసంవత్సరములు 6, సిద్ధా (శుక్ర) దశాసంవత్సరములు 7, సంకటా (రాహు) దశాసంవత్సరములు 8.

## దశవిదశాపథకము.

### 1. మంగళ (చంద్ర) దశా సం. 1.

| విదశలు. | సం. | మా. | ది. | విదశలు. | సం. | మా. | ది. |
|---|---|---|---|---|---|---|---|
| 1.1 మంగళ | 0 | 0 | 10 | 1.5 భద్రికా | 0 | 1 | 20 |
| 1.2 పింగళ | 0 | 0 | 20 | 1.6 ఉల్కా | 0 | 2 | 0 |
| 1.3 ధన్యా | 0 | 1 | 0 | 1.7 సిద్ధా | 0 | 2 | 10 |
| 1.4 భ్రామరీ | 0 | 1 | 10 | 1.8 సంకటా | 0 | 2 | 20 |

## 2. పింగళ (సూర్య) దశా సం. 2.

| విదశలు. | సం. | నె. | ది. | విదశలు. | సం. | నె. | ది. |
|---|---|---|---|---|---|---|---|
| 2-1 పింగళ | 0 | 1 | 10 | 2-5 ఉల్కా | 0 | 4 | 0 |
| 2-2 ధన్యా | 0 | 2 | 0 | 2-6 సిద్ధా | 0 | 4 | 20 |
| 2-3 భ్రామరీ | 0 | 2 | 20 | 2-7 సంకటా | 0 | 5 | 10 |
| 2-4 భద్రికా | 0 | 3 | 10 | 2-8 మంగళ | 0 | 0 | 20 |

## 3. ధన్యా (గురు) దశా సం. 3.

| విదశలు. | సం. | నె. | ది. | విదశలు. | సం. | నె. | ది. |
|---|---|---|---|---|---|---|---|
| 3-1 ధన్యా | 0 | 3 | 0 | 3-5 సిద్ధా | 0 | 7 | 0 |
| 3-2 భ్రామరీ | 0 | 4 | 0 | 3-6 సంకటా | 0 | 8 | 0 |
| 3-3 భద్రికా | 0 | 5 | 0 | 3-7 మంగళ | 0 | 1 | 0 |
| 3-4 ఉల్కా | 0 | 6 | 0 | 3-8 పింగళ | 0 | 2 | 0 |

## 4. భ్రామరీ (కుజ) దశా సం. 4.

| విదశలు. | సం. | నె. | ది. | విదశలు. | సం. | నె. | ది. |
|---|---|---|---|---|---|---|---|
| 4-1 భ్రామరీ | 0 | 5 | 10 | 4-5 సంకటా | 0 | 10 | 20 |
| 4-2 భద్రికా | 0 | 6 | 20 | 4-6 మంగళ | 0 | 1 | 10 |
| 4-3 ఉల్కా | 0 | 8 | 0 | 4-7 పింగళ | 0 | 2 | 20 |
| 4-4 సిద్ధా | 0 | 9 | 10 | 4-8 ధన్యా | 0 | 4 | 0 |

## 5. భద్రికా (బుధ) దశా సం. 5.

| విదశలు. | సం. | నె. | ది. | విదశలు. | సం. | నె. | ది. |
|---|---|---|---|---|---|---|---|
| 5-1 భద్రికా | 0 | 8 | 10 | 5-5 మంగళా | 0 | 1 | 20 |
| 5-2 ఉల్కా | 0 | 10 | 0 | 5-6 పింగళా | 0 | 3 | 10 |
| 5-3 సిద్ధా | 0 | 11 | 20 | 5-7 ధన్యా | 0 | 5 | 0 |
| 5-4 సంకటా | 1 | 1 | 10 | 5-8 భ్రామరీ | 0 | 6 | 20 |

## 6. ఉల్కా (శని) దశా సం. 6.

| విదశలు | సం. | నె. | ది. | విదశలు. | సం. | నె. | ది. |
|---|---|---|---|---|---|---|---|
| 6-1 ఉల్కా | 1 | 0 | 0 | 6-5 పింగళ | 0 | 4 | 0 |
| 6-2 సిద్ధా | 1 | 2 | 0 | 6-6 ధన్యా | 0 | 6 | 0 |
| 6-3 సంకటా | 1 | 4 | 0 | 6-7 భ్రామరీ | 0 | 8 | 0 |
| 6-4 మంగళ | 0 | 2 | 0 | 6-8 భద్రికా | 0 | 10 | 0 |

## 7. సిద్ధా (శుక్ర) దశా సం. 7.

| విదశలు. | సం. | నె. | ది. | విదశలు. | సం. | నె. | ది. |
|---|---|---|---|---|---|---|---|
| 7-1 సిద్ధా | 1 | 4 | 10 | 7-5 ధన్యా | 0 | 7 | 0 |
| 7-2 సంకటా | 1 | 6 | 20 | 7-6 భ్రామరీ | 0 | 9 | 10 |
| 7-3 మంగళ | 0 | 2 | 10 | 7-7 భద్రికా | 0 | 11 | 20 |
| 7-4 పింగళ | 0 | 4 | 20 | 7-8 ఉల్కా | 1 | 2 | 0 |

## 8. సంకటా (రాహు) దశా సం. 8.

| విదశలు. | సం. | నె. | ది. | విదశలు. | సం. | నె. | ది |
|---|---|---|---|---|---|---|---|
| 8-1 సంకటా | 1 | 9 | 10 | 8-5 భ్రామరీ | 0 | 10 | 20 |
| 8-2 మంగళ | 0 | 2 | 20 | 8-6 భద్రికా | 1 | 1 | 10 |
| 8-3 పింగళ | 0 | 5 | 10 | 8-7 ఉల్కా | 1 | 4 | 0 |
| 8-4 ధన్యా | 0 | 8 | 0 | 8-8 సిద్ధా | 1 | 6 | 20 |

## ఫలనిరూపణము.

### 1. మంగళ (చంద్ర) దశా సం. 1. తత్ఫలము.

శ్లో. మంగళాయదిదశాచజన్మతో రాజ్యవృద్ధిరపి సర్వదా నృణామ్।
మిత్రవ ద్భవతి సర్వసజ్జనః ప్రాప్నువంతి సకలాః మనోరథాః.

తా. మంగళదశయందు రాజ్యలాభమును, సకలజనుల స్నేహమును, ఇష్టార్థసిద్ధులును కలుగును.

### 1-1. మంగళదశయందు మంగళవిదశాఫలము. 0-0-10.

శ్లో. దివ్యాంగనానాంసుఖభాగ్యవృద్ధిః మాన్యోనరేశస్యచకీర్తియుక్తః
పశ్వాదిపిత్రాదికళత్రయుక్తశ్చేన్మంగళాపాకగమధ్యగాస్యాత్.

తా. సుందరియగు స్త్రీవలన సుఖమును, భాగ్యవృద్ధియును, రాజులవలన సమ్మానమును, కీర్తియును కలుగును. పశువులు ఎద్దులు గుఱ్ఱములు మొదలగువానితోడను, తండ్రివర్గమువారితోడను, భార్యతోడను కూడినవాఁడై యుండును.

### 1-2. మంగళదశయందు పింగళవిదశాఫలము. 0-0-20.

శ్లో. బ్రతాపోన్నతే రేవ దూరీ భవన్తి
ప్రతిస్పర్థినో రాజమాన్యత్వ మత్ర ।

ధనప్రాప్తి రక్తాంబరాణాం సుఖం స్యాత్
యదా పింగళా మంగళా మధ్యగా స్యాత్.

తా. విశేషకీర్తియును, శత్రురాజులవలన గౌరవమును, ధనలాభమును, మతాంతరులైన జైనాదులవలన సౌఖ్యమును కల్గును.

1-3. మంగళదశయందు ధన్యావిదశాఫలము. 0-1-0.

శ్లో. వ్యాపారతో బహుసుఖం బహువృద్ధిరస్యాత్
మిత్రాది వస్తు ధన ధాన్య గృహాదిలాభమ్ ।
శత్రోః పరాజయ మిహ స్వజనైః ప్రతిష్ఠా
ధన్యా దశా భవతి మంగళపాకమధ్యే.

తా. వ్యాపారమువలన విశేషలాభమును, మిత్రులు, ఇష్టపదార్థములు, ధనము, ధాన్యము, గృహము మొదలగునవియు కల్గును. శత్రువులు తొలఁగిపోదురు. బంధుజనులలో గౌరవము సంప్రాప్తమగును.

1-4. మంగళదశయందు భ్రామరీవిదశాఫలము. 0-1-10.

శ్లో. శరీరనేత్రామయకంఠరోగైః భయం వికార స్సుహజాపదశ్చ ।
సర్వాంగపీడాతరుణీవియోగోయద్భ్రామరీమంగళగామినీస్యాత్.

తా. శరీరమునందును నేత్రమునందును కంఠమునందును రోగమును, భయమును, చిత్తవిక్షేపమును, ఆపదయును, భార్యావియోగమును కల్గును.

1-5. మంగళదశయందు భద్రికావిదశాఫలము. 0-1-20.

శ్లో. శరీరసౌఖ్యం ఋణమోచనంచ ధనాగమః కీర్తివిశేషవృద్ధిః ।
దేశాధికారోనృపమాన్యతాచభద్రాదశామఙ్గళమధ్యగాస్యాత్.

తా. శరీరమునకు ఆరోగ్యమును, ఋణవిమోచనమును, ధనలాభమును, విశేషకీర్తియును, అధికారప్రాప్తియును, రాజసమ్మానమును కలుగును.

1-6. మంగళదశయందు ఉల్కావిదశాఫలము. 9-2-0.

శ్లో. చిత్తభ్రమో భ్రమణతః పథి చోరకష్టం
శోకోదయం స్వజనవర్గవివాద ముగ్రమ్ ।
గ్రామాదిపుత్రకలహః కిల దేహపీడా
ఉల్కా యదా మంగళపాకమధ్యే.

తా. చిత్తవిభ్రమమును, సంచారమును, మార్గమందు దొంగలవలన బాధయును, దుఃఖమును, బంధుజనులతో విశేషకలహమును, ఉన్నతావునందు కలహమును, పుత్త్రులతో కలహమును, శరీరపీడయును కలుగును.

1-7. మంగళదశయందు సిద్ధవిదశాఫలము. 0-2-10.

శ్లో. ధనాంగనాలాభమపారసౌఖ్యంసుతీర్థయాత్రాసుతబంధుసౌఖ్యం
శత్రుక్షయస్స్యా దధికప్రతిష్ఠా చే న్మంగళాపాకగతాచ సిద్ధా.

తా. ధనలాభమును, స్త్రీలాభమును, విశేషసౌఖ్యమును, తీర్థయాత్రయును, బంధువులకును బిడ్డలకును సౌఖ్యమును, శత్రుజయమును, విశేషకీర్తియును కల్గును.

1-8. మంగళదశయందు సంకటవిదశాఫలము. 0-2-20.

శ్లో. ధనవినాశక చోరజనాద్భయం చరణనేత్రశిరః పరిపీడనమ్।
నిజకళత్రవియోగభయంభవేత్ యదిచమంగళమధ్యగసంకటా.

తా. ధననష్టమును, చోరులవలన భయమును, కాళ్ళు కన్నులు తల వీనియందు బాధయును, భార్యావియోగభయమును కల్గును.

2. పింగళ (సూర్య) దశా సం. 2. తత్ఫలము.

శ్లో. స్యాత్పుంసాం యది పింగళా ప్రథమతో హృద్రోగరోగప్రదా
నానారోగవివృద్ధిసంకట మిహ ప్రాప్నోతి సద్యః పుమాన్।
శూలంచ గ్రహణీ వివృద్ధి వమనం రక్తాది నేత్రం సదా
భీతీ రోగఘనాత్స్వమూలకలితా త్పుత్త్రాద్భయం తత్క్షణమ్.

తా. మొదట కడుపునొప్పియును, ఆమీఁద అనేకరోగములును కలిగి అందుచే సంకటమును, మఱియు శూల, గ్రహణి, రక్తవమనము, నేత్రరోగము, భయము, పుత్త్రభయమును కల్గును.

2-1. పింగళదశయందు పింగళవిదశాఫలము. 0-1-10.

శ్లో. శరీరే సుఖం వ్యాధి కష్టాదినాశం
ధనై ర్వాహనై రైభవై ర్వృద్ధిదాస్యాత్।
గృహే స్వల్పవాసః ప్రవాస స్స్వదేశే
యదా పింగళా పింగళా పాకమధ్యే.

తా. శరీరసౌఖ్యమును, వ్యాధిబాధానివారణమును, ధనవాహనవిభవవృద్ధియును, కొంతకాలము గృహమందు వాసమును, స్వదేశప్రయాణమును సంభవించును.

2-2. పింగళదశయందు ధన్యావిదశాఫలము. 0-2-0.

శ్లో. శత్రో ర్విమర్దనకరీ రణమోక్షకర్త్రీ
రాజః ప్రసాదఫలదా ధనధాన్యధాత్రీ ।
పుత్రాదికీర్తి నిజగేహాభివర్ధి ధన్యా
ధన్యాదశాభవతి చే దనుపింగళాయామ్.

తా. యుద్ధమునందు శత్రువులను జయించుటయును, రాజసమ్మానమును, ధనధాన్యభూలాభమును, పుత్రలాభమును, కీర్తియును, స్వగృహ ధనలాభమును కలుగును.

2-3. పింగళదశయందు భ్రామరీవిదశాఫలము. 0-2-20.

శ్లో. శోకోదయం వికలతా వివిధాపకీర్తిః
దేశాంతరే ఫలవియోగకరీ వ్రణార్తిః ।
హాని ర్ధ్రువం సుత కళత్ర వియోగ దాచ
స్యా ద్భ్రామరీ భవతి పింగళపాకమధ్యే.

తా. శోకమును, వ్యాకులమును, అనేకవిధములైన అపయశస్సును, అన్యదేశములవలన కలుగు ఫలమునకు నష్టమును, వ్రణబాధయును, కీడును, భార్యాపుత్రులకు మరణమును కలుగును.

2-4. పింగళదశయందు భద్రవిదశాఫలము. 0-3-10.

శ్లో. మంత్రాదిసౌఖ్య మణిమౌక్తికలాభదాస్య
భార్యాసుతాధిసుఖదా ధనధాన్యధాత్రీ ।
దేశాధికారపదవీ మపి యచ్ఛతీయం
చే ద్భద్రికా భవతి పింగళపాకమధ్యే.

తా. ఆలోచనవలన సౌఖ్యమును, రత్నములవలనను ముత్తెములవలనను లాభమును, పెండ్లాముబిడ్డలవలన సౌఖ్యమును కలుగును. మఱియు, ధనము ధాన్యము భూమి అధికారము యివియు సంప్రాప్తమగును.

2-5. పింగళదశయందు ఉల్కావిదశాఫలము. 0-4-0.

శ్లో. సదా విగ్రహాత్ వాదబుద్ధ్యా రతిస్యాత్
ప్రతిస్పర్ధయా బంధుభి ర్వ్యాకులత్వమ్ ।
ధనార్తిశ్చ వస్త్రాదికానాం వియోగం
యదా చోల్కికా పింగళాపాకమధ్యే

తా. ఎల్లప్పుడును ఒకరితో నొకరిని కలియనీయక యెడబాటు చేయుటయందే బుద్ధి ప్రవేశించి యుండుటయును, ఇతరులతో ద్వేషమును, బంధువులవలన మనో వ్యాకులత్వమును, ధనము, వస్త్రము మొదలగునవి చేయి విడిచి పోవుటయును సంప్రాప్త మగును.

### 2-6. పింగళదశయందు సిద్ధవిదశాఫలము. 0-4-20.

శ్లో. సౌభాగ్య వృద్ధి ర్విజయోరిపూణాం దేవార్చనం బ్రాహ్మణపూజ
నంచ । మిత్రాదిసౌఖ్యం వినయాభివృద్ధిం సిద్ధాదశా పింగళ
పాకమధ్యే.

తా. సకలభాగ్యములు కలుగును. శత్రువులు పలాయితు లగుదురు. దేవతలను బ్రాహ్మణులను పూజించుట తటస్థించును. మిత్రులు బంధువులు మొదలగువారికి సుఖము కల్గును. మంచిగుణమును పట్టువడును.

### 2-7. పింగళదశయందు సంకటవిదశాఫలము. 0-5-10.

శ్లో. చోరైర్ధనంనశ్యతి గుప్తదుఃఖం హానిర్భయం పుత్రకళత్రభేదైః।
చోరోదయం సంధిసమీరపీడా తమోదశా పింగళపాకమధ్యే.

తా. దొంగలవలన ధననష్టమును, మనస్సునందే దుఃఖమును, చెనుగువలని భయమును, భార్యాపుత్రులు భేదబుద్ధితో నుండుటయును, కీళ్ళయందు వాయురోగము వలని బాధయును కల్గును.

### 2-8 పింగళదశయందు మంగళవిదశాఫలము. 0-0-20.

శ్లో. తురగ భవన దార ద్రవ్య పుత్రాది సౌఖ్యం
నరపతిఫలయానం సర్వదా ధన్యబుద్ధిః ।
భవతి తను రరోగా ఉష్ణతాస్యా చ్ఛరీరే
సకలసుఖసమృద్ధిః పింగళా మంగళాస్యాత్.

తా. వాహనము, గృహము ప్రాప్తించును. భార్య, ధనము, పుత్రులు మొదలగువారికి సౌఖ్యమును కల్గును. రాజులవలన వాహనలాభము కల్గును. ఎల్లప్పుడును సత్త్వగుణ ముండును. శరీరము ఆరోగ్యముగా నుండును. ఉష్ణముగ నుండును, అనగా శరీరము రోగాంకురము లే కుండును. సకలసౌఖ్యములును గలుగును.

### 3. ధన్యా (గురు) దశా సం. 3. తత్ఫలము.

శ్లో. ధన్యా ధన్యతమా ధనం గజముఖవ్యాపారభోగప్రదం
పుంసాం మానవివృద్ధిదా రిపుగణప్రధ్వంసినీ సౌఖ్యదా ।

సన్మాంగల్యవిభూషణం పరిచయస్త్రీభిస్సహ ప్రాగ్భవం
విత్తం చాపరపూర్వపుణ్యనిచయైః లభ్యాదశా భాగ్యతః.

తా. ధన్యతయును, ఏనుఁగులు మొదలగు వ్యాపారములవలన లాభమును, కీర్తియును, శత్రుజయమును, భూషణలాభమును, పరిచితులగు స్త్రీలవలని సౌఖ్యమును, ధనలాభమును కలుగును.

3-1. ధన్యాదశయందు ధన్యావిదశాఫలము. 0-3-0.

శ్లో. మేధాసమా నవమహీనృపతి స్వకీయ
విద్యామతి ర్ధనకళత్రసుఖాని శశ్వత్ ।
శత్రోర్భయం భవతి చాత్ర మహాసుఖంచ
ధన్యా యదా భవతి ధన్యగతా తదా స్యాత్.

తా. బుద్ధిమంతుఁడగు క్రొత్తరాజులవలనను, తనయొక్క విద్యాబుద్ధివలనను సుఖము కలుగును. మఱియు ధనప్రాప్తి యగును. కళత్రసౌఖ్యము కల్గును. శత్రుజయమును, విశేషసుఖమును లభించును.

3-2 ధన్యాదశయందు భ్రామరీవిదశాఫలము. 0-4-0.

శ్లో, అలస మధికనిద్రా వాతయుక్తం శరీరం
సతతభ్రమణ శత్రుద్వేషణం విగ్రహంచ ।
అధమజనవివాదే మానసం మానభంగం
యది భవతి హి ధన్యా మధ్యగా భ్రామరీ చేత్.

తా. సోమరితనమును, విశేషనిద్రయును, వాయురోగమును, పిత్తాధిక్యమును సంభవించును శత్రుద్వేషమును, మిత్రవిరోధమును, నీచులతో కలహమును, మానభ్రష్టమును కలుగును.

3-3. ధన్యాదశయందు భద్రవిదశాఫలము. 0-5-0.

శ్లో. అతులమమలకీర్తి ర్ద్రవ్యవృద్ధిః పరస్మాత్
స్వజనసుతకళత్రం సర్వదా సౌఖ్య మత్ర ।
భవతి రిపువినాశస్యాచ్చ సౌఖ్యాభివృద్ధిః
యది భవతిచ ధన్యా మధ్యగా భద్రికా చేత్.

తా. విశేషకీర్తియును, ధనలాభమును, బంధుభార్యాపుత్రులకు సౌఖ్యమును, శత్రుజయమును, అధికసౌఖ్యమును కలుగును.

### 3-4. ధన్యాదశయందు ఉల్కావిదశాఫలము. 0-6-0.

శ్లో. వ్యయ కలహ రతిస్సాస్య ద్దారవైకల్యతాచ
రిపువివిధవికారై ర్విగ్రహో బంధుభిశ్చ ।
నృపనిశిచరపీడా వాయుపీడాచ సంధా
యది భవతిచ ధన్యా మధ్యగా ఉల్కలాచ.

తా. ధననష్టమును, కలహమును, కళత్రవిరోధమును, శత్రువులవలన కీడును, బంధువిరోధమును, రాజులవలనను పిశాచాదులవలనను (లేక దొంగలవలనను) దుఃఖమును కలుగును.

### 3-5. ధన్యాదశయందు సిద్ధవిదశాఫలము. 0-7-0.

శ్లో. నృపతిమానవిరాజితవిగ్రహో రిపుభయంతురగాదియుతంసదా।
సుతకళత్రసుఖంచహి సిద్ధికా ప్రకురుతే యది ధన్యదశాగతిః.

తా. రాజసమ్మానమును, పగవారికి తన్ను చూడఁగానే భయమును, వాహనలాభమును, పెండ్లము బిడ్డలకు సౌఖ్యమును కలుగును.

### 3-6. ధన్యాదశయందు సంకటవిదశాఫలము. 0-8-0.

శ్లో. కళత్రకష్టం కమలావియోగం శత్రుప్రకోపం నృపచోరభీతిమ్ ।
వాతాదిరోగంకురుతేవ్రణాది తమోదశా ధన్యదశాగతాచేత్.

తా. భార్యకు కష్టమును, ధననష్టమును. శత్రుభయమును, రాజభయమును, చోరభీతియును, వాతపిత్తాదిరోగములును, వ్రణములును గలుగును.

### 3-7. ధన్యాదశయందు మంగళవిదశాఫలము. 0-1-0.

శ్లో. భూపాలయుగ్గతవికారవిచిత్రభోగ
ప్రౌఢప్రతాపవిహితాచరణం సుపుణ్యమ్ ।
ద్రవ్యాశ్వలాభయుత మత్రచ తీర్థలాభ
శ్చైన్మంగళా యదిచ ధన్యదశా ప్రపన్నా.

తా. రాజులవలన విశేషసంపదయును, భోగమును, కీర్తియును, శౌర్యయుక్తమైన పుణ్యకార్యములు చేయుటయందు బుద్ధియును, ధనప్రాప్తియును, వాహనలాభమును, పుణ్యతీర్థలాభమును కలుగును.

3-8. ధన్యాదశయందు పింగళవిదశాఫలము. 0-2-0.

శ్లో. సదాశత్రునాశస్స్వగోత్రప్రతిష్ఠా మహాధాన్యలాభోవివాదేజయశ్చ।
స్వదారాదిసౌఖ్యంకలిస్సార్వర్థసిద్ధిః భవేద్ధన్యగాపింగళాచేత్తదానీమ్.

తా. శత్రుజయమును, స్వజనులయందు విశేషకీర్తియును, విశేషధాన్యలాభమును, వ్యవహారమందు జయమును, భార్యాపుత్రులకు సౌఖ్యమును, ధనలాభమును కలుగును.

4. భ్రామరీ (కుజ) దశా సం. 4. తత్ఫలము.

శ్లో. దుర్గారణ్యమహీధరోపగహనారామాతపవ్యాకులా
దూరాత్కాంతరతరం భ్రమంతి మృగవత్తృష్ణాకులా స్సర్వతః।
జాతాయేచ నృపాన్వయేపి రుచిరే యేషాం దశా భ్రామరీ
భ్రాన్తాస్సేవ్యయగృహంవిహాయనియతంత్స్థాయాంలుఠన్తేముహుః.

తా. దుర్గము, అరణ్యము, పర్వతము, ఉపవనము, ఆరామము ఈ ప్రదేశములయందు సంచారము కలుగును. ఎండలో తిరుగుట, మనోవ్యాకులము, అధికతాపము, ఇవి కలుగును. గృహమునందు వసియింపనీయక చేయును. మాటిమాటికి భూమియందు పడుటయు సంభవించును.

4-1. భ్రామరీదశయందు భ్రామరీవిదశాఫలము. 0-5-10.

శ్లో. వికలబుద్ధి ధనార్తికరీ మహత్ సమరదుర్గనివేశనకారిణీ।
తురగవాహనహానికరీ భవేత్ భ్రమరిపాకగతాయది భ్రామరీ.

తా. మనోవ్యాకులత, ధననాశము, యుద్ధమునందును దుర్గమునందును వాసము, వాహననష్టము ఇవి కలుగును.

4-2. భ్రామరీదశయందు భద్రవిదశాఫలము. 0-6-20.

శ్లో. భూపాలతో బహుసుఖం మహతీం ప్రతిష్ఠాం
భాగ్యోదయం స్వజనపుత్రకళత్రలాభమ్।
భాగ్యాదిలాభ మమలం కురుతేచ భద్రా
[illegible] భ్రామరీ భవతి సా నృప తేర్థవృద్ధిః.

తా. రాజువలన విశేషసౌఖ్యమును, విశేషకీర్తియును, ధనలాభ[illegible]ను, జనపుత్రమి[illegible] వృద్ధి[illegible] కలుగును.

4-3. భ్రామరీదశయందు ఉల్కావిదశాఫలము. 0-8-0.

శ్లో. వాతామయశ్లేష్మశిరోవ్యధాచ కంఠాదికష్టం కురుతే భయంచ।
కృష్యర్థకీర్తిశ్చవినాశకర్త్రీచేద్భ్రామరీమధ్యగతోల్కలాచేత్.

తా. వాతరోగము, శీతలరోగము, శిరోరోగము, కంఠరోగము, (దగ్గు మొదలగునవి), కృషినష్టము, ధననష్టము, అవమానము ఇవి కల్గును.

4-4. భ్రామరీదశయందు సిద్ధవిదశాఫలము. 0-9-10.

శ్లో. ఉగ్రంవివాదంచమహాప్రకాశంమాంగల్యవస్త్రాభరణాదిలాభమ్।
ప్రజ్ఞావిశేషం నృపమాన్యతాంచ తద్భ్రామరీమధ్యగతాచసిద్ధా.

తా. వివాదమునందు జయమును, శుభమును, వస్త్రభూషణాదిలాభమును, బుద్ధిప్రకాశమును, రాజసన్మానమును కల్గును.

4-5. భ్రామరీదశయందు సంకటవిదశాఫలము. 0-10-20.

శ్లో. తనౌ దుఃఖదం రాజపక్షారిసిద్ధిః
సుహృద్బంధుకష్టం గృహే నైవవాసః।
గతౌ విభ్రమం ఘాతపాతాదికంచ
యదా భ్రామరీ పాకగా సంకటాస్యాత్.

తా. దుఃఖమును, రాజవిరోధమును, మిత్రులకును బంధువులకును కష్టమును కల్గును. ఇంటిని విడిచి తిరుగు చుండుట, చిత్తవిభ్రమము, దెబ్బలౌకుట, పడుట ఇవియును సంభవించును.

4-6. భ్రామరీదశయందు మంగళవిదశాఫలము. 0-1-10.

శ్లో. రజతవిద్రుమహేమవరాంగనాసుఖమహీపతిమానయుతంనరం।
విమలకీర్తియుతంకురుతే కుజాధిపగతాఖలు మంగళకాఫలమ్.

తా. బంగారు వెండి, పగడములును, ఉత్తమస్త్రీవలని సౌఖ్యమును, రాజపూజితమును, విశేషకీర్తియును కలుగును.

4-7. భ్రామరీదశయందు పింగళవిదశాఫలము. 0-2-20.

శ్లో. నిపుణమతివినీతం వేదశాస్త్రార్థబుద్ధిం
స్వజనధనసుఖాఢ్యం తీర్థయాత్రార్పితార్థమ్।
జితసకలరిపుంవా మానవం పింగళాచేత్
యది భవతి కదాచి ద్భ్రామరీ మధ్యగా చేత్.

తా. మంచిబుద్ధియును, వేదశాస్త్రవిచారమును, బంధువులకు సుఖమును, ధనలాభమును, తీర్థయాత్రలకొఱకు ధనవ్యయమును, శత్రుజయమును కల్గును.

### 4-8. భ్రామరీదశయందు ధన్యావిదశాఫలము. 0-4-0.

శ్లో. ప్రతాపానలై ర్భస్మితా శేషశత్రుః
కళత్రాత్మజశ్రేష్ఠసౌఖ్యం విధత్తే।
తథా రత్నముక్తాప్రవాళాదిలాభో
యదా ధన్యకా భ్రామరీ మధ్యగాచేత్.

తా. ప్రతాపాధిక్యముచేత శత్రుజయమును. భార్యకును పుత్త్రులకును విశేష సౌఖ్యమును, నవరత్నలాభమును కల్గును.

### 5. భద్రికా (బుధ) దశా సం. 5. తత్ఫలము.

శ్లో. కాన్తాయోగసమాగమో ధనసుఖం ప్రాప్నోతిసద్యః పుమాన్
మాంగల్యం గృహమండలే ఽఖిలసుఖవ్యాపారసక్తం మనః।
రాజ్ఞాం యోగకృపాలలాటతిలకా సత్త్రోఽఙ్గనాభిస్సమం
క్రీడామోదభరో దశా భవతిచే త్పుంసాంచ భద్రాభిదా.

తా. స్త్రీసంయోగమును, ధనలాభమును, శుభమును, సకలసౌఖ్యమును, వ్యాపారము చేయుటయందు బుద్ధియును, రాజులవలన సౌఖ్యమును, స్త్రీలవలన సురతసౌఖ్యమును కల్గును.

### 5-1. భద్రికాదశయందు భద్రవిదశాఫలము. 0-8-10.

శ్లో. ప్రౌఢప్రతాపంవిజయంరిపుక్షయంక్షోణీపతిప్రీతిమహాప్రతిష్ఠాం।
ప్రసన్నమూర్తింకురుతేధనాఢ్యంభద్రాదశాభద్రికమధ్యగాచేత్.

తా. విశేషప్రతాపమును, శత్రుజయమును, రాజవిశ్వాసమును, విశేషకీర్తియును, ఆరోగ్యమును. ధనలాభమును కలుగును.

### 5-2. భద్రికాదశయందు ఉల్కావిదశాఫలము. 0-10-0.

శ్లో. దద్రు కండు ముఖరోగపీడితం వాజి వాహన వినాశదుఃఖదమ్।
వహ్నిచోరనృపశత్రుపీడనం భద్రికాభవతి చోల్కలాన్వితా.

తా. దద్దులు గజ్జి నోటియందు కురుపులు మొదలగుబాధ, వాహననష్టము,అగ్ని వలనను దొంగలవలనను రాజులవలనను శత్రువులవలనను కష్టము సంభవించును.

5-3. భద్రికాదశయందు సిద్ధవిదశాఫలము. 0-11-20.

శ్లో. యజ్ఞాదికర్మజసుఖం ద్విజదేవభక్తి రత్యర్థమర్థచయనం విభుతా సమేతమ్। చేత్సిద్ధికాభద్రికయాసమేతా కళత్రపుత్రాదియుతో విరాజతే.

తా. యజ్ఞయాగాదికర్మములవలన సౌఖ్యమును, బ్రాహ్మణులయందును దేవలయందును భక్తియును, రతిసుఖమును, యజ్ఞమును, రాజవిశ్వాసమును, పెండ్లాము బిడ్డలతోఁ గూడి యుండుటయును కలుగును.

5-4. భద్రికాదశయందు సంకటవిదశాఫలము. 1-1-10.

శ్లో. జ్వరవమనవికారం గుప్తదుఃఖం విపత్తిం అనిలభయవినాశం ద్వంద్వయుద్ధంవినాశమ్ । నిజకులపరిభ్రంశక్లేశపీడావ్రణాఢ్యం యది భవతిచ భద్రా మధ్యగా సంకటాచేత్.

తా. జ్వరము, వాంతి, మనోదుఃఖము, ఆపద, అగ్నిభయము, యుద్ధమునంగు అపజయము, స్వజనులయందు అమర్యాద, మనోక్లేశము, వేదన, వ్రణములు ఇవి కలుగును.

5-5. భద్రికాదశయందు మంగళవిదశాఫలము. 0-1-20.

శ్లో. ధాన్యాంబరాణి నిజవర్గ సుఖానిపుష్టిం లీలావిలాస పురతస్సుకృతస్యసిద్ధిమ్ । ప్రీతింపరాంప్రకురుతేచ మహాప్రతిష్ఠాం భద్రా దశాంగతవతీ కిల మంగళాచ.

తా. ధాన్యము, వస్త్రము, భార్యాపుత్రాదులకు సుఖమును, పుష్టియును, ఇష్టగోష్ఠియును, పుణ్యఫలమును, ప్రియమును, విశేషకీర్తియును కల్గును.

5-6. భద్రికాదశయందు పింగళవిదశాఫలము. 0-3-10.

శ్లో. సుహృదనన్తధనం కలినాశనం విమలబుద్ధి మనేకసుఖానిచ । అమలకీర్తియుతంకిల పింగళా ప్రకురుతేయదిభద్రికయాన్వితా.

తా. మిత్రలాభమును, ధనలాభమును, దోషనివృత్తియును, విశేషబుద్ధియును, అధికసౌఖ్యమును, మహాకీర్తియును కల్గును.

5-7. భద్రికాదశయందు ధన్యావిదశాఫలము. 0-5-0.

శ్లో. కళత్రసౌఖ్యం మహిషీసుధేను ద్రవ్యాన్వితం శత్రుధనేవివాదః। నృపేంద్రమానం కురుతేచ.ధన్యా భద్రాదశాయాం యదిచేత్ప్రవిష్టా.

తా. భార్యాసౌఖ్యమును, ఎనుములు, ఆవులు, వస్తువులును కల్గును. శత్రువులయందుండు ధనముకొఱకై వివాదమును, రాజసమ్మానమును కల్గును.

5-8. భద్రికాదశయందు భ్రామరీవిదశాఫలము. 0-6-20.

శ్లో. కళత్రపుత్రాదివియోగదుఃఖం మహద్భయంభూపకృతంత్వనిష్టమ్।
త్రిదోషరోగంచ శరీరకష్టం చేద్భ్రామరీభద్రికయా సమేతా.

తా. పెండ్లాము బిడ్డలు మృతి చెందుటవలని దుఃఖమును, విశేషభయమును, రాజులవలన అవమానమును, రోగమును, శరీరప్రయాసమును కలుగును.

6. ఉల్కా (శని) దశా సం. 6. తత్ఫలము.

శ్లో. ఉల్కాచేద్యది యోగినీ శనిదశా ప్రాప్నోతి కష్టం మహత్
క్లేశం చాపి సదా వియోగగమన భ్రాన్త్యాది జీవే భయమ్।
రాగద్వేషవివృద్ధిదా రిపుభయం రోగంభయం సర్వదా
ఏవం జన్మఫలం భవేచ్చ కలహో నిత్యం పరం జ్యోతిషి.

తా. విశేషకష్టమును, మనఃక్లేశమును, అప్పుడప్పుడు బంధుమిత్రాదులు యెడబాసిపోవుటయును, నడకయును, చిత్తభ్రమచే ప్రాణభయమును, కామక్రోధాదులు వృద్ధియగుటయును, శత్రుభయమును, సదా రోగభయమును, నిత్యమును కలహమును కలుగును.

6-1. ఉల్కాదశయందు ఉల్కావిదశాఫలము. 1-0-0.

శ్లో. దేహేపీడా జాయతే వాతపిత్తై
రాజ్ఞాభీతి ర్బంధుభి శ్శత్రుభిశ్చ।
పుత్రాదేశ్చ స్యా ద్వియోగా ద్విపత్తి
శ్చోల్కాపాకే బంధనం చాభిచారైః.

తా. శరీరబాధయును, వాతపిత్తరోగమును, రాజభయమును, బంధువిరోధమును, పుత్రమరణమును, ఆపదయును కలుగును.

6-2. ఉల్కాదశయందు సిద్ధవిదశాఫలము. 1-2-0.

శ్లో. క్రయవిక్రయనైపుణలాభరతో పురనాథశ్చచమూపతిర్వా।
అథవా యదిపుత్రలాభగో ఉల్కాపాకగతాచ సిద్ధికాస్యాత్.

తా. కొనుటవలనను విక్రయించుటవలనను లాభమును, రాజులవలనను, లేక సేనాధిపతివలనను లాభమును, లేక పుత్రలాభమును కల్గును.

6-3. ఉల్కాదశయందు సంకటవిదశాఫలము. 1-4-0.

శ్లో. శిరః కర్ణ నా సాక్షి కంఠే వికారో
భవేత్ క్లేశ తాపై నృపా చ్చోరతోపి।
భయం బంధనం దేహపీడా వియోగో
యదా ఉల్కలా మధ్యగా సంకటాస్యాత్.

తా. తల, చెవులు, ముక్కు, కన్నులు, గొంతు అను నీ యంగములయందు వేదనయును, క్లేశమును, రాజులవలనను దొంగలవలనను భయమును, కారాగృహవాసమును, శరీరపీడయును, వియోగమును కలుగును.

6-4. ఉల్కాదశయందు మంగళవిదశాఫలము. 0-2-0.

శ్లో. రోగో వినాశో రిపు కష్టనాశం
లాభో భవే ద్దేశయుత స్సదా స్యాత్।
పౌరాజనా స్తస్య సహాయకా స్సుశ్చ
శ్చే న్మంగళా చోల్కల పాకగా స్యాత్.

తా. రోగనివృత్తియును, శత్రుబాధానివృత్తియును, లాభమును, స్వదేశమునం దుండుటయును, గ్రామస్థులవలన సహాయమును కల్గును.

6-5. ఉల్కాదశయందు పింగళవిదశాఫలము. 0-4-0.

శ్లో. దారాంగనాహాస్యవిలాససౌఖ్యంవస్త్రాదిలాభోధనధాన్యసంపత్।
పుణ్యే పరస్సాశ్చ ద్విజదేవతీర్థే చేదుల్కలా పాకగపింగళాస్యాత్.

తా. భార్యవలన విశేషసౌఖ్యమును, వస్త్రభూషణలాభమును, ధనధాన్యసమృద్ధియును, పుణ్యమందును విప్ర దేవ తీర్థములయందు బుద్ధియును కల్గును.

6-6. ఉల్కాదశయందు ధన్యావిదశాఫలము. 0-6-0.

శ్లో. సుఖోదయోమిత్రసమాగమశ్చ రిపుక్షయో దేశనరాధిపత్వమ్।
బహుప్రతాపేనచ సర్వమైత్రీ చేదుల్కలాపాకగతాచ ధన్యా.

తా. సౌఖ్యమును, మిత్రసందర్శనమును, శత్రుజయమును, దేశాధిపత్యమును, విశేషకీర్తియును, సకలజనవిశ్వాసమును గల్గును

6-7. ఉల్కాదశయందు భ్రామరీవిదశాఫలము. 0-8-0.

శ్లో. దేశత్యాగో వ్యాధి దుఃఖం వియోగో
బంధో నాశో బుద్ధినాశో ధనత్వమ్।

తేజో భ్రంశ శ్చాగ్నిచోరాది భీతిః
ఉల్కాపాకే జాయతే భ్రామరీ చేత్.

తా. స్వదేశమును విడిచి పోవుటయును, వ్యాధి దుఃఖమును, వియోగమును, బంధుజననష్టమును, బుద్ధిభ్రంశమును, ధననష్టమును, అవమానమును, దొంగల భయమును, అగ్నిభయమును కలుగును.

6-8. ఉల్కాదశయందు భద్రవిదశాఫలము. 0-10-0.

శ్లో. స్వర్ణాదిరౌప్యాదిసహస్రముగ్ర వాణిజ్యభావేనధనాగమస్స్యాత్।
చతుష్పదప్రాప్తిసుహృత్సుఖంచ చేద్భద్రికాయాంసుగృహస్యలబ్ధిః.

తా. బంగారు వెండి మొదలగు లోహముల వ్యాపారమువలన ధనలాభమును, ఎద్దులు గుఱ్ఱములు ఆవులు మొదలగు చతుష్పాదజంతులాభమును, మిత్రులవలన సుఖమును, గృహలాభమును కలుగును.

7. సిద్ధా (శుక్ర) దశా సం. 7. తత్ఫలము.

శ్లో. సిద్ధా సిద్ధకరీ సుభోగజననీ మానార్థసంధాయినీ
విద్యా రాజసుపూజితా బహుసుఖం తత్కాలసిద్ధిప్రదమ్.
రాజప్రసాదంస్వజనాదిసౌఖ్యంధాన్యాదిలాభంగుణకీర్తిలబ్ధిమ్।
సదాంగనాసౌఖ్యమరిష్టహానింవిద్యాంచసిద్ధాప్రకరోతిపుంసామ్.

తా. ఇష్టార్థసిద్ధియును, భోగమును, సన్మానమును, ధనలాభమును, విద్యవలన రాజపూజితమును, విశేషసౌఖ్యమును, రాజసమ్మానమును, బంధుమిత్రులవలన సౌఖ్యమును, ధాన్యలాభమును, సద్గుణప్రాప్తియును, కీర్తియును, స్త్రీసౌఖ్యమును, రోగనివృత్తియును, విద్యాప్రాప్తియును కల్గును.

7-1. సిద్ధదశయందు సిద్ధవిదశాఫలము. 1-4-10.

శ్లో. ద్రవ్యాగమో మనసి చింతిత కార్యసిద్ధిః
సత్కార్యమంగళకరో బహుధాన్యవృద్ధిః।
గ్రామాధిపత్య సుఖ బంధుసుఖం భవే ద్ధి
చే త్సిద్ధికా సిద్ధిక పాకగాస్స్యాత్.

తా. ద్రవ్యాదాయమును, ఇష్టకార్యసిద్ధియును, సత్కార్యఫలప్రాప్తియును, విశేషధాన్యవృద్ధియును, గ్రామాధికారసుఖమును, బంధుజనసౌఖ్యమును కలుగును.

7-2. సిద్ధదశయందు సంకటవిదశాఫలము. 1-6-20.

శ్లో. ఆలస్యతంద్రాకటి గుహ్యపీడా ఆమాద్వికా రోదరవాతవేగః ।
రాజ్ఞాతిభీతిర్జలవహ్నిపాకః సిద్ధాదశాయాంయదిసంకటాస్యాత్.

తా. సోమరితనమును, తంద్రయును, నడుము పిఱుదులు ఘర్మస్థానము వీని యందు బాధయును, కడుపునందు వాయుప్రకోపముచే సంకటమును, రాజువలన భయమును, జలమునందును అగ్నియందును పడుటయును కల్గును.

7-3. సిద్ధదశయందు మంగళవిదశాఫలము. 0-2-10.

శ్లో. ముక్తాప్రవాళమణిభూషణలాభకారీ
నానావిధం ధనచయం కురుతే విభుత్వమ్ ।
దివ్యాంగనాజనసుచందనపంకలేప
శ్చే న్మంగళా సకలసిద్ధకపాకమధ్యే.

తా. ముత్తెములు, పవడములు, రత్నములు, ఆభరణములు వీనివలన లాభమును; అనేకవిధము లైన మార్గములచేత ధనాదాయమును, సుందరు లగు యువతీసంపర్కమును కల్గును.

7-4. సిద్ధదశయందు పింగళవిదశాఫలము. 0-4-20.

శ్లో. అర్థస్యలాభస్సుఖసంపదశ్చ హేమాదివస్త్రైఃపరిభూషితత్వమ్।
కామాధికంకామినిసంగమశ్చ సిద్ధాదశాయాంయదిపింగళాస్యాత్.

తా. ధనలాభమును, సుఖమును, వస్త్రభూషణలాభమును, సుందరీస్త్రీసంభోగమును కలుగును.

7-5. సిద్ధదశయందు ధన్యావిదశాఫలము. 0-7-0.

శ్లో. గృహద్వారవాజీ రణేరంగరాజీ
విచిత్రాంబరాణాం సుఖం దేశలాభః ।
కుటుంబాదికం మిత్రపక్షాదిలాభో
యదా సిద్ధికా మధ్యగా ధన్యకా చేత్.

తా. వాహనలాభమును, యుద్ధమునందు జయమును, దివ్యవస్త్రాభరణప్రాప్తియును, సుఖమును, రాజ్యప్రాప్తియును, కుటుంబసౌఖ్యమును, మిత్రులవలన లాభమును కలుగును.

7-6. సిద్ధదశయందు భ్రామరీవిదశాఫలము. 0-9-10.

శ్లో. జనాపవాదోబహుధాచకష్టంపుత్రైశ్చమిత్రైశ్చభవేద్విరోధః
నృపాదిభీతిః కలహశ్చరోగశ్చే ద్భ్రామరీ సిద్ధికమధ్యగాస్యాత్.

తా. అపనిందయును, అనేకవిఘ్నము లైన కష్టమును, పుత్రమిత్రవిరోధమును, రాజభయమును, కలహమును వ్యాధియును కల్గును.

7-7. సిద్ధదశయందు భద్రవిదశాఫలము. 0-11-20.

శ్లో. సకలతాపవితాపసుఖోదయో విమలకీర్తిగుణోవిమలం ధనమ్।
విపులదేహసుఖంనృపమాన్యతాబుధదశాభృగుపాకగతాయది

తా. సర్వసంతాపనివృత్తియును, సౌఖ్యమును, విశేషకీర్తియును, సద్గుణమును, అధికధనలాభమును, దేహారోగ్యమును, రాజసమ్మానమును కల్గును.

7-8. సిద్ధదశయందు ఉల్కావిదశాఫలము. 1-2-0.

శ్లో. సుఖస్యనాశస్తనురోగదుఃఖం నృపాదిభీతిః కలహః కుమిత్రమ్।
మనోవిమోహోభ్రమణంవిదేశేచేదుల్కలాసిద్ధికపాకగాస్యాత్,

తా. సౌఖ్యహీనమును, రోగమును, దుఃఖమును, రాజభయమును, కలహమును, దుష్టసహవాసమును, మనోవికారమును, విదేశసంచారమును కలుగును.

8. సంకట (రాహు) దశా సం. 8. తత్ఫలము.

శ్లో, రాజ్యభ్రంశోగ్నిదాహోగృహపురనగరగ్రామగోష్ఠేషుపుంసాం
స్త్రీభీరాగాభిఘాతః క్షణభరణకృతే పుత్రకాన్తావియోగః.
జనానాం వివాదం జ్వరాణాం ప్రకోపం
కళత్రాదికష్టంచ వస్త్రాది నాశమ్।
గృహే స్వల్పవాసం ప్రవాసాభియానం
దశా సంకటా యచ్ఛతేత్రైవకేవా.

తా. రాజ్యనష్టమును, గృహము నగరము గ్రామము పశువులకొట్టము వీనికి అగ్నిభయమును, స్త్రీజలన భయమును, భార్యాపుత్రవియోగమును, కలహమును, విశేషజ్వరమును, భార్య మొదలగువారికి కష్టమును, ద్రవ్యనాశమును, కొంతకాలము గృహమునను చాలాకాలము విదేశమునందు వాసమును కలుగును

8-1. సంకటదశయందు సంకటవిదశాఫలము. 1-9-10.

శ్లో॥ దేహాదికష్టం మరణేనతుల్యం రోగాదికై ర్వాతకఫప్రకోపైః ।
విరోధదోషో రిపువర్గభీతి శ్చే త్సంకటా సంకట పాకగాస్యాత్॥

తా. శరీరప్రయాసమును, మరణసమాన మైన వ్యాధియును, అధిక వాత శ్లేష్మ రోగమును, విరోధమును, శత్రువర్గమువలని భయమును కల్గును.

8-2. సంకటదశయందు మంగళవిదశాఫలము. 0-2-20.

శ్లో॥ శ్రీస్త్రీసుతార్థై ర్ధనధాన్యసంపత్
పుమాంశ్చ నిత్యం నృపసౌహృదాఢ్యః ।
సుజ్ఞానపాండిత్యకళాయుత స్స్యా
చ్చే న్మంగళా సంకటమధ్యగాచ॥

తా. భాగ్య బిడ్డలు మొదలగువారికి సౌఖ్యమును, ధన ధాన్య లాభమును, రాజ స్నేహమును, మంచిజ్ఞానమును, పాండిత్యమును, వివిధకళాజ్ఞానమును కలుగును.

8-3. సంకటదశయందు పింగళవిదశాఫలము. 0-5-10.

శ్లో॥ ప్రవాళముక్తా ఫలవస్త్రలాభః క్రియార్థవా౯ సర్వజనేషుమైత్రీ
రథాదికానాంఖలుసేవకానాంచేత్సంకటాపాకగపింగళాస్యాత్॥

తా. పగడములను, ముత్తెములును, వస్త్రములును లభించును. కార్యసిద్ధి యగును. సర్వజనవిశ్వాసము కల్గును. వాహనలాభము కల్గును. సేవకజనులు ఏత్తురు.

8-4. సంకటదశయందు ధన్యావిదశాఫలము 0-8-0.

శ్లో॥ సేవాధికం దేవగురుద్విజానాం దానే మతి స్తీర్థజపాదిహోమే ।
బహూద్యమస్స్యాద్ధనలబ్ధిరత్రచేత్సంకటాయాంభవతీహధన్యా॥

తా. దేవతలు, ఆచార్యులు, బ్రాహ్మణులు అగు వీరిసేవయును; దానమిచ్చుట యందును, తీర్థయాత్రలు చేయుటయందును, జపతపహోమములు చేయుటయందును బుద్ధియును; అనేక విధములవలన ధనలాభమును కల్గును.

8-5. సంకటదశయందు భ్రామరీవిదశాఫలము. 0-10-20.

శ్లో॥ దేశాటనం పర్వతమస్తకేషు జాయాదిపీడా ధనహాని రత్ర ।
వాతాదిరోగంరిపుభీతిదుఃఖంచేద్భ్రామరీశాహుదశాప్రపన్నా॥

తా. దేశసంచారమును, పర్వతశిఖరములయందు సంచారమును, భార్య మొద లగువారికి బాధయును, ధననష్టమును, వాయువు మొదలగు రోగములును, రాజభయ మును, దుఃఖమును కలుగును.

8-6. సంకటదశయందు భద్రవిదశాఫలము. 1-1-10.

శ్లో॥ విద్యాలంకారవస్త్రాణి వివిధాని మహాయశః ।
విగ్రహా స్స్వజనై స్సార్థం భద్రాచే త్సంకటాదశా॥

తా. విద్యయును, వివిధవస్త్రభూషణాలాభమును, అధికకీర్తియును, బంధు జనప్రాప్తియును కల్గును.

8-7. సంకటదశయందు ఉల్కావిదశాఫలము. 1-4-0.

శ్లో॥ వామాక్షి కర్ణపీడాచ కటి గుహ్యేచ పీడనమ్ ।
ధనహానిః కార్యనాశ శ్చే దుల్కా- సంకటాన్తరే॥

తా. ఎడమకన్ను, చెవులు, నడుము, మర్మస్థానము, వీనియందు బాధయును; ధననాశమును, కార్యభంగమును కల్గును.

8-8. సంకటదశయందు సిద్ధవిదశాఫలము. 1-6-20.

శ్లో॥ నృపా ల్లాభధనం శాస్త్ర మనేకప్రియసమ్మతమ్ ।
సంకటాంతర్గతా సిద్ధా సర్వసౌఖ్యకరీ సదా॥

తా. రాజువలన ధనలాభమును, జనసమూహమునకు ప్రయోజన మైన శాస్త్రా భ్యాసమును, సకలసౌఖ్యమును కల్గును.

మంగళాదిదశాఫలము.

శ్లో॥ మంగళా పింగళా ధన్యా భ్రామరీ భద్రికా దశా ।
ఉల్కా సిద్ధా సంకటాచ ఫలదా స్స్యా త్స్వనామతః॥

తా. మంగళా, పింగళా, ధన్యా, భ్రామరీ, భద్రికా, ఉల్కా, సిద్ధా, సంక టా, అను నీ యెనిమిదిదశలును, ఆయా దశానామములకుఁ దగిన ఫలము లొసంగు నని తెలియఁదగినది.

రుద్రయామళమునందలి సిద్ధజాతకము

సమాప్తము.

శ్రీ రస్తు.

# సకలార్థ సాగరము

## ప్రమోద తరంగము.



### సజ్జన ధర్మము.

శ్లో. స్వజాయాప్రేక్షణ స్తస్వ త్ఫలపుష్పనిరీక్షణమ్ ।
గజాశ్వవీక్షణం నృణాం ప్రభాతే శ్రీసుఖప్రదమ్.

తా. అనఁగా, మనుష్యులకు ప్రాతఃకాలమునందు తనభార్యను జూచుటయును, ఫలపుష్పములను జూచుటయును, గుఱ్ఱములను యేనుఁగులను జూచుటయును సంపదను గలుఁగఁజేయును.

శ్లో. మాతృవ త్పరదారాంశ్చ పరద్రవ్యాణి లోష్ఠవత్ ।
ఆత్మవ త్సర్వభూతాని యః పశ్యతి స పశ్యతి.

తా. అనఁగా, పరస్త్రీని తల్లివలెను, పరద్రవ్యమును మట్టిపెళ్ళవలెను, సకలప్రాణులను తనవలెను, ఎవఁడు చూచునో వాఁడే బ్రహ్మజ్ఞాని యనఁబడును.

శ్లో. జనకేన జనన్యాచ నిజభర్త్రా పరస్త్రియా ।
భూవరేణాప్య నాపహాసం న కుర్యా ద్బుద్ధిమా న్సదా.

తా. అనఁగా, వివేకి యైనవాఁడు తండ్రి, తల్లి, నిజభర్తఁడు, పరస్త్రీ, రాజు, అను వీరితో పరిహాసవాక్యము లాడరాదు.

శ్లో. పరిహాస స్తథా భాషా వీక్షణం స వికారకమ్ ।
ఏత త్త్రియ మ్పరస్త్రీషు త్యజే త్స త్పురుష స్సదా.

తా. అనఁగా, సజ్జనుఁడు పరస్త్రీలవిషయమై హాస్య మాడుటయును, మాటలాడుటయును, వారియందే దృష్టిని యుంచి చూచుటయును అను నీ మూఁటిని వర్జింపవలయును.

శ్లో. పరేషాం చాతినిందాయాం పరవి త్తే పరస్త్రియామ్ ।
సంసర్గే ఖల నీచాభ్యాం న కుర్యా దీప్సితం సుధీః.

తా. అనఁగా, బుద్ధిమంతుఁడు పరులను నిందించుటయును, పరగృహమున కాపురించుటయును, అన్యస్త్రీతోడను దుష్టనికృష్టులతోడను సహవాసము చేయుటయును గూడదు.

శ్లో. దర్శనా చ్చిత్తవైకల్యం స్పర్శనాత్తు ధనక్షయమ్ ।
సంయోగాత్కిల్బిషం పణ్యస్త్రీణాం ప్రత్యక్షరాక్షసమ్.

తా. అనఁగా, వారస్త్రీలదర్శనమువలన మనస్సునకు వైకల్యమును, స్పర్శమువలన ధననాశమును, సంపర్కమువలన పాపమును కలుగును గాన వారస్త్రీలు ప్రత్యక్షరాక్షసు లని తాత్పర్యము.

శ్లో. దాసీ మానధనం హంతి హంతి వేశ్యా ధనాగమమ్ ।
ఆయుర్హంతి విధవా హంతి సర్వం హంతి పరాంగనా.

తా. అనఁగా, దాసిసంగమము మానమును, భోగముదానిసంగమము ధనాదులను, ముండసంగమము ఆయుస్సును, అన్యస్త్రీసంగమము కులము కీర్తి మొదలగువాని నన్నింటిని బోఁగొట్టును.

శ్లో. ఆత్మపత్న్యాశ్చ కలహో మిథ్యానిందా వరస్త్రియామ్ ।
స్వజనే ప్రేమహీనత్వ మశ్రీలం సర్వదా నృణామ్.

తా. అనఁగా, ఇల్లాలితో కలహమును, పాతివ్రత్యాదిగుణములచే శ్రేష్ఠురాలగు స్త్రీయందు నింద మోపుటయును, పితృభ్రాత్రాది స్వజనులయందు ప్రేమ లేకుండుటయును దరిద్రప్రదము.

శ్లో. జననీం జనకం సాధూన్ పుత్రాన్ దారాన్ గురూ నపి ।
సమర్థ స్సన్న పుష్ణాతి స ఏ వాగతిక స్స్మృతః.

తా. అనఁగా, తల్లిని, తండ్రిని, సాధువులను, పుత్రులను, భార్యను, గురువులను పోషింపనివాఁడు యిహపరగతులు లేనివాఁ డగును.

శ్లో. సుహృది నిర్మలచిత్తే గుణవతిభృత్యే సువృత్తినికళత్రే ।
స్వామినిదయార్ద్రహృదయే నివేద్యకష్టం సుఖీ భూయాత్.

తా. అనఁగా, నిష్కపటి యైన స్నేహితునితోడను, గుణవంతుఁ డైన సేవకునితోడను, పతిభక్తిగల భార్యతోడను, దయాళు వైన రాజుతోడను, తన కష్టములను చెప్పుకొనినయెడల సౌఖ్యము కలుగును.

శ్లో. అర్ధం భార్యా మనుష్యస్య భార్యా శ్రేష్ఠతమ స్సఖా ।
భార్యామూలం త్రివర్గస్య భార్యామూలం తరిష్యతః.

తా. అనఁగా, భార్యభర్తయొక్క అర్ధశరీరముగను, స్నేహితులందఱిలోను ఉత్తమ మైన స్నేహితురాలుగను, ధర్మార్థ కామములకు స్థానముగను, సద్గతికి కారణ భూతురాలుగను నున్నది.

శ్లో. కాంతారే ష్వపి విశ్రామో జనస్యా ధ్వనికస్య వై ।
యస్సదార స్సవిశ్వాస్య స్తస్మా ద్దారాః పరాగతిః.

తా. అనఁగా, భార్య అడవియందు సంచరించునప్పుడు విశ్రాంతి నొసంగునదిగ నుండును. భార్య గలవాఁడు పరులవలన విశ్వసింపఁబడును. కావున, భార్య పురుషునకు పరమగతిగా నున్నది.

శ్లో. పరదారా న్న గచ్ఛేత మనసాపి కదాచన ।
పరదారగతిః పుంసాం ఉభయత్రోపి భీతిదా.
ఇతి మత్వా స్వదారేషు ఋతుమ త్సుబుధో వ్రజేత్ ।
అతృప్తస్స్వ యథా దారే పుమాన్ కామయతే పరామ్.
తథా భర్తరిచా తృప్తా పర మిచ్ఛతి కామినీ ।
ఇ త్యాత్మనోపమాం కృత్వా స్వదారనిరతో భవేత్.

తా. అనఁగా, మనస్సునం దైనను పరదారను అపేక్షింప రాదు. పరస్త్రీసంగమము ఇహపరలోకములయందును భయమును కలిగించును. ఈ విషయమును పురుషుఁడు బాగుగా నెఱింగి తనధర్మపత్నితో ఋతుకాలములయందు కూడవలయును పురుషుఁడు స్వభార్యయందు తృప్తిని జెందనివాఁడై పరదారను గోరనేని తనభార్యయు నట్లే పరపురుషుని గోరును. కాఁబట్టి పురుషుఁడు తనవలెనే స్త్రీయును ప్రవర్తించు నని తెలిసి నడుచుకొనవలయును.

శ్లో. అదుష్టాం వినతాం భార్యాం యౌవనేయః పరిత్యజేత్ ।
స ప్తజన్మభవేత్ స్త్రీత్వం వైధవ్యంచ పునఃపునః.

తా. అనఁగా, పతికి లోఁబడినట్టి బుద్ధిశాలినియగు భార్యను యౌవనమం దెవఁడు పరిత్యజించునో వాఁడు ఏడుజన్మములు స్త్రీజన్మ మొంది వైధవ్య మనుభవించును.

## పతివ్రతాధర్మము.

శ్లో. పతివ్రతా పతిప్రాణా సా నారీ ధర్మభాగినీ ।
శుశ్రూషాం పరిచర్యాంచ కరో త్యవిమనా స్సదా.

తా. అనఁగా, ఏస్త్రీ తనభర్తయందే ప్రేమము నిలుపునదియై, యాతనియందే ప్రాణము గలదై, శుశ్రూషయును, పరిచర్యయును, మనఃప్రీతితో జేయునో యాపుణ్యవతియే తనభర్తతో ధర్మభాగము గలది యగును.

శ్లో. భర్తృపూజా వరారోహా సా భవే ద్ధర్మచారిణీ ।
దరిద్రం వ్యాధితం దీన మధ్వనా పరికర్శితమ్.

తా. అనఁగా, భర్త దరిద్రుఁడైనను, రోగియైనను, దీనుఁడైనను, మార్గాయాసము జెందినవాఁడైనను, పూజించునట్టి పుణ్యస్త్రీ ధర్మశీలురా లగును.

శ్లో. శుశ్రూషా పరిచర్యాంచ దేవతుల్యం ప్రకుర్వతీ ।
వశ్యాభావేన సుమనా స్సువ్రతా సుఖదర్శనా.

తా. అనఁగా, భర్తయెడ దేవునియందువలె శుశ్రూషాపరిచర్యాదులు సేయుచు, నతనికి వశ్యురాలై, సద్బుద్ధిగలదై, మంచిచూపులు గలదై యుండుట పతివ్రతాలక్షణము.

శ్లో. వ్రతం చరతయా నిత్యం దుశ్చరం లఘుసత్త్వరా ।
పతిచిత్తా పతిహితా సా పతివ్రతభాగినీ.

తా. అనఁగా, తనభర్తయందే చెల్లింపఁబడిన మనస్సు గలదై యతనియొక్క క్షేమమును గోరుచు, ఎల్లప్పుడును జాగ్రత్త గలదై యుండి అశక్య మగు వ్రతము నను ష్ఠించునట్టిదే పతివ్రత యనఁబడును.

శ్లో. శ్వశ్రూ శ్వశురయోః పాదౌ తోషయంతి గుణాన్వితా ।
మాతా పితృపరా నిత్యం యా నారీ సా తపోధనా.

తా. అనఁగా, నిరంతరమును అత్తమామలపాదములను సేవించుచును, తలిదండ్రులయందు ప్రేమ గల్గియు నుండు గుణవతి యైన స్త్రీయే తపోధనురా లనఁబడును.

శ్లో. పానందుర్జనసంసర్గః పత్యాచ విరహోటనమ్ ।
స్వప్న శ్చాన్య గృహేవాసో నారీణాం దూషణాని షట్.

తా. అనఁగా, మద్యపానము, వ్యభిచారిణి మొదలగువారితో స్నేహము, మగనిని విడిచి వేరుగా నుండుట, ఎల్లప్పుడు వీధులఁ దిరుగుట, తూఁగుబోతుగా నుండుట, పనులులేక పొరుగింట నుండుట, అను నీయాఱుగుణములును ఉత్తమస్త్రీల యందుండదు.

శ్లో. హస్తయో ర్భూషణం దానం సత్యం రాజ్ఞాం విభూషణమ్ ।
సర్వేషాం భూషణం నీతిః మానస్స్త్రీణాం విభూషణమ్.

తా. అనఁగా, చేతులకు భూషణము దానము, రాజులకు భూషణము సత్యము, సకలజనులకు భూషణము నీతి, స్త్రీలకు భూషణము మానము.

శ్లో. స బంధు ర్యో హితేషు స్స్యాత్ స పితా యస్తు పోషకః ।
స సఖా యత్ర విశ్వాస స్సా భార్యా యత్ర నిర్వృతిః.

తా. అనఁగా హితమును గోరినవాఁడే బంధువు, పోషించినవాఁడే తండ్రి, విశ్వాసము గలవాఁడే స్నేహితుఁడు, సుఖమును గలుగఁజేయునట్టిదే భార్య అని తెలియవలయును

శ్లో. కోకిలానాం స్వరోరూపం నారీరూపం పతివ్రతమ్ ।
విద్యారూపం కురూపాణాం క్షమారూపం తపస్వినామ్.

తా. అనఁగా, కోకిలలకు సుస్వరమును, స్త్రీలకు పాతివ్రత్యమును, అంగహీనులకు విద్యయును, యోగులకు ఓర్పును రూపము లని తాత్పర్యము.

శ్లో. హరిద్రాచూర్ణసంయుక్త నేత్రే కజ్జలసంయుతమ్ ।
మాసే మాసే ఋతుస్స్త్రీణాం దినసంఖ్యా చతుష్టయే.

తా. పసుపును మైనిండ బూయవలయును. ఫాలమునందు కుంకుమరేఖను, కన్నులయందు కాటుకను పెట్టవలయును. ప్రతిమాసమందును ఋతుదోషము కలిగినప్పుడు మూఁడుదినములు నియమముతో నుండి నాలుగవదినమందు స్నానాదులను చేయవలయును.

శ్లో. స్నానం కుర్యా దుషఃకాలే విధివ త్సమ్యగా చరేత్ ।
వస్త్ర మాచ్ఛాద్య గోప్యేన యావత్సూర్యోదయావధి.

తా. చతుర్థదినమందు సూర్యోదయము కాకమునుపు ఉషఃకాలమందున లేచి విధిప్రకారముగా రహస్యస్థానమందు స్నానము చేయవలయును. సూర్యుఁ డుదయించునంతదనుక రహస్య మైనచోట తన ఋతువస్త్రమును దాఁచవలయును.

శ్లో. తతో భానుం సమాలోక్య తత్పరం పతిదర్శనమ్ ।
ఏవం నారదనారీణాం సాధ్వీనాం ధర్మనిర్ణయః.

తా. సూర్యుఁ డుడయించినపిదప సూర్యునకు నమస్కారము చేసి సూర్యుని చూచి పిమ్మట పతిభక్తి గలదై తన పెనిమిటిని దర్శించి తర్వాత యావత్కార్యములను జరుపవలసిన దని బ్రహ్మదేవుఁడు నారదునకు పతివ్రతాస్త్రీధర్మముల నుపదేశించెను.

శ్లో. వసామి నారీషు పతివ్రతాసు కల్యాణశీలాసు విభూషితాసు ।
సత్యాసునిత్యంప్రియదర్శనాసు సౌభాగ్యయుక్తాసుగుణాన్వితాసు.

తా. అనఁగా, శుభకరంబు లగు నడవడికలు గలిగినట్టియు, భూషింపంబడు నట్టియు సత్యవ్రతు లగునట్టియు, ప్రియమైనచూపులు గలిగినట్టియు, సౌభాగ్యముతోఁ గూడినట్టియు, సద్గుణములు గలిగినట్టియు పతివ్రత లైన స్త్రీలయందు నేను వసియించి యుందు నని లక్ష్మీదేవి చెప్పెను. కావున పైన చెప్పిన లక్షణములతోఁ గూడిన స్త్రీవసించుచోట లక్ష్మీదేవి కాపుర ముండును.

శ్లో. యస్య భార్యా శుచి ర్దక్షా భర్తార మనుగామినీ ।
నిత్యం మధురవక్త్రీ చ సారమా నరమా రమా.

తా. అనఁగా, ఎవనియొక్క భార్య పరిశుద్ధురాలుగను, సమర్థురాలుగను, ఎల్లప్పుడు భర్తను అనుసరించునదిగను, సదా ప్రియవచనము లాడునదిగను నుండునో అదియే లక్ష్మి అనఁబడును. లక్ష్మీదేవి లక్ష్మి కాదు.

శ్లో. వస్త్రముఖ్య స్త్వలంకారః ప్రియముఖ్యంతు భోజనమ్ ।
గుణోముఖ్యస్తు నారీణాం విద్యాముఖ్యస్తు పూరుషః.

తా. అనఁగా, అలంకారమునకు వస్త్రమును, భోజనమునకు ప్రీతియును, స్త్రీలకు గుణమును, పురుషులకు విద్యయును ముఖ్యములు.

శ్లో. రక్షితావా రక్షితాశ్చ పతి త్యక్తా అపి స్వయమ్ ।
స్వశీలరక్షణపరా న్న కుర్వంతి కులస్త్రియః.

తా. అనఁగా, కులస్త్రీలు మగనిచే పోషింపఁబడినను, పోషింపఁబడక పోయినను, మగఁడు విడిచిపెట్టినను, తమ పాతివ్రత్యమును విడువకపతినే ధ్యానించుచుందురు.

శ్లో. సా భార్యాయా గృహే దక్షా సా భార్యాయా ప్రజావతీ ।
సా భార్యాయా పతిప్రాణా సా భార్యాయా పతివ్రతా.

తా. అనఁగా, ఇంటిపనులయందు సమర్థురా లైనదియును, పుత్రవతి యైనదియును, భర్తయే గతియని యుండునదియును, భర్తయందే వ్రతము గలదియును భార్య యనఁబడును.

శ్లో. అభ్యుత్థాన ముపాగతే గృహపతౌ తద్భాషణే నమ్రతా ।
తత్పాదార్పితదృష్టిరాసనవిధి స్తస్యోపచర్యాస్వయమ్.

సుప్తే తత్ర శయీత తత్ప్రథమతో జహ్యాశ్చ శయ్యామితి
ప్రాచ్యైః పుత్రి నివేదితః కులవధూ సిద్ధాన్తధర్మాగమః.

తా. అనఁగా, నీపతి రాఁగానే లెమ్ము, అతఁనుపతో మాటలాడుము, అతని పాదములమీఁదనే దృష్టిని యుంచుము, అతఁడు నిద్రించినమీఁద ఆ శయ్యలోనే పరుండుము, అతనికంటె ముందుగాలెమ్ము. అని పెద్దలు చెప్పుచున్నారని యొకఁడు తనకుమార్తెకు బోధించి యున్నాఁడు.

## మానవస్వరలక్షణము

శ్లో. కరివృషరథౌఘభేరీ మృదంగసింహాబ్దనిస్వనా భూపాః ।
గర్దభఝర్ఝరరూక్ష స్వరాశ్చ ధనసౌఖ్యసంత్యక్తాః.

తా. ఏనుఁగు, వృషభము, రథము, ప్రవాహము, భేరి, మృదంగము, సింహము, అగు వీనివంటి ధ్వనివలె మనుష్యునకు స్వర ముండిన రాజగును. గాడిద, ఝర్ఝర వాద్యము, క్రూరస్వరము, అను వీనివంటిస్వరము దరిద్రప్రదము.

## స్త్రీపురుషభారఫలము.

శ్లో. భారార్ధతనుస్సుఖభాగ్ [illegible] దుఃఖభాగ్భవత్యూనః ।
భారాతీతానాం [illegible].

తా. [illegible]

శ్లో. [illegible]
[illegible]

[illegible]

## యోగ్యకన్యాలక్షణము.

శ్లో. అవ్యంగాంగీం సౌమ్యనామ్నీం హంసవారణగామినీమ్ ।
తనురోమకేశదశనాం మృద్వంగీ ముద్వహే త్స్రియమ్.

తా. చక్రములు గాని అనియమములు కలిగినదియు, మనోహరమయిన నామము గలదియు, హంసవలెను గజమువలెను నడక గలిగినదియు, సూక్ష్మము అయిన శరీరరోమములు కలిగినదియు; మృదువైన శిరోజములు కలదియు, సూక్ష్మదంతములు కలదియు, మృదువైన యంగము గలదియు వివాహము చేసికొనుటకుఁ దగినది.

శ్లో. క్షేత్రభూతా స్మృతా నారీ బీజభూతః స్మృతః పుమాన్ ।
క్షేత్రబీజసమాయోగా త్సంభవ స్సర్వదేహినామ్.

తా. లోకమున సర్వజంతువులకును తల్లి క్షేత్ర మనియు, తండ్రి బీజ మనియు ప్రసిద్ధము. క్షేత్రబీజములు రెండును కలిసి యంకురమును పుట్టించు చున్నది. కావున క్షేత్రరూప మయిన కన్యక సులక్షణము గలదిగా నుండవలయును.

## అయోగ్యకన్యాలక్షణము.

శ్లో. నోద్వహే త్కపిలాం కన్యాం నాధికాంగీ సరోగిణీమ్ ।
నాలోమికాం నాతిలోమాం నవాచావాం నపింగళాం.

తా. కపిలవర్ణము కలిగిన చిన్నదానిని, తనకంటె పొడుగుగ నుండుదానిని, రోగము కలదానిని, రోమములు లేనిదానిని, మిక్కిలి రోమములు కలదానిని, ఎక్కువ మాట లాడుదానిని, పింగళవర్ణము కలదానిని వివాహము చేసికొన రాదు.

శ్లో. నదుష్టాం దుష్టవాక్యాం వా వ్యంగినీం పితృమాతృతః ।
నశ్మశ్రు వ్యంజనవతీం న చైవ పురుషాకృతిమ్.

తా. దుష్టస్వభావము కలదానిని, దుష్టవాక్యము నుడువుదానిని, తల్లిదండ్రుల పోలిక లేనిదానిని, ముఖమందు రోమములు కలదానిని, పురుషాకారము కలదానిని పెండ్లాడకూడదు.

శ్లో. వర్షై రేకగుణాం భార్య ముద్వహే త్త్రిగుణ స్స్వయమ్ ।
నిసర్గతోధికాం గాంవా న్యూనాంగాం వాపి నోద్వహేత్.

తా. కన్యవయస్సుకంటె వరుఁడు మూఁడింత లధికవయస్సు గలవాఁడుగా నుండవలయును. స్వాభావికముగా మిక్కిలి పొడవైనదానిని, మిక్కిలి పొట్టిదానిని పెండ్లాడ గూడదు.

## దక్షిణ హిందూస్థాన ప్రధానసంవత్సరములు.

| క్రీస్తుశకము. A. D. | | సంవత్సరములు. | శాలివాహనశకము. | | ఫసలి. | |
|---|---|---|---|---|---|---|
| 1927 | 1987 | ప్రభవ | 1849 | 1909 | 1336 | 1396 |
| 1928 | 1988 | విభవ | 1850 | 1910 | 1337 | 1397 |
| 1929 | 1989 | శుక్ల | 1851 | 1911 | 1338 | 1398 |
| 1930 | 1990 | ప్రమోదూత | 1852 | 1912 | 1339 | 1399 |
| 1931 | 1991 | ప్రజోత్పత్తి | 1853 | 1913 | 1340 | 1400 |
| 1932 | 1992 | ఆంగీరస | 1854 | 1914 | 1341 | 1401 |
| 1933 | 1993 | శ్రీముఖ | 1855 | 1915 | 1342 | 1402 |
| 1934 | 1994 | భావ | 1856 | 1916 | 1343 | 1403 |
| 1935 | 1995 | యువ | 1857 | 1917 | 1344 | 1404 |
| 1936 | 1996 | ధాతు | 1858 | 1918 | 1345 | 1405 |
| 1937 | 1997 | ఈశ్వర | 1859 | 1919 | 1346 | 1406 |
| 1938 | 1998 | బహుధాన్య | 1860 | 1920 | 1347 | 1407 |
| 1939 | 1999 | ప్రమాధి | 1861 | 1921 | 1348 | 1408 |
| 1940 | 2000 | విక్రమ | 1862 | 1922 | 1349 | 1409 |
| 1941 | 2001 | విషు | 1863 | 1923 | 1350 | 1410 |
| 1942 | 2002 | చిత్రభాను | 1864 | 1924 | 1351 | 1411 |
| 1943 | 2003 | స్వభాను | 1865 | 1925 | 1352 | 1412 |
| 1944 | 2004 | తారణ | 1866 | 1926 | 1353 | 1413 |
| 1945 | 2005 | పార్థివ | 1867 | 1927 | 1354 | 1414 |
| 1946 | 2006 | వ్యయ | 1868 | 1928 | 1355 | 1415 |
| 1947 | 2007 | సర్వజిత్తు | 1869 | 1929 | 1356 | 1416 |
| 1948 | 2008 | సర్వధారి | 1870 | 1930 | 1357 | 1417 |
| 1949 | 2009 | విరోధి | 1871 | 1931 | 1358 | 1418 |
| 1950 | 2010 | వికృతి | 1872 | 1932 | 1359 | 1419 |
| 1951 | 2011 | ఖర | 1873 | 1933 | 1360 | 1420 |
| 1952 | 2012 | నందన | 1874 | 1934 | 1361 | 1421 |
| 1953 | 2013 | విజయ | 1875 | 1935 | 1362 | 1422 |
| 1954 | 2014 | జయ | 1876 | 1936 | 1363 | 1423 |
| 1955 | 2015 | మన్మథ | 1877 | 1937 | 1364 | 1424 |
| 1956 | 2016 | దుర్ముఖి, | 1878 | 1938 | 1365 | 1425 |

# దక్షిణ హిందూస్థాన ప్రధానసంవత్సరములు.

| క్రీస్తుశకము. A. D. | | సంవత్సరములు. | శాలివాహనశకము. | | ఫసలి. | |
|---|---|---|---|---|---|---|
| 1957 | 2017 | హేవిళంబి | 1879 | 1939 | 1366 | 1426 |
| 1958 | 2018 | విళంబి | 1880 | 1940 | 1367 | 1427 |
| 1959 | 2019 | వికారి | 1881 | 1941 | 1368 | 1428 |
| 1960 | 2020 | శార్వరి | 1882 | 1942 | 1369 | 1429 |
| 1961 | 2021 | ప్లవ | 1883 | 1943 | 1370 | 1430 |
| 1962 | 2022 | శుభకృతు | 1884 | 1944 | 1371 | 1431 |
| 1963 | 2023 | శోభకృతు | 1885 | 1945 | 1372 | 1432 |
| 1964 | 2024 | క్రోధి | 1886 | 1946 | 1373 | 1433 |
| 1965 | 2025 | విశ్వావసు | 1887 | 1947 | 1374 | 1434 |
| 1966 | 2026 | పరాభవ | 1888 | 1948 | 1375 | 1435 |
| 1967 | 2027 | ప్లవంగ | 1889 | 1949 | 1376 | 1436 |
| 1968 | 2028 | కీలక | 1890 | 1950 | 1377 | 1437 |
| 1969 | 2029 | సౌమ్య | 1891 | 1951 | 1378 | 1438 |
| 1970 | 2030 | సాధారణ | 1892 | 1952 | 1379 | 1439 |
| 1971 | 2031 | విరోధికృతు | 1893 | 1953 | 1380 | 1440 |
| 1972 | 2032 | పరీధావి | 1894 | 1954 | 1381 | 1441 |
| 1973 | 2033 | ప్రమాదీచ | 1895 | 1955 | 1382 | 1442 |
| 1974 | 2034 | ఆనంద | 1896 | 1956 | 1383 | 1443 |
| 1975 | 2035 | రాక్షస | 1897 | 1957 | 1384 | 1444 |
| 1976 | 2036 | నళ | 1898 | 1958 | 1385 | 1445 |
| 1977 | 2037 | పింగళ | 1899 | 1959 | 1386 | 1446 |
| 1978 | 2038 | కాళయుక్తి | 1900 | 1960 | 1387 | 1447 |
| 1979 | 2039 | సిద్ధార్థి | 1901 | 1961 | 1388 | 1448 |
| 1980 | 2040 | రౌద్రి | 1902 | 1962 | 1389 | 1449 |
| 1981 | 2041 | దుర్మతి | 1903 | 1963 | 1390 | 1450 |
| 1982 | 2042 | దుందుభి | 1904 | 1964 | 1391 | 1451 |
| 1983 | 2043 | రుధిరోద్గారి | 1905 | 1965 | 1392 | 1452 |
| 1984 | 2044 | రక్తాక్షి | 1906 | 1966 | 1393 | 1453 |
| 1985 | 2045 | క్రోధన | 1907 | 1967 | 1394 | 1454 |
| 1986 | 2046 | క్షయ | 1908 | 1968 | 1395 | 1455 |

## చమత్కారగణితము.

### 63-సంవత్సరములవయస్సునకు తక్కువగ నుండు వారివయస్సు కనుఁగొనుట.

ఎవనివయస్సు కనుఁగొన నీ కిచ్ఛ గలదో ఆ మనుజునిచేత యీప్రక్కయంకెలబంతులలో ఏయే బంతిలో ఆమనుజునివయస్సు సంఖ్యయున్నదో తెలిసికొని యాబంతులయొక్క మొదటనుండు సంఖ్యలను కూడితిరేని ఆ వయస్సు తప్పక యేర్పడును.

ఉదాహరణము:—ఒకమనుజుని వయస్సు కనుగొన నీకుయిచ్ఛగలదు. ఆ మనుజుఁడు నీదగ్గర నుండునపుడు అతనివయస్సు గల బంతులను చెప్పుమని యడుగుము. అట్లు నీ వడుగు మనుజుని వయస్సు 47 సంవత్సరములు, ఈ సంఖ్యను అతఁడు నీకు చెప్ప నక్కఱ లేదు. ఆ సంఖ్య యుండు బంతినిగాని లేక బంతులుగాని తెలిసికొనుము. ఆ మనుజుఁడు తన వయస్సుసంఖ్య మొదటి నాలుగు బంతులలోను ఆఱవదానిలోను నున్నదని చెప్పును. అందుపై మొదటి బంతి మొదటియంకె 1, రెండవబంతి మొదటి సంఖ్య 2, మూఁడవబంతి మొదటిది 4, నాల్గవబంతి మొదటిది 8, ఆఱవబంతి మొదటిది 32.

ఈ 1, 2, 4, 8, 32 అంకెలను కూడిన 47 వచ్చును

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 4 | 8 | 16 | 32 |
| 3 | 3 | 5 | 8 | 17 | 33 |
| 5 | 6 | 6 | 10 | 18 | 34 |
| 7 | 7 | 7 | 11 | 19 | 35 |
| 9 | 10 | 12 | 12 | 20 | 36 |
| 11 | 11 | 13 | 13 | 21 | 37 |
| 13 | 14 | 14 | 14 | 22 | 38 |
| 15 | 15 | 15 | 15 | 23 | 39 |
| 17 | 18 | 20 | 24 | 24 | 40 |
| 19 | 19 | 21 | 25 | 25 | 41 |
| 21 | 22 | 22 | 26 | 26 | 42 |
| 23 | 23 | 23 | 27 | 27 | 43 |
| 25 | 26 | 28 | 28 | 28 | 44 |
| 27 | 27 | 29 | 29 | 29 | 45 |
| 29 | 30 | 30 | 30 | 30 | 46 |
| 31 | 31 | 31 | 31 | 31 | 47 |
| 33 | 34 | 36 | 40 | 48 | 48 |
| 35 | 35 | 37 | 41 | 49 | 49 |
| 37 | 38 | 38 | 42 | 50 | 50 |
| 39 | 39 | 39 | 43 | 51 | 51 |
| 41 | 42 | 44 | 44 | 52 | 52 |
| 43 | 43 | 45 | 45 | 53 | 53 |
| 45 | 46 | 46 | 46 | 54 | 54 |
| 47 | 47 | 47 | 47 | 55 | 55 |
| 49 | 50 | 52 | 56 | 56 | 56 |
| 51 | 59 | 53 | 57 | 57 | 57 |
| 53 | 54 | 54 | 58 | 58 | 58 |
| 55 | 55 | 55 | 59 | 59 | 59 |
| 57 | 58 | 60 | 60 | 60 | 60 |
| 59 | 59 | 61 | 61 | 61 | 61 |
| 61 | 62 | 62 | 62 | 62 | 62 |
| 63 | 63 | 63 | 63 | 63 | 63 |

## తలఁచినయంకె చెప్పుట.

గీ. మతి దలంచు లెక్క బుతువుల గుణియించి, అష్టదశములందు నరయఁగూడి
అగ్నిపాలు బుచ్చి యాలబ్ధ మర్ధించి, యనల ద్రోయునచ్చు మనసులెక్క.

ఒకఁడు మనస్సున దలంచుకొన్న అంకె 16
దీనిని బుతువులగుణించి 6
96
అష్టదశములనుగూడి 18
అగ్నిపాలుబుచ్చి 3)114(38
9
24
24
00
ఆలబ్ధమును అర్ధించి, అనఁగా 38 లో సగము 19
అనలత్రోయ 3
నిల్వ 16

మతియందు దలంచుకొన్న లెక్క 16 అని చెప్పవచ్చును.

## గుణకమునందు 4, 5, 6, ఇట్లుగా మొత్తము వచ్చుటకు ఉదాహరణము.

12345679 ఎనిమిదవయంకెకూడదు. దీనిక్రింద దినుస
36 వచ్చు మొత్తము అంకెలన్నియు నాలుగు
444444444 రావలసియుండిన తొమ్మిదినాలుగులు 39

గనుక 36 నుంచి పెంచవలయును. అయిదు రావలసియుండినయెడల 45 ను, ఆఱు రావలసియుండినయెడల 54 నుంచి హెచ్చింపవలయును.

127 లోపల నేదైన నొకయంకెను ఒక్కనిని తలఁచుకొనునట్లు చెప్పి, ఆ యంకెపైన కనఁబఱచియుండు ఏడింట్లయందు ఏయేయింట నున్నదని యడిగి తెలిసి కొని, వాఁడు కనఁబఱచిన యిండ్లయొక్క కుడిప్రక్కనుండు మీఁదియంకెలను మొత్త ముచేసి చెప్పినయెడల వాఁడు తలఁచుకొనినయంకె తెలియును.

దృష్టాంతము:—ఒకఁడు 100 అంకెను తలఁచుకొనినయెడల, వాఁడు మనస్సులో తలఁచుకొన్న అంకె, 3, 4, 7, ఈ యిండ్లయందున్నదని చెప్పును అప్పుడు మూఁడవ యింటి కుడిప్రక్కమీఁదియంకె 4, నాలుగవయింటి కుడిప్రక్కమీఁదియంకె 64, ఏడవయింటి కుడిప్రక్కమీఁది యంకె 32, ఈ మూఁటిమొత్తము 100.

| | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 33 | 65 | 97 | 2 | 34 | 66 | 98 | 4 | 36 | 68 | 100 | 64 | 80 | 96 | 112 | 8 | 40 | 72 | 104 | 16 | 48 | 80 | 112 | 32 | 48 | 96 | 112 |
| 3 | 35 | 67 | 99 | 3 | 35 | 67 | 99 | 5 | 37 | 69 | 101 | 65 | 81 | 97 | 113 | 9 | 41 | 73 | 105 | 17 | 49 | 81 | 113 | 33 | 49 | 97 | 113 |
| 5 | 37 | 69 | 101 | 6 | 38 | 70 | 102 | 6 | 38 | 70 | 102 | 66 | 82 | 98 | 114 | 10 | 42 | 74 | 106 | 18 | 50 | 82 | 114 | 34 | 50 | 98 | 114 |
| 7 | 39 | 71 | 103 | 7 | 39 | 71 | 103 | 7 | 39 | 71 | 103 | 67 | 83 | 99 | 115 | 11 | 43 | 75 | 107 | 19 | 51 | 83 | 115 | 35 | 51 | 99 | 115 |
| 9 | 41 | 73 | 105 | 10 | 42 | 74 | 106 | 12 | 44 | 76 | 108 | 68 | 84 | 100 | 116 | 12 | 44 | 76 | 108 | 20 | 52 | 84 | 116 | 36 | 52 | 100 | 116 |
| 11 | 43 | 75 | 107 | 11 | 43 | 75 | 107 | 13 | 45 | 77 | 109 | 69 | 85 | 101 | 117 | 13 | 45 | 77 | 109 | 21 | 53 | 85 | 117 | 37 | 53 | 101 | 117 |
| 13 | 45 | 77 | 109 | 14 | 46 | 78 | 110 | 14 | 46 | 78 | 110 | 70 | 86 | 102 | 118 | 14 | 46 | 78 | 110 | 22 | 54 | 86 | 118 | 38 | 54 | 102 | 118 |
| 15 | 47 | 79 | 111 | 15 | 47 | 79 | 111 | 15 | 47 | 79 | 111 | 71 | 87 | 103 | 119 | 15 | 47 | 79 | 111 | 23 | 55 | 87 | 119 | 39 | 55 | 103 | 119 |
| 17 | 49 | 81 | 113 | 18 | 50 | 82 | 114 | 20 | 52 | 84 | 116 | 72 | 88 | 104 | 120 | 24 | 56 | 88 | 120 | 24 | 56 | 88 | 120 | 40 | 56 | 104 | 120 |
| 19 | 51 | 83 | 115 | 19 | 51 | 83 | 115 | 21 | 53 | 85 | 117 | 73 | 89 | 105 | 121 | 25 | 57 | 89 | 121 | 25 | 57 | 89 | 121 | 41 | 57 | 105 | 121 |
| 21 | 53 | 85 | 117 | 22 | 54 | 86 | 118 | 22 | 54 | 87 | 119 | 74 | 90 | 106 | 122 | 26 | 58 | 90 | 122 | 26 | 58 | 90 | 122 | 42 | 58 | 106 | 122 |
| 23 | 55 | 87 | 119 | 23 | 55 | 87 | 119 | 23 | 55 | 86 | 118 | 75 | 91 | 107 | 123 | 27 | 59 | 91 | 123 | 27 | 59 | 91 | 123 | 43 | 59 | 107 | 123 |
| 25 | 57 | 89 | 121 | 26 | 58 | 90 | 122 | 28 | 60 | 92 | 124 | 76 | 92 | 108 | 124 | 28 | 60 | 92 | 124 | 28 | 60 | 92 | 124 | 44 | 60 | 108 | 124 |
| 27 | 59 | 91 | 123 | 27 | 59 | 91 | 123 | 29 | 61 | 93 | 125 | 77 | 93 | 109 | 125 | 29 | 61 | 93 | 125 | 29 | 61 | 93 | 125 | 45 | 61 | 109 | 125 |
| 29 | 61 | 93 | 125 | 30 | 62 | 94 | 126 | 30 | 62 | 94 | 126 | 78 | 94 | 110 | 126 | 30 | 62 | 94 | 126 | 30 | 62 | 94 | 126 | 46 | 62 | 110 | 126 |
| 31 | 63 | 95 | 127 | 31 | 63 | 95 | 127 | 31 | 63 | 95 | 127 | 79 | 95 | 111 | 127 | 31 | 63 | 95 | 127 | 31 | 63 | 95 | 127 | 47 | 63 | 111 | 127 |

## వయస్సు కనుఁగొను పద్ధతి.

ఒకఁడు ఆగస్టు నెలలో పుట్టి 15 యేండ్లాయెను. జనవరి మొదలు వాఁడుపుట్టిన నెలవర కెన్నిమాసములో లెక్కించుకొను మని చెప్పుము.

| | |
|---|---|
| పుట్టినమాసము (ఆగస్టు) | 8 దో నెల |
| 2 చే హెచ్చించగా | 2 |
| | 16 |
| 5 చేర్చు | 5 |
| | 21 |
| 50 చే హెచ్చించగా | 50 |
| | 1050 |
| పిమ్మట ఆ వయస్సుచేర్చగా | 15 |
| | 1065 |
| 365 తీసివేయఁగా | 365 |
| | 700 |
| 115 చేర్చగా | 115 |
| | 815 |

ఈ చివర మొత్తము 815, దీని చివర రెండంకెలు 15 అతని వయస్సనియు, మిగిలిన యంకెలు 8 అనఁగా ఆగస్టునెల పుట్టినమాస మనియు చెప్ప వచ్చును. ఈ రీతిగా నూరేండ్లవరకు చెప్పవచ్చును. పదేండ్లకు తక్కువవ యస్సు పిల్లలకు లెక్కించు నపుడు చివర అంకెకు పూర్వ మొక సున్న యుండును. ఆ సున్నను లెక్కకు తేఁ గూడదు.

## విచిత్రగణితము.

× గుణించుట, + కలుపుట, = సమానము. ఈ దిగువ వివరింపఁబడు అంకెల వలన గమనింపనగును.

1 × 9 + 2 = 11
12 × 9 + 3 = 111
123 × 9 + 4 = 1111
1234 × 9 + 5 = 11111
12345 × 9 + 6 = 111111
123456 × 9 + 7 = 1111111
1234567 × 9 + 8 = 11111111
12345678 × 9 + 9 = 111111111
1 × 8 + 1 = 9
12 × 8 + 2 = 98
123 × 8 + 3 = 987
1234 × 8 + 4 = 9876
12345 × 8 + 5 = 98765
123456 × 8 + 6 = 987654
1234567 × 8 + 7 = 9876543
12345678 × 8 + 8 = 98765432
123456789 × 8 + 9 = 987654321

## భరతఖండ క్షత్త్రియరాజవంశావళి.

మనము వసించు అర్ధద్వీపమునకు "భరతఖండ" మని పేరు. దీనికి "హిందూ" స్థాన మని మన విరోధులు పేరిడి రనియును, హిందు వనఁగా దొంగ, దాసుఁడు, అల్పమనుష్యుఁడు అనియును కొందఱు చెప్పుదురు.

శ్లో. హీనంచ దూషయ త్యేవం హిందు రిత్యుచ్యతే బుధైః.

అని మేరుతంత్రము. అనఁగా, అహింసాపరుఁడు హిందు వనఁబడు చున్నాఁడు. కనుక హిందూదేశ మనఁగా ధర్మదేశ మని అర్థము.

మనభరతఖండమును పాలించినరాజులలో యుధిష్ఠిరమహారాజునకుఁ దర్వాతి రాజులచరిత్రములు స్పష్టముగా దెలియఁజేయు గ్రంథములు లేవు.

ఇంద్రప్రస్థ (ఢిల్లి) నగరమున యుధిష్ఠిరమహారాజునకు తర్వాత యశోపాలుని పర్యంతము సుమారు 124 గురు క్షత్త్రియరాజులు 4157 సంవత్సరములు, 9 నెలలు, 14 దినములు రాజ్యపాలనము చేసిరి.

యుధిష్ఠిరుఁడు మొదలు వానివంశమువారు 30 గురు 1770 సంవత్సరములు, 11 నెలలు, 10 దినములు, రాజ్యము నేలిరి.

యుధిష్ఠిర స 36, నె 8, ది 25, పరీక్షిత్తు స 60, నె 0, ది 0. జనమేజయ స 84, నె 7, ది 23. అశ్వమేధ స 82, నె 8, ది 22. ద్వితీయరామ స 88, నె 2, ది 8, ఛత్రమల స 81, నె 11, ది 27. చిత్రరథ స 75, నె 3, ది 18. దుష్టశైల స 75, నె 10, ది 24. ఉగ్రసేన స 78, నె 7, ది 21. శూరసేన స 78, నె 7, ది 21. భువనపతి స 69, నె 5, ది 5. రణజిత్ స 65, నె 10, ది 4. ఋక్షక స 64, నె 7, ది 4 సుఖదేవ స 62, నె 0, ది 24. నరహరిదేవ స 51, నె 10, ది 2. శుచిరథ స 42, నె 11, ది 2. ద్వితీయశూరసేన స 58, నె 10, ది 8. పర్వతసేన స 55, నె 8, ది 10. మేధావి స 52, నె 10, ది 10. సోనచీర స 50, నె 8, ది 21. భీమదేవ స 47, నె 9, ది 20. నృహరిదేవ స 45, నె 11, ది 23. పూర్ణమల స 44, నె 8, ది 7. కరదవీ స 44, నె 10, ది 8. అలంమిక స 50, నె 11, ది 8. ఉదయపాల స 38, నె 9, ది 0. దువనమల స 40, నె 10, ది 26. దమాత స 32, నె 0, ది 0. భీమపాల స 58, నె 5, ది 8. క్షేమక స 48, నె 11, ది 21.

క్షేమకునిమంత్రి విశ్రవుండను వాఁడు క్షేమకునిచంపి రాజ్యపాలనము చేసినాఁడు. వీఁడును వీనివంశమువారును 14 గురు రాజులు 500 సంవత్సరములు 3 నెలలు 17 దినములు రాజ్య మేలిరి.

విశ్రవ స 17, నె 3, ది 29. పురసేని స 42, నె 8, ది 21. వీరసేని స 52, నె 10, ది 7. అనంగశాయి స 47, నె 8, ది 23. [illegible] స 35, నె 9, ది 17. పరమసేని

స 44, నె 2, ది 23. సుఖపాతాల స 30, నె 2, ది 21. కద్రుత స 42, నె 9, ది 24. సజ్జ స 32, నె 2, ది 14. అమరచూడ స 27, నె 3, ది 16. అనీపాల స 22, నె 10, ది 25. దశరథ స 25, నె 4, ది 12. వీరసాల స 31, నె 8, ది 11 వీరసాలసేన స 47, నె 0, ది 14.

వీరసాలసేనుని వీరమహామంత్రి చంపి రాజ్య మేలినాఁడు. వీఁడును వీనివంశము వారును 16 గురు రాజులు 445 సంవత్సరములు 5 నెలలు 3 దినములు రాజ్యమును పాలించిరి.

వీరమహామంత్రి స 35, నె 10, ది 8. అజితసింహ స 27, నె 7, ది 16. సర్వదత్త స 28, నె 3, ది 10. భువనపతి స 15, నె 4, ది 10. వీరసేన స 21, నె 2, ది 13. మహీపాల స 40, నె 8, ది 7. శత్రుశాల స 26, నె 4, ది 3. సంఘురాజ స 17, నె 2, ది 10. తేజపాల స 28, నె 11, ది 10. మాణిక్యచంద స 37, నె 7, ది 21. కామసేని స 42, నె 5, ది 10. శత్రుమర్దన స 8, నె 11, ది 13. జీవనలోక స 28, నె 9, ది 17. హరిరాయ స 26, నె 10, ది 29. ద్వితీయవీరసేన స 35, నె 2, ది 20. ఆదిత్యకేతు స 23, నె 11, ది 13.

మగధదేశపురాజైన ఆదిత్యకేతువును ప్రయాగరాజైన ధంగరుఁడు చంపి రాజ్య పాలనము చేసినాఁడు. వీఁడును వీనిసంతతివారును 9 గురు 374 సంవత్సరములు 11 నెలలు 26 దినములు పాలించిరి.

ధంగర స 42, నె 7, ది 24. మహర్షి స 41, నె ?, ది 29. సనరచ్ని స 51, నె 10, ది 19. మహాయుద్ధ స 31, నె 3, ది 8. మురనాథ స 28, నె 5, ది 28. జీవన రాజ స 45, నె 2, ది 5. రుద్రసేన స 47, నె 4, ది 28. ఆరీలక స 52, నె 10, ది 8. రాజపాల స 36, నె 0, ది 0.

రాజపాలుని సామంతమహాపాలుఁడు చంపి రాజ్యమేలినాఁడు.

సామంతమహాపాల స 14, నె 0, ది 0.

విక్రమార్కుఁడు అవంతికా (ఉజ్జయిని) పురినుండి మహాపాలునిరాజ్యముపై దండెత్తి వానిం జంపి రాజ్యమేలినాఁడు.

విక్రమార్కుఁడు స 93, నె 0, ది 0.

శాలివాహనునిముఖ్యమంత్రి యైన పైఠణదేశపుసముద్రపాలుఁడు విక్రమాదిత్యునిఁ జంపి రాజ్యమేలినాఁడు. వీఁడును వీనివంశము వారును 16 గురు 372 సంవత్సరములు 4 నెలలు 27 దినములు రాజ్యమును పాలించిరి.

సముద్రపాల స 54, నె 2, ది 20. చంద్రపాల స 36, నె 5, ది 4. సహాయ

పాల స 11, నె 4, ది 11. దేవపాల స 17, నె 1, ది 28. నరసింహపాల స 18, నె 0, ది 20. సామపాల స 27, నె 2, ది 17. రఘుపాల స 22, నె 3, ది 25. గోవిందపాల స 27, నె 1, ది 17. అమృతపాల స 36, నె 10, ది 13. బలీపాల స 12, నె 5, ది 27. మహీపాల స 13, నె 8, ది 4. హరిపాల స 14, నె 8, ది 4. సీస (శ్రీశ) పాల స 11, నె 10, ది 13. మదనపాల స 17, నె 10, ది 19. కర్మపాల స 16, నె 11, ది 2. విక్రమపాల స 24, నె 11, ది 13.

విక్రమపాలుఁడు పశ్చిమప్రాంతమున రాజుగా నుండిన మలుఖచందుబోహరు మీఁద దండెత్తి యుద్ధము చేసెను. అందు మలుఖచందు విక్రమపాలునింజంపి ఇంద్రప్రస్థము నేలెను. వీనివంశస్థులు 10 గురు 191 స, 1 నె, 16 దినములు పాలించిరి.

మలుఖ (చంద్ర) చందు స 54, నె 2, ది 10. విక్రమచందు స 12, నె 7, ది 12. అమీనచందు స 10, నె 0, ది 1. రామచందు స 13, నె 11, ది 8. హరిచందు స 14, నె 9, ది 24. కల్యాణచందు స 10, నె 5, ది 4. భీమచందు స 16, నె 2, ది 9. లోవచందు స 26, నె 3, ది 22 గోవిందచందు స 31, నె 7, 12, రాణిపద్మావతి స 1, నె 0, ది 0.

పద్మావతి గతించినమీఁద దానికి సంతతి లేనందున రాజ్యమందలి ముఖ్యప్రజలు హరిప్రేమవిరాగి యను వనికి పట్టాభిషేకము చేసిరి. వీనివంశమువారు 4 గురు 50 సంవత్సరములు 21 దినములు రాజ్య మేలిరి.

హరిప్రేమ స 7, నె 5, ది 16. గోవిందప్రేమ స 20, నె 2, ది 8. గోపాలప్రేమ స 15, నె 7, ది 28. మహాబాహు స 6, నె 8, ది 29.

మహాబాహువు రాజ్యమును విడిచి తపస్సు చేయుటకు అరణ్యమునకుఁ బోయెను. ఈ వృత్తాంతమును బంగాళరాజైన ఆధిసేనుఁ డెటింగి ఇంద్రప్రస్థమునకు వచ్చి రాజ్యము చేయం దొడంగెను. వీనిసంతతివారు 12 గురు 151 సం, 11 నెలలు 2 దినములు రాజ్యము నేలిరి.

ఆధిసేన స 18, నె 5, ది 21, విలావలసేన స 12, నె 4, ది 2. కేశవసేన స 15, నె 7, ది 21. మాఘసేన స 12, నె 4, ది 2. మయూరసేన స 20, నె 11, ది 27. భీమసేన స 5, నె 10, ది 9. కల్యాణసేన స 4, నె 8, ది 21. హరిసేన స 21, నె 0, ది 25. క్షేమసేన స 8, నె 11, ది 15. నారాయణసేన స 2, నె 2, ది 29. లక్ష్మీసేన స 26, నె 10, ది 0. దామోదరసేన స 11, నె 5, ది 16.

దామోదరసేనుఁడు తనప్రధానమంత్రియైన దీపసింహుని మిక్కిలి పీడించుచుండినందున వాఁడు దండుచేర్చుకొని రాజుతో యుద్ధముచేసి వానింజంపి రాజ్యమేలినాఁడు. వీనిసంతతివారు 6 గురు 107 స, 6, నె 22 దినములు రాజ్యపాలనము చేసిరి.

దీపసింహ స 17, నె 1, ది 26. రాజసింహ స 14, నె 5, ది 0. రణసింహ స 9, నె 8, ది 11. నరసింహ స 45, నె 0, ది 15. హరిసింహ స 13, నె 2, ది 29. జీవనసింహ స 8, నె 0, ది 1.

జీవనసింహుఁడు తనసైన్యమును ఉత్తరదిక్కునకుం బంపెను. దీనిని పృథ్వీరాజు విని ఇంద్రప్రస్థమున కేగి యుద్ధముచేసి జీవనసింహునిఁజంపి రాజ్యమేలినాఁడు. వీని సంతతివారు 5 గురు 86 సం, 20 దినములు రాజ్యమేలిరి.

పృథ్వీరాజు స 12, నె 2, ది 19. అభయపాల స 14, నె 5, ది 17. దుర్జనపాల స 11, నె 4, ది 14. ఉదయపాల స 11, నె 7, ది 3. యశోపాల స 36, నె 4, ది 27.

అనంతరము శ్యాబుద్దీన్ గోరి యనువాఁడు దండెత్తి విక్రమశకము 1249 వ సం, న ప్రయాగకోటయందు యశోపాలుని చెఱబెట్టి తానే రాజ్యమేలినాఁడు. వీనికి తర్వాత పాలించినవారి విషయము ప్రస్తుతమున ప్రచారమునం దుండు ఇతిహాసములయందు గనఁదగును.

## స్వదేశాచారవ్యవహారములు.

ప్రకృతమున ప్రచారములో నుండు ఆచారములు చెప్పఁబడు చున్నవి. ఇట్లు చెప్పుటవలన రాఁగలకాలములో వీనికి వ్యతిరిక్తమైన ఆచారములు కలిగినప్పుడు తత్పూర్వాచారము లిట్లుండె నని తెలియును.

దేశము లనేకములును, భాష లనేకములును, మతము లనేకములును, జాతు లనేకములును గలవు.

బొందిలీలు, రాజపుత్త్రులు, చిత్రకారకులు, ముచ్చెవాండ్రు, మరాటీలు, దేశస్థ బ్రాహ్మణులు, బలిజలు, వీరికి రావు అని బిరుదు.

కర్నాటక మహారాష్ట్ర మధ్వులు, వైష్ణవులు, చాత్తాదవైష్ణవులు, పంచాననం వారు, వీరికి ఆచార్య అని బిరుదు.

బలిజలు, తెలగాలు, తెలుగువెలమలు, కమ్మవారు, తెనుగుగొల్లలు, తెనుగు దాసీపుత్త్రులు, వీరికి నాయఁడు అని బిరుదు.

అహంపడియారు, అఱవగొల్లలు, మాలవారు, వీరికి పిళ్లలు అని బిరుదు.

బ్రాహ్మణులు, చాత్తాద శ్రీవైష్ణవులు, జంగములు, వీరశైవులు, వీరికిని; కొందఱు దేవాంగులు మొదలగువారికిని, అయ్య అని బిరుదు.

పైనిచెప్పిన వారిలో దాక్షిణాత్యులకు అయ్యార్ అని పేరు.

కోమట్లు వీరిలో కొందఱికి అయ్య అని బిరుదు గలదు.

కోమట్లు, జేరులు, బలిజలు, కుమ్మరులు, లింగబలిజలు, నాటుకోటవారు, సాలెవారు, గాండ్లవారు, ఉప్పరవారు, కుమ్మరవారు, ఒడ్డెవారు, బెస్తవారు, జనపవారు, వీరికిని; కొందఱు దేవాంగులకును సెట్టి (శ్రేష్ఠి) అని బిరుదు.

కాపులలోఁ జేరిన పంటకాపు, పాకనాటికాపు, మోటాటికాపు, మురికినాటికాపు, దేసూరుకాపు అగు వీరికి రెడ్లు అని పేరు.

రెడ్లు అని బలిజవారిలోను కొందఱు గౌరవార్థముగా నుంచుకొనెదరు. పశ్చిమదేశమున రెడ్డి యనుట గ్రామాధికారికి చెల్లును. కొన్నిచోటులందు రెడ్లు వెలమ లయిపోయిరి.

దక్షిణమున అగ్నివంశస్థు లనెడు పల్లెవాండ్రకు ఖండర్, నాయకర్, పడైయాచ్చి, శమ్ముట్టి, పిళ్ల, మొదలార్ అని బిరుదులు గలవు.

కారైక్కాడు, చోళియ, పొన్నేరి, పూనమల్లి, కొండకట్టి, పాండ్య, తొండమండలం, తుళువ, అని వివిధగృహనామములు గల అఱవ వెలమవారికిని, కైకాలవారికిని, అఱవ దాసీపుత్త్రులకును మొదలారు లని బిరుదు.

నియోగిబ్రాహ్మణులు, క్షత్త్రియులు, భట్టువారు, వీరికి రాజు లని బిరుదులు గలవు.

వైష్ణవులకును, చాత్తాదవైష్ణవులకును, పట్టుసాలెవారికిని, అయ్యంగారు అని బిరుదు.

అహంపడియారులకును, అఱవకుమ్మరవారికిని, ఉడయార్ అని బిరుదు.

కుమ్మరవారికిని, స్వర్ణకారులకును, పత్తరు (భక్తు) అని బిరుదు.

అఱవజైనులకు, నైనార్ అని బిరుదు.

అఱవగొల్లవారికి, కీదారి, కోనార్, పిళ్ల అని బిరుదులు గలవు.

చాకలివారికి మేస్త్రి యని బిరుదు.

భట్టురాజులకును, సిద్ధులవారికిని మూర్తి అని బిరుదు గలదు.

మలయాళమునం గల శూద్రులకు నాయర్ అని బిరుదు. వీరిలో కిరియత్తిల్ నాయర్ అను జాతివా రొకరు గలరు.

క్రీస్తుమతమున గలిసిన హిందువు లెట్లు ఆంగ్లేయులకంటె తక్కువగాఁ జూడఁబడుచున్నారో, అట్లే తురకలలో గలిసిన మప్పిళలు, జోనకులు, లబ్బెలు మొదలగువారు ఘార్వమహమ్మదీయులకంటె తక్కువవారుగ జూడఁబడు చున్నారు.

బంటుజాతియందు మాసిదికా[illegible] అని [illegible] చున్నారు.

దక్షిణమున చాకలివాండ్రకు కాగడావృత్తి. దూదుగాం జగనంపల్లె మొదలగు స్థలములలో మంగలివారికి కాగడావృత్తి. ఈ దూదుగాం మొదలగు స్థలములలో తంబళిజాతివారు పాలు పెరుగు పుష్పములు విక్రయించెదరు. మేళమును వాయించెదరు. నాగపూర్ మొదలగు స్థలములలో వైదికులు అంగీ పాగా లేక ఆశీర్వాదము చేయరు. మాండుగాం సలమాబాదు మొదలగు స్థలములలో శూద్రస్పర్శాన్నమును అగ్రకులస్థులారగింతురు.

దక్షిణదేశమునం దెట్లు కైకాలవారిలో ఒకయింటనే సంసారులుగా కొందఱు స్త్రీలును, భోగమువారుగా కొందఱుస్త్రీలును నున్నారో, అట్లే తెనుఁగుదేశమున జక్కు లనువారును, బొంబాయిప్రాంతములలో మురళీలు అనువారు నున్నారు.

కాశీప్రాంతములలో గొల్లవారి చేతి జలమును బ్రాహ్మణులు స్వీకరింతురు.

జగన్నాథమున ఎంగిలికి దోషము లేదు. గయ మొదలగు స్థలములలో బ్రాహ్మణులు బ్రాహ్మణార్థము చేసినమీఁద రెండవమాఱు భోజనము చేయుదురు.

మలయాళమున స్త్రీలుకూడ గోచి పెట్టుకొందురు.

రాజపుత్రస్థానములో బికనేరుసరిహద్దులలో దొరకు నొకవిధ మైన తౌతిని పిండిచేసి ఆహారముగా నుపయోగించెదరు.

నాటుకోటసెట్టివారు తమవయస్సుకంటె మించిన స్త్రీలను వివాహము చేసికొందురు.

విశాఖపట్టణప్రాంతములోని కొండజాతివారిలోఁ గొందఱు తమకంటె అధికవయస్సుగల స్త్రీలను పరిణయ మయ్యెదరు.

మలయాళమున పెద్దలతోడను, గౌరవస్థులతోడను భాషించునప్పుడు తాము గులాములవలెనుండి యెదుటివారిని దేవగురువులవలె తలంచి మాట్లాడవలయును. ఈయాచారము దాక్షిణాత్యులలోని వైష్ణవులకును, చాత్తాదవైష్ణవులకును గలదు.

వీరశైవులు, వైష్ణవులు, చాత్తాదశ్రీవైష్ణవులలో కొందఱు, నాటుకోటసెట్లు, తెంగలవారుతప్ప తక్కిన తెగలలోని బ్రాహ్మణవితంతువులు, స్మార్తసన్యాసులు ముండనము గావించుకొందురు. ప్రకృతమున నీ నియమములేక యాంగ్లేయాచారము ననుసరించి వింతవింత లగు ముండనములను బాతనియమము లేక కావించుకొనెదరు.

ప్రకృతమున పురుషులు సభలు చేయునట్లే స్త్రీజనమును సభలుచేసి కార్యమును జరిపించెదరు.

ఆహారవిషయమునందు హిందూదేశమువారును, ఇతరదేశీయులును, భక్షించుట కిది తగినది, ఇది తగని దని తలంచక చలిచీమలు మొదలు ఏనుఁగుపర్యంతము గల అన్ని జంతువులమాంసములును; ఆకులు, అలములు, గడ్డలు, కొమ్మలు, కాయలు, పండ్లు మొదలగునవియును భక్షించెదరు. ఏదేశమందును ఏజాతివారియందును మాంసమును భక్షింపనివారును, మద్యమును స్వీకరింపనివారును అరుదుగ నున్నారు.

సకలదేశజాతిలోను రొక్కవవా రని కొందఱును, తక్కువవా రని కొందఱును గలరు.

## అన్యదేశాచారములు.

చీనాదేశీయబౌద్ధులు దేవునియందు క్రీస్తువులవలెను తురకలవలెను మోఁకాలూని కూర్చుండి ధ్యానింతురు. అయినను హిందువులవలె నమస్కరింతురు.

చీనాదేశబౌద్ధులు నిలువంబడియు దేవుని ధ్యానింతురు. ఇది సకలమతస్థులకును సమ్మతమైన యాచారమే.

చీనావారు ఎంత ముసలివారైనను జడవేసి కొందురు. జులుపా (కాకపక్షము) కలదు.

జపానువారిజుట్టు చీనావారిజుట్టువలె నున్నను దారముతోఁ జక్కగా బిగియగట్టుదురు.

ఆఫ్రికాలోని కొన్నిప్రదేశములందు జనులు ఆకులను వస్త్రముగా నుపయోగింతురు. కుక్క నక్క మొదలగువాని దంతములను ఆభరణముగా గ్రుచ్చి మెడయందు ధరింతురు.

డహమీదేశములలో నరబలులను యిచ్చెదరు. ఈదేశపురాజుగారి యింటిగోడ చుట్టు మనుష్యులకపాలములను వ్రేలాడఁగట్టుదురు.

ఆస్ట్రియాలో కొన్నిప్రదేశములయందు పురుషులకు యౌవనము రాఁగానే ముందటిపండ్లను పీకివేయుదురు.

న్యూజిలండులోని కొన్నిజాతులవారు నరమాంసభక్షకు లై యున్నారు.

చీనావారు తమ స్త్రీశిశువులకు పాదముల నెదుగనీయక యినుపకవచము తొడుగుదురు.

సయాముదేశమునందు ప్రసవించినస్త్రీముందు పెద్దమంట వేయుదురు.

బర్మాదేశస్థులు పచ్చ పొడుచుకొనుటవలన జంతుబాధ మొదలగునవి సంభవింప దని తలంచెదరు.

మెక్సికోదేశీయులలోఁ గొందఱు ప్రతిసంవత్సరమును తమ యుద్ధదేవతకు నరబలు లిచ్చి ఆ నరమాంసమును ప్రీతితో భుజింతురు.

## వివిధదేశ స్త్రీజన సౌందర్యము.

మన హిందూదేశమునందే గాక, ఇతర దేశములందును ఆయాజాతులకుఁ దగినట్లు సౌందర్య మఁడును. అయినను యెచ్చోటను స్త్రీజనులే సౌందర్యమును కోరువారై యున్నారు. ఆభరణములవలననే సౌందర్యము కలుగు నని తలంచుటమాత్రము వెఱ్ఱితనము.

అమెరికాఖండముయొక్క ఉత్తరభాగమునందు పూర్వపు యిండియన్‌జాతివారికి విశాలమైన ముఖమును, చిన్నకన్నులును, పొడుగైన దవడయెముకలును, లంబకుచములును సౌందర్యము.

చీనాదేశపుఉత్తరభాగమున నుండువారికి పలచనై విశాల మైన ముక్కును, పెద్దచెవులును, పొడ వైన దవడయెముకలును సౌందర్యము.

చీనాదేశమువారికిని జపాన్‌దేశమువారికిని జారినకన్నులు అతిసౌందర్యము.

కొచ్చిన్‌చీనావారికి గుండ్రనిముఖము అందము.

సయాందేశీయులకు చిన్నముక్కును, లా వైన పెదవులును, విశాలముఖమును, పెద్దనోరును, రంధ్రములు స్ఫుటముగా గనఁబడు నాసికాద్వారములును అందము.

ఆఫ్రికాదేశమువారికి నితంబ మున్నత మైనకొలఁది సౌందర్య మతిశయించుచుండును.

నీగ్రోజాతివారికి నితంబము యెంత తక్కువగ నుండునో యంతకంత సొగసుదనము.

నీగ్రో, మూర్, కాఫర్, ఈ జాతులవారికి నలుపు శృంగారము.

జావాద్వీపమువారికి పసుపురంగు గల శరీరము సౌందర్యము.

అమెరికా ఉత్తరభాగమువారికి శిరోజములు పొడవుగ నున్న శృంగారము.

మలయాళీమువారికి కర్ణరంధ్ర మెంతపెద్దదిగ నుండునో అంత సౌందర్యము.

మహమ్మదీయులకు పండ్లు నల్లగా నుండిన శృంగారము.

హిందువులలో ననేకజాతులవారిలో ననేకులు యెంత పచ్చ పొడుచుకొనిన అంత సౌందర్య మని తలఁచి యుండిరి ప్రకృతమున పచ్చ పొడుచుకొన కుండిననే సౌందర్య మని తలఁచెదరు.

## తిర్యగ్జంతుస్వభావములు.

చిలుకతప్ప మఱి యేపక్షియును ముక్కుయొక్క పై క్రిందిభాగములు రెంటిని కదలింపఁజాలదు.

చేఁపలు నోటిని తఱుచుగ మూసికొని యున్నచో శ్వాసము విడువవు గాన ఆహారమును నమలకయే శీఘ్రముగ మ్రింగును.

పాము నోటియందు పండ్లుండును.

ఈఁగలకడుపున నుండునవియెల్లను పురుగులు.

దుప్పికి నాసికారంధ్రములే గాక శ్వాసమార్గములు వేఱు రెండు కలవు.

అన్నిజంతువులకును గోవుల కుండు గోరోచనమువలె రోచనము కలదు.

ఒంటెకు వీఁపుమీఁద నెత్తుగా నుండు స్థలమున క్రొవ్వుండును. ఇది యెడారులయం దనేకదినములు ప్రయాణము చేయునపు డీక్రొవ్వే దీని కాహారము.

గుడ్లగూబ కనుగ్రుడ్లను కదలింపదు, తలను అన్నివైపులకు త్రిప్పి చూచును.

కుక్కలకు స్వజాతివైరము మెండు.

ఆడుపిల్లి పిల్లలను దాని మగపిల్లి బ్రతుకనీయదు.

తొండ వివిధమైన రంగులుగా తన దేహమును మార్చుకొనఁగలదు ఈ జాతి తొండ ఊసరవెల్లి యగును.

ఊసరవెల్లికి తనశరీరమంతటి నాలుక కలదు, అది దూరముగ నుండు పూచులను ఉన్నచోటనుండియే పట్టి తినఁగలదు.

జలగ తనదేహమును వలసినప్పుడు ఆకుంచనము చేసికొనును.

కుందేటికి కనుఱెప్పలు లేవు. ఇది నిద్రించునపుడుగూడ కన్నులు తెఱచుకొని యుండును. అయినను నిద్రించునపు డొకవిధమైనచర్మపుపొర మూసికొనియుండును.

చతుష్పాజ్జంతువులలో ననేకములు మూత్రవిసర్జనస్థలమును పట్టిచేఁ గప్పును.

కప్ప నోరు తెఱచి యున్నంతసేపు వూపిరి విడువఁజాలదు. దీనినోటిని పట్టి తెఱచి యుంచితిమేని శ్వాసబంధముచే వేగముగ మృతి నొందును.

అన్నిపక్షులకంటె కపటము గలది కొంగ.

తాఁబేటికి పండ్లు లేవు.

తిర్యగ్జంతువు లన్నిఁటిలోను ఓర్పు గలది గాడిద.

నెమరు వేయు ప్రతిజంతువునకును గిట్టలు రెండుగ చీలి యుండును.

గుఱ్ఱమునకు కనుబొమలు లేవు.

శ్రీరస్తు.

# సకలార్థసాగరము

## విజ్ఞానవిద్యాతరంగము.



### పాకశాస్త్రము.

పాకము చేయుటను గూర్చిన గ్రంథము లిదివఱ కనేకము లున్నవి సాధారణముగా పాకము చేయుటకు కూడినంతదాఁక ప్రతిగృహిణికిని దెలియును. ఇందు ముఖ్యము లైనవానినిమాత్రము జెప్పఁబడును.

టెంకాయ కుజ్మీర్.—తెంకాయ తురిమిన పువ్వు (కోరు), చిదుగ కొట్టిన కొత్తిమల్లి యాకు, చాలినంత వుప్పు, మిరపకాయలపొడి, నాలు గైదు గడియలు నాన బెట్టిన కొంచెము సెనగపప్పు, వీని నన్నిటిని యొకటిగాఁ జేర్చుకొని ఉపయోగించుకొనవలయును.

దోసకాయ కుజ్మీర్.—దోసకాయను తోలు తీసివేసి ముక్కలుగా కోసికొని దానిలో నొక తెంకాయను తురిమిన కోరును చేర్చి కావలసినంత వుప్పు, మిరపపొడి చేర్చుకొనునది.

మహారాష్ట్రుల కూరపొడి.—కాలుపడి బియ్యము, కాలుపడి గోధుమలు, లేక ఒకచటాకు జొన్నలు తీసికొని బియ్యమును వాసనవచ్చునటుల వేయించి మూఁడుపలముల మిరియాలను వేయించుకొని, ఒకటి రెండు పసుపు కొమ్ములు వేసి వీనినంతయు చేర్చి విసరుకొని కాయగూరలకు వేసి వండునది.

మహారాష్ట్రుల పులుసుకూరపొడి.—ఒకటింకాలుపలము కూరపసుపు, అరాపరకపలము మెంతులు, వీనిని ప్రత్యేకముగా నెండబెట్టి, మిరియాలు, కొత్తిమల్లి, జొన్నలు ఈ మూఁడు అరాపరకపలము; మిరపకాయలు, లవంగపట్ట, లవంగము, ఏలకులు, జాపత్రి, జాజికాయ, జిలకర, వీనిని శుద్ధము చేసికొని ఈ యేడును దినుసునకు కాలుపలము తీసికొని వేర్వేరుగా వేయించుకొని కావలసిన కరివేపాకు చేర్చి విసరుకొనేది. ఈ కూరపొడి మజ్జిగ, పెరుగుపులుసు, చారు మొదలగువానికి చేర్చుకొనవచ్చును. ఇది వారముదినము లుండును. దీనిని గుజరాతివారును వాడెదరు.

కర్నాటక కూరపొడి.— పాతికాపరకఅరశాకు బియ్యము, కాలుఅరశాకు కందులు, అరాపరకఫలము మిరియాలు, అరాపరకపలము మిరపకాయలు, కాలుపలము పసుపు, కాలుపలము జీలకర, పిడికెడు ఎండుకరివేపాకు వీనినంతయు వేయించి విసరి కాయగూరలకు చేర్చుకొనునది.

మహారాష్ట్ర సాంబార్.—ఎనిమిదిపలముల క్రొత్త చింతపండు నీళ్లలో గలిపి తీసికొని ముక్కాలుఅరశాకు సెనగలను ప్రత్యేకముగా నుడకబెట్టి యెత్తి పులుసులో వేసి ముప్పదిరెండుపలముల వంకాయలను చిన్నముక్కలుగాఁ జేసి పై దానిలో వేసి కొంచెము మెంతులు, బియ్యపుపిండి, ఉప్పు వీనిని వేసి, అన్నియు బాగా కాగిన తర్వాత ఆవాలు జీలకర త్రుంచిన మిరపకాయలు ఇంగువ వీనిని నేతిలోవేయించి యందులో పోయవలయును.

అరఁటిపండు పచ్చడి.—ఉప్పు, పసుపుపొడి, వేయించిన ఆవాలు, జీలకర, వీనినంతయు చింతపండు కలిపిన పులుసు నీళ్ళలో వేసి అందులో తోలు ఒలిచిన అరటి పండ్లను చేర్చి పిసికి యెత్తుకొనునది.

కేరళదేశస్థుల అరటికాయపులుసు.—ఒకటింకాలుపలము మిరియాలు, ఒక పిడికెడు కరివేపాకు, ఈ రెంటిని ఒకగరిటెలో వేసి కావలసినంత నేతిలో వేయించి తర్వాత నీళ్ళుపోసి నూరి ఆముద్దను ముక్కాలుపడినీళ్లలో కలిపి ముందుగనే ఉప్పువేసి యుడకబెట్టి యుంచిన పది అరటికాయలముక్కలలో పోసి మూడుపొంగులు వచ్చిన మీఁద వేఁడొక పొయిమీఁద లేక దాలిలోనుడికించిన కాలుపడి కందిపప్పును దానిలో చేర్చవలయును. తర్వాత కావలసినంత వుప్పును వేయవలయును. చింతపండును కావలసినంత ముద్దగానే వేయవలయును. పిమ్మట గరిటెలో నేయిపోసి పది త్రుంచిన మిరపకాయలను మినపప్పును వేయించి పోపు చేయవలయును.

దధిభక్ష్యము.—మీగడతోడ అయిదుపళ్లు గట్టిపెరుగును తెల్లగుడ్డలో మూటగట్టి మీఁదుగ వ్రేలాడ గట్టవలయును, నీరంతయు వడిసిన తర్వాత అందు కాలుపడి గోధుమరవలను, మూడుపలముల వెన్ననుగాని లేక నేతినిగాని చేర్చి పిసికి చిన్నచిన్న బిళ్లలుగా తట్టి ఏడుసేర్ల తెల్లచక్కెరను మురికిలేక పాకముచేసి పెట్టుకొని బిళ్లలను నేతిలోవేఁచి తోడనే ఆపాకములో వేయవలయును. బిళ్లలను నాలు గైదు గడియలవఱకు యుంచియుండి చల్లారినమీఁద భక్షించవలయును.

గోధుమరవ హల్వా.—రెండుపళ్ళపాలలో అరపడి నీళ్ళుబోసి పొయిమీఁద బెట్టి పొంగువచ్చునప్పుడు ఒకపడి గోధుమరవను వేసి ఆరవలు ఉడికి గట్టిగా వుచ్చు

నపుడు రెండుపల్లు శుద్ధిచేసిన తెల్లచక్కెర పాకమునుపోసి దానిమీఁద కాలుపడి నెయ్యిని, ఒకపలము పన్నీరును పోసి చక్కఁగా కలియబెట్టి మూతబెట్టి కొంచెమునేపు అట్లే యుండనిచ్చి తర్వాత కలియఁబెట్టి, యీలాగు అయిదాఱుమాఱులు కలియఁబెట్టి లేహ్యపక్వమున దించి ఆరినమీఁద ఉపయోగించుకొనవచ్చును.

గోధుమబాదాం హల్వా:— ఒకటిన్నరపడి పాలలో పాతికాపరకపడి నీళ్ళు పోసి మరుగనిచ్చి పొంగువచ్చుసమయమున అయిదుపలముల బాదాంపప్పును వేడి నీళ్ళలో కొంచెమునేపుంచి పై తోలు తీసి దానిని పాలుపోసి మెత్తగా నూరి పెట్టుకొని ముందుగా అరపడి గోధుమరవలు వేసి చక్కఁగా కలియఁబెట్టినచో కొంచెము నేపులో వుడికిపోవును అప్పుడు నూరినబాదము ముద్దనువేసి, మరికితీసిన తెల్ల చక్కెరపాకము ఒకటింకాలుపడియును, రెండుపలములు పన్నీరును పడి నెయ్యియును చేర్చి కలియఁబెట్టుచు లేహ్యపక్వముగా నచ్చునపుడు దించుకొనునది.

బాదాం హల్వా:—పైతోలుతీసిన బాదముపప్పు ఒకపడిని ఆవుపాలతో మెత్తగా నూరిపెట్టుకొని, ఒకపడిపాలను పొయిమీఁద బెట్టి కాగినవచ్చునపుడు అరపడి గోధుమరవనువేసి అది మరిగినవచ్చునపుడు నూరిన బాదము ముద్దను వేసి ఒకటింకాలుపడి శుద్ధమైన తెల్లచక్కెరపాకమును, కాలుపడి నెయ్యియును, రెండుపలాలు పన్నీరును, ఒకవరాయెత్తు కుంకుమపూవును, మూఁడువరాలయెత్తు ఏలకులపొడిని చేర్చి చక్కఁగా కలియబెట్టుచు హల్వాపక్వమున దించుకొనవలయును

నిషాస్తా హల్వా:—అయిదుపళ్ళ గోధుమరవలను చిలుముపట్టని పాత్రలో వేసి రాత్రికి నీళ్ళు పోసి యుంచి, ఉదయమున ఆ రవలను రోట్లోవేసి రుబ్బి ఆముద్దను బట్టలో పెట్టి పిడిచికొని, మరలను ఆ పిప్పిగానుండు ముద్దలో కొంచెము తెల్లచక్కెర చేర్చి రుబ్బి దానిని పిడిచికొని, ఇట్లు పిడిచిన పాలను మంచిపాత్రయందు పోసి నోటికి బట్టకట్టి యొకచోట వారముదినము లుంచి యుంచవలయును. ఎనిమిదవనాఁడు ఒకపడి కలకండ, లేక తెల్లచక్కెరను పాకము చేసికొని, అందు ముందుపిడిచియుంచిన పాలు ఒకపడి పోసి పదిపలముల నెయ్యిని, మూఁడు పలముల పన్నీరును, ఒక వరాయెత్తు ఏలకులచూర్ణమును చేర్చి హల్వాపక్వముగా చేసికొనవలయును.

సొరకాయ హల్వా:—లేఁతసొరకాయ తోలు తీసివేసి లోపలిగుజ్జును విత్తులను తీసివేసి ముక్కలుగా జేసికొని రెండుపళ్ళపాలును అరపడి నీళ్ళనుకలిపి బాగా మరుగనిచ్చి అందులో అయిదు లేక ఆఱు సేర్ల సొరకాయ ముక్కలనువేసి మూతబెట్టి అయిదు గడియలు మంటబెట్టి సొరకాయముక్కలన్నియు బాగా నీరైపోయినమీఁద తోలు

తీసి నూరిన బాదముపప్పు మూఁడుపలములును, పదిపలముల నెయ్యియును, రెండుసేర్ల కలకండయును, మూఁడుపలముల పన్నీరును, ఒక వరాయెత్తు కుంకుమపువ్వును వేసి బాగా కలియబెట్టి హల్వాపక్వమున దించుకొనవలయును.

అక్బర్ హల్వా:—పెద్దదోసపప్పు, కర్బూజపప్పు, చిన్నదోసపప్పు, సారపప్పు ఇవి దినుసునకు అరపడి, పొట్టుతీసినబాదముపప్పు కాలుపడి, గసగసలు రెండుపలములు వీనినంతయు ఆవుపాలలో మెత్తగా ముద్దగా నూరి, రెండుపళ్ళ కలకండను పాకముచేసి కొని ఈ పాకమును పొయిమీఁదబెట్టి ముందు నూరియుంచి యుండు ముద్దను దాని యందు వేసి, అరావీసముపడి నెయ్యియు; అయిదుపలముల పన్నీరును రెండువరాలెత్తు కుంకుమపూవును, అరవరాయెత్తు కస్తూరిని, ఒకవరాయెత్తు బంగారురేకులును చేర్చి హల్వాపక్వముగ చేసికొనవలయును.

ఆరోగ్య హల్వా:—నల్ల బియ్యపుపిండి పడిఅర, ముదిరినటెంకాయపాలు పడి అర, గోధుమరవలు తడిపిపెట్టి పిండినపాలు పడికాలు, పాలు పడికాలు, వీనినన్నిటిని యొకటిగా కలిపి, ఒకపాత్రలోవేసి పొయిమీఁద బెట్టి విడువక కలియఁబెట్టుచుండి నీళ్ళంతయు యింకి గట్టిపడునప్పుడు ఇరువదైదుపలముల తెల్లచక్కెరను పాకము చేసి యుంచుకొని, ఆపాకమును కొంచెముకొంచెముగా అందులోఁబోసి కలియఁబెట్టు చుండవలయును. అప్పుడు ఎనిమిదిపలములనెయ్యిని కొంచెముకొంచెముగా పోసి కలియఁబెట్టవలయును. తర్వాత ఏలకులు జాజికాయ జాపత్రి కుంకుమపూవు ఇవి నాలుగును సమభాగముగా చేర్చిన పొడి పలముఅర, (అనఁగా దినుసుకు పలము పరక) అందులో వేసి కలియఁబెట్టి చేతికి అంటనిసమయమున నొకతట్టలో నెయ్యిపోసి అం దులో హల్వానువేసి రెండంగుళములమందముగా పోసి యుంచి ఆరినమీఁద కత్తితో బిళ్ళలుగా కోసి భుజించవలయును.

జీరా:—ఒకపలము నెయ్యిని యొకబాణలిలో పోసి కాచి చక్కఁగా కాఁగిన మీఁద కాలుపడి గోధుమరవను దానిలో వేసి పక్వముగా వేయించుకొని, ముక్కాలు పడి పాలును కాచి పొంగువచ్చునపుడు, వేయించి యుంచి యుండు గోధుమరవను దానిలో పోసి కలియఁబెట్టి ఒకపొంగురాగానే, ముందుగానే పదిపలములతెల్లచక్కెర ను పాకము చేసి యుంచియుండుదానిని అందులో పోసి కలియఁబెట్టుచుండి మూఁడు పొంగులురాగానే, విత్తనములు లేని ద్రాక్షపండుపలము రెండున్నర, ఏలకులపొడి పలముకాలు, వీనినంతయువేసి తర్వాత నాలుగురిగింజలెత్తు కుంకుమపూవును కొంచె ము పాలతో నూరి యందులో వేసి చక్కఁగా కలియఁబెట్టి, అయిదుపలముల నెయ్యిని

పోసి నోటికి వాసెనగట్టి అయిదునిమిషములదాఁక పొగలేని బొగ్గులనిప్పుసెగలో నుంచి అయిదు పలముల కలకండను మిరియములంతేసి ముక్కలుగా చేసి యందు జేసి బాగా కలియఁబెట్టి యుపయోగించ వచ్చును.

సాజా.—రెండుపలముల నెయ్యిని కాచి, అరపడి గోధుమరవలు వేసి మాడిపోనీయక యిసుకరంగుగా వేయించి యుంచుకొనవలయును. తర్వాత ఒకపడి నీళ్ళను కాచి చక్కగా పొంగువచ్చునప్పుడు, వేయించి యుంచిన రవలను అందు వేసి కలియఁబెట్టి, ఇరువదిపలముల తెల్లచక్కెర, ఏలకులపొడి పలము కాలు, నేతిలో వేయించిన తోలులేని ముంతమామిడిపప్పు, లేక తోలుతీసిన బాదముపప్పు పలములు మూడు వీనినంతయు వుడుకుచుండు నీళ్ళలో వేసి, నీళ్ళింకి అన్నపక్వముగా కనఁబడు సమయమున దించి అయిదునిమిషములు పొగలేని బొగ్గులనిప్పుసెగలో నుంచి, తర్వాత అయిదుపలముల నెయ్యినిపోసి చక్కఁగా కలియఁబెట్టి కొంచెముసేపు తాళి యుపయోగించుకొనవచ్చును.

ఫీర్ని.—కాలుపడి పాలను పొయిమీఁద బెట్టి పొంగువచ్చునప్పుడు ఆళాకు గోధుమరవను అందువేసి కలియబెట్టుచునే యుండి అది యుడికి గట్టిపడునప్పుడు అస్ట్రికాంచక్కెర అయిదుపలములు వేసి కొంచెముసేపు పొయిమీఁదనే యుంచి యుండి తర్వాత దించి ఒకపలము పన్నీరునుపోసి కలియఁబెట్టి యుపయోగించుకొనవలయును.

జర్దా.—పచ్చిబియ్యము కాలుపడిని బాగా కడిగి ఒక గడియసేపు అల్లే యుంచవలయును. అస్ట్రికాంచక్కెర ఇరువదిపలములను ఒక ఆళాకునీళ్ళలో వేసి పాకము పెట్టి యుంచవలయును. కాలుతులము కుంకుమపూవును నూరి యుంచుకొనవలయును. రెండుపలముల నెయ్యిని బాణలిలో పోసి లవంగము లవంగపట్ట పెద్దజీలకర మరాటిమొగ్గలు ఏలక్కాయ జాజికాయ జాపత్రి తోకమిరియాలు ఇవన్నియు చేరిన పొడి అరతులము ఆ నేతిలో వేసి యెఱ్ఱగా వేగునప్పుడు అందులో అరపడి నీళ్ళు పోసి నూరిన కుంకుమపూవును వేసి చక్కగా పొంగువచ్చునప్పుడు బియ్యమును వేసి నీళ్ళింతయు యింకినమీఁద ఆపాత్రను క్రిందికి దించిపెట్టి నోటికి బాగాగుడ్డకట్టి దానిచుట్టును పొగలేని నిప్పును చేర్చి యుంచి కాలుగడియకుమీఁద రెండుపలముల ద్రాక్షపండు, తోలుతీసిన ఒకటింకాలుపలము బాదముపప్పు వీనిని వేసి చక్కెరపాకమును పోసి చక్కగా కలిపి మూఁతబెట్టి అయిదునిమిషములు మరల పొయిమీఁద బెట్టి దించుకొని యుపయోగించవలయును.

## కుశలవిద్యలు.

పాలు చక్కెర చేయుట.—ఆవుపాలను బాగుగ కాచుచు తుత్తివేళ్ళు కట్టగా కట్టుకొని దానితో కలియబెట్టు చుండినయెడల చక్కెర యగును. ఇది మేహాకారకము గలవారు భుజించుటకు ప్రశస్తమైనది.

నిమ్మపండ్లను గాపాడుట.—ఒక కుండయందు కొంచెము తడిగా నున్న మట్టిని వేసి యా మట్టిలోపల యిష్టమైనన్ని నిమ్మపండ్లను పాతిపెట్టి కుండనోటికి సరియయిన మూసదు వేసి గాలి పోకుండునట్లు బంకమట్టితో చీల చేసి యుంచినయెడల నెన్ని దినంబులనలు కైనను పసిమిగనే యుండును.

చెదలు పట్టకుండుట.—మట్టిగోడలు పెట్టి యిండ్లు కట్టువారు దూలములను ఆనించుచోటునందును ద్వారబంధములు మొదలగునవి గోడలకు ఆనించుచోటను తామరాకుల నుంచినయెడల చెదలు పట్టదు; ఇట్టే మట్టిమిద్దెయిండ్లకును చేయవచ్చును.

మట్టిపాత్రలకు పురుగులు పట్టక చేయుట.—కుండను పొయిమీద పెట్టి కాల పెట్టి 1 పలం తెల్లగుగ్గిలము చూర్ణము చేసికొని కుండలో 1 సేరు మంచినూనెను పోసి తర్వాత గుగ్గిలపుపొడిని వేసి నూనె పొంగురాగానే దించుకొని గుడ్డమూటకట్టుకొని దానితో కుండయొక్క లోపలంతయు బాగుగ కలాయి పూయునట్లు పూసి మిగిలినదానిని కుండపైగను పూయవలయును. ఇట్టి పాత్రలోనుంచిన ఊరుగాయలు మొదలగునవి పురుగులు పట్టక యుండును.

జలభూతదర్పణము.—పలచనైన యిత్తడిరేకులో సూది దూరునంతటి రంధ్రము చేసి ఆ ద్వారముమీద నొకబొట్టు నీటిని విడిచినయెడల అది వర్తులాకారముగ అందు నిలుచును. ఈభూతద్దముక్రింద నేదేని చిన్నవస్తువు నుంచి చూచినయెడల గొప్పగా కనబడును.

జలాఘాతదర్శిని.—ఒకదాని అడ్డుకొలత 1 అడుగు, మఱియొకదాని అడ్డుకొలత 1 అంగుళముగా నుండునట్టి రెండు అద్దపుబిల్లలను సంపాదించుకొని, ఆరడుగుల నిడివి గల యొక తగరగొట్టమును భాంకానంటిఆకారముగా చేసి చక్కగా అతికించి యుంచుకొనవలయును. అట్లు చేయు గొట్టముయొక్క ఒకభాగముద్వారము ఒక అంగుళము అడ్డుకొలత గలదిగాను, మఱియొకభాగముద్వారము 1 అడుగు అడ్డుకొలత గలదిగాను చేసికొని, మొదట సంపాదించిన అద్దపుబిల్లలను ఆయాప్రమాణములకు తగినభాగములయందుంచి జలము ప్రవేశింప కుండునట్లు లప్పముతో మూసి యెండించి యుంచుకొని; చాప, చెఱువు, ఏఱు, గుంట మొదలగు వానిలో నేదైనను

వస్తువులుపడినను, లేక దాని అడుగుప్రదేశములను పరీక్షించవలసినను గొట్టముయొక్క 1 అడుగు అడ్డుకొలత గల భాగమును నీళ్ళలో నుంచి 1 అంగుళము అడ్డుకొలత గల భాగము గల అద్దముతో చూచినయెడల జలములో నుండునవి యంతయు తెలియును.

మంటనార్పుట:—నవాసారమును గాని; లేక వెలిగారమును గాని నీళ్ళలో కలుపుకొని మండుచుండుమంటమీఁదపోసినయెడల తక్షణమే మంట చల్లారిపోవును.

శ్రీచూర్ణము చేయుపద్ధతి:—పచ్చిపసుపునుగాని, ఎండినపసుపునుగాని 1 వీసె (40 పలములు) తెచ్చి బాగుగా పైననుండు పీచుమొదలగునవి లేక శుద్ధపఱచి నలియ గొట్టి యుంచుకొనేది. మంచినిమ్మపండ్లు 40, రసము తక్కువపండ్లుగా నుంటే 50 తెచ్చి రసముపిడిచి యొకపాత్రలో నుంచుకొనేది. తర్వాత ఆ నిమ్మతోళ్ళంతయును రోటిలో వేసి కొంచెము నీళ్ళుపోసి దంచి పిడిచికొనిన యీ నీళ్ళలో 2 పలములు వెలిగారమును, 2 పలములు పటికారమును పొడిచేసివేసి కొంచెముసేపు పొయిమీఁదఁబెట్టి వుడకఁబెట్టి దించుకొని, దీనితోకూడా మొదట పిడిచియుంచుకొనియుండు రసమును పోసి కలియబెట్టి పసుపునంతయు వేసి పిసికి యట్లే యొకరాత్రియంతయు నుండనిచ్చి మరునాఁడు ఆ పసుపునుమాత్రము యెండలో బెట్టేది ఇంకను రసము మిగిలియుండినయెడల మఱల రాత్రిపూట ఆరసమును పోసి పిసికి యుంచి మఱునాడు యెప్పటివలె యెండనిచ్చేది. ఇట్లు పసుపునకు చాయకట్టి బాగా యెండబెట్టి రోట్లో వేసి కొట్టిగాని, తిరుగలిలో వేసి విసరిగాని, పాత్రముమీదపెట్టి నూరిగాని యెత్తుకొని మిక్కిలి దట్టమైనగుడ్డతో వస్త్రఘాళితము చేసికొనినయెడల ప్రసిద్ధమైన శ్రీచూర్ణముగ నుండును. కొందఱు 1 వీసె పసుపునకు వెలిగారము 4 పలములును, పటికారము 2 పలములును వేసెదరు. పటికారము వెలిగారము సమముగా నుండినయెడల ముఖమున ధరించిన తర్వాత ప్రకాశముగా నుండును. వెలిగారము యెక్కువగా నుండినయెడల ముఖమున ధరింపక ముందు ప్రకాశముగా నుండును. కొందఱు ముఖమున బాగాపట్టుటకై మినపపప్పును కొంచెము చేర్చెదరు. చాయ గట్టిన పసుపును నీడలో నెండబెట్టుట మేలు

కుంకుమముచేయు పద్ధతి:—పైనచెప్పినచొప్పున పసుపునకు చాయగట్టి వస్త్రఘాళితము సుమారుగ చేసికొని కొంచెము నూనెపోసి పిసికి యెత్తుకొనినయెడల మంచి కుంకుమ మగును.

పసుపుశ్రీచూర్ణము చేయుక్రమము:—పైన చెప్పినచొప్పున పసుపునకు చాయ గట్టి పసుపునకు సగము పచ్చిబియ్యము చేర్చి చూర్ణము చేసి వస్త్రఘాళితము చేసుకొనునది.

రంగుకుంకుమములు చేయుట:—అంగళ్ళయందు అమ్మునట్టి వివిధములైన రంగులలో తమ కిష్టమైనరంగును తీసి నీళ్ళలో కలిపి ఒక పాత్రయందుంచికొని అందులో అరరూట్ పిండిని కావలసినంత వేసి బాగా పిసికి రుద్ది నీడను యెండించి యెత్తికొనవలయును.

ఉప్పుగిన్నె చేయువిధము:—సీమచల్లగడ్డ (సీమపిల్లపీచరగడ్డ) లను నరములు తీసి బాగా యెండించి చూర్ణము చేసికొని ఉప్పును కల్వములో నుంచి కొంచెముగ నీళ్ళుపోసి నూరి దానిలో పైన చెప్పినచూర్ణమును వేసి బాగుగా నూరి తమకిష్టమగు పాత్రలపై మెత్తి తీసి నీడను యెండించుకొని అందులో పాలు పోసి కొంచెముసేపు వుండనిచ్చి పుచ్చుకొనినచో శరీరమున కారోగ్యము కలుగును.

శ్రేష్ఠమైన నల్లయింకి చేయు క్రమము:—కరక్కాయలదుమ్ము పలములు 11, అన్నభేదిదుమ్ము పలములు 8, ఆల్కహాల్ద్రావకము, అనగా రెక్టిఫైడ్ స్పిరిట్సు ఆవ్ ఒయిన్ పలములు 3, మేలైననీలపౌడరు పలము 1, జలము పలములు 77, వీనిలో నీలపౌడరును స్పిరిట్సు ఆవ్ ఒయిన్లో వేసి మూసిపెట్టినయెడల 3 గంటలసేపులో కరిగిపోవును. కరక్కాయలదుమ్మును జలములో వేసి కాచి చక్కగా వుడుకు వచ్చినపిమ్మట అన్నభేదిదుమ్మును దానిలోవేసి కాచి దింపి ఒకగంటసేపునకు పిదప వడియగట్టి, నీలపౌడరును కలిపియున్న ఆల్కహాల్ద్రావకమును మొదట వడియగట్టియుంచుకొనియున్న దానిలో పోసి మరల వడియగట్టి బుడ్డియందు పోసి పెట్టుకొనవలయును. ఇది మిగుల మేలుగా నుండును.

కాపింగ్ యింకి చేయువిధము:—ఊదాయింకి 5 పలములు, గ్లిసరిన్ 6 పలములు చేర్చి వుపయోగించుకొనవచ్చును

సోడావాటర్ చేయువిధము:—రెండుటమలరులయందు చల్లనిజలము నింపించుకొని వానిలో నొకదానియందు (టీస్పూన్లో సగము) అరగరిటకొలత కార్బొనెట్ సోడా చేర్చి, మఱియొకదానిలో అదేకొలతగా టార్టారిక్ ఆసిడ్డును చేర్చి రెండు టమలర్లలో నుండునవియును వేర్వేఱుగా కరిగిన పిమ్మట టార్టారిక్ ఆసిడ్ చేర్చిన టమలరులో నుండు జలమును మొదటి టమలరులోపోయుగా వెంటనే యా జలమునందు వాయుశక్తిచేత నొకవిధమైనపొంగు వచ్చును. అప్పుడు ఆలస్యము చేయక త్రాగవలయును. దీనికిని షాపులయందు అమ్మునట్టి సోడావాటరుకుగల గుణములన్నియుగలవు.

సోడావాటర్ చేయునట్టి మఱియొకవిధము:—కార్బొనెట్ సోడాను టార్టారిక్ ఆసిడ్డును ఒకకొలతగా తీసికొని చెమ్మలేనిదిగాను శుద్ధముగా నుండు కల్వములోవేసి

చక్కఁగాఁ పొడిచేసికొని బుడ్డిలోవేసి కార్కుతో బిగించి పెట్టుకొనవలయును. సోడావాటరు కావలసినప్పుడు యీ దుమ్మును కొంచెమెత్తి ఒక టములరు జలము నందు వేసినతోడనే పొంగు కలుగును. ఆ పొంగురాఁగానే ఆ జలమును పానము చేయ వలయును. ఇదియును మీఁదఁజెప్పిన గుణము కలదియై యుండును.

ఇత్తడి పాత్రలను శుద్ధిచేయు విధము:—శుద్ధిచేయ వలసిన ఇత్తడి పాత్ర లను నిప్పు దగ్గరబెట్టి కొంచెము సేపు వెచ్చచేసి యా వెచ్చన చల్లారుటకు ముందు నవాసారమును చక్కఁగా పొడిచేసి నీళ్లలోఁగలిపి యుంచుకొని, ఆ నీళ్ళతో ఇత్తడి పాత్రలను తోమిన యెడల దానియందున్న చిలుము పోయి శుద్ధముగను ప్రకాశముగ నుండును.

ముద్రవేయునట్టి నల్లలక్క చేయు విధము:— వెనిషియన్ టర్పన్ టయిన్ పలములు 183, అటుకుల లక్క పలములు 3/4, రోజనము పలములు 6¾, కావలసి నంత లాంబ్లాక్, వీనియందు అటుకుల లక్కలను రోజనంబును చక్కఁగా పొడిచేసి ఒక కుండయందు వేసి పొయిమీఁదబెట్టి సన్నగా మంటవేయవలయును. ఇది చక్కఁగా కరిగిన పిమ్మట లాంబ్లాక్ పొడినివేసి బాగా కలియఁబెట్టి మంటచేయక నిప్పు సెగయం దుంచి వెనిషియన్ టర్పన్ టయిను పోసి కలియబెట్టిన పిమ్మట ముందుగానే సిద్ధము చేసి యుంచుకొని చెమ్మచేసియున్న మిట్ట పల్లములులేని నునుపైన ఒక నల్లజాతి మీఁద ఒకగరిటతో ముంచిపోసి చేతితో నీళ్లనంటుకొని యిష్టప్రకారము లావుగాను నిడివి గాను దానిని చక్కగా దొర్లించి జలమునందు వేసివేయ వలయును.

ఇండ్లకు సున్నము కొట్టుటకు మంచి పద్ధతి:—నాలుగు పౌనులు సున్నపునీరును మూఁడుపళ్ళ జలమునందు కలుపుకొన వలయును రెండౌన్సులు వజ్రపుపచ్చను జలము నందువేసి యొక రాత్రియంతయు ఊరబెట్టియుండి మఱునాఁడు ఉదయమున దీనిని పొయిమీఁదనుంచి అది కరుగు వరకు మంటచేసి, కరిగిన పిదప ఇది నరకు కలిపి పెట్టి యుండు సున్నపు జలముతోఁ గూడ చేర్చి యుపయోగించిన యెడల మిక్కిలి చక్క నయిన తెలుపుగా నుండును.

గచ్చుగట్టిపడునట్లు చేయువిధము:—గోడలకు నేలలకు మిద్దెలకు సున్నపుగచ్చు పూసి, ముప్పాతికభాగము ఎండిన తర్వాత నాలుగుపళ్ళ పెరుగులో రెండుపళ్ళ మంచి నూనెనుపోసి యొకరాత్రి యంతయు నుండనిచ్చి మరునాఁడు ఆ పెరుగును నూనెను కలిసిన నీళ్లను గోడలు మొదలగువానికి పోసి అలికినయెడల గోడలు మొదలగునవి బీట్లు పారక యుండుటయే గాక చాలాకాలముదాఁక గచ్చు చెడిపోక యుండును.

క్రోటనాయిల్ [illegible] చేయు విధానము:—క్రోటనాయిల్ గింజలను [illegible] గాలి, [illegible] గింజలను [illegible] తప్పకుండ [illegible] కలిపినయెడల [illegible] నెలల [illegible] కొంత [illegible] పెట్టి తర్వాత బాగా [illegible] క్రమముగా [illegible]. క్రోటనాయిల్ దీసములను [illegible] (ఐస్) [illegible] బాగా ఎండబెట్టి మీఁద బర్నరులో వేయుట [illegible] శ్రీ [illegible] యుంచి మెల్లఁగా [illegible] కుండతో [illegible] కదలకబెట్టి చల్లారినవెనుక కుండలోని [illegible] చేసి కలిపిన [illegible] కడిగి బాగుగా ఎండినమీఁద [illegible] కలిపించిన [illegible] ఎంతటివేసి [illegible] నను పగులను.

## గృహవైద్యకము.

## ఆరోగ్యశాస్త్రము.

శ్రీమజ్జగదీశ్వరుఁడు పృథివి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశము అను పంచభూతములను జగమున కాధారముగాఁ జేసి, ఆరీతిగనే జీవునకును, ఈ పంచ భూతములనే యాధారంబుగా చేసియున్నాఁడు. ఎట్లనిన:—ఎముకలు, మాంసము, చర్మము, నరములు, రోమము లివి పృథివీ తత్త్వము, రక్తము, శుక్లము, మూత్రము, చెమట, జొల్లు, ఇవి అప్పుతత్త్వము. చూచుట, చలించుట, దుఃఖించుట, ఆరగించుట, మండుట, యివి తేజస్తత్త్వము. నడుచుట, పట్టుకొనుట, దాఁటుట, పడుట, కూర్చుండుట, యివి వాయుతత్త్వము. మోహము, భయము, లజ్జ, ద్వేషము, రాగము, ఇవి ఆకాశతత్త్వము.

ఇట్లు సృజింపఁబడిన దేహమునకు గాలి, జలము, ఆహారము ఇవి కావలసినంత క్రమప్రకారము సకాలమునందు ఇప్పించకపోయిన ఈ పంచభూత కృత్యము లొకప్పుడును జరుగవు.

మనము తినుటకు అన్నమును కట్టుకొనుటకు బట్టలు నుండిన నివి మాత్రము చాలవు. కొంచెమైనను గాలిసోఁకనిచో మహాసంకటము కలుగును. గాలియుండియును జలము త్రాగకపోయిన మహాతాపము గలుగును. ఇన్ని యున్నను అన్నము లేకున్న ప్రాణముండదు. అన్నముండియు దేహము శుద్ధిగాలేకున్న మతి నిలుకడగా నుండదు. ముఖ్యముగా చక్కని గృహమున ఇంతియగాక నిద్రాసుఖమును నుండవలయును. [illegible] నుండవలయును.

## గాలి.

ఈ లోకమున మనము అన్నపానములు లేక కొన్ని దినము లున్నను గాలిలేక నిమిషమాత్ర ముండము. గాలి సర్వత్రయున్నను బొగ్గు, జలము, ఉప్పు మొదలగుచోట్లనుండి వెలువడు గాలిమాత్రము సుఖము నిచ్చును. ఆకులు, అలములు, కుప్ప, శ్మశానము, మురికినీళ్ళు, జలదాగి, మలమూత్రవిసర్జనస్థలములు, వ్యాధిగ్రస్తులు వాసము చేయుచోట్లు, ఈ మొదలగు చోటులనుండి వచ్చుగాలి రోగములను కలుగఁజేయును. చింతచెట్లు మొదలైన యుష్ణము గల చెట్లగాలి చెడ్డది. మఱ్ఱి, వేప, మొదలైన యుష్ణము లేని చెట్లగాలి మంచిది. ఏ చెట్లయొద్దగాని రాత్రిపూట వాసము చేయఁగూడదు. వ్యాధిగలవారికిగాను దుర్గంధవాయువు దొలగింప యత్నించువారు నొకమూలలో కొంత పొయిబొగ్గును గంపలో వేసి యుంచవచ్చును. లేనిచో నిప్పుమీఁద గంధకమును వేసి యా పొగను సోఁకునట్లుగా చేయవచ్చును. సాంబ్రాణి, గుగ్గిలము మొదలైనవాని యొక్క పొగవలన విషవాయువు తొలగనేరదు. వాయువే శరీరమును కాపాడుచున్నది గాన గాలికి ప్రాణ మని మనపూర్వులు నామం బిడిరి.

స్త్రీలుగాని బాలురుగాని గాలియందు తిరుగు చుండవలయును. మనదేశములో గర్భిణి స్త్రీలును, వ్యాధిగ్రస్తులును గాలిసోకక యున్నారు. వీరికిని గాలి కావలయును. ప్రతివారికిని సముద్రపుగాలి మంచిది అయినను ఉష్ణభూమి చేరువ నుండు సముద్రపుగాలి ఆరోగ్యకరము. శీతలభూమి చేరువనుండు సముద్రపుగాలి రక్తక్షీణమును చేయును. వాతసంబంధభూమి చేరువనుండు సముద్రపుగాలి అండవాతము, శ్లేష్మము మొదలయిన రోగములను కలుగజేయును. పట్టణవాసమునం గల జనులకు విశేషముగ గాలి కావలయును. అధికజనులతో చేరి యుండరాదు. చిన్నగదియందనేకులు చేరి కొంతసేపు వుండవచ్చును గాని 2-3-ఘంటలకాలము వసించుట అనారోగ్యము. కొన్ని సమయములందు మరణమును గలుగును.

## జలము.

భోజనము లేక కొన్ని దినము లున్నను, జలములేక ఒకటి రెండుదినములుతప్ప చాలాదినము లుండలేము. ఈ లోకములో సమస్తప్రాణులును, స్థావరాదులును జలము లేకుండిన జీవింపవు. గనుక జలమునకు జీవనం బని నామము కలిగి యున్నది. సముద్రపుజలమే ఆవిరియై వానగా కురియును. చవుటినేలనుండు నీరు ఉప్పుగాను, రేగడయందుండునీరు తీపిగా నుండును. గొప్పనదులయందును, గుంటలయందును, మడుగులయందును నీళ్లు బహుకాల ముండును. ఆ నీళ్లను వాడునెడల జాగ్రత్తతో వాడుకొనవలయును. అధికముగా నీళ్లుండునపుడు కంపు తెలియనేరదు. ఆకులు, అలములు, చెట్ల

వేళ్ళు, గడ్డి, విశేషమైనపాచి మొదలైనవి యుండు జలము త్రాగుటవలన అనేక వ్యాధులు కలుగును. గనుక ఈనీళ్ళు స్నానపానములు రెంటికిని ప్రయోజనము కాదు.

ఆబాలవృద్ధపర్యంతము స్త్రీపురుషుల కందఱికిని దిన మొకమాఱైనను స్నాన మావశ్యకము. లేనియెడల చెమట బాగా బైలువెడలక రోగములను కలిగించును. బల హీనులు, వ్యాధిగ్రస్తులు, బాలురు వీరికి గోరువెచ్చని నీళ్లు స్నానమునకు యోగ్యము. చలికాలమం దందఱికిని గోరువెచ్చనినీళ్ళు మంచిది. మిక్కిలి వేడినీళ్ళు స్నానమునకు మంచిదికాదు. దెబ్బపడినవారు, త్రోవనడిచినవారు కొంతవేడిగా పోసికొనవచ్చును. పసిబాలురకు మనదేశమువారు ఊపిరికూడా తిరుగనీయక మిక్కిలి వేడినీళ్ళను త్వర త్వరగా పోసెదరు. దీనివలన కొన్నిసమయములయందు శిశువులు మృతిగూడ జెంద వలసివచ్చును. బిడ్డలకు ఊపిరి సాధారణముగా తిరుగునట్లుగా, చాలా వెచ్చనినీళ్ళను మెల్ల మెల్లగా పోయవలయును. చాలా వేడినీళ్ళు శ్వాసమును బంధించును.

కొన్నికాలములందు నీళ్ళు మంచిదిగా దొరక నేరదు. అట్టి సమయములందు నీళ్ళను తెచ్చి అందు పటికారము,మామిడిపప్పు, గంధము, వీనితో తేరనిచ్చి వడియగట్టి వాడు కొనవలయును. కట్టెలబొగ్గను, ఇసుకయును శుద్ధపఱచిన కుండలోవేసి దానిపైన నీళ్లు పోసియుంచి పై నీళ్ళనువాడుట ఆరోగ్యము. కొన్నిదినముల కొకతూరి క్రొత్త బొగ్గును ఇసుకయు వేయుచుండవలయును. వంటకుకూడా మంచినీళ్లుగానే యుండ వలయును.

## భోజనము.

గాలియు జల ముండినను అన్నము లేకపోయినచో చాలా కాల ముండ నేరము. భోజనమే మనకు బల మిచ్చు చున్నదని మితిమీరి భుజించరాదు. బాలురకుగాని పెద్దల కుగాని ఆహారము నియతిచొప్పున పెట్టవలయును. బాలురకు దినమునకు మూఁడు మార్లు క్లుప్తకాలమున నుంచవచ్చును. అయినను ఒక్కొకజామునకుపైగా భోజనము పెట్టవలయును. 16 ఏండ్లకు మించినవారికి ప్రాతఃకాలమునందు జామునకు పైగ 10 ఘంటలలోపల నొక పూటయును; రాత్రి 7, 8, ఘంటలలోపల నొకపూట యును భోజనము పెట్టవలయును. కొంచెము దేహబలము తగ్గినవారికిని, వ్యాధిగ్రస్తులు మొదలైనవారికిని మధ్యాహ్నకాలమునందు భోజనము పెట్టించవచ్చును. ఈ భోజనము నందు సత్తువ గల పదార్థములనే వాడు చుండవలసినది భూమిలో పుట్టినదిమొదలు కొన్నాళ్ళదాఁక క్రొవ్వు, మధురము, పిండి, జలము మొదలైనవికలిగినట్టి తల్లిపాలు త్రాగి మనము బలము నెట్లు చెందినారమో ఆరీతిగనే అట్టివస్తువులు గల పదార్థములనే

సదా భుజించవలసినది. అయినను అట్టివస్తువులనే మనము భుజించినయెడల అరిగించు కొను శక్తిలేనివారమై అజీర్ణాది రోగాదులంబడి బాధనొందుదుము. కావుననే ఉప్పు, పులుసు, కారము మొదలగు ననేక సంబారద్రవ్యములను చేర్చుకొను చున్నాము. కూడినంతవఱకు బలకరములగు వస్తువులను భుజించవలయును. భోజనము అర్ధభాగ మును, నీళ్ళు పాతికభాగమునుగా భోజనము చేయవలయును. పాతికభాగమును నింపించక యుంచినయెడల రోగహార మని మనపూర్వులు వచించి యున్నారు. భోజనమును బాగా నమలక నోటిలోనికి పోయినమాత్రమున మ్రింగకూడదు.

చంటిపాపలకు పాలిచ్చుటకు కాలము నిష్కర్షచేయ వలిలేదు. 2, 3, సంవత్సరముల శిశువులకు పప్పు మొదలగు పదార్థములను విశేషముగా నుపయోగింపరాదు. కొన్నిసమయములయందు జీర్ణముకాక శరీరతాపమును కలుగజేయును బాలుర తినడములే దని కొందఱు కారము ఉప్పు మొదలైనవి చేర్పక అన్నము పెట్టుదురు. లేక పాలనుమాత్రము త్రాగింతురు. ఆలాగు చేయుట తగదు మఱియు చిరుతిండ్లను విశేష మియ్యఁ గూడదు. బాలురు భోజనము చేయని సమయములో జావగాని పాలుగాని పోసెదరుకదా! వారు పోయునప్పుడు శిశువుల కూపిరి తిరుగనియట్లు పోయుటవలన శిశువులు చచ్చుటకూడా నొకానొకసమయమున కలుగును.

## ఆహారపదార్థముల జీర్ణకాల ఘడియలు.

బెల్లము, తేనె, పచ్చిబియ్యము కూడినవి 21 ఘడియలు. పిండివర్గములు, మిరియపుఅన్నము 21 ఘడియలు. పాలు 20 ఘడియలు. జలముతో చేరిన అన్నము 18 ఘడియలు. వెన్నతో చేరిన అన్నము 15 ఘడియలు. మజ్జిగ అన్నము 15 ఘడియలు. అన్నము 15 ఘడియలు. వేడినీళ్ళు 15 ఘడియలు. తేనె, చూర్ణము, తైలము, లేహ్యము 12 ఘడియలు. పెరుగుఅన్నము 11 ఘడియలు. దోసకాయ మొదలైన కాయగూరలు 8 ఘడియలు. పనస, అరఁటి, మామిడి మొదలగు పండ్లు, గడ్డదినుసులు, పప్పుదినుసులు, పుష్పములను దంచి పిండినరసము పండ్లరసము, నూరినట్టి మందుదినుసులు, శుద్ధ మయిన శీతలజలము $7\frac{1}{2}$ ఘడియలు. మంచిపదార్థములు, గంజినీళ్లు, తెంకాయనీళ్లు, చక్కెర, పానకము, వేయించిన పిండితో గలసిన నీళ్ళు 7 ఘడియలు. షడ్రసములు గల పదార్థములు, పులిసినకుడితి 5 ఘడియలు. పెరుగన్నము తిని నీళ్ళు త్రాగిన 4 ఘడియలు. కాఁగి చల్లారిననీళ్ళు, భస్మములు $3\frac{3}{4}$ ఘడియ. కషాయము 3 ఘడియలు.

## నిద్ర.

నిద్ర లేనియెడల సమస్తసుఖంబులును భంగంబు లగును. నిద్రను గోరువారందఱును దేహవిశ్రాంతిని ముందుగోరి పిదప నిద్రను గోరవలయును. లేనియెడల విశేష

ముగా నిద్రపట్టక కలవరింతలచే కాలము గడపవలసి వచ్చును. ప్రతిదినము కొంచెము సేపు తిరుగు లాడుట, సాము చేయుట, గుఱ్ఱపుస్వారీ చేయుట, లేక నేదైన పనులు చేయుట మొదలయినవానిని యనుష్ఠానమునకు తేవలయును. ఇట్లు చేయక యుంటిమేని దేహమునకు బలము కలుగక బుద్ధి స్థిరత్వము తప్పి చంచలముతో నేమియు తోచక యత్నించినకార్యము లన్నియు నెఱవేరక పోవును.

దేహపరిశ్రమ లేక పోవుటవలన శుద్ధరక్తము ప్రవహింపకయును, చెమ్మట పట్టకయును, శుద్ధవాయువు లోపలికి ప్రవేశింపకయును, భుజించిన అన్నము జీర్ణము కాక యుండుటయును సంభవించును. పిల్లలుకూడా వారివారికి తగినంతటి యాట పాటలతో కాలము గడపుట మంచిదిగానే యున్నది. స్త్రీలు గృహకృత్యములు నెఱ వేర్చుకొనుటయందు పాటుపడుటయే వారియొక్క దేహవిశ్రాంతికి కావలసినంత సుఖము నిచ్చును.

పైన జెప్పినట్లు పరిశ్రమ కలవారికి నిద్ర సులభముగా వచ్చును. పగటిపూట కంటె రాత్రియందు కొంచెము తక్కువ యాహారమును భుజించినచో మంచినిద్ర వచ్చును. నిద్ర తప్పిపోయినయెడల మేధస్సునకు భంగము కలుగును. పడకటింటి యందు గాలిరాక పోవుట, బట్టలు శుభ్రముగ లేకపోవుట, విశేషజనులు శయనించుట ఈ మొదలైనవానివలనను నిద్రకు భంగము కలుగును. ఎండకాలమునమాత్రము పగటియందు నిదురింపవచ్చును.

నిద్రలో మనకు స్వప్నములు సంభవించుట గలదు. శిశువులకు నిద్ర విశేషము కావలయును గనుక వారు పగటియందుకూడా నిద్ర పోవచ్చును. ఆ ఱేడు సంవత్సరముల వయస్సువఱకు పిల్లలకు పండ్రెండుఘంటలసేపు నిద్ర కావలయును. ఆమీద పదునాఱుసంవత్సరములవఱకు దినమునకు తొమ్మిదిఘంటలసేపు నిద్ర కావలయును. పెద్దవాండ్రు రాత్రి పదిఘంటలకు శయనించి తెల్లవాఱుజామున అయిదుఘంటలకు మేల్కొంచిరేని సుఖదేహు లగుదురు. నిద్రబోవునపుడు ముఖమును మూసికొనరాదు. ఎల్లరును తగినంతపరిశ్రమచేసిరేని సుఖమైనగాఢనిద్రకలిగి ఆరోగ్యమును పొందుదురు.

## గృహము.

మనమెట్టిసంపద వహించియున్నను వాసముచేయుటకు వసతియగు గృహములేని యెడల సమస్తవిధములయందును సుఖమునకు భంగము కలుగును. కాబట్టి చుట్టుపట్ల నీరునిలువనిస్థలమందు ఇండ్లు కట్టవలయును. గాలివచ్చుటకై కావలసిన గవాక్షముల నుంచవలయును. ఇండ్లు దట్టముగా నుండుచోట కట్టుటకంటెను చుట్టు బైలు గలిగి మధ్య నిండ్లుకట్టుట ఆరోగ్యమునకు మంచిది. వెలుతురు లేని గృహములందు వాసము చేయుట జనులకు బలము తక్కువయును దేహము తెల్లబారుటయును కలుగును.

ప్రతిదినమును గృహమును చక్కఁగా కడుగు చుండవలయును ఆఱు నెలల కొక మాఱైనను గోడలకు సున్నమును గొట్టవలయును అంట్లకుండలు, మురికికాల్వలు, దొడ్లు మొదలైనవానిని శుభ్రపఱచు చుండుటయే గాక బిడ్డలను అరుగులసమీపమున జల మల విసర్జనములకు విడువఁగూడదు. గ్రామాదులలో నిండ్లయందే పశువులను ఎద్దులను కట్టుచున్నారు. ఇట్లు కట్టుటవలన పశువులయొక్క శ్వాసము యెంతమాత్రమును బైలువెడలక మనము శ్వాసించెడు గాలితో కలిసి లోపలికి పోవును. అట్లు పోవుట బలక్షీణమును కలుగఁజేయును మఱియు వీనిమూత్రము పేడ గడ్డి మొదలగువాని నుండి వెడలు దుర్గంధవాయువువలన వాంతిభేది అతిసారము గ్రహణి మొదలగు రోగములు సంభవించును. గృహములందు అసహ్యాకరము లగు వస్తువులను మూలమూలకు చేర్పకయు, పదుగురు జూచి పరిహాసము చేయు నంతటి ఆభాసములను ఇండ్లయందు నుంచకయు నుండిరేని సుఖగాత్రులై కొంతకాలమువఱకు నీలోకమందు చక్కని స్థితిలో నుందురు.

## స్ఫోటకప్రయోగము.

స్ఫోటకము ఉష్ణముచే గలుగు బొబ్బలు. ప్రస్తుతమున స్ఫోటకమనఁగా, ఆవుల వంటి జంతువుల పొదుగులయందును, చన్నులయందును కొన్నిసమయములలో సంభవించు చున్న స్ఫోటకము అనెడు వ్యాధినుండి తీయునట్టి పాలను మనుష్యుల భుజములయందు అంటుకొనునట్లు పొడుచుట. దీనిని 1798 వ సంవత్సరమునందు పశువులు స్ఫోటకము అనెడు వ్యాధివలన సంకటపడునప్పుడు ఆవ్యాధిసంపర్కము కలవారికి మసూచకము రాకుండునట్లు డాక్టరు జెన్నరుదొర మొదట తెలిసికొనెను.

అమ్మవారు పొడిచినచోట్లమాత్రము బొబ్బలు కనఁబడును. పొడిపించుకొన్న వారికి అపూర్వముగా మసూచకము కనుపించును. కనుపించినను తేలికగా పోవును.

కొందఱికి అమ్మవారు పొడుచుకొనిన, మూఁడవ లేక అయిదవదినమందైనను ఆఱవదినమందయినను జ్వరము వచ్చును. వంతుప్రకారము సాధారణముగా యెనిమిదవ నాటిసాయంకాలము ఎఱ్ఱనివలయము బయట వచ్చినప్పుడు జ్వరము రావడమును కలదు. ఈ జ్వరము కొందఱికి కొంచెముకాల ముండును. అప్పుడును ముమ్మరముగా నుండదు. అధికముగ వచ్చినను ఇరువదినాలుగుఘంటలకుమీఁద నుండదు. బిడ్డలకు అమ్మవారు పొడిపించుటవలన తాపముకలిగి ఉష్ణము మీదికివుబికి మాటిమాటికి పేగుల యందు సంకటములు కలుగుచుండును. చంకలో బిళ్ళకట్టి నొప్పికలుగును పదిదినములైనవెనుక బిడ్డ బాగుగా తేరి యెప్పటివలె సౌఖ్యము చెందును.

## ఉపచారములు.

అమ్మవారు పొడిపించుకొన్నవారికి నాల్గవదినము లేక అయిదవదినము ప్రవృత్తియగునట్లు చిట్టాముదము, లేక తేలికగానుండు మందులిచ్చుట యుక్తము. మఱియు సాధారణముగ స్నానము చేయించునట్టి కాలములలో చేతిమీఁది బొబ్బలకు హాని రాకుండునట్లు చేయఁగూడిన ట్లయినచో మాత్రమే స్నానము చేయింపవచ్చును. నాల్గవదినము మొదలుకొని తర్వాతదినములందును పెరుగుచున్న ముత్తెములకు రొట్టి చెడుపును చేయక యుండవలయును దీనికై బాల్యమందు అమ్మవారు పొడిపించుట ఉత్తమమని తెలియవలయును అపుడు బిడ్డలకు బాధలు తెలియవు. శోకదమునుండదు.

అమ్మవారు పొడిపించుకొన్నవారికి సాధారణముగా నాల్గవదినము స్నానము చేయింపవచ్చును. అయిదవదినము విరేచనమునకు చిట్టాముద మిప్పింపవచ్చును. చాలమంది బుద్ధిమంతులు యీవాడుకను అనుసరించుచు వచ్చెదరు. అమ్మవారు పొడిపించుకొన్నవారివలనగాని, పాలకులయొక్క శ్రద్ధాలోపమువలనగాని, ముత్తెములు గోకుడు కలిగినట్టులైన వుండుఅగును దానికి తెంకాయనూనెపట్టించవచ్చును. బొబ్బ పచ్చిపుండయినప్పుడు మురికి చేరి యీగలు మూఁగక జాగ్రత్తగాఁ జూచుచు వెన్నపశాస్త్రి వేసిన యెడల ఆరి పోవును, లేక వెన్నమాత్రము పూయవచ్చును.

బిడ్డ పుట్టిన ఆఱువారములు మొదలు మూఁడుమాసములవఱకును అమ్మవారు పొడిపించుటకు తగినకాలము. పండ్లు మొలచుటకు ముందే అమ్మవారు పొడిపించుట సర్వోత్తమము. ఈ మశూచకము వయసు వచ్చినవారికంటె బాలురకే విశేషముగా కనిపించి ప్రాణహానిని చేయుచున్నది. బిడ్డలు జ్వరముతోడ నున్నప్పుడును, చెవి వెనుక ప్రక్కను, గజ్జలు, తోలు, ముడుతలు, ఇవిపుండ్లచే పొంగి యుండునపుడును నొకవిధమైన అగ్నిజ్వాల, జ్వరము, చిన్నమ్మ, అక్కి, లేక దద్దురరోగము మొదలయినవి వ్యాపించి యున్నప్పుడును అమ్మవారు పొడిపించకూడదు.

## సూదితో అమ్మవారు పొడిపించుట.

అమ్మవారు పొడుచుటకుగాను ప్రయోగించునట్టి ఆయుధము సూది. సూదులమొనలచే పాలు యెత్తునప్పుడు ఆ మొనలు పాలిచ్చు ముత్తెముల పచ్చిభాగమందు పడకుండునట్లు మిగుల జాగ్రత్తతో చూడవలయును. రక్తము బయట రాఁగూడదు, క్రమముగా తెలిసి అమ్మవారు పొడుచుటవలన బిడ్డలుయేడ్చుట లేదు. ఉలికిపడుటయును లేదు. భుజమునను మూఁడుచోట్లచొప్పున పాలు ప్రయోగింపవలయును. ప్రతిచోటికి నడుమ ఆఱుఅంగుళములు మొదలు రెండంగుళములవఱకును స్థలము విడిచి యుండవలయును.

రెండుమూఁడుచోట్లలో అంటించుటకంటె ఆయుచోట్ల అంటించుట మేలు. మగశిశువులకు దీర్ఘ రేఖ గాను ఆడుశిశువులకు త్రికోణాకారముగాను పొడుచుటకలదు.

ఆడువారికి భుజమునందు చిహ్నములు కొంచెము క్రింద కనఁబడకుండుటకై యిట్లు చేయుచున్నారు.

రెండు శేక నాల్గుముత్తెములు క్రమముగా పొటమరించినట్టులయినచో ఒక్క ముత్యమే చిదుపవచ్చును. ఆపత్కాలమందుకూడ రెండుముత్తెము లున్నచో ఒక్క ముత్తెము నే చిదుపవలయును. ఒక్కటే యున్నయెడల ఒకప్పుడును చిదుపకూడదు. ముత్తెములు వృద్ధియగునప్పుడు వానికి యెట్టిచెలుపును సంభవింపకయుండుటకు ముత్తెములు తేరి పగిలి యెండి పక్కు గట్టినతర్వాత ఆ పక్కును నిర్ణీతకాలమునకు ముందే గిల్లివేయ కుండునట్లు జాగ్రత్తతో జూచు చుండవలయును.

ఈ కార్యము సర్కారువారియనుమతిని బొందినవారలవలన జరిపింపఁబడినను గృహస్థులకెల్ల నీవిధి దెలియవలసినది యావశ్యకమై యున్నది గాన సంగ్రహింపంబడినది. (విశేషముగాఁ దెలియఁగోరువారు వైద్యసారరత్నావళియందు గనఁదగును)

## వస్తుగుణవివరణము.

అగిసె:—దీనిపుష్పములవలన అగ్నివలనను పొగవలనను కలిగిన పిత్తమును, ఉష్ణమును పోవును. దీనివేరువలన సర్వాంగములలో మంటలు, దాహము, మేహము తీరును. దీనిఆకువలన పెట్టుడుమందులు నివర్తించును.

అతివస:—గ్రహణి, భేది, వాంతి, ఉష్ణము హరించును.

అత్తి:—దీనికల్లువలన విశేషమైన మైకము, ఉష్ణము, మేహము తీరును. దీని కాయలవలన ఉష్ణము, శూల, కురుపులు, మలబద్ధకము, మేహము, వాతము పోవును. దీనిపట్టవలన రక్తశీతభేది, కంపెత్తినవ్రణములు, ప్రమేహము తీరును. దీనిపండ్లవలన రక్తకాసము, మేహము హరించును. దీనిపాలవలన అత్యుష్ణము, మూత్రకృచ్ఛ్రము, బహుమూత్రము, పిత్తము హరించును. దీనిపించెలవలన ఆసనము మంటలు, మూల గ్రహణులు తీరును.

అభిని:—దీనివలన కొన్నిరోగములు నివర్తించు నని చెప్పినను, దీనిచే కలుగు అపాయములు చెప్ప తరము కాదు.

అష్టశాకారము:—కఫము, వాతము, గుల్మము, శూల, ఉబ్బసము హరించును.

అశ్వగంధిగడ్డ:—(పెన్నేరుగడ్డ) ఆయాసము దోషము, క్షయము, చేతుల వల్లగానుండుట, పరుపులు, పాండువాతము, ఉష్ణము తీరును. కామోద్రేకమును, మోహమును కలుగును.

అయము:—(ఇనుము) అగ్నిమందము, అరుచి, దేహస్థూలము, కామిల, గ్రహణి, గుల్మము, శోఫ, ధాతునష్టము, పిత్తపాండు, వాయువు, కఫము యివి తీరును.

అన్నభేది:—అమగడ్డ, శూల, జలమహోదరము, మందము, మొలకలెత్తిన వ్రణములు వీనిని హరించును.

అష్టసుము:—పదుమూండుసన్నిపాతములు, కఫము, వాతము, వాతజ్వరాదులను పలువిధజ్వరములు, కాసము, శ్వాసబంధము, మందము యివి తీరును.

అల్లము:—త్రిదోషము, దగ్గు, కఫము, కుక్కవ్యాధి, సన్నిపాతము, జ్వరము, శూల, స్వరదోషము, మేహము, వాపు యివి తీరును.

అటికమామిడి:—గళగ్రహము, శీతలము, గజ్జి, పీనసము, వాతము హరించును.

అనపకాయలు:—పిత్తశ్లేష్మమును, వాయురోగములును కలుగఁజేయును. అనపగింజలు త్రిదోషములను కలుగఁజేయును.

అరఁటి:—దీనిపండ్లు సోమరోగము, పిత్తరోగము, మదమూర్ఛలను పోఁగొట్టును. దీనికాయలు కడుపులో మంట, కాసము, పిత్తము, భేది, వాంతి, వాయువు, నోటిలో నీళ్ళూరుటను మాన్పును. దీనిగడ్డ అగ్నిదీపనమును కలుగఁజేయును. దీనిబొంత వేసులలో నుండు తోలు, జాళ్ళు, వెంద్రుకలు వీనిని హరించును. దీనిగడ్డలోని నీరువలన వ్రణము, రక్తభేది, ఆయాసము, భస్మకరోగము, మూత్రకృఛ్రము, సోమరోగము, మూత్రద్వారమందలి మంటలు, పాండువులు తీరును. చలవయు, బలమును కలుగఁజేయును. దీనిపిందెలు రక్తమూలము, రక్తభేది, బహుమూత్రము, మేహము, గర్భవ్రణములు మాన్పును. దీనిపువ్వులు ఉష్ణము, కాసము, క్రిములు, కాళ్ళు చేతులు మంటలు, పిత్తము, గళగ్రహము, ప్రమేహము, మూలము, రక్తమేహము, భేది వీనిని పోఁగొట్టును; ధాతుపుష్టిని కలుగఁజేయును. దీనిఆకు అగ్నిమందము, దగ్గు, కరపాణి, మేహవాతము, ఆయాసము, వాతమును పోఁగొట్టును; దేహకాంతిని, భోగమును కలుగఁజేయును.

ఆవాలు:—కఫము, కాసము, గుల్మము, పిత్తమందము, శీతము, మైకము, వాయువుపట్లు, త్రిదోషము, నోటిలో నీరూరుట వీనిని పోఁగొట్టును. దీనినూనె

రక్తపిత్తము, కఫము, కుష్ఠము, సూతికాశూల, మూలము, కడుపునొప్పి, వాయువు, వ్రణము, జంతురోగము, అనఁగా కడుపులో పురుగులబాధ, శుక్లగతదోషము, వీనిని హరించును.

ఆముదపునూనె:—జంతురోగము, సమస్తఉదరశూలలు, వాతము, కుష్ఠము, గజ్జి ఇవి మొదలైనవి పోవును. ఇది విరేచనమునకు ప్రసిద్ధము.

ఆవుపాలు:—అంతర్గతజ్వరము, ఉష్ణము, రక్తపైత్యము, జరావ్యాధి, కఫము, దాహము, వికారమూర్ఛ వీనిని పోఁగొట్టును నేత్రహితము, వయస్థాపనము, శ్లేష్మము, వీనిని కలుగఁజేయును. దీనిపెరుగు త్రిదోషములను, ఆయాసమునుపోఁగొట్టి అగ్నిదీపనమును కలుగఁజేయును. దీనినేయి సమస్తత్రిదోషసంబంధవ్యాధులనెల్లను హరించును. దీనిమజ్జిగ పెరుగుకన్నను శ్రేష్ఠము. దీనిమూత్రము సకలవిషములు, పిత్తపాండు, ఉదరరోగములు మాన్పును. దీపనము గల్గును. విరేచనకారి.

ఇంగిలీకము:—గడ్డలు, వ్రణములు, కురుపులు, గ్రంధి, కుష్ఠము, సన్నిపాతము, జ్వరము, శూల, భేది, వాతము హరించును.

ఇంగువ:—అష్టగుల్మములు, గర్భశూల, గర్భస్థక్రిములు, సకలవిషములు, శ్లేష్మము, దంతమూలరోగము, మహోదరము, బొమ్మనొప్పి వీనిని హరించును.

ఇప్పనూనె:—దుర్బలము పోవును. వ్రణములు, కురుపులు మొదలయినవి పోఁగొట్టును. దీని గానుగపిండివలన నూనెజిడ్డు, వ్రణములు, కురుపులు, అండవాతము తీరును. దీనిపూలవలన దాహము, పిత్తజ్వరము మానును పైత్యరోగము సంభవించును.

ఈశ్వరవేరు:—అన్నిరోగములను, విషములను పోఁగొట్టును.

ఉప్పు:—అష్టగుల్మములు, అగ్నివాతము, శూల, బలమైనగడ్డలు మాన్పును.

ఉద్దులు:—శుక్లనష్టమును, భస్మకరోగమును మాన్పును. వాతశీతలమును కలుగఁజేయును. దీనివడలు దీపనకారి, పిత్తమును పోఁగొట్టును. వాతమును కలుగఁజేయును. దీనిఅప్పడములు బలమును వాతమును కలుగఁజేయును.

ఉస్తె:—అగ్నిదీపనమును కలుగఁజేయును. వాతపిత్తము, అరోచకము, జంతురోగము, మేహము, గ్రహణి మొదలయిన రోగములను హరించును. రక్తపుష్టిని కలుగఁజేయును.

ఉసిరికకాయలు:—అరోచకము, ఉష్ణము, ప్రమేహము, పీనసము, వ్రణములు త్రిదోషము, వాంతి, వాపు, మొదలయినవానిని హరించును.

ఉల్లిగడ్డలు:—దీనిసమూలములు గురుత్వము గలవి యయినను వాతము, శ్లేష్మము, అజీర్ణము, కాసము, సన్నిపాతము, వీనిని కలుగఁజేయును. ఉష్ణము, రక్తపిత్తము, గ్రంధి, దాహము, నాలుకకురుపులు వీనిని పోఁగొట్టును.

ఉలవలు:—వాతరోగములను హరింపఁజేయును.

ఊడుగ:—శ్లేష్మము, కాసము, కుష్ఠము, వాయువు, విషము హరించును. పిత్తమును కలుగఁజేయును. దీనివిత్తులు విషములను పోఁగొట్టును.

ఎళనీరు:—శ్లేష్మము మానును. రాత్రిలో పానము చేసినచో క్రిములు హరమగును.

ఎనుముపాలు:—బుద్ధిమందము, వాతము, తిమ్మిరి, నిద్ర, శ్లేష్మము, అగ్నిమాంద్యము కలుగఁజేయును. మందుగుణమును మాన్పును. దీనిపెరుగు పిత్తమంటలను పోఁగొట్టును. దీనిమజ్జిగ కఫము, శోఫ వీనిని కలుగఁజేయును. దీనినెయ్యి నేత్రప్రకాశము, బుద్ధి, దేహకాంతి వీనిని హరించుటయే గాక; కరపాణి, పిత్తము, వాతము వీనిని కలుగఁజేయును.

ఎలుకచెవికూర:—జ్వరము, దాహము, బహుమూత్రము, ప్రమేహము హరించును ఇంద్రియపటుత్వము కలుగఁజేయును.

ఎండపడిన నీళ్ళు:—అన్నిరోగములను పోఁగొట్టును. దేహమునకును అన్నివిధములైన సుఖమును కలుగఁజేయును.

ఏటినీళ్ళు:—ధాతువృద్ధి కలుగఁజేయును.

ఏలకులు:—అన్నిరోగములను హరించును. ధాతువృద్ధిని కలుగఁజేయును. విషములను పోఁగొట్టును.

ఓమము:—అతిసారము, ఆమము, దగ్గు, శీతము, భేది, జ్వరము, మాంద్యము, మూలరోగము ఇవి మాన్పును.

కటుకరోహిణి:—ఆమము, కరపాణి, జ్వరము, త్రిదోషము, వ్రణము, మలబంధము, మందము, కడుపునొప్పి, వాయువు మాన్పును. భేదిని కలుగఁజేయును.

కరక్కాయలు:—అతిస్థూలము, మేఢ్రము నొప్పులు, వ్రణములు, దెబ్బపడిన వ్రణములు, కన్నునొప్పి, నాలుకనొప్పి, విషములు పోఁగొట్టును.

కందగడ్డ:—మూలవ్యాధులు మానును. దేహస్థూలము, నేత్రకాంతి, గ్రంధి, శూల కలుగఁజేయును.

కలకండ.—దగ్గు, ఉష్ణము, కఫము, దంతరోగము, వాంతి, దురద, బహుమూత్రము మాన్పును అగ్నిదీపనము, ధాతువృద్ధి కలుగును.

కందిపప్పు.—పిత్తము, గ్రహణి, సన్నిపాతము, శ్లేష్మము, శీతము, విషము హరించును. ధాతువృద్ధియు, బలమును కలుగఁజేయును.

కాగిఆరిననీళ్ళు—దేహమునకుమంచిది రోగులకిది ప్రయోజనకరము.

కాకరఆకు.—క్రిములు, పాషాణదోషము హరించును. రసమునకు విరుగుడగును. భేదిని కలుగఁ జేయును. దీనికాయలు పురుగులు, శ్లేష్మము హరించును. దీపనము కలుగఁజేయును దీనిపండ్లు కాసము, క్రిములు, జ్వరము, శ్వాసము, త్రిదోషము, మూలము, మేహము వీనిని పోఁగొట్టును.

కుంకుమపువ్వు.—అండవాతము, శిరోరోగములు, కంటిలోని పుష్పము. కఫము, శూల, దాహము, మేహము, బిందునష్టము, ఛర్ది, జలదోషము, జ్వరము, చెవినొప్పి, పిత్తము. పీనసము, మధుమేహము, స్త్రీగర్భాశయదోషము వీనిని మాన్పును.

కొత్తమల్లి—చలి; జ్వరము, శ్లేష్మము, దాహము, ధాతునష్టము; మందము, వాంతి, వికారము, ఎక్కిళ్ళు, వ్రణము, ఉష్ణము హరించును. దీని యాకు సమస్తపిత్తరోగములను హరించును భోగమును వృద్ధి చేయును.

గసగసలు—అతిసారము, గ్రహణి, క్రిములు, మేహపు తీట వీనిని మాన్పును. నిద్ర, బిందువు, కాంతి వీనిని కలుగఁజేయును.

గంటుభారంగి.—కడుపుపొఱుట, ఆయాసము, కఫము, శీతజ్వరము, శ్వాసకాసము, గొంతునొప్పి, బహుమూత్రము, పిత్తము, పీనసము, వాతము, వెట్టి వీనిని హరించును.

గజపిప్పలి.—తీరని శ్వాసకాసము, కఫము, కరపాణి, గొంతు కమ్ముకొనుట, సన్నిపాతము హరించును దీపనము కలుగును.

గుమ్మడికాయ.—తాపము, పిత్తము హరించును. మంగుగుణమును విరచును. వాతమును కలుగఁజేయును. దీని విత్తనములు మంచిది.

గోధుమలు—బలము, ధాతుపుష్టిని కలుగఁజేయును.

గోరోచనము—ఉన్మాదము, లోపలివ్రణములు, కఫము, బాలురరోగములు, బహుమూత్రము, మసూచకము, మేహజ్వరము హరించును.

చక్కెర.—అరుచి, కఫము, పిత్తము, వాంతి నివర్తించును.

చలువమిరియాలు.—శీతము, దాహము, కడుపునొప్పి, పిత్తము నివర్తించును. దీపనమును కలుగఁజేయును.

చామగడ్డలు.—మేహము, గళము నివర్తించును. పథ్యములకు ప్రయోజనము కాదు దీనిఆకు మూలవ్యాధులను నివర్తించును.

చిక్కుడుకాయలు—అరోచకమును, మంద గుణమును మాన్పును. దీని పిందెలు పథ్యకారిగా నున్నది. దీనిఆకు వ్రణములు, గ్రహణి, తలనొప్పి, విషము నివర్తించును. దీపనము కలుగఁజేయును.

చిట్టికూర—కాసము, కృచ్ఛ్రము, విషము, పాషాణవిషము, పిత్తము, రక్తపిత్తము, నేత్రరోగము, రసవ్రణములు నివర్తించును చలువయు, కాంతిని కలుగఁజేయును.

చింతకాయ—పిత్తమును నివర్తించి వాతమును కలుగఁజేయును, దీనిపండ్లు ఛర్ది, ధాతుపుష్టి, మందగుణమును, పిత్తమును హరించి దేహమందలి రోగమును అధికము చేయును. దేహస్థూలము, సన్నిపాతజ్వరము, బుద్ధిమందము కలుగఁజేయును. దీనిపూలు అరోచకము, పిత్తము, వాంతి వీనిని మాన్పును. దీనిఆకు శోఫ, పాండువ్రణము హరించి ఉష్ణమును కలుగఁజేయును. దీనిగింజలు అతిసారము, వ్రణము, శుక్లమేహము మాన్పును. దీనిగింజలతోలు గ్రహణి, మేహములను నివర్తించును. ఈ తోలును తెంకాయకోరులో వేసి పిసికినయెడల శీఘ్రముగా పాలను పిప్పిని వేర్వేరుగా విడఁదీయును.

జటామాంసి.—దగ్గు, రక్తపిత్తము, శ్వాసము, ఉష్ణము, కన్నునొప్పి, కుష్ఠము, ఛర్ది, విషము, పురాణజ్వరములు, భేది, వాయువు వీనిని పోఁగొట్టును.

జముడు—క్రిములు, కుష్ఠము, గజ్జి, వ్రణములు పోఁగొట్టును విరేచనకారి. ఇది కొన్నిశరీరములకు కాదు.

జాజిపత్రి.—గ్రహణి, భేది, తాపజ్వరము మాన్పును. ధాతువృద్ధిని, పిత్తమును కలుగఁజేయును. జాజికాయ శిరోభారము, శీతజ్వరము, శీతభేది, శీతలము, మూలము పోఁగొట్టును. జాజిపుష్పము సన్నిపాతము, త్రిదోషము, నేత్రరోగము, ఉష్ణము, ఒళ్ళునొప్పులు మాన్పును. దేహకాంతిని కలుగఁజేయును.

జిల్లేడు—సన్నిపాతము, అనేకవిషములు, వాతము పోఁగొట్టును. దీనిపాలు గడ్డలు. సన్నిపాతము, వాయువు పోఁగొట్టును. దీనిఆకు ఎలుకకాట్లు, శ్లేష్మము, క్రిములు, కుష్ఠము, శూల, మందము, మలబంధము, వాయువు పోఁగొట్టును. దీనిఆకు యొక్క పసరు పామువిషమును పోఁగొట్టును.

జీలకర:— అరుచి, దగ్గు, శిలామేహము, గ్రహణి, గుల్మము, వాతము, గొంతు కమ్మట, నాసారోగము, పిత్తము, ప్లీహము, వాంతి పోఁగొట్టును నేత్రములకు చలువ కలుగును.

తాళకము:—వ్రణములు, శిరోరోగములు, నేత్రమందము, జ్వరములు మాన్పును.

తిప్పతీగె:—అతిసారము, రక్తపిత్తము, జ్వరములు హరించి దీపనమును కలుగఁ జేయును. దీనిగడ్డ అతివిషములు, అతిసారము, రక్తపిత్తము, జ్వరము, మాంద్యము, మేహములు పోఁగొట్టును.

తులసి:—అస్థిగతజ్వరము, అరోచకము, కఫము, కాసము, దాహము, వ్రణము మాన్పును. ఉష్ణమును కలుగఁజేయును దీనివిత్తులు అరుచి, కఫము, మలబంధము మాన్పును. కాంతి దీపనము కలుగును.

తుంగముస్తెలు:—అతిసారము, ఉష్ణము, రక్తపిత్తము, శీతజ్వరము, శోఫ, దాహము, పిత్తము, వాతజ్వరము, వాంతి నివర్తించును.

తెగడ:—ఉదావర్తము, పిత్తము, బాలగ్రహదోషములు, వాతము మాన్పును. తెల్లతెగడవేరు విరేచకఔషధమునకు ప్రశస్తము.

తెల్లగలిజేరు:—వాతరోగములు, గ్రంధి, కురుపులు, శ్వాసకాసము, పీనసము మాన్పును. దీనివేరు నేత్రరోగములను నివర్తించును.

తెల్లగడ్డ:—సన్నిపాతము, శీతలము, తలనొప్పి, పండ్లు చేరుకొని నోరు తెరువకయుండువ్యాధి వీనిని మాన్పును.

తెల్లబోడతరము:—అరోచకము, దగ్గు, కరపాణి, ద్వంద్వరోగము, మాంద్యము, వాతము, వాంతి మాన్పును కాంతి, దీపనము, శుక్లపుష్టి కలుగఁజేయును.

తేనె:—త్రిదోషములు, అరుచి, మందము నివర్తించును.

దాసనము:—పిత్తము, మేహము మాన్పును. దీనిపువ్వులు రక్తపిత్తము, దాహము, భేది, కడుపులో సంకటము, శుక్లనష్టము, విషూచి, ఉష్ణము పోఁగొట్టును.

దానిమ్మ:—ఛర్ది, ఉష్ణము వీనిని మాన్పును.

ద్రాక్ష:—అరుచి, రక్తపిత్త, ఉన్మాద, క్షయ, జ్వర, శ్వాస, సోమరోగ, దాహ, స్థావరవిష, పిత్త, మదమూర్ఛ, మూత్రరోగ మేహములును; కడుపులో ఖండము, ఉష్ణము వీనినిపోఁగొట్టును చలువయు, నేత్రప్రకాశము, ధాతుపుష్టి కలుగఁ జేయును.

దోసకాయ:—మంటలు, కరపాణి, మూత్రరోగములు పోఁగొట్టును. ఆఁకలియును వాతము కలుగును. దీనిపిందెలు త్రిదోషమును మాన్పును. దీనిపండ్లు శైత్యమును కలుగఁజేయును దీనివిత్తులు శిలామేహము, మూత్రబంధము, మూత్రద్వారమందు గల రోగములు, మేహము మాన్పును..

నల్లసోమిదపాకు:—కఫరోగము, కరపాణి, సన్ని, ఒడిసెగడ్డలు, పీనసము, రాచకురుపు, మేహవ్రణములు, శిరోరోగములు మానును దీనిపూలు జలదోషము, తలపోట్లు, పీనసము, వాతము హరించును.

నల్లేరు:—అతిసారము, రక్తభేది, కఫము, మందము, మూలము, ఉదరవ్యాధులు, వాయువు మాన్పును. దీపనము కలుగఁజేయును.

నిమ్మకాయ:—ఛర్ది, గుల్మము, శూల, పిత్తోష్ణము, త్రిదోషము, వాతకఫము పోఁగొట్టును. దీనిపండ్లు అరోచకము, న్నునొప్పి, జ్వరము, దాహము, మైకము, విషము నివర్తించును.

నువ్వులు:—సంశుగుణమును హరించును ఉష్ణము, నేత్రప్రకాశము, బలము, పిత్తము కలుగును. దీనితైలము నేత్రరోగము, కపాలరోగము, కాసము, కర్ణరోగము హరించును దీనిపిష్టము మంచిదికాదు

నూఁగుదోస:—రక్తపిత్తము, మూలవృష్ణము హరించును.

నేలతంగేడు:—గ్రంథి, గుల్మము, తీట, వ్రణములు, తామర, మలబంధము, మూలవాయువు మానును. విరేచనకారి.

నేలతాటి:—భస్మకరోగము, గ్రంధి, శూల, ఉష్ణము, మేహము, కుష్ఠము మాన్పును రక్తము, అధికభోగము కలుగఁజేయును.

నేలవేము:—జ్వరదోషము, పిత్తమైకము, వాతము మాన్పును.

పచ్చకర్పూరము:—మేహము, ఉష్ణము, తాపము, శూల, ఉన్మాదము, గుల్మము, కఫము, పిత్తము, పీనసము మాన్పును. నేత్రములకు హితమును కలుగఁజేయును

పనస:—దీనియొక్క పిందెలు, కాయలు, పండ్లు, విత్తనము లన్నియు రోగములను కలుగఁజేయును.

పర్పాటకము:—ఉన్మాదము, శీతవాతజ్వరము, పిత్తము మానును.

పసుపు:—విషము, త్రిదోషము, పీనసము, కంపు, మందము, మేహము, వాంతి, వ్రణము నివర్తించును. దీనిని స్త్రీలు పూసికొనుటచేత దుర్గంధము, ముఖసంకోచము, చెమ్మట మానును.

పటికారము:—నేత్రరోగము, గుల్మము, మధుమాంసవిషము, దంతరోగము, శ్లీపదవాతము (ఏనుగకాలు) మానును.

పొన్నగంటి:—ఉష్ణము, వాతము, పిత్తము ప్లీహము, కాసము మానును. నేత్రమునకు హితము చేయును.

పొగాకు:—ఇది మంచిదిగాదని అనేకవైద్యశాస్త్రములందు జెప్పియుండుటయే గాక ఆంగ్లేయవైద్యులలో ప్రసిద్ధిజెందిన కాంగ్‌వేస్టు, మార్షల్‌హాల్, హెన్రిబ్రియన్స్, విల్లియంహార్డ్‌విక్ మొదలగువారు చెప్పుచున్నారు; ఒక పౌండు పొగాకులో 3½ గ్రెయినులవిష ముండును.

పొగడ:—అరోచకము హరించును. దీనివిత్తులు, నేత్రదోషము, మలబద్ధము, విషము, ఉష్ణము మాన్పును. శీతలము, ధాతువృద్ధి, ఇంకను కొన్నిరోగములు నివర్తించును. దీనిపట్ట దంతములను గట్టి చేయును.

బ్రహ్మరాకాసి:—నేత్రరోగము, నేత్రము ఎఱుపు కలిగియుండుట, కఫము, వాతము మానును.

బాదము:—దీనికాయలు కఫము, పిత్తవికారము నశింపఁజేయును దీనిపండ్లు ధాతువృద్ధికరముగ నుండును. దీనిపప్పు కఫము, ఉష్ణరోగములు, శుక్లనష్టము హరించును. దీనితైలము దేహమునకు ఆరోగ్యము, నేత్రహితము నిచ్చును.

బావంచివిత్తులు:— మేహవ్రణములు, కుష్ఠము, దద్రురోగములు, గజ్జి, కరపాణి, వాతము, కఫము నివర్తించును. పైత్యకారి.

బిల్వసమూలములు:—శీతలమును కలుగఁజేయును. ఉష్ణమును హరించును. దీని ఆకును కొన్నిదినములు భుజించినయెడల నేత్రదోషము నివర్తి యగును. రేచీఁకటిని త్వరలో మాన్పును.

బుడమకాయ:—పిత్తమును కలుగఁజేయును. దీనివరుగులు అరుచి, వాతము మాన్పును.

బెల్లము:—మితముగా దినినచో ప్రమేహము మాన్పును. లేనిచో విశేష పుష్టము, మేహము కలుగును.

బొద్ది:—ఇది శుక్లనష్టమును మాన్పును. హితకారి.

బోడతరము:—కరపాణి, గర్భక్రిములు, తీట, గజ్జి, మేహము, ఉష్ణము, మలబంధము హరించును.

మాచికాయ:—జిహ్వారోగ, నేత్రరోగ, మేహపుష్టములు మానును.

మామిడిపిందెలు:— అరోచకము, పిత్తము, మందము, వాతము, వాంతి మానును. దీనికాయలు బుద్ధి, ఆఁకలి మాన్పును; వ్రణము, వాతము కలుగును. దీనిపండ్లు దీపనము హరించును. కాయలవంటిగుణము పండ్లకును గలదు. దీనివేరు శీతరక్తము, కడుపుపారుట వాంతి మాన్పును.

మిరియములు:—సమస్తరోగములను హరించును.

ముల్లంగిగడ్డ:— ఉబ్బసము, కరపాణి, కాసము, పేగులలోని వాతము, గుల్మము, శూల, తలనొప్పి, కడుపులో మంట, వాతము మానును. దీనిఆకు గుల్మ బాధను హరించును. దీనివిత్తులు ధాతుపుష్టిని కలుగఁజేయును.

మునగకాయలు:—వాతము మొదలగు నొప్పులను మాన్పును ధాతుపుష్టిని కలుగఁజేయును. పథ్యకారి. దీనిపట్ట కఫము, సన్నిపాతజ్వరము, భేది, వాయువు, వాత ప్రకోపము, విషము మానును

మెంతులు:— అస్థిగతజ్వరము, దగ్గు, దేహముమంటలు, శీతభేది, దాహము, బెజ్జము పడెడు మేహము, పిత్తభగంధరము, గుదపాకము, బాలురవృష్ణము, భేది మానును. దేహమునకు చలువను పుట్టించును. దీనిఆకుకూర దేహమునకు హితకారి. ఉష్ణమును, పిత్తమును మానును.

యవలు:—బలము, స్వల్పశీతలము, వాతము కలుగఁజేయును. మలమును శోధించును. (ఇదే బార్లి బియ్యము.)

రసాంజనము, అనఁగా సుర్మాతాయి:— పురుషభగంధరవ్రణము, మేఢ్ర రోగము, వ్రణము మానును.

లవంగపట్ట:—ఆస్యరోగము, దగ్గు, ఉబ్బసము, సర్పవిషము, సర్వవిషములు, ధాతునష్టము, భేది మానును. లవంగపత్రి.— అరుచి, శీతజ్వరము, శ్వాసకాసము, దాహము, ధాతునష్టము, పిత్తము, మేహాజ్వరము, మేహగడ్డలు, వాంతి, ఉష్ణము మానును. లవంగపూలు.—అతిసారము, రక్తభేది, నేత్రనుందలి పుష్పము, సన్నిపాతము, జ్వరము, శుక్లనష్టము, తాలుమూలబంధము, భేది, మైకము, పిత్తము మానును.

వంకాయ:—కఫము, పిత్తము మానును. గ్రంధి, తీట కలుగును. దీనిపండ్లు కఫము, శ్వాసము, వాతము మాన్పును. కరపాణి, కుష్ఠము, ధాతునష్టము, పిత్తము, గ్రంధి కలుగును. దీనిపిందెలు త్రిదోషములను హరించును.

నస:—అగ్నిమందము, పక్షవాతము, శూల, సన్నిపాతము, వ్రణములు, భేది, వాయువు మానును.

విష్ణుక్రాంతి:—ఉష్ణము, దగ్గు, కఫము, కాసము, తీరని జ్వరములు, వాతము మానును

వేపచెట్టుసమూలమును, తైలమును:—పక్షవాతమును, కరపాణిని; గ్రంధి, సన్ని, జ్వర, వాత, గుల్మ, మలబంధ, మూల, కుష్ఠ, విష, శిరోరోగ, త్రిదోష, అరుచి, కాస, మూర్ఛ, సమనాదిరోగములను హరించును కొంచెముపిత్తమును కలుగఁజేయును.

శుంఠి:—సమస్తరోగములను హరించును.

స్వర్జక్షారము:—దగ్గు, గ్రహణి, గుల్మము, మహోదరము మాన్పును.

సాంబ్రాణి:—శిరోరోగములు, వాతము, సన్నిపాతము, శరీరమందలి దుర్గీరు వీనిని నివర్తింపఁజేయును.

సుగంధపాల:—సుఖరోగములు, త్రిదోషములు, జ్వరము, మేహమును పోఁగొట్టును.

సైంధవలవణము:—అష్టగుల్మము. కఫము, రక్తమూలము, సూతికావాతము, మలబంధము నివర్తించును.

సోమెద:—శిరోరోగములు, వ్రణములు, పీనసము, నాశము మానును.

## వ్యాధి నిధానము.

ప్రథమంబున రోగియొక్క అష్టస్థానములను పరీక్షించవలయును.

అష్టస్థానపరీక్ష యనఁగా:—దేహమును తాఁకిచూచుట శరీరవర్ణమును కనుఁగొనుట, రోగిమాటలను వినుట, నాలుకను చూచుట, కనులను చూచుట, మలమును చూచుట, మూత్రమును పరీక్షించుట, నాడిని చూచుట.

స్పర్శలక్షణము:—రోగికి శరీరము కించిదుష్ణముగ నుండిన వాతరోగ మనియును, విశేషవుష్ణముగగాని విశేషశీతలముగగాని యుండిన పైత్యరోగ మనియును, కొంచెము చల్లగా నుండిన శ్లేష్మరోగ మనియును, నానావిధములుగ నుండిన ద్వంద్వరోగ మనియు నెఱుంగవలయును.

రూపలక్షణము:—రోగికి శరీరము నల్లగనుండిన వాతరోగ మనియు, పచ్చగ నైనను ఎఱ్ఱగనైన నుండిన పైత్యరోగ మనియు, తెల్లగానుండిన శ్లేష్మరోగ మనియు మిశ్రవర్ణముగ నుండిన ద్వంద్వరోగ మనియు, వివర్ణముగ నుండిన సన్నిపాతరోగ మనియు తెలియఁగవలయును.

శబ్దలక్షణము:—రోగికి సహ మైనమాటలు కలిగియుండిన వాతరోగ మనియు, నవ్వుచు బెదరుచునుండిన పైత్యరోగ మనియు, హీనస్వరము కలిగియుండిన శ్లేష్మరోగ మనియు, మిశ్రమముగ మాటలాడుచుండిన ద్వంద్వరోగమనియు తెలిసికొనవలయును.

జిహ్వాలక్షణము:—నాలుక వాతరోగమునందు పగిలి ముల్లుతాకి పచ్చగా నుండును. పైత్యరోగమునందు నల్లగనయినను ద్రవము కలిగిరైన నుండును. సన్నిపాతమునందు ద్రవములేక ముల్లుతాకి నల్లగా నుండును. ద్వంద్వరోగమునందు అనేక వర్ణములతోఁ గూడి యుండును.

నేత్రలక్షణము:—కన్నులు నల్లగనైనను కొంచెము వుబ్బుగనైనను నీరుకారుచు నైన నుండిన వాతరోగమనియు, పచ్చగనైనను యెఱ్ఱగనైననుండిన పైత్యరోగమనియు, పుసికట్టిరైనను తెల్లగనైన నుండిన శ్లేష్మరోగమనియు, పచ్చగానైనను యెఱ్ఱగనయిన నుండిన సన్నిపాతరోగ మనియు, పసుపువర్ణము కలిగియుండిన కామిలారోగమనియు తెలిసికొనవలయును.

పురీషలక్షణము:—రోగికి మలము బద్ధగించిరైనను నల్లగనైన నుండిన వాతరోగ మనియు, పచ్చగనైనను యెఱ్ఱగనైన నుండిన పైత్యరోగ మనియు, తెల్లగనైనను బంకగనయినను నురుగుకట్టిరైన నుండిన శ్లేష్మరోగ మనియు, మిశ్రవర్ణము కలిగి యుండిన ద్వంద్వరోగ మనియు తెలిసికొనవలయును.

మూత్రపరీక్ష:—మూత్రము వాతరోగమునందు తెల్లగాను, పిత్తరోగమునందు యెఱ్ఱగాను. కామిలారోగమునందు పచ్చగాను, శ్లేష్మరోగమునందు తెల్లగానైనను లేక నురుగుకట్టిరైన నుండును. ద్వంద్వరోగమునందు మిశ్రవర్ణము గలిగి యుండును.

నాడీలక్షణము:—నాడి అంగుష్ఠమూలము నాశ్రయించి మూఁడువ్రేళ్ళయవప్రమాణము కలిగి దేహమాద్యంతము వ్యాపించి యుండును. మొదటివ్రేలిస్థానము వాతమనియు, రెండవది పిత్తమనియు, మూఁడవది శ్లేష్మమనియు తెలియంగవలయును. మఱియు యెడమప్రక్క స్త్రీలకును, కుడిప్రక్క పురుషులకును నాడిని పరీక్షింపవలయును.

వాతనాడీలక్షణము.—జలగవలెను, ఉయ్యాలు వూఁగునట్లును, పామువలెను, లావుకపిట్టవలెను, కప్పవలెను, వంకరగను నడుచును.

పైత్యనాడీలక్షణము.—పావురపిట్టవలెను, హంసవలెను, నెమలివలెను, చంచలముగను నడుచును.

శ్లేష్మనాడీలక్షణము.—లకుమికిపిట్టవలెను, ఊరపిచ్చుకవలెను, పావురపిట్టవలెను, కోడివలెను, స్థిరముగను నడుచును.

శ్లేష్మపిత్తనాడీలక్షణము.—ప్రథమమునందు పామువలెను, పిదప నెమలివలెను నడుచును.

వాతపిత్తనాడీలక్షణము.—మందముగను, లావుకపిట్టవలెను, పిమ్మట నెమలివలెను నడుచును.

వాతశ్లేష్మనాడీలక్షణము.—ప్రథమమునందు కోడివలెను, పిమ్మట జలగవలెను నడుచును.

సన్నిపాతనాడీలక్షణము.—చంచలముగను, సూక్ష్మముగను, తిన్నగను, శిథిలముగను, కాష్ఠమధ్యమున మంచుబారినరీతిగను, వంకరగను నడుచును. మఱియు ఇట్టి నాడి యని తెలియక నడిచి పిదప జలగవలె నడిచిన త్రిదోషయుక్తం బగు సన్నిపాత నాడి యని యెఱుంగునది.

ఆశ్చర్యనాడీలక్షణము.—వాత పిత్త నాడులకంటె శ్లేష్మనాడి అతిక్రమించి నడిచి తిరుగాఁ మందమై నడుచును.

## జ్వరనాడీలక్షణములు.

వాతజ్వరనాడి.—వంకరగను చంచలముగను నడుచుచు నుండి హస్తము చల్లగ నుండును.

పిత్తజ్వరనాడి.—శీఘ్రముగను సరళముగను నడుచును.

శ్లేష్మజ్వరనాడి.—అతిస్థిరముగను సరళముగను చల్లగను మెల్లగను నడుచును.

## ఆంగ్లేయమతానుసార నాడీలక్షణము.

నరుఁడు జనించిన క్షణమునందు అతనినాడి 1 ఘంటకాలములో 140 మాఱులును, జనించినకాలము మొదలు 1 సంవత్సరమువఱకు అతనినాడి 1 ఘంటకాలము

లోపల 130 మాటులును 1 సంవత్సరము మొదలు 2 సంవత్సరములవఱకు 110 మాటులును, 4 సంవత్సరములు మొదలు 7 సంవత్సరములవఱకు 90 మాటులును, 7 సంవత్సరములు మొదలుకొని 14 సంవత్సరములవఱకు 85 మాటులును, 14 సంవత్సరములు మొదలుకొని 30 సంవత్సరములవఱకు 80 మాటులును, 30 సంవత్సరములు మొదలుకొని 50 సంవత్సరములవఱకు 75 మార్లును, 50 సంవత్సరములు మొదలుకొని 80 సంవత్సరములవఱకు 60 మాటులును నాడి చలించు చుండును.

జన్మము మొదలు వయస్సు యొక్క నయగుకొలందిని నాడులు కంపన మొందును. ఈ మధ్యకాలంబున రోగములు సంప్రాప్తం బయ్యేనేని నాడీచలనము వ్యత్యస్తము నొందును. రోగకాలంబున నాడి దుర్బలంబుగా నుండిన ప్రాణభయము కలుగునని తెలియవలయును.

## ఔషధలక్షణము.

స్వచ్ఛందభైరవము.—రసము, నాభి, గంధకము ఇవి సమభాగములు; రసములోసగము జాజికాయ; పైవస్తువులన్నింటి తూకములో సగము తూకము పిప్పిలి చూర్ణము, వీనిని తమలపాకులరసముపోసి మర్దించి గురిగింజప్రమాణము మాత్రలు జేసి నీడలో నెండించి యుంచుకొని అల్లపురసములో 2 మాత్రలిచ్చిన సకలజ్వరములు, అగ్నిమాంద్యము, వాంతి మొదలైనవి మానును.

జ్వరవిషఫణిగరుడము.—గంధకం 1 భాగం, రసం 1 భాగం, నాభి 1 భాగం, ఇంగిలీకం 4 భాగాలు, వీనికిసమం నేపాళాలుచేర్చి గుంటగలగరాకు పసరున జాము నేపు మర్దించి మిరియాలంతమాత్రలు చేసి నీడలో నెండించి యుంచుకొని తేనెలోగాని అల్లపురసములోగాని యొకమాత్ర యిచ్చిన 2 మార్లు విరేచన మగును; జ్వరములు, పురాణజ్వరములు, ఆహికజ్వరము లన్నియు మానును.

ఆనందభైరవరసము —ఇంగిలీకము, నాభి, త్రికటుకము, వెలిగారము ఇవి సమభాగా లుంచుకొని నిమ్మపులుసున 4 జాములు మర్దించి మిరియాలంతమాత్రలు చేసి నీడను యెండించి తమలపాకులో జ్వరముల కిచ్చేది.

సర్వజ్వరకషాయము.—నేలతంగేడు, నేలవేము, పర్పాటకం, తుంగముస్తెలు, త్రికటుకము, తిప్పతీగ వీనిని సమముగా జేర్చి కషాయముపెట్టి కొంచెము తేనె చేర్చి యిచ్చినయెడల నివారణ మగును.

సకలాతిసారములను, అతిసారధ్వాంతభాస్కరము.—వెలిగారము, గంధకము, అభిని, జాజికాయ, జీలకఱ్ఱ, ఇవి సమభాగములు; వీనికి సమము దానిమ్మవిత్తులను

చేర్చి మర్దించి దానిమ్మచిప్పలోనుంచి 3 దీల లిచ్చి ఘడియసేపు గాఢాగ్నిలో నుంచి తీసి కొంచెము చనుపాలుబోసి నూరి గుంజామాత్రము మాత్రలు చేసి ఆవువెన్నతో పుచ్చుకొనేది.

శిశువులకును, అల్పాతిసారము గలనారికిని ఔషధము:—దానిమ్మ బొబ్బడ పూరుబిండిగాని, గేదెపెరుగులో దొండాకుపసరు చేర్చిగాని, నేతితో వేయించిన పాతిక జాజికాయచూర్ణముగాని, శిలాజిత్తుభస్మమును వెన్నలోగాని, నేరేడు మామిడి దానిమ్మ మొదలగు తొగరు గల చిగుళ్ళనుగాని యియ్యనచ్చును. బాలురకుమాత్రము కషాయము పెట్టి యియ్యవలయును.

మూలవ్యాధులకు లేపనము:— మఱ్ఱిపండాకులు కాల్చిన బూడిదెను నువ్వుల నూనెతో మర్దించి పట్టించవచ్చును.

క్రిమికులాంతకము:— వాయువిళంగములు, మోదుగపప్పు, వేపచిగురు వీనిని నూరి తేనెతో పుచ్చుకొన్నయెడల క్రిములు హరించును.

క్షయరోగములకు:— ఊడుగఆకుపసరును ఆవుపాలలో కలిపి 3-దినము లుద యమున పుచ్చుకొన్నచో మానును. కారము, పులుసు వర్జించేది.

మహావాతనాశినీరసము:—గంధకం, రసం, ఇంగిలీకం, సమభాగాలు; వీనికి సమం త్రికటుకంచేర్చి తెల్లగలిజేరు పసరుచేత నాలుగు జాములు మర్దించి మినపగింజ లంత మాత్రలు చేసి యుంచుకొనేది. ఇది సకలమైన వాతములను హరించును.

సకలశూలలకు, శూలకుఠారము:—రసము, గంధకము, తాళకము, తామ్ర భస్మము, త్రికటుకము, త్రిఫలము, నేపాళము, వెలిగారము ఇవి సమభాగములు గుంట గలగరాకుపసరున మర్దించి ద్విగుంజాప్రమాణం మాత్రలు చేసి ఒక్కమాత్రను అల్లపుర సానగాని, మిరియాల పొడితోగాని పుచ్చుకొన్న సకలశూలలు, గుల్మములు మానును. ఈ వ్యాధికి అన్నభేదిసిందూరమును ఆవునెయ్యితో నియ్యవచ్చును.

మూత్రాశ్మరికి ఔషధము:—పిల్లపీచరగడ్డలరసమునకు సగం ఆవుపాలు పోసి పుచ్చుకొన్నను, లేక శిలాజిత్తుభస్మమును తేనెతో సేవించినను, అభ్రకసిందూరమును సేవించినను మానును.

సకలమేహరోగనివారణి:—శిలాజిత్తు, గంధకము, మనోశిల, కంపిల్లము, పచ్చకర్పూరము, ఇవి సమంచేర్చి త్రిఫలకషాయముచే మర్దించి సగంభాగము త్రికటుకచూర్ణము చేర్చి తేనెతో కలిపి పుచ్చుకొన్న మేహములు, ప్రమేహములు, పిట

కలు, గ్రంధులు, కొరుకు, సవాయి, అడ్డగజ్జలు, బిళ్ళ ఇవి మొదలయినవి మానును. మఱియు వంగభస్మమును, గంధకభస్మమును చేర్చి పుచ్చుకొన్నచో పైన చెప్పిన మేహ వ్యాధు లన్నియు నివర్తించును.

వ్రణములకు:— త్రిఫలకషాయములో కొంచెము గుగ్గులుచూర్ణము కలిపి త్రాగిన వ్రణములు హరించును. న్యగ్రోధాదిగణములపట్టలను కషాయముపెట్టి ఒత్తడముగాని, లేపనముగాని చేయవచ్చును. పగులని గడ్డలను శస్త్రముచే ఛేదింపనలయును. సకలవ్రణములకును తెంకాయనూనెలో ఉమ్మెత్తవిత్తనములు, వాయువిళంగములు చూర్ణముచేసి కలిపి సూర్యపుట ముంచి తీసికొని లేపనముచేయ గుణమగును. అగ్నిచలన కాలినవ్రణములకు సున్నపునీటితేటను తెంకాయనూనె, లేక నువ్వులనూనెలో కలిపి జిలకొట్టి పూయనగును.

కుష్ఠరోగములకు.— రేలచిగుళ్ళను కలితోనూరి లేపనముచేసిన అన్నికుష్ఠువులు, దద్దురులు, ఎంగిటిచిడుములు ఇవియన్నియు మానును. పాదరసం, గంధకంసమం ఆవునేయితో నూరి తర్వాత గుంటగలగరాకురసముతో నూరి లేపనము చేసేది.

శ్వేతకుష్ఠములకు:— తెల్లగురిగింజలు, చిత్రమూలముసమం కలితోనూరి లేపనము చేసినను, లేక మణిశిల, ఉత్తరేణిబూడిద వీనిని నీళ్ళతో నూరి లేపనము చేసినను శమించును.

కర్ణరోగములకు:— చెవిలో చీము కారు చున్నచో చెంగల్వకోష్ఠము, వేపచిగురు వీనిని నూనెలో వేసి కాచి పోసేది. లేక కొంచెము రసకర్పూరము నూనెలో వేసి కాచి పోసేది.

కర్ణశూలలకు:—అల్లపురసమున సైంధవలవణము వేసి చెవిలో పోసిన కర్ణశూలలు మానును.

వెండ్రుకలు రాలినవారికి:—కడిలపుఆకురసము, నూనె సమముగా చేర్చి వండి తలంటుకొన్న శిరోజములు బాగుగా దట్టముగా నల్లగా మొలుచును. లేక, చెప్పుతట్టాకు పసరును నూనెయు కలిపి వండి మునుగవచ్చును.

నేత్రరోగములకు:— తెల్లగలిజేరువేరును పాలలో వుడికించి నీడను యెండించి తాటిమట్టలరసముతో జాముసేపు నూరి మాత్రలు చేసి యుంచుకొని సకలనేత్రరోగములకు చన్నీళ్ళతో చాది కన్నులకు వేసేది. లేక, పాలతో వుడికించిన యీ వేరును, కంటిలో పువ్వు పడినప్పుడు నేతితోను, నీళ్ళు కారుచుండిన నీళ్ళతోను, తీటగలిగిన గుంటగలగరాకు పసరుతోను, చత్వారి గలిగిన నీలిఆకు పసరుతోను, వెండ్రు

కలు రాలిపోయిన పసుపు నూరి కలిపిన నీళ్ళతోను, రేచీకటికి కాచిఆకుపసరుతోను మంటలు గలిగినపుడు చనుపాలతోను, శిరోభారముమీద కన్నులకు నీరుముట్లు కలిగినపుడు మునగాకుపసరుతోను చాది వేయవలయును మునగాకుపసరు తేనెయు సమము చేర్చి కన్నులకు బెట్టిన సకల మైన నేత్రరోగములు మానును.

కన్నులకు ప్రకాశాంజనము — కంచుతట్టలో గుంటగలగరాకు పసరు, నిమ్మపులుసు వీనిని పోసి తామ్రపుగుండుతో మర్దించి తీసినముద్ద వరాయెత్తు 4, బంగారు వెండి వీనిని కల్వమున వైచి ఆవువెన్నతో మర్దించి తీసినముద్ద వరాయెత్తు 8, వీనికి సమం పటికారముచేర్చి తేనెతో నూరి యుంచుకొనేది. వీనితో కాలుపలం తురిసిచేర్చి నిమ్మపులుసున నూరి మాత్రలు చేసి యుంచుకొని నేత్రములకు చాది వేసిన సకలనేత్ర రోగములు మానును.

ప్రదరరోగములకు.—త్రికటుకము, త్రిఫలను సమము కషాయముపెట్టి వెన్న వేసి పుచ్చుకొన్న హరించును.

సుఖప్రసవమునకు.—అతిమధురము, మాదీఫలపువేరుపట్ట సమభాగములు చూర్ణము చేసి తేనె నేయి వీనిని కలిపి పుచ్చుకొన్న సుఖప్రసవ మగును.

మాదీఫలపువేరును యష్టిమధుకమును కషాయముపెట్టి కడుపుపై లేపనం బొనర్చిన ప్రసవించును. వెలమసందివేరును స్త్రీప్రమాణము దారముతో బంధించి పూజించి స్త్రీకి గట్టిన ప్రసవించును.

స్త్రీలు గర్భముగా నుండునపుడు 4.5 నెలలలో 2 మార్లు చిట్టాముదము భేదికి పుచ్చుకొనవలయును. గర్భకాలమున మిక్కిలి కారము, పులుసు గల పదార్థములు భుజింప రాదు.

గర్భములో శిశువు మృతి జెందినప్పుడు:—పల్లేరువేళ్ళు, లేక దీనిముండ్లు, లేక దీనిఆకు వీనిని కలితోనూరి కడుపుపై లేపనము చేసేది.

స్త్రీల స్తనరోగములకు:—వెట్టిపుచ్చవేరును నూరి వెచ్చచేసి లేపనము చేసేది.

పాలు వృద్ధిపొందుటకు:—సుగంధపాలవేళ్లు, సొంటి, తిప్పతీగె సమము కషాయముపెట్టి తెల్లచక్కెర, ద్రాక్షచేర్చి పుచ్చుకొన్న స్తన్యము గలుగును.

బాలురజ్వరములకు:—అడ్డసరపురసము స్వరసములో కొంచెము గోరోచనము చేర్చి యిచ్చిన మానును. వాకుడుకషాయములో తేనె కలిపి యిచ్చిన బాలులమందము మానును.

సర్పవిషములకు — గరుడగడ్డచూర్ణమునుగాని, ఈశ్వరవేరు చూర్ణమునుగాని, జిల్లేడాకు పసరునుగాని పుచ్చుకొన్నను లేక వీని నస్యము చేసినను నివర్తించును మైలతుత్తము, గంధకము, పాదరసము, పసుపు, వెలిగారము ఇవి సమము; చేదుసొరకాయ రసమున మర్దించి మిరియముప్రమాణము మాత్రలు చేసి యుంచుకొనిన స్థావర జంగమ విషము లన్నియు హరించును.

తేలుకు —జిల్లేడువేరును జముడుపాలలో 41 దినములు నాననిచ్చి నీడలో నెండించి కుట్టినచోట చాది వేసేది. మఱియు, శిలిపసరుగాని, ఉమ్మెత్తపసరుగాని, దిరిశినపువిత్తులను నీళ్లతోచాదికాని, ఇంగువను చనుపాలతోచాదికాని వేయవచ్చును.

వృశ్చికవిషాంతకము.—1 పలము యింగువను తెంకాయచిప్పలోనుంచి ఇంగువ మునగను చనుపాలు పోసి నోటికి గుడ్డకట్టి బొంతజెముడువేరు క్రిందనుంచి పైన మన్నుమూసి వచ్చేది. ఎనిమిదవదినము పోయి మరల చనుబాలుపోసి గుడ్డకట్టి అచ్చోటనే యుంచి వచ్చేది ఇట్లు మువ్మాఱు చేసినమీఁద నాలుగవవారము తీసికొనివచ్చి భద్రపఱచుకొని కుట్టినచోట లేపనము చేసినయెడల విషము తత్క్షణము నివర్తించును. మండ్రగబ్బవిషమును మాన్పును.

మండ్రగబ్బకు:—గాడిదతుమ్మిఆకుపసరుగాని, ఉమ్మెత్తాకుపసరుగాని, చేతరాసి ఆకుపసరుగాని పట్టించిన మానును.

వెఱ్ఱికుక్క, నక్క, పిల్లి కాట్లకు:—వేపవిత్తులు, చేదుకొడిసెవిత్తులు, గంధము, తామరకేసరములు వీనిని ఆవుపాలతోనూరి త్రాగిన పైనజెప్పిన విషములు నివర్తించును. ఊడుగవేరుచూర్ణమును 3 దినములు పుచ్చుకొన్నయెడల నివర్తించును.

మూషకవిషములకు:—మునగపట్టకషాయములో యీశ్వరవేరుచూర్ణమును వేసి 3 దినములు పుచ్చుకొనిన హరించును.

## విషప్రతివిషములు.

అనఁగా కొన్నివస్తువులు సేవించినయెడల దోషము కలుగుచున్నది. దానిని హరించువస్తువులు ప్రతివిషవస్తువు లని తెలియదగ్గది మొదట చెప్పెడి వస్తువులదోషములను రెండవనూఱు చెప్పఁగలవస్తువులు హరించును.

నేపాళముసల్ల విశేషముగా భేదిగాని, లేక ఉష్ణముగాని సంభవించినందుకు వసకాల్చినమసి కషాయము. తేనెకు చన్నీళ్ళు. నెయ్యికి పుల్లమజ్జిగ. తెంకాయకు ఉప్పుడుబియ్యపు అన్నము. అన్నమునకు మాడినఅన్నము. నాభికి చిఱ్ఱికూర;

తెల్లమేకమూత్రము, ఆవునెయ్యి. వెలిగారమునకు మిరియాలు, సొంటి, కరక్కాయ కషాయము. అడవిమునగకు నువ్వులనూనె. ఫలవర్గములకు సొంటి, మిరియాల కషాయము. మాజీనమునకు నెయ్యి. నువ్వులనూనెకు టెంకాయ. గన్నేరుకు కరక్కాయల కషాయము. గంజాకు నిమ్మపులుసు, సొంటి కషాయము. జిల్లేడుపాలకు నెయ్యి, చక్కెర, ఆముదము, పసుపు. జముదుకు అరటిమట్టలరసము, తంగేడు. అభినిగంజాకు, నెయ్యిని వేడినీళ్ళలో కలిపి యిచ్చుట. అభినికి నెయ్యి, నిమ్మపులుసు, ఎఱ్ఱగడ్డలు, సొంటి, మాచికాయ, ఉప్పు వీనిని తేనెలో నూరి యిచ్చుట. నువ్వులకు శర్కర. కందకు తమలపాకులు, చింతపండు. కల్లుకు తంగేడాకుపసరు. గురిగింజలకు తంగేడు రసము. బొంతజముడుకు కరక్కాయ, తంగేడు. తెగడకు తెల్లతుమ్మచెక్క. జిల్లేడాకుకు చక్కెర. ముషిణికి నేరేడుచిగురు, మొగిలిపూడలరసము. చింతపండుకు ఉప్పు. ఉప్పుకు పుల్లిగడ్డ. ఉప్పు పసుపుకు జీలకర. మాంసములకు తెల్లగడ్డ. ఊమగ గన్నేరు నూనెకు కరక్కాయలకషాయము తెల్లపాషాణమునకు కాకరాకు. గంధకమునకు ఆవునెయ్యి తామ్రమునకు నిమ్మరసము, పుల్లమజ్జిగ. తుత్తమునకు నిమ్మపులుసు, శర్కర. సారాయికి జీలకర, దనియాలు. పాషాణములకు నీలికషాయము. మిరియాలు. వంగములకు నల్లపులుగుడాకురసము. వెఱ్ఱిబీరకు తుంగగడ్డలు. జీడిగింజలకు మోదుగపువ్వు. కర్పూరమునకు గుంటగలగరాకు. ఉమ్మెత్తకు తామరదుంప చూర్ణము. సున్నమునకు పసుపు. పనసపండ్లకు నెయ్యి, తేనె. పొగాకుకు జీరకకషాయము. ఉమ్మెత్త నాభికి మాచికాయకషాయము. రత్నములలో నొకటి యగు వజ్రమును తినినవారికి ఆవుపాలలో నెయ్యినికలిపి వమనమున కిచ్చ్యాలయును. మఱియు సకలమైన స్థావరజంతువిషములకును, అట్టి ఔషధములు సేవించినవారికి గలుగు దోషములకును, మిశ్రమము లైన రసవిషగంధకలోహపాషాణాదులకును నీలివేరుగాని, వంగివేరు గాని, నల్లకాచివేరు గాని, చిత్రివేరు గాని వీనిలో నేదైన నొకవేరును మిరియాలును జేర్చి కషాయముపెట్టి యిచ్చిన మానును.

గృహవైద్యకము మొదలగువానిని సమగ్రముగా "ఏకమూలికాప్రయోగ వైద్య సారరత్నావళి" యందు గనందగును.

## ఆంగ్లేయౌషధములు.

జ్వరములకు:—కొయనామాత్రలు యిచ్చుట కలదు.

మూలమునకు:—షల్ విస్ట్రిస్సెపలీసును టించర్ పెరినిచేర్చి నూరి గుడ్డలో చరిమి వేసిన మానును.

వాంతిభేదికి:—సల్ఫ్యూరిక్ ఆసిడ్డు. 10 బొట్లు జలములోచేర్చి కొంతసేపుంచి యియ్యవచ్చును. లేక క్లోరడైనును 5 మొదలు 10 బొట్లు బ్రాందిలో కలిపి యియ్య వచ్చును. దీనివల్ల దగ్గు, కడుపునొప్పి, ఉబ్బసము, శూలలు మానును

తలనొప్పికి:—సిలమనాయల్ చరుముటవల్లను, ఓలియంకాస్ పొడరును పట్టించుటవల్లను మానును.

కడుపులోని పురుగులకు:—పెద్దలకు సాంటనిక్ 5 గ్రేనులును, బాలురకు 1 మొదలు 4 వఱకును చక్కెరలో యియ్యవచ్చును. పైప్రకారమే యెప్సంసాల్టును నీళ్ళలో చేర్చి యియ్యవచ్చును.

వాయువులకు:—పొట్టాస్ నయిట్రిస్సు, పొట్టాస్ అయొడిను వీనిని నీళ్ళలో గాని, బ్రాందిలోగాని 10 బొట్లు కలిపి యియ్యవచ్చును.

బీజవాయువులకు:—టించర్ అయొడినును లేపనము చేయునది.

రాక్ సాల్టు:—(ఇందుప్పు) అజీర్ణరోగముల కియ్యవగును, ఇలుకు కలిగినచోట్ల యీవుప్పును నూరి పట్టించిన నివర్తించును.

కార్బొనెట్ ఆఫ్ సోడా:—(సజ్జక్షారము) శరీరము వుష్ణముగా నుండునపుడును, వాంతి యగునపుడును నిమ్మపండ్లరసముతో కలిపి యియ్యవచ్చును. 5 గురిగింజ లెత్తు వఱ కియ్యవచ్చును.

క్రీమ్ ఆఫ్ తార్తార్:—(ద్రాక్షవుప్పు) దీనిని ½ వరాయెత్తు మొదలు, 1 వరా యెత్తువఱకు జలోదరవ్యాధికి అప్పుడప్పు డియ్యవచ్చును. చాలా గుణ మిచ్చును. అధికముగా యిప్పించినయెడల భేది యగును.

బోరక్సు:—(వెలిగారము) అరవరాయెత్తు వెలిగారమును నీళ్ళలో కలిపి యిచ్చిన యెడల మూత్రబంధము నివర్తి యగును. నోటిపురుపులు, గొంతువ్రణములు నిశ్శేష ముగా నివర్తి యగును. అరవరాయెత్తు వెలిగారమును 1¼ ఒకటింకాలుపలము జల ములో కలుపవలయును.

సల్ఫేట్ ఆఫ్ ఐరన్:—(అన్నభేది) అయఃసిందూరమునకు బదులుగా దీని వాడు కొనవచ్చును ½ మొదలు 1 గురిగింజయెత్తువరకు యియ్యవచ్చును. అయినను శరీరము నందు రక్తము అధికముగా ప్రవహించుకాలమునను, నాడి వేగముగా నడుచునపుడును అన్నభేదిసిందూరమును గాని అయస్సిందూరమును గాని యియ్యఁగూడదు.

శ్రీ ర స్తు.

# సకలార్థ సాగరము

## పా ర మా ర్థి క త రం గ ము.



### విగ్రహారాధనవిషయము.

ఇక్కాలంబున నాస్తికవాదసంబంధమైన మతములు గొన్ని స్థాపితంబై యున్నవి. ఆ మతవాదులందఱునుతమ్మును నాస్తికులని చెప్పఁగూడదని తలంచి కాఁబోలు ఆస్తికులు తామే యనునట్లుగా కొన్నిఅద్వైతమతసంబంధమైనవాక్యముల నుదహరించి పలవించుచుండుటయేగాక విగ్రహారాధనము మొదలగు కొన్నిశిష్టాచారములను దుష్టాచారము లనియు, ఇది పామరజనోపయోగకార్యము లనియు వాదించు చున్నారు. ఈ నూతనప్రచ్ఛన్న నాస్తికమతవాదు లందఱును తమ్మును తామే మహాజ్ఞానసంపన్నులని తలంచియున్నారు. ఇట్టి మూఢులు విగ్రహారాధనవిషయముగా వేదాదులం దెచ్చటను ప్రమాణము లేదనియు వాదించెదరు. ఆహా! ఏమి చిత్రము? మహాప్రాజ్ఞులును, జ్ఞానాధికులు నగు శంకరాచార్య, రామానుజాచార్య, మధ్వాచార్య, నీలకంఠాచార్యులందఱును అజ్ఞానముచేతనే విగ్రహారాధనము చేసిరని యీ మూఢులు తలంచియుండుటంబట్టి, వీరిని విశ్వసించి విలపించు పరమమూఢులును చెడిపోయెదరు.

ఇఁకనైనను ఈ దిగువ నుదహరించు ప్రమాణములవలన విగ్రహారాధనమును వేదసమ్మతమని విశ్వసింతురు గాక. మఱియు వేదములందు విగ్రహారాధనవిషయమై యనేకసూక్తములు చెప్పఁబడి యున్నవి. ప్రకృతమున విగ్రహారాధనవిషయమును గుఱించిమాత్రము వ్రాయంబడును.

తైత్తిరీయసంహితకాండము 5, ప్రశ్నము 7, అనువాకము 2.

సంవత్సరస్య ప్రతిమాగ్ం యాంత్వా రాత్ర్యుపాసతే ప్రజాగ్ం సువీరాం కృత్వా విశ్వ మాయు ర్వ్యశ్నవత్ ప్రాజాపత్యామ్.

తా. సంవత్సర (కాల) స్వరూపి యైన పరమాత్మ యగు నీయొక్కరూపమెయ్యది రౌ అట్టి ప్రతిమను (విగ్రహమును) చేసి చీఁకటి యైన అజ్ఞానదశయందు ఉపాసించెదరు. అట్లు ఉపాసించువాఁడు శక్తిగల పుత్రుని, సంపూర్ణాయువును బొందుచున్నాఁడు. ప్రజలకు అధికారియు నగుచున్నాఁడు.

తైత్తిరీయము కాణ్వసంహితకాండము 4, ప్రశ్నము 3, ఖండము 4.

సురూపాం ప్రతిమాం విష్ణోః ప్రసన్నవదనేక్షణామ్
తామర్చయేత్తాం ప్రణమేత్తాం యజేత్తాం విచిన్తయేత్.

తా. ప్రసన్నమైన ముఖము, కన్నులు, వీనితోడఁ గూడిన విష్ణువుయొక్క మనోహరమైన రూపము గల ప్రతిమ యేదియో దానిని పూజించవలయును. నమస్కరించవలయును. ఆరాధించవలయును. ధ్యానించవలయును.

తైత్తిరీయసంహితా 5, 6, 7.

అగ్నే హిరణ్యగర్భ దేహ పావక సర్వముఖ సర్వనివాస ఆసాం మూర్తీనాగ్ం సర్వాంగేభ్యస్సర్వధాతుభ్య స్సకాశా న్నిర్గచ్ఛ నిర్గచ్ఛ। తాపం దాహం శమయ శమయ శీతలతా మఙ్గావయవ ధాతుషు కురుకురు.

తా. ఓ అగ్నీ! ఓ అగ్నిస్వరూపమైన హిరణ్యగర్భా! సకలస్వరూపీ! సకలమునందును వాసము చేయువాఁడా! ఈ మూర్తులయొక్క లోహస్వరూపమైన సకలాంగములయందుండియు వెలువడుము వెలువడుము. మమ్మును తాపత్రయములయందుండి వెలువరించుము వెలువరించుము. మాయొక్క అంగము అవయవము నరములు వీనియందు చల్లఁదనమును కలుగఁజేయుము.

యజుర్వేదము మైత్రాయణ్యసంహితకాండము 3, ప్రశ్నము 1.

పాషాణ లోహ మణి మృణ్మయ విగ్రహేషు
పూజా పునర్భోగకరీ ముముక్షోః.

తా. రాయి, లోహము, రత్నము, మన్ను, వీనిచేఁ జేయఁబడిన విగ్రహములకుఁ జేయు పూజ యైనది, బంధమునుండి విడుపడుట కిచ్ఛగలవానికి సుఖము నొసంగునదిగా నున్నది.

సామవేదము షడ్వింశబ్రాహ్మణము, ప్రపాఠకము ౬, ఖండము 10.

దేవతాయతనానికం పన్తే దైవతాః ప్రతిమాహ సన్తి రుదన్తి గాయన్తి నృత్యన్తి స్ఫుటన్తి స్విద్యన్త్యున్మీలన్తి నిమీలన్తి ప్రతిమాః ప్రయాన్తి నద్యః కబన్ధ మాదృశ్యన్తే విజలేసచ పరిదృశ్యతే.

తా. దేవాలయములు వణఁకుచున్నవి. ప్రతిమారూపమైన దైవములు నవ్వుచున్నవి. ఏడ్చుచున్నవి. పాడుచున్నవి. నటనము చేయుచున్నవి. నోళ్ళను తెఱుచు

చున్నవి. చెమటను విడుచు చున్నవి. నేత్రములను తెఱచు చున్నవి. నేత్రములను మూయు చున్నవి ప్రతిమలు నడుచు చున్నవి. నదులయందు తలలు లేని మొండెములు కనఁబడు చున్నవి. నదియందు జల మున్నను జలము లేనట్లు కనఁబడు చున్నవి. (ఇట్లు గాఁ గనఁబడుట లోకనాశనమును సూచింపించుట యని తెలియునది).

ఋక్సంహితఅష్టకము 7, వర్గము 15.

అదోయద్దారుః ప్లవతే సిన్ధో రపారే అపౌరుషం తదా రభస్వ.

తా. దరిలేనిసముద్రమునందు మనుష్యులచేఁ జేయంబడని యేకట్టె తేలుచున్నదో దానిని శీఘ్రముగాఁ గొని రమ్ము. (ఇదే జగన్నాథస్థలమందలి మూలవిరాడ్విగ్రహము).

అథర్వణవేదము కాండము 1, కల్పము 2, ధ్వని 3.

ఏ హ్యశ్మాన మా తిష్ఠ అశ్మా భవతు తే తనూః.

తా. ఓ భగవంతుఁడా! రమ్ము ఈ శిలాప్రతిమయం దుండుము, నీవు శరీరము శిలావిగ్రహముగా నుండనిమ్ము.

కఠసంహితకాండము 1, అధ్యాయము 3, అనువాకము 6.

యావన్తో ఽశ్మానో ఽస్యాం పృథివ్యాం ప్రతిష్ఠాసుప్రతిష్ఠితాః
యావ న్తఃపాగ్ం సవోభూమే స్సంఖ్యాః తావదేవ మాయయా.

తా. ఈ భూమియందు యెన్ని శిలలు చక్కఁగా ప్రతిష్ఠ చేయఁబడి యున్నవో, దేవునియొక్క మాయవలన భూమియొక్క రేణువులు యెన్ని లెక్క పెట్టఁబడి యున్నవో, (ఇవి యంతయు పరమాత్మస్వరూపమే)

తైత్తిరీయసంహితా 5, 2, 5.

పురుషమాత్రేణ వినిర్మితే.

తా. పురుషప్రమాణము గలదిగా (విగ్రహమును) నిర్మించవలసినది.

ఇట్లు వేదములయందు అనేకస్థలములలో జెప్పఁబడి యుండుటచేతనే ఆగమములందును విగ్రహారాధనమును, విగ్రహప్రతిష్ఠానులను గూర్చి విస్తరించి చెప్పఁబడి యున్నవి.

ఇట్లు చెప్పిన హేతువునుబట్టి పరమాత్మను ధ్యానించుటను సాధనము వేఱేలేదని యభిప్రాయము కాదు. పరబ్రహ్మోపాసనాపద్ధతి యెట్లు వేదశాస్త్రచోదితమై యున్నదో యట్లే ప్రతిమారాధనమును వేదశాస్త్రచోదిత మని తెలియవలయును.

## ఓం.

## అథ యాజుషీ కలిసన్తారణోపనిషత్.

### సహనావవ త్వితి శాన్తిః.

మూ. ద్వాపరాన్తే నారదో బ్రహ్మాణం జగామ కథం భగవన్ గాం పర్యటన్ కలిస న్తరేయ మితి సహోవాచ.

తా. నారదుఁడు ద్వాపరయుగాంతమునందు బ్రహ్మయొద్దకుఁ బోయి, ఓ భగవంతుఁడా! నేను భూమియందు సంచరించి కలిని యేవిధముగా దాఁటఁగల నని యడిగెను.

మూ. బ్రహ్మో, సాధుపృష్టో ఽస్మి.

తా. బ్రహ్మదేవుఁడు, చక్కఁగా అడిగితివి. (అని చెప్పి దిగువ వచ్చువిధముగాఁ జెప్పుచున్నాఁడు.)

మూ. సర్వశ్రుతిరహస్యం గోప్యం తచ్ఛృణు యేన కలిసంసారం తరిష్యసి భగవత ఆదిపురుషస్య నారాయణస్య నామోచ్చారణ మాత్రేణ నిర్ధూత కలి ర్భవతి.

తా. దేనిచేత కలి యైన సంసారమును దాఁటుదువో అట్టి సర్వశ్రుతిరహస్యమైనదిగను గోప్యమైనదిగను (రహస్యముగా నుంచఁదగినదిగను) నుండుదానిని వినుము. ఆదిపురుషుఁ డైన భగవంతుఁ డగు నారాయణునియొక్క నామమును ఉచ్చరించిన మాత్రమున కలిదోషమును విదిర్చివేయువాఁ డగు చున్నాఁడు.

మూ నారదః పునః పప్రచ్ఛ తం నామ కి మితి సహోవాచ హిరణ్యగర్భః.

తా. మఱల నారదుఁడు బ్రహ్మను జూచి ఆ నామ మెయ్యది? అని యడిగెను. దానికి హిరణ్యగర్భుఁ డైన బ్రహ్మ చెప్పు చున్నాఁడు.

మూ. * హరేరామ హరేరామ రామరామ హరేహరే,
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే.

ఇతి షోడశకం నామ్నాం కలికల్మషనాశనమ్। నాతః పరతరోపాయ స్సర్వవేదేషు దృశ్యతె॥ ఇతి షోడశకలావృతస్య జీవ స్యావరణవినాశనమ్ - తతః ప్రకాశతే పరంబ్రహ్మ మేఘాపాయే రవిరశ్మిమండలీ వేతి.

---

* ఈ కలికాలమంత్రోపాసన చేయుటకుఁ దగినట్లు శ్రీరామకృష్ణులరూపములతో శ్రీపట్టభద్రరామగిరిక్షేత్రమున నెలకొని యున్నవి. అది చెంగల్పట్టుజిల్లా, పొన్నేరితాలూకా, రెుజమిట్టపాళెము కుశస్థలీనదీతీరమున నున్నది.

తా. హరే, రామ, హరే, రామ, రామ, రామ, హరే, హరే, హరే, కృష్ణ, హరే, కృష్ణ, కృష్ణ, కృష్ణ, హరే; హరే, అనెడి పదునారు నామములును కలిదోషమును నాశము చేయును. దీనికంటె శ్రేష్ఠమైన ఉపాయము సకలవేదములయందును కనఁబడ లేదు. (ఈ పదునారు నామములును) పదునారుకళలచే ఆవరింపఁబడియుండు జీవునియొక్క ఆవరణమును (జ్ఞానమును మఱిగించుకొనియుండు అవిద్యను) నాశము చేయు చున్నది. ఆమీఁద మేఘము పోయినచో సూర్యమండలము ప్రకాశించువిధమున పరబ్రహ్మము ప్రకాశించు చున్నది.

మూ. పునర్నారదః ప్రపచ్ఛ భగవన్ కోస్య విధి రితి తం హోవాచ నాస్య విధి రితి సర్వదా శుచి రశుచి ర్వాపఠన్, బ్రహ్మణ స్సలోకతాం సమీపతాం సరూపతాం సాయుజ్యతామ్.

తా. మఱల నారదుఁడు, ఓ భగవంతుఁడా! దీనికి (ఈ నామోచ్చారణమునకు) విధి యేమి? అని యడిగెను. దీనికి విధి లేదు అని (బ్రహ్మ) చెప్పినాఁడు. శుచిగా నుండినను, అశుచిగా నుండినను యెల్లప్పుడును జపించువాఁడు బ్రహ్మముయొక్క సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్యములను పొందు చున్నాఁడు.

మూ. ఇతి యదాస్య షోడశీకస్య సార్ధత్రికోటీర్జపతి తదా బ్రహ్మహత్యాం తరతి, స్వర స్తేయా త్పూతో భవతి, వృషలీగమనా త్పూతో భవతి, పితృదేవమనుష్యాణా మపకారా త్పూతో భవతి, సర్వధర్మపరిత్యాగ పాపా త్సద్యశ్శుచితా మాప్నుయాత్, సద్యో ముచ్యతే సద్యో ముచ్యత ఇ త్యుపనిషత్.

ఓం సహనావవ త్వితి శాన్తిః.

ఇతి కలిసన్తారణోపనిష త్సమాప్తా.

తా. ఈ పదునారు భగవన్నామము లగుఁగినమంత్రమును * మూఁడున్నరకోటి 35,000,000 జపమును యెప్పుడు చేయునో అప్పుడు బ్రహ్మహత్యదోషమును దాఁటు చున్నాఁడు. బంగారు ద్రుచ్ఛిలించినదోషమునుండి పరిశుద్ధుఁడగు చున్నాఁడు. వృషలీ

* దినము 1-కి లక్షజపము చేసినయెడల కొంచెము తక్కువగా ఒక సంవత్సరము లోను, దినము 1-కి పదివేలు అయినయెడల కొంచెము తక్కువ పదిసంవత్సరముల లోను, దినము 1-కి వేయి అయినయెడల కొంచెము తక్కువగా నూఱేండ్లలోను మూఁడున్నఱకోటి యగును.

బహిష్ఠయైన (స్త్రీ, లేక నీచస్త్రీ) సంబంధదోషమునుండి పరిశుద్ధుఁడగు చున్నాఁడు. పితరులు దేవతలు మనుష్యులు వీరికి చేసిన అపకారదోషమునుండి పరిశుద్ధుఁడగు చున్నాఁడు. సకలకర్మలను విడిచిపెట్టిన పాపమునుండి తత్క్షణముననే పరిశుద్ధుఁడగుచున్నాఁడు. తోడనే బంధమునుండి వీడు చున్నాఁడు. తోడనే బంధమునుండి తొలఁగుచున్నాఁడు. అని ఉపనిషత్.

కలిసన్తారణోపనిషత్ - సమాప్తము.

హరిః ఓం

## అథ నారాయణోపనిషత్.

సహనావవత్వితి శాన్తిః.

మూ. ఓమ్ అథ పురుషో హవై నారాయణో కామయత, ప్రజాః సృజేయేతి, నారాయణా త్ప్రాణో జాయతే, మనస్సర్వేన్ద్రియాణిచ, ఖంవాయుర్జ్యోతిరాపః, పృథివీ విశ్వస్యధారిణీ, నారాయణా ద్బ్రహ్మా జాయతే, నారాయణా ద్రుద్రోజాయతే, నారాయణాదింద్రోజాయతే, నారాయణా త్ప్రజాపతి ప్రజాయతే, నారాయణా ద్ద్వాదశాదిత్యా రుద్రావసవస్సర్వాణి ఛందాంసి,నారాయణా దేవసముత్పద్యన్తే,నారాయణా త్ప్రవర్తన్తే, నారాయణే ప్రలీయన్తే, ఏతదృగ్వేద శిరోధీతే.

తా. ఓం. తర్వాత (విరాట్ సృష్టికి తర్వాత) ప్రజలను సృష్టించుటకు పరమపురుషుఁడైన నారాయణుఁడు ఇచ్ఛయించెను. నారాయణునివలన ప్రాణము, మనస్సు, సకలమైన యింద్రియములు, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, సర్వమును వహించు భూమి ఇవి కలిగెను. నారాయణునివలన బ్రహ్మ, శివుఁడు, ఇంద్రుఁడు, ప్రజాపతి, (నవప్రజాపతులు) ద్వాదశాదిత్యులు, ఏకాదశరుద్రులు, అష్టవసువులు, సకలవేదములును కలిగెను. ఇవి నారాయణునివలననే కలిగి నారాయణునివలననే వృద్ధిని బొంది నారాయణునియందే లయమగు చున్నవి. ఇట్లు ఋగ్వేదోపనిషత్తు చెప్పుచున్నది.

మూ. అథ నిత్యో నారాయణః, బ్రహ్మానారాయణః, శివశ్చనారాయణః, శక్రశ్చనారాయణః, కాలశ్చనారాయణః, దిశశ్చనారాయణః, విదిశశ్చ నారాయణః, ఊర్ధ్వంచ నారాయణః, అధశ్చ నారాయణః, అన్తర్బహిశ్చ నారాయణః, నారాయణ ఏవేదం సర్వం యద్భూతం

యచ్చభవ్యం, నిష్కళఙ్కో నిరఞ్జనో నిర్వికల్పో నిరాఖ్యాత శ్శుద్ధో దేవ ఏకో నారాయణః, నద్వితీయోఽస్తి కశ్చిత్, య యేవం వేద, స విష్ణురేవ భవతి సవిష్ణురేవ భవతి, ఏత ద్యజుర్వేదశిరోఽధీతే.

తా. నారాయణుఁడు నిత్యుఁడు; బ్రహ్మయును, శివుఁడును, ఇంద్రుఁడును, కాలమును, దిక్కులును, విదిక్కులును, మీఁదను, క్రిందను, లోపలను, వెలుపలను, నారాయణుఁడే. కలిగినట్టియు, కలుగఁబోవునట్టియు నగు ఈ ప్రపంచ మంతయు నారాయణుఁడే. కళంకము లేనివాఁడుగను, దోషరహితుఁడుగను, వికల్పము లేని వాఁడుగను, నామరహితుఁడుగను, పరిశుద్ధుఁడుగను, దేవుఁడుగను నుండువాఁడు నారాయణుఁ డొక్కఁడే. రెండవవాఁ డెవఁడును లేఁడు. ఇట్లు యెవఁడు తెలిసికొను చున్నాఁడో వాఁడు విష్ణువే యగు చున్నాఁడు. వాఁడు విష్ణువే యగు చున్నాఁడు. ఇట్లు యజుర్వేదోపనిషత్తు చెప్పుచున్నది.

మూ. ఓమిత్యగ్రే వ్యాహరేత్, నమ ఇతి పశ్చాత్, నారాయణాయే త్యుపరిష్టాతు, ఓమిత్యేకాక్షరం, నమ ఇతిద్వే అక్షరే, నారాయణాయేతి పంచాక్షరాణి, ఏత ద్వై నారాయణ స్యాష్టాక్షరం పదం, యోహ వై నారాణస్యాష్టాక్షరం పదమధ్యేతి, అనపబ్రువంత్సర్వ మాయురేతి, విందతే ప్రాజాపత్యం, రాయస్పోషం గౌపత్యం, తతో ఽమృతత్వ మశ్నుతే తతో ఽమృతత్వమశ్నుత ఇతి. ఏత త్సామ వేదశిరోఽధీతే.

తా. మొదట ఓమ్ అనియు, ఆమీద నమః అనియు, ఆపైన నారాయణాయ అనియు ఉచ్చరింపవలయును. ఓమ్ అనునది ఒక అక్షరము నమః అనునది రెండక్షరములు. నారాయణాయ అనునది అయిదక్షరములు. ఇదే నారాయణాష్టాక్షర మైన వాక్యము. ఈ నారాయణాష్టాక్షరమును యెవఁడు అధ్యయనము చేసి దానినే సదా జపించునో, వాఁడు సంపూర్ణాయుస్సును బొందును. ప్రజలకు అధిపతి యగును. రాజభోగము ననుభవించును పశువులకు యజమాని యగును. తర్వాత మోక్షము నొందును. ఆమీఁద మోక్షము నొందును. అని సామవేదోపనిషత్తు చెప్పుచున్నది

మూ. ప్రత్యగానందం బ్రహ్మపురుషం ప్రణవస్వరూపం, అకార ఉకారో మకార ఇతి, తానేకధా సమభవ త్తదేతదో మితి, యముక్త్వా ముచ్యతే యోగీ జన్మసంసారబంధనాత్, ఓం నమో నారాయణా యేతి మంత్రోపాసకః, వై కుంఠభవనం గమిష్యతి, తదిదం పుండరీకం

విజ్ఞానఘనం తస్మాత్తటిదాభమాత్రం, బ్రహ్మణ్యో దేవకీపుత్రో బ్రహ్మ ణ్యో మధుసూదన ఇతి, స్వభూతస్థ మేకం వై నారాయణం కారణ పురుష మకారణం పరం బ్రహ్మోమ్. ఏత దథర్వణ శిరోధీ తే.

తా. పూర్ణానందుఁడుగను, బ్రహ్మపురుషుఁడుగను, అకార ఉకార మకార ములు కూడిన ఓంకారమైన ప్రణవస్వరూపుఁడుగను నుండువానిని వుచ్చరించి యోగి యైనవాఁడు జన్మసంసారమునుండి తరించు చున్నాఁడు ఓం నమో నారాయణాయ అనెడి మంత్రమును ఉపాసన చేయువాఁడు (ఉచ్చరించువాఁడు) వైకుంఠలోకమును బొందు చున్నాఁడు. అది ఈ హృదయకమలము జ్ఞానస్వరూపము. మెఱుపువంటి కాంతి గలది. దేవకీపుత్త్రుఁ డైన భగవంతుఁడే బ్రహ్మణ్యుఁడు (విష్ణువు) మధుసూద నుఁడే బ్రహ్మణ్యుఁడు. సకలభూతములయందు నుండువాఁడును, ఒక్కఁడే ఒక్కఁ డుగను, కారణపురుషుఁడుగను, (తనకు) కారణము లేనివాఁడుగను నుండు నారా యణుఁడే పరబ్రహ్మము. అని అథర్వణోపనిషత్తు చెప్పుచున్నది.

మూ. ప్రాతరధీయానో రాత్రికృతం పాపం నాశయతి, సాయ మధీయానో దివసకృతం పాపం నాశయతి, తత్సాయం ప్రాతరధీయానః పాపో ఽపాపోభవతి, మాధ్యందిన మాదిత్యాభిముఖోఽధీయానః, పంచ మహాపాత కోపపాతకా త్ప్రముచ్యతే, సర్వవేదపారాయణపుణ్యం లభ తే, నారాయణసాయుజ్య మాప్నోతి, శ్రీమ న్నారాయణసాయు జ్య మాప్నోతి. యఏవం వేద. ఇత్యుపనిషత్. సహనావవ త్వితిశాన్తిః.

తా. ఈ ఉపనిషత్తును ప్రాతఃకాలమున అధ్యయనము చేసినవాఁడు రాత్రి చేసిన పాపమును నశింపఁజేయు చున్నాఁడు సాయంకాలమునందు అధ్యయనము చేసినవాఁడు పగటియందుచేసిన పాపమును నశింపఁజేయుచున్నాఁడు. దీనిని ప్రాతః స్సాయంకాలములయందును అధ్యయనము చేసినవాఁడు పాపిగా నుండినను పాప రహితుఁ డగు చున్నాఁడు. మధ్యాహ్న కాలమునందు సూర్యునికి అభిముఖుఁడై అధ్య యనము చేసినవాఁడు పంచమహాపాతకములనుండియు ఉపపాతకములనుండియు విముక్తుఁ డగు చున్నాఁడు. సకలవేదపారాయణములయొక్క ఫలమును బొందు చున్నాఁడు. ఇట్లెఱింగినవాఁడు నారాయణ సాయుజ్యమును బొందుచున్నాఁడు. శ్రీమ న్నారాయణసాయుజ్యమును బొందు చున్నాఁడు. అని ఉపనిషత్.

ఓం తత్సత్.

నారాయణోపనిషత్ సమాప్తము.

## శ్లోకద్వయము అను పరమార్థస్తుతిః.

పరమార్థ స్తుతి,

## ఆంధ్రతాత్పర్య సహితము.

అవతారిక. ప్రపన్నులు ప్రాతఃకాలమునందు ప్రతిదినమును అనుసంధించవలసిన పరమార్థమును రెండుశ్లోకములచేత కృప చేయుచున్నారు —

శ్లో॥ సత్సంగాద్భవనిస్పృహో గురుముఖాచ్ఛ్రీశం ప్రపద్యాత్మవాన్
ప్రారబ్ధం పరిభుజ్యకర్మశకలం ప్రక్షీణకర్మాంతరః ।
న్యాసాదేవనిరంకుశేశ్వరదయా నిర్లూనమాయాన్వయో
హార్దానుగ్రహలబ్ధమధ్యధమనిద్వారా ద్బహిర్నిర్గతః॥ ౧
ముక్తోర్చిర్దినపూర్వపక్షషడుదఙ్మాసాబ్దవాతాంశుమత్
గ్లౌవిద్యుద్వరుణేంద్రధాతృమహిత స్సీమాంతసింధ్వాప్లుతః ।
శ్రీవైకుంఠముపేత్యనిత్యమజడం తస్మిన్ పరబ్రహ్మణః
సాయుజ్యం సమవాప్య నందతి చిరం తేనైవ ధన్యః పుమాన్॥ ౨

తా. సజ్జనులైన ప్రపన్నులయొక్క సహవాసముచేత సంసారమునందలి ఆశను నిగ్రహించి ఆచార్యముఖమువలన భగవంతునియందు ప్రపత్తి చేసి తనయొక్క ఆత్మస్వరూపమును వహించినవారై, (ప్రపత్తిచేయునప్పుడు తాము కోరిన) ప్రారబ్ధకర్మలయొక్క లేశమును అనుభవించి, తాము అనుష్ఠించిన ప్రపత్తిచేత పూర్వాభిలాషలు వదలినవారై, భగవంతునికృపచేత ప్రకృతిసంబంధము లేనివారై, హార్దుఁడనెడి అంతర్యామియొక్క అనుగ్రహముచేత ఈ దేహమందుండు సుషుమ్నయను మధ్యనాడీమార్గములనుండి బయలువెడలి ముక్తుఁడైయుండు ఈ ఆత్మ, అగ్ని పగలు శుక్లపక్షము ఉత్తరాయణము సంవత్సరము (అను వీనికి అభిమానిదేవతలైన) వాయువు వరుణుఁడు ఇంద్రుఁడు సూర్యుఁడు చంద్రుఁడు మెఱుపు (వీని అభిమాని దేవతలైన) వరుణుఁడు ఇంద్రుఁడు ప్రజాపతి అను వీరివలన పూజింపఁబడుచు పోయి, ప్రజాపతిమండలమునకు పొలిమేరయై యుండు విరజానదియందు స్నానము చేసిన యనంతరము, జ్ఞానప్రకాశముతోఁగూడినదియును, నాశము లేని లోకమైనదియును నగు శ్రీవైకుంఠమును జేరి, అచ్చట పరబ్రహ్మస్వరూపుఁడై యుండు శ్రీమన్నారాయణునితో సాయుజ్యమును బొంది నివసించి యున్నారు అనఁగా లక్ష్మీనాయకునియందు ప్రపత్తి చేయు ధన్యులకు వైకుంఠలోకమునందు సాయుజ్యము మహానందము గలవారై వారితో బహుకాలము కలుగునని భావము.

శ్లో॥ ప్రాత ర్నిత్యానుసంధేయం పరమార్థం ముముక్షుభిః।
శ్లోకద్వయేనసంక్షిప్తం సువ్యక్తం వరదో ఽబ్రవీత్॥ 3

తా. ప్రపన్నులు ప్రాతఃకాలమున అనుసంధించవలసిన పరమార్థమును వాత్స్య వరదగురువు రెండుశ్లోకములచేత సంగ్రహముగా రచియించిరి.

---

## పరత్వాదిపఞ్చకస్తుతి.

### తాత్పర్యసహితము.

అవతారిక. ప్రపన్నులు భగవంతునియొక్క పరవ్యూహాది పంచావతారములను ప్రతిదినము ప్రాతఃకాలమునందు అవశ్యముగా ధ్యానము చేయవలయును గాన, ఆ యవతారములస్తుతిని అయిదుశ్లోకములచేత ప్రసాదించు చున్నారు.—

ఈ మొదటి శ్లోకమునందు పరవాసుదేవస్తుతి చేయంబడుచున్నది

శ్లో॥ ఉద్యద్భానుసహస్రభాస్వరపరవ్యోమాస్పదన్నిర్మల
జ్ఞానానందఘనస్వరూప మమలం జ్ఞానాదిభి ష్షడ్గుణైః।
జుష్టం శ్యామలవిగ్రహం ధృతరథాంగాబ్జాదిభూషోజ్జ్వలం
శ్రీభూనీళమనంతభోగి నిలయం శ్రీవాసుదేవం భజే॥ ౧

తా. అనేకసూర్యులేకకాలమునందు వుదయించినయెడల నేప్రకారము తేజోమయముగా ప్రకాశించునో ఆప్రకారము ప్రకాశించునట్టి పరమపదమును స్థానముగాఁ గలవారును, ఏకాలమునందును కొఱవడని జ్ఞానానందములచే పూరితమైన స్వరూపము గలవారును, కర్మలవలనఁ గల్గు దోషము లేనియు లేనివారును, జ్ఞానము, బలము, 1 ఐశ్వర్యము, 2 వీర్యము, 3 శక్తి, తేజస్సు అనెడి షడ్గుణములతోఁ గూడినవారును, నీలమేఘసమానమైన దివ్యమంగళవిగ్రహముతోఁ గూడినవారును, శంఖచక్రాది దివ్యాయుధములను హస్తములందు ధరియించి ప్రకాశించువారును, శ్రీభూనీళలను దివ్యమహిషులతోఁ గూడినవారును, అనంతునిమీఁద నివసించి యుండువారును నగు శ్రీ పరవాసుదేవుని సేవించు చున్నాఁడను.

1 ఐశ్వర్యము:—ఈశ్వరుఁడుగా నుండుట.
2 వీర్యము:—శత్రువులను జయించి శ్రమ జెందక యుండుట.
3 శక్తి:—చేరనిదానిని చేరునట్లు చేయుట.

అవ. ఈ రెండవశ్లోకముచేత వ్యూహావతారములు విశదీకరింపఁబడు చున్నవి.—

శ్లో. ఆమోదే భువనే ప్రమోద ఉత సమ్మోదేపి సంకర్షణం
ప్రద్యుమ్నంచ తథానిరుద్ధ మపి తాన్ సంహారసృష్టిస్థితీః ।
కుర్వాణా న్మతిముఖ్యషడ్గుణవరై ర్యుక్తాంస్త్రియుగ్మాత్మకాన్
వ్యూహాధిష్ఠితవాసుదేవ మపి తం వైకుంఠనాథం భజే. ౨

తా. ఆమోదము, ప్రమోదము, సమ్మోదము అనెడి మూఁడుస్థానములయం దును క్రమముగా వేంచేసి యుండు, జ్ఞానము బలము ఐశ్వర్యము వీర్యము శక్తి తేజము అను షడ్గుణములయందు క్రమముగా రెండు రెండు గుణములతోఁ గూడినవారును, క్రమప్రకారము సంహారము సృష్టి రక్షణము అను వీనిని గావించువారును నగు సంకర్షణ ప్రద్యుమ్న అనిరుద్ధులను మువ్వురినిన్, ఈ మువ్వురితోఁ గూడియుండు శ్రీ వాసుదేవులనున్ సేవించు చున్నాఁడను.

అనఁగా, వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్న అనిరుద్ధులు వ్యూహావతారములు.

సంకర్షణులు, ఆమోద మనెడి లోకమునందు జ్ఞాన బలము లను రెండు దివ్య గుణములతోఁ గూడి ఈ సకలలోకసంహారమును చేయుచున్నారు.

ప్రద్యుమ్నులు, ప్రమోద మను లోకమునందు ఐశ్వర్య వీర్యము లనెడి రెండు దివ్యగుణములతోఁ గూడినవారై సకలలోకసృష్టిని గావించు చున్నారు.

అనిరుద్ధులు, సమ్మోద మను లోకమునందు శక్తి తేజస్సు లనెడి రెండు గుణము లతోఁ గూడినవారై సకలలోకరక్షణమును జేయు చున్నారు.

ఈ మూఁడు అవతారములతోడను గూడినవారైన వాసుదేవులు వైకుంఠలోక మునకు నాథుఁడుగా ప్రకాశించు చున్నారు; అని భావము.

అవ ఈ మూఁడవశ్లోకమునందు విభవావతారములు కీర్తింపఁబడు చున్నది —

శ్లో. వేదాన్వేషణ మందరాద్రిధరణ క్ష్మోద్ధారణ స్వాశ్రిత
ప్రహ్లాదావన భూమిభిక్షణ జగద్విక్రాంతయో యత్క్రియాః।
దుష్టక్షత్రనిబర్హణం దశముఖాద్యున్మూలనం కర్షణం
కాళింద్యాఅహో కంసపాపనిరసో యత్క్రీడితం త న్నుమః. 3

తా. వేదములను వెదకుట, మందరాద్రిని ధరించుట, భూమిని పైకిఁ దీయుట, తమ్మ శరణుఁ జొచ్చిన ప్రహ్లాదుని రక్షించుట, భూమిని యాచించుట, ముల్లోకములను గొలుచుట, అనునివి యెవ్వరికృత్యములో; (మఱియు) దుష్టులైన రాజులను సంహ

రించుట, రావణాదిరాక్షసులను నిర్మూలనముచేయుట, యమునానదినిఁ గ్రహించుట, కాళియుఁడు కంసుఁడు అను పాపుల మద మణంచుట, అనునివి యెవ్వరియొక్క క్రీడయో; అట్టి భగవంతుని ధ్యానము చేయుచున్నాము. అనఁగా;

వేదములను వెదకుటకై మత్స్యావతారమును,
మందరాద్రిని ధరించుటకై కూర్మావతారమును,
అసురులచేత గొంపోఁబడిన భూమిని పైకెత్తుటకై వరాహావతారమును,
తన్నాశ్రయించిన ప్రహ్లాదుని రక్షించుటకై నృసింహావతారమును,
బలిచక్రవర్తియొద్ద భూమిని యాచించుటకై వామనావతారమును,
త్రిలోకములను మూఁడడుగులుగాఁ గొల్చుటకై త్రివిక్రమావతారమును,
దుష్టులైన రాజులను సంహరించుటకై పరశురామావతారమును,
రావణాదిరాక్షసులను సమూలముగా నశింపఁజేయుటకై రామావతారమును,
కాళియుఁడు కంసుఁడు అను దుర్మార్గులను సంహరించుటకై శ్రీకృష్ణావతారమును, అను నీతొమ్మిది యవతారములను దాల్చిన భగవంతుని స్తుతి చేయుచున్నాము.

అవ. ఈ నాలుగవశ్లోకముచేత అర్చావతారములను నిరూపింపఁబడు చున్నది —

శ్లో. శ్రీరంగస్థల వేంకటాద్రి కరిగి ర్యాదా శతాష్టోత్తర
స్థానే గ్రామనికేతనేషుచ సదా సాన్నిధ్యమానే దుషే ।
అర్చారూపిణ మర్చకా భ్యభిమతాఁ స్వీకుర్వ తే విగ్రహాఁ
పూజాం చాఖిలవాంఛితాఁ వితరతే శ్రీశాయ తస్మై నమః. ౪

తా. శ్రీరంగము, వేంకటాచలము, కాంచీపురము మొదలగు నూటయెనుబది దివ్యతిరుపతులయందును, గ్రామములయందును, భాగవతుల గృహములయందును, అర్చారూపిగా వేంచేసి ఆరాధకుల కోరికప్రకారముగా దివ్యమంగళవిగ్రహములను, వారు చేయు ఆరాధనములను అంగీకరించి, ప్రార్థించు భక్తులయొక్క కోర్కెల నంతయు కృప చేయునట్టి భగవంతునకు ప్రణామము చేయు చున్నాము.

అవ. ఈ అయిదవశ్లోకముచేత భగవంతునియొక్క అంతర్యామిత్వము ప్రతిపాదింపఁబడు చున్నది —

శ్లో. యో దేవాది చతుర్విధాసు జనిషు బ్రహ్మాండకోశాంతరా
సంభక్తేషు చరాచరేషుచ విశ న్నాస్తే సదాంతర్బహిః ।
విష్ణుం తన్నిఖిలే ష్వణుష్వణుతరం భూయస్సుభూయస్తరం
స్వాంగుష్ఠప్రమితంచయోగిహృదయే ష్వాసీన మీశం భజే. ౫

తా. ఏ భగవంతుఁడు యీ బ్రహ్మాండగోళమునందు దేవతిర్యఙ్మనుష్యస్థావరములను చతుర్విధజన్మములయందు చేరినవి యైన చరాచరములలోపలఁ బ్రవేశించి, ఎల్లప్పుడును లోపలను బయటను వ్యాపించి యుండునో; అణువునందు అణువుగాను, మహత్తునందు మహత్తుగాను, యోగులహృదయమునందు వారియొక్క అంగుష్ఠమాత్ర ప్రమాణముగ నుండునో; అట్టి సర్వవ్యాపి యైన భగవంతుని సేవించు చున్నాఁడను.

శ్లో. ప్రాత ర్విష్ణోః పరత్వాది పంచక స్తుతి ముత్తమామ్ ।
పఠన్ ప్రాప్నోతి కుశలం భక్త్యా వరదనిర్మితామ్.

తా. శ్రీనాత్స్యవరదాచార్యులచే రచియింపఁబడిన పరవ్యూహాది పంచావతారములను గూర్చినదియు, ఉత్తమ మైనదియు నగు పరత్వాదిపంచకస్తోత్రమును ప్రాతఃకాలమున నెవ్వఁడు భక్తితోఁ బఠించునో వాఁడు క్షేమ మొందును.

---

## ఆర్తత్రాణపరాయణస్తోత్రమ్.

వాత్సల్యా దభయప్రదానసమయా దార్తార్తినిర్వాపణాత్
ఔదార్యా దఘశోషణా దగణిత శ్రేయః పదప్రాపణాత్ ।
సేవ్యః శ్రీపతి రేక ఏవ జగతా మేతే హి షట్ సాక్షిణః
ప్రహ్లాదశ్చ విభీషణశ్చ కరిరా ట్పాంచాల్యహల్యాధ్రువః. ౧

ప్రహ్లాదప్రభు రస్తిచే త్తవ హరి స్సర్వత్ర మే దర్శయ
స్తంభేచే త్య వధత్ హిరణ్యకశిపు స్తత్రా విరాసీత్ హరిః ।
వక్ష స్తస్య విదారయన్ నిజనఖై ర్వాత్సల్య మావేదయన్
ఆర్తత్రాణపరాయణ స్స భగవా న్నారాయణో మే గతిః. ౨

శ్రీరా మాత్ర విభీష ణోహ మనఘో రక్షో భయా దాగతః
సుగ్రీవానయపాలయైన మధునా పౌలస్త్య మే వాగతమ్ ।
ఇత్యుక్త్వాభయ మస్య సర్వవిదితో యోరాఘవో దత్తవాన్. ఆర్త.

నక్రగ్రస్తపదం సముద్ధృతకరం బ్రహ్మాది దేవేశ్వరాః
పాం త్వి త్యా ర్తరవం నిశమ్య కరిణం దేవే ష్వశక్తేషు యః ।
మా శోచేతి రరక్ష నక్రవదనా చ్చక్రేణ తం సంహరన్, ఆర్త. ౪

